# PANDURANGA MAHATHMYAM.

COMPILED BY

**T·ENNALEE RAMAKR SHNA KAV.**

శ్రీమత్పరమపదనాథ నిరవధిక కృపా పరిపాక పరిచిత సరసకవితాసనాథుండగు

తెనాలి * రామకృష్ణకవినాథునిచేరచియింపఁబడిన

# పాండురంగమాహాత్మ్యము.

అనునీపరమభాగవతచరిత్రము

చెన్నపురిచర్చ్ ఆఫ్‌స్కాట్లండుమిషన్ కాలేజిలో తెనుఁగుపండితులగు

కొమాండూరి, అనంతాచార్యుల వారిచేఁ బరిష్కరింపఁబడి.

తెన్నరం * వేంకటనరసింహాచార్యులుగారిచే

లఘుటీకతోడ


వసురత్నాకరముద్రాయంత్రమునందు

ముద్రింపఁబడినది.

చెన్నపురి.

సర్వజిన్నామ సంవత్సర ఆశ్వయుజశు ౯ - భానువారము.

PRINTED AT THE VASURATNAKARA PRESS,

312 Tandiarpet Trivathoor Highroad.

MADRAS

1887.

# విజ్ఞప్తి.

శ్రీకృష్ణదేవరాయ సభాలంకారులయిన యష్ట మహాకవులలో నొకఁడని పేర్కొనఁబడిన తెనాలి రామకృష్ణ మహాకవి వర్యునిచే రచియింపఁబడిన పాండురంగ మాహాత్మ్యము అనఁబడు నీమహాకావ్యమును ముద్రింపవలెనని చాలకాలము నుండి ప్రయత్నము చేయుచుండిన మాకు నీ యపూర్వగ్రంథము చిక్కకయే చిరకాలము కడచెను. పిమ్మట మదీయాప్తులగు నొకరు హఠాత్తుగా నొక ప్రతినిచ్చిరి. దానిని సంప్రదింపఁ బ్రత్యంతరములేవియు లభింపక కొంతకాలము ముద్రింపనను వుపడదయ్యెను. పదంపడి ప్రస్తుతము నెల్లూరియందు నివసించియుండెడి, శ్రీమాన్ ఆసూరి, సరస్వతి, నరసింహాచార్యులవారొకప్రతి నిప్పించిరి. అది సమగ్రప్రతి గాకపోయినను యథోచితసహాయకారి కాఁగా „అథవాపుస్తకత్రయమ్,, అన్నట్టు గవరన్మెంటువారిపుస్తక భండారమునందలి ప్రతినిగూడఁ దోడుచేసికొని చెన్నపురి చర్చిఆఫ్‌స్కాట్లండుమిషన్ కాలేజి తెనుఁగు పండితులగు, కొ॥ అనంతాచార్యులవారిచే యథోచితముగాఁ బరిష్కరింపించివారిముఖ్యసహాయముచేలఘుటీకను వ్రాసి ముద్రింపించితిని. సర్వవిషయ పరిశీలనా విచక్షణులగు పండితులకే కొన్నియెడలఁ బొరపాట్లు కలుగుచుండఁగా సామాన్యులగు మాబోఁటివారికిలేక పోవు; కనుక నిందేమేని తప్పులున్నను దిద్ది మమ్ముఁ గృతార్థులను జేయుదురని విశేషజ్ఞులగు దోషజ్ఞుల నెల్లఁ బదింబదిగఁ బ్రార్థించెదను.

ఈపాండురంగ మాహాత్మ్యముగాక పాండురంగవిజయమని యొకమహాకావ్యము గలదనియు అదియుఁ దెనాలి రామకృష్ణ కవికృతమేయనియుఁ గొన్నికొన్నిచాటు పద్యములను చెప్పి యవియాగ్రంథములోని వనియుఁ గొందఱు చెప్పెదరు. కొందఱిదియేపాండురంగ విజయమను నామాంతరము కలదియనియందురు. అట్లుగాక పాండురంగ విజయ మొకటియున్నయెడల దానిం బంపి మాచేముద్రింపింపఁజేయ సకలకావ్యపరిశీలనాపరులగు సజ్జనుల నెల్లను వేఁడుకొనుచున్నాఁడను.

ఇట్లు సుజనవిధేయుఁడు

☞ తె * వేంకటనరసింహాచార్యులు.

ఓమ్ శ్రీ జయతు.

లఘుటీకాసహిత

# పాండురంగమాహాత్మ్యము.

## ప్రథమాశ్వాసము.

శా ॥ శ్రీకాంతామణిఁ గన్న్యంగి మదిధాత్రిన్ మంచినన్ దద్ధృతి । శ్రీకాదంబినిమిఁ దకుబ్బెసనఁగా శ్రీవత్సముం దాల్చిము । ల్లోకంబుల్పొదలించు కృష్ణుఁడు దయాళుండేలు శ్రీవైష్ణవ । స్వీకారార్హు విరూరిపట్టణపతిన్ వేదాద్రిమంత్రీశ్వరున్ ॥ ౧ ॥ సీ ॥ అవతారమందె నేయఖిలైకజననియత్రి కలశరత్నాకరగర్భసీమఁ । దోఁ బుట్టువయ్యె నేతులితకాంచనవర్ణ వెలఁది వెన్నెలగాయు వేల్పునకును । బాయకయుండు నే పరమపావనమూర్తి చక్రిబాహామధ్యసౌధవీధి । నభిషేకమాడు నేయభినగ్నితాచార దిగ్గజానీతమహాతేటనీట । నవనిధానంబు లే దేవి జవణిసరకు । లమ్మహాదేవి శ్రీదేవియాదిలక్ష్మి । సరసశుభదృష్టి రామానుజయ్యసుతుని । నాదరించు విరూరివేదాద్రినాథు ॥ ౨ ॥ ఉ ॥ మాద్రికిసిరుసంచ వెలిమావుపయిన్ ముకువైనజోదుచే । భద్రమయాత్మ చే భువనపాలనఖేలను చేసరస్వతీ । ముద్రితవక్త్రిచేత నలుమోముల వేల్పు చేవిరూరి వే । దాద్రిచమూవిభుండుగను నాయువుశ్రీయు నిరంతరాయమున్ ॥ ౩ ॥ శా ॥ కద్రూజాంగమతోఁ డఁబుట్టువుశరత్కాదంబినీచంద్రికా । చిద్రూపాంచితసర్మగర్భముఖరాజీవాళిహంసంబువ । ర్ణద్రాక్షాఫలకీరిశారదకృపన్ రామానుజామాతృవే । దాద్రిస్వామికినిచ్చు నిచ్చలును విద్యాబుద్ధివాక్సిద్ధులన్ ॥ ౪ ॥ ఉ ॥ ఈచిగురాకునిప్రసవమీవువుఁ దేనియ దొంతమొప్పెడిన్ । జూచితిరేయటంచుఁ దనచుట్టుశుకాములుగోల్వఁ గాఁగవ । ర్ణోచితచంద్రగాంగజలమైనశివాహ్వయకల్పశాఖి వే । దా

---

౧.— శ్రీకాంతామణిన్ = లక్ష్మీదేవిని. కన్న్యంగి = వంచించి. మంచినన్ = మన్నించఁగా. తద్ధృతిశ్రీకాదంబిని = ఆభూమిని ధరించుటవలని కాంతిసంపదయనెడి మేఘపఙ్క్తి. శ్రీవత్సమున్ = శ్రీవత్సము అనెడి లాంఛనం దలిమచ్చను. పొదలించు = వృద్ధిపొందించు. స్వీకారార్హున్ = అంగీకరింపఁదగినవానిని ॥ ౨ ॥ కలశరత్నాకరము = పాలసముద్రము. వెలఁది = స్వచ్ఛమైన. అభిషేకమాడు = స్నానము చేయు. ఆనీతము = తేఁబడినది ॥ ౩ ॥ మాద్రి = మాదిరి - వెలిమావు = తెల్లగుఱ్ఱము. మురువు = అందము. జోదు = యోధుఁడు. ఖేలనుఁడు = క్రీడగలవాఁడు. చమూవిభుండు = సేనాపతి. నిరంతరాయము = నిత్యమైన శుభావహక్రియ — విఘ్నము లేమి ॥ ౪ ॥ కద్రూజాంగజుఁడు = శివుఁడు. చిద్రూపాంచిత = జ్ఞాన స్వరూపముచేత ఒప్పినది. రాజీవాళి = తామరల వరుస. వర్ణద్రాక్షాఫలకీరి = వర్ణములనెడి ద్రాక్షాఫలములకు చిలుక. నిచ్చలును = నిత్యమును ॥ ౫ ॥

చలమంత్రికీర్తికలశాబ్ధిని వెన్నెలమాడ్కిఁ జూచుతన్ ॥ ౫ ॥ ఉ ॥ చిద్రసవేదియా కోడమచిల్క కువిష్ణుసహస్రనామముల్ । ముద్రతి మోము మోహనిడి ముద్దుచుఁ గోడమ నేనుదువ్వుచున్ । భద్రనిధానమై వెలయు పర్వతకన్యపిఠారిమంత్రివే । దాద్రికిఁ [illegible] భక్తిమహిమాతిశయం బనయంబు నీవుతన్ ॥ ౬ ॥ సీ ॥ సూత్రవతీదేవిసొబగు పా లిండ్లపై మలుపచ్చిగందంపు వలపుతోడ । శిరసులు వంచు నిర్జరకోటిఁ బనిగొను తపనీయ వేత్రహస్తంబుతోడఁ । బనియేమియని విన్నపము సేయు సుమనోరథములయి సవి వ్యాయుధములతోడ । బ్రహ్మాండకోటుల పారుపత్తెములెల్లఁ గనియును నిక్కనిద్దంపు మనసుతోడ । శార్ఙ్గి రెండవమూర్తియై జగములేలు । మునిమనోహారి శ్రీసేనమొదలియారి । చేయుపనులెల్ల సఫలముల్ చేయుఁగాత । మలరి రామానుజయ్య వేదాద్రిపతికి ॥ ౭ ॥ శా ॥ మీఁదందారధరాధరంబుగలయా మేరున్నగంజాలిత । త్తాదృక్తుండరుచిన్దలిర్చు ఖగయూథస్వామి హేమప్రభా । ప్రాదుర్భావశుభప్రభుండనుచు రామానుజామాత్యశ్రీ । వేదాద్రీశువిరూరిమందిరు జగద్విఖ్యాతకీర్తీశ్వరున్ ॥ ౮ ॥ సీ ॥ ధరణీభరముఁ దాల్చు తనచేవయంతయు భుజపరిఘంబులఁ బొంకపఱిచి । మునుమిన్నకనియైన తనప్రజ్ఞయంతయు నుమతివిశేషమునందు మస్తరించి । దైత్యారివశ నైన తనచిత్తమంతయు నినుచు గౌరవమున నివ్వటించి । తనువు వెన్నెలగాయు తనమూర్తి యంతయుఁ గీర్తివైభవమునఁ గీలుకొలిపి । శేషుఁడఖిలప్రపంచవిశేషశాలి । [illegible] ముక్తులకాద్యుఁడై నిలుచుమేటి । చారుచారిత్రు రామానుజయ్యపుత్రుఁ । గగుణవేదాద్రిమంత్రిశేఖరుని మనుచు ॥ ౯ ॥ క ॥ పుట్టకుఁ బుట్టెడు వేళం । దిట్టపును సుపచ్చి పుట్ట [illegible] యచవితోఁ బుట్టెననమృతము ప్టెడు । పుట్టినిసుపుస్తకవిత్వములు వర్ణింతున్ ॥ ౧౦ ॥ క ॥ ఇట్టాడరాని యాగమ । ఘట్టమునకు నడవ యచ్చుకట్టిన మునిరా । ట్పట్టాభిషిక్తుఁ దవపముల । పుట్టిన నెలవయిన వ్యాసముని వర్ణింతున్ ॥ ౧౧ ॥ తే ॥ వ్యాసవాల్మీకిముఖసూక్తివైభవముల । నేర్పుమీరంగ నిజకావ్యదర్పణముల । సరసమానసముల నేటు పఱుచు కీర్తి । ధనుల నన్నయభట్టాదికవులఁ దలఁతు ॥ ౧౨ ॥ ఉ ॥ చాటుకవిత్వతత్త్వరససాగరపారగులయ్యె

---

ప్రసవము=పువ్వు. కపర్దోచితము=జడముడికిఁ దగినది ॥ ౬ ॥ చిద్రసవేది=జ్ఞానసారము నెఱిఁగినది. ముద్రతిన్=సంతోషముతోడి ఆసక్తితో. ముద్దుచున్=మాటలు చెప్పుచు. భద్రనిధానము=శుభమునకు నిధి ॥ ౭ ॥ సొబగు=అందము. మలుపచ్చి=కొంచెము తడియాఱినది. వలపు=వాసన. పనిగొను = నియమించు. తపనీయవేత్రము = బంగారుబెత్తము. పారుపత్తెములు = అధికారములు. నిద్దంపు=స్నేహముగల. సేనమొదలియారి=విష్వక్సేనుఁడు ॥ ౮ ॥ తారధరాధరంబు=వెండికొండ. తత్తాదృక్తుండరుచిన్=దానినిపోలిన ముక్కుయొక్క ప్రకాశముతో. తలిర్చు=ఆ[illegible]యించు. ఖగయూథస్వామి=పక్షిసమూహమునకు రాజు—గరుత్మంతుఁడు ॥ ౯ ॥ చేవ=శ[illegible] పొంకపఱిచి=జతపెట్టి. మునుమిన్నకని=వేదములకు ఉనికిపట్టు. మస్తరించి=ఐక్యముచేసి. నివ్వటించి=వ్యాపింపఁజేసి ॥ ౧౦ ॥ సుపచ్చి=చక్కగాఁ బక్వముగాని. ఉప్టెడు=స్రవించునట్టి. పుట్టినిసుపు=వాల్మీకి ॥ ౧౧ ॥ ఘట్టమునకున్ = తీరప్రదేశమునకు. అచ్చుకట్టిన= ఏర్పఱిచిన ॥ ౧౨ ॥

సత్కవుల్ । పాటిఁబట్టి విందురొకపాటివిగావనకస్య కావ్యముల్ । కైటభవైరియో
వతశిఖామణిశ్రీసతి పేరురంబునన్। మాటియునీటి కెంపుబహుమానముగం బదకంబుఁ జే
యదే॥౧౩॥ తే॥ తప్పు గలిగినచోట నేయొప్పుఁ గలుగు । నరసి కావలికవితల యవగుణము
లు। సరసకవితావశోక్తులసరణియందు। నమృతధారాప్రవాహంబు లడరుఁగాదె॥౧౪॥
తే॥ కానదోషాత్ములయిన దుష్కవుల కతన। గరిమ వహియించుఁ గవిరాజకావ్యమహిమ।
బహుళపక్షంబు చీఁకటి బహుళమగుటఁ। జాయ వెన్నెల తరిఁ బుసేయు కరణి॥౧౫॥ వ॥ అని
నిఖిలభువనప్రధానధన్యంబులగు మాన్యదైవతంబులం గొనియాడి రూఢి మెఱయు కవివృ
షభుల సభినుతించి యుదంచితంబగు కవిత్వతత్త్వంబునం గల గరిమంబుఁ బరిశీలించి పంచ
కులగుకొంచెపుం గవుల రవళి యదలించి పంచాశత్కోటి విస్తీర్ణంబగు నర్ణవమేఖలావల
యంబునం గల పరమవైష్ణవరత్నంబులకుఁ బ్రయత్నపూర్వకంబుగ నభివందనం బాచ
రించి॥ ౧౬॥ క॥ వాక్కాంతాశ్రయ భట్టరు । చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూ
ర్తిన్। నిక్కపు భక్తి భజించెద । నిక్కావ్యకళాకలాపమీడేఱుటకున్ ॥ ౧౭ ॥ క॥
రవణింతు నొక్క శ్రీభా । గవతచరిత్రంబుఁ బరమకల్యాణసము । ద్భవ భవనంబుఁ జతు
ర్దశ। భువనమహారత్నసూత్రముగఁ దగుసరణిన్ ॥ ౧౮ ॥ వ ॥ అని యిట్లభినవప్రబంధ
నిర్మాణకౌతూహలాయత్తచిత్తుండనయి యేనున్న సమయంబున ॥ ౧౯ ॥ సీ ॥ తన
కులాచారవర్తన వైష్ణవాచారపర్యాయములకొజ్జబంతియనఁగఁ । దనసూనృతము పు
రాతనసత్యనిధులయున్నతికిఁ బునః ప్రతిష్ఠితము గాఁగఁ । దనబుద్ధి నీతిశాస్త్రరహస్య
ములు తెల్లముగఁ దెల్పు వ్యాఖ్యానముద్ర గాఁగఁ । దన ప్రాయు గంటంబు మొనవాఁడి
విశ్వంభరాప్రజలకుఁ బ్రాణరక్ష గాఁగ । వెలయు మంగయ గురువభూవిభుని పెద్ద ।
సంగభూపాలమణి ప్రాయసప్రవర్తి । ప్రియయుతుండైన రామానుజయ్యసుతుఁడు।
భద్రగుణసీరి విరురి వేదాద్రిశౌరి॥ ౨౦ ॥ మ ॥ కవులుం బాఠకులున్ బ్రధానులు నలంకా
రజ్ఞులున్ బ్రాజ్ఞులున్ । ధవళాక్షుల్ భజియింప నిండుకొలువై తారేందుతారావళీ।
ధవళంబైన సువర్ణకుంభయుతసౌధంబందు నావాసమై । వివిధామ్నాయపురాణ
గుంభనకథల్ వించున్ బ్రమోదంబునన్ ॥ ౨౧ ॥ క ॥ నను రామకృష్ణకవిఁ గవి । జన
సహకారావళీ వసంతోత్సవమా । కీర్తినిధిఁ బిలిపించి యుగ్గా । ననముఁ గూర్చుండఁ

---

యోషావతశిఖామణి=స్త్రీసమూహమునందు శ్రేష్ఠురాలు. మాటియున్=మఱుఁగుపఱచియు. నీటికెం
పున్=కౌస్తుభమణిని. పదకంబున్=హారమునడుమనుండెడి రత్నపుబిళ్లనుగా॥౧౩॥౧౪॥౧౫॥౧౬॥
నిఖిలభువనప్రధానధన్యంబులు=ఎల్లలోకములందును ముఖ్యులైన పుణ్యాత్ములుగలవి. మాన్యదైవతం
బులన్ =పూజింపఁదగిన దేవతలను. రూఢి=ప్రసిద్ధి. గరిమంబు=గౌరవము. రవళి=ధ్వని —మాయ
..ఒజ్జబంతి=ఉపాధ్యాయులు పెట్టెడి మేలుబంతి. ప్రా
ట. అర్ణవమేఖల=భూమి॥ ౧౭॥౧౮॥౧౯॥౨౦॥ ఒజ్జబంతి=ఉపాధ్యాయులు పెట్టెడి మేలుబంతి. ప్రా
యనము=ప్రాయునట్టిపని॥౨౧॥౨౨॥ కవిజనసహ...నిధిన్ = కవీశ్వరుల నెడితియ్యమామిడిచెట్లచా
లు నవవసంత [illegible] లకువలె వేడుకయైన మంచిమాటలకుస్థానమయినవానిని — కవులను అనరాగము

బనిచిచతురతననియెడన్ ॥ ౨౨ ॥ సీ॥ జగతిసొబగులనెన్నఁగఁగావ్యధారలఁజదువవాతువునందుఁగరము మేటి । యఖిలభూమీపాలకాస్థానకమలాకరోదయతరుణసూర్యోదయుఁడవు। శైవవైష్ణవపురాణావళినానార్థరచనాపటిష్ఠైకరమ్యమతివి । లోకవైదిక లక్షణచాతుర్యధైర్యప్రభారూఢకార్యచణుఁడ। వరయభూమికుచాగ్రహారాభవైభవమైన । శ్రీతెనాల్యగ్రహారనిర్ణేతవగ్ర । శాఖికాకోకిలమవీవుసరసకవివి । రమ్యగుణకృష్ణ రామయరామకృష్ణ ॥ ౨౩ ॥ క ॥ కౌండిన్యసగోత్రుఁడవా । ఖండలగురునిభుఁడవఖిల కావ్యరససుధామండనకుండలుఁడవుభూ। మండలవినుతుఁడవులక్ష్మమాంబరతనయా ॥ ౨౪ ॥ క ॥ యశముగలిగించు నీమృదు । విశదోక్తులఁబౌండరీకవిభుచరితఁజతు। ర్దశభువనవినుతముగశుభ। వశమతినాపేరనుడువువరతత్త్వనిధీ ॥ ౨౫ ॥ ఉ ॥ స్కాందపురాణనీరనిధికౌస్తుభమై ప్రభవించుదేవకీ। నందనుసత్కథోద్యమమునవ్యకవిత్వకళాకలాపమన్। కుందనమున్ ఘటించికడుఁగ్రొత్తగుసొమ్ముసరించివిష్ణుసే । వందిలకించునస్థిరమవైష్ణవకోటినలంకరింపుమా ॥ ౨౬ ॥ మ॥ ఉదయంబస్తనగంబుసేతువుహిమవద్వ్యూహంబునుంజుట్టిరా । విదితంబైనమహిన్ మహాంధ్రకవితావిద్యాబలప్రౌఢిని। కడురే కీసరసార్థబోధఘటనాహేలాపరిష్కార శా । రదనీరూపము రామకృష్ణకవిచంద్రా సాంద్రకీర్తీశ్వరా ॥ ౨౭ ॥ వ॥ అనిసంభావించికనకాంబరాభరణంబులంబ్రసాదించి యాప్రధానపంచాననుండు ॥ ౨౮ ॥ మ ॥ పలుకుందొయ్యలిమాళికాంతికెనయాబా

---

నుపుట్టించెడి మంచిమాటలుగలవానిని ॥ ౨౩ ॥ సొబగులన్ = చక్కఁదనములను. కావ్యధారలన్ = కవిత్వముయొక్క ధోరణులయందు. ఆశువునందున్ = వడిగాకవిత్వము చెప్పుటయందు. మేటివి = [illegible]కుఁడవు. అఖిలభూ...దయుఁడవు = ఎల్ల రాజుల కొలువుకూటములనెడి సరస్సులయొక్క యభ్యుదయమునకు లేఁతసూర్యుని యుదయమును తోఁపించువాఁడవు. నానార్థ ... తివి = అనేకములైన అర్థములను కల్పించుటయందలి చౌరవచేత ముఖ్యమును మనోజ్ఞము నైనబుద్ధి గలవాఁడవు. లోకవై ... చణుఁడవు = లోకవ్యవహారమును అనుసరించి నవియు వేదమునందుఁజెప్పఁబడినవియు నైన గుఱుతులయందు (నడవళ్లయందు) నేర్పుచేతను ధీరత్వముయొక్క ప్రకాశముచేత ప్రసిద్ధములైన పనులచేతను సమర్థుఁడవు. భూమికుచాగ్రహారాభము = భూదేవియొక్క స్తనములపైనుండెడి ముత్యాలపేరునుపోలినది. అగ్రహారము = బ్రాహ్మణుల యూరు. నిర్ణేత = నిర్ణయించువాఁడు. అగ్రశాఖికాకోకిలమవు = ప్రథమశాఖయనెడి వృక్షమునకు కోవెలయైనవాఁడవు. రమ్యగుణకృష్ణ = మనోహరములైనగుణములయందు కృష్ణుఁడా ॥ ౨౪ ॥ ఆఖండలగురునిభుఁడవు = ఇంద్రునికి గురువైన బృహస్పతినిబోలినవాఁడవు. కావ్యరససుధామండనకుండలుఁడవు = కావ్యరసమనెడిఅమృతము [illegible]కారమయిన చెవిపోఁగుగాఁగలవాఁడవు ॥ ౨౫ ॥ మృదువిశదోక్తులన్ = సులభోచ్చారణమును తేటదనమునుగల మాటలతో ॥ ౨౬ ॥ నీరనిధి = సముద్రము. ఉద్యమము = ప్రయత్నము. నవ్యకవిత్వకళాకలాపము = క్రొత్తయగుకవిత్వవిద్యలసమూహము, తిలకించు = ప్రకాశించు ॥ ౨౭ ॥ హిమవద్వ్యూహంబు = హిమాలయము—మంచుకొండ. ప్రౌఢి = నేర్పు. సరసార్థ ... స్ఫార = రసవంతమయిన అర్థము యొక్క తెలివినికూర్చుటయనెడివిలాసచేష్టయే ఆభరణముగాఁగలది. శారద = సరస్వతి ॥ ౨౮ ॥ సంభావించి = సన్మానించి. ప్రసాదించి = ఇచ్చి. ప్రధానపంచాననుండు = మంత్రిశ్రే

గాలుసయ్యాంతిచె। కుఱ్ఱలఁబోలుందెలనాకులయ్యావిదపలుకుల్వంటికప్రంపుఁబల్కులతోఁగూడినవీడియంబొసఁగెనాకుం బక్మనాభార్చనా। కలనాపావనహస్తకంకణఝణత్కారంబుతోరంబుగన్ ॥ ౨౯ ॥ వ॥ ఇట్లులోకోత్తరగుణోత్తరుండ గునాప్రధానశేఖరుండుపరమ పురుషపరికర చరిత్రంబునకు నధీశ్వరుండగుట తీర్థంబునుప్రార్థంబునుజాజులుందేవర ప్రసాదంబునుబుణ్యంబునుంబురుషార్థంబునునయ్యెనయ్యభ్యుదయంబునకుంగల్యాణాచారంబుగాఁగృతిపతివంశావతారంబభివర్ణింపంబూని॥ ౩౦॥

సీ ॥ మిగులఁగన్నొందవిన బిగువయెక్కుడుగాని కరుణాకటాక్షవీక్షణమువాఁడు । దంష్ట్రావిటంకవర్ధనమయెక్కుడుగాని ముద్దుఁజందురునేలుమోమువాఁడు । నరమృగదేహవిస్ఫురణ మెక్కుడుగాని బహుకోటి మదన రూపంబువాఁడు । దైత్యుదండించునుద్ధతియె యెక్కుడుగాని శ్రితజనావళుల రక్షించువాఁడు । నాఁగగరుడాద్రిసింహాసనమునసనుండి । యెల్లజగముల నేలు లక్ష్మీశ్వరుండు । శ్రీయహోబలనరసింహనాయకుండు । శతమఠనగోత్రమంత్రిరక్షణమొనర్చు ॥ ౩౧ ॥ చ ॥ జఠరవసత్ప్రపంచసురసత్తమతుల్యుఁడశేషయోగిరాణ్మతహృదయుండుమానిజనమాన్యుఁడుధన్యుఁడుముక్తికామినీ। కఠినకుచద్వయీనిహితకాంచనమాలికహేళికల్పుఁడా। శతమఠణ్ణిశేఖరుఁ బ్రశంస యొనర్పఁదగుం జగంబులన్ ॥ ౩౨ ॥ శా ॥ ఆవాచంయమవంశసాగరమునం దవ్యాహతైశ్వర్యల । క్ష్మీవంతుండు విహారికర్తసచివశ్రేష్ఠుండువిద్యాహయ । గ్రీవుండన్నయమంత్రియవ్విభునిసత్కీర్తుల్విజృంభించునీ । ద్యావాపృథ్వ్యవకాశ పుంఖిత నిజవ్యాపారపారీణతన్ ॥ ౩౩ ॥ ఉ ॥ ఆసచివావతంసముకులాంగనచెల్వగులక్ష్మమాంబ గా । రీసతియోయరుంధతియొ రేవతియోయలయాది లక్ష్మియో । వాసవురాణియోయనఁగ వాసియు వన్నెయుఁ గ్గ

ఋంఁడు॥ ౨౯॥ పలుకుంబొయ్యలి=సరస్వతి. బాగాలు=వక్కపలుకులు. తెలనాకులు=తెల్లనియాకులు. కప్రంపుఁబల్కులతోన్=కర్పూరపుఁబలుకులతో. వీడియంబు=తాంబూలము. తోరంబుగన్=అతిశయింపఁగా ॥ ౩౦ ॥ లోకోత్తరగుణోత్తరుండు= లోకమునందు మేలైనగుణములచేత అధికుఁడు. పరికర=పరివారముయొక్క. జాజులన్=జాజిపువ్వులును. అభ్యుదయంబునకున్=మేలుపొందుటకు. కల్యాణాచారంబు=శుభమునకు గురుతైననడవడి ॥ ౩౧ ॥ మిగులన్=అెప్పలనుమించ — మిడిగ్రుడ్లతో. ఎక్కుడు=అధికము. దంష్ట్రావిటంకవర్ధనమ=ఇంటిముంజూరునందలిహావుదాగూండ్లవలెఁగానవచ్చెడికోఱలపెంపే. విస్ఫురణము=ప్రకాశము. ఉద్ధతి=నిక్కు. శ్రితజనావళులన్=ఆశ్రయించిన జనులబారులను ॥ ౩౨ ॥ జఠర...తుల్యుఁడు= కడుపునందువాసముచేయుచున్నలోకములుగలవాఁడైనవిష్ణుదేవునితోసమానుఁడు. అశేష...యుండు=ఎల్లయోగీశ్వరులకుమతమైనమనసుగలవాఁడు. హేళికల్పుఁడు=సూర్యునిఁబోలినవాఁడు॥ ౩౩ ॥ వాచంయముఁడు=మునిని. అవ్యాహతము = వ్యర్థముకానిది. విద్యాహయగ్రీవుండు= చదువునందుహయగ్రీవుఁడైనవాఁడు. ద్యావాపృథ్వ్యవ...పారీణతన్=ఆకాశమునకుభూమికి నడిమియెడమును సందులేనిదిగాచేయునట్టినవనులయొక్క పారమునుముట్టుటచేతను॥ ౩౪ ॥ కులాంగన=గృహిణి— పెండ్లాము. వాసి—కొన్నతనము. వన్నె=పొగడ్త. చెల్వగున్ — ఇదిక్రియాపదము॥ ౩౫ ॥ అర్థినిధానము=యాచకుల

కీర్తులన్ । జేసినమూర్తి మేలు పతిచిత్తమువచ్చిన సచ్చరిత్రలన్ ॥ ౩౪ ॥ ఉ॥
అన్నయ లక్ష్మమాంబసుతు లర్థినిధానముతిప్పరాజుసం । పన్నుఁడు రంగరాజుఁ
బ్రతిభానిధి గుండమరాజుఁబొల్చిరా । సన్నుతభాగ్యవర్ధనుల సన్మతిశౌర్యముధైర్య
మన్నయాభ్యున్నతినీతిరీతి జయమొప్పను నేర్పును నెన్నశక్యమే॥ ౩౫ ॥ క॥అము
ల్పరిలో రంగను । ధీమణిదీపించె వంశతిలకంబగుచున్ । శ్రీమహితగంగమాంబా । రా
మారమణీయరాగరసరంజితుఁడై ॥ ౩౬ ॥ క॥ఆరంగరాజుకీర్తులు । శ్రీరంగనివాసహా
సశివకరలక్ష్మిం । జేరంగఁదిగుచునహితులఁ । బారంగానెగుచునతనిబాహాసియసిన్ ॥
౩౭ ॥సీ॥ శ్రీమదష్టాక్షరీసేవైకనిపుణుండుగీతార్థసారసంకేతవేది । పరిచితదివ్యప్ర
బంధసంధానుండు మహితసౌదర్శనమనువిదుండు । వితతప్రభాసితవిజ్ఞానకోవిదనిజస
మయావననిపుణబుద్ధి । సరసరామాయణసప్తకాండజ్ఞాతయాశవందారుస్తవాభిశో
భి । సలిలనిధిజాలజంఘాలజలవిశాల । ధూళిపాళీభరాళీకధూమభూమ । శంకితాత్మప్ర
తాపవైశ్వానరుండు । గంగమాప్రాణవిభుఁడొప్పు రంగరాజు॥ ౩౮ ॥ తే॥దశ
రథేశ్వరుభార్యయైధన్యమహిమ । మున్నుకౌసల్యశ్రీరాముఁగన్నకరణి । రంగయా
మాత్యుసతియైనగంగమాంబ । మతిమరున్మంత్రిశ్రీరామమంత్రిఁగనియె॥ ౩౯॥ క॥ఆ
రామరాజువాహిని । వారాన్నిధులేడుదాఁటెవసుమతిమున్నే । శ్రీరామరాజువాహి
ని । వారాన్నిధులేడుదాఁటివర్ధిలునవులన్ ॥ ౪౦॥ సీ॥పుడమిపైనడనేర్చియడుగుఁబెట్టె
డునాఁడెధర్మంబు నాల్గుపాదములనిలిపె । జిలిబిలిపలుకులు పలుకనేర్చిననాఁడె సత్య
భాషాహరిశ్చంద్రుఁడయ్యె । వరుసమీఁదటిబ్రాలువ్రాయనేర్చిననాఁడె కమిచి [illegible]
జయాంకములు వ్రాసె । ముఖ్యవ్రతస్ఫూర్తి ముంజిగట్టెడునాఁడెకవులఁబ్రోచుటకుఁ
గంకణము గట్టె । నంబమాంబికఁగల్యాణమైననాఁడె । వాసిగలకీర్తిలక్ష్మికిసేస
వెట్టె । ధైర్యహేమాద్రిప్రజ్ఞశాంతనవుమాద్రి । రంగయామాత్యవరుసిశ్రీరామమం
త్రి॥ ౪౧॥ సీ॥సంహృతాంహస్స్ఫూర్తి సింహాసనుండున్నృసింహవిక్రముఁడున్నృసింహ
శౌరి । త్రయ్యంతవాసనాగ్రహబుద్ధినోయయ్యారియొయ్యారిరామానుజయ్యగారుగం

---

లకుసంధి. అన్నయాభ్యున్నతి=అనీతిగౌరవము॥ ౩౬॥ ౩౭॥శివకర=మేలుసకలుగఁజేయునట్టి. ఎగు
చున్=తఱుముచును. బాహాసి=చేతికత్తి॥ ౩౮॥సంకేతవేది=ఏర్పాటుతెలిసినవాఁడు. పరిచిత[illegible]లవా
టుచేయఁబడిన. సౌదర్శనమనువిదుండు=సుదర్శనమంత్రమునెఱిగినవాఁడు. నిజసమయావన...న
మతమునురక్షించుకొనుటయందు. సలిలనిధి=సముద్రము. జంఘాల=మిక్కిలివడిగాపోవునట్టి. ధూళి
పాళీభర=దుమ్ముచాలుయొక్క అతిశయమనెడి. అళీక=అబద్ధపు. భూమ=మిక్కిలి. ఆత్మప్రతాప...
నప్రతాపమనెడి. వైశ్వానరుఁడు=అగ్నిగలవాఁడు॥ ౩౯॥మతిమరున్మంత్రి=బుద్ధిచేతబృహస్పతియైన
నవాఁడు॥ ౪౦॥వాహిని=సేనవాఘాటి. వారాన్నిధులు=సముద్రములు॥ ౪౧॥నడ=నడచుట. జిలిబిలి
=కొంచెము—వచ్చిరాని. కమిచి=ఆక్రమించి. ముంజి=దర్భమొలత్రాడు—ముంజిగట్టెడునా
డె=ఉపనయనమునాఁడె. కల్యాణము=పెండ్లి. సేస=తలఁబ్రాలు. మాద్రి=విధము ॥ ౪౨ ॥ సంహృ
తాంహస్స్ఫూర్తి=నశింపఁజేయఁబడినపాపములప్రకాశముగల. త్రయ్యంత=వేదాంతములయొక్క

గాతరంగసారంగలాంఛనదీప్తిఁబొంగుకీర్తికి రాజు రంగరాజు। శరణాగతత్రాణకరుణావరణకేళివరదరాజులఁబోలు వరదరాజు। నసఁగ శ్రీరామవిభునికినంబమకును। గలిగి రాచంద్రతారార్క గతిఁబ్రశస్తి। నలువురాత్మజు లౌదార్యసలిలనిధులు। భుజగశాయికి నాలుగుభుజములట్లు ॥ ౪౨ ॥ తే ॥ అందునగ్రజుఁడఖిలవిద్యావినోది। శ్రీనృసింహాఖ్యసన్మంత్రిసింహమలరు। లీలలక్ష్మమ్మ తనకునిల్లాలుగాఁగఁ। జెలఁగె లక్ష్మీనృసింహవిశేషముద్ర ॥ ౪౩ ॥ క ॥ శ్రీనరసింహునిలక్ష్మీ। మానవతికి వెంగళాఖ్యమంత్రీశ్వరుఁడున్। గోనప్పయుననఁదగువి। ద్యానిధు లిరువురుసుతులు ప్రౌఢిమనిరవన్ ॥ ౪౪ ॥ క ॥ నయవినయంబుల కైవడి। జయతేజసులట్లు విభవశేషములక్రియన। వ్యయయశులు వెంగళయకో। నయులిరువురువెలసి రవనినాథాశ్రితులై ॥ ౪౫ ॥ క ॥ ఆవెంగళమంత్రీశ్వరు। దేవికి శ్రీయాంబ శ్లాఘ్యతిలకవతికి రా। ధావిభుదేవేరియునల। కావేరియు నీడుజోడు గౌరవకళలన్ ॥ ౪౬ ॥ క॥ గానకళాతుంబురుఁడనఁ। గానయవిద్యావివేక గౌరవలక్ష్మీ। జానియనంగానిద్ధరఁ। గోనప్రభుఁడొప్పు మంత్రికులతిలకంబై ॥ ౪౭ ॥ తే ॥ ఆవిదేహాధిపతిపుత్రియాత్మభార్య। గాఁగవిఖ్యాతిఁబొందు రాఘవునికరణి। రాఘవాంబాధినాథుడై శ్లాఘమీఱు। శ్రీనృసింహునికోనప్పసిరులకుప్ప ॥ ౪౮ ॥ ఉ ॥ సామజరక్షణుఁ గొల్చి సన్నుతికెక్కినభాగ్యశాలి శ్రీ। రామచమూపశేఖరునిరంగనమంత్రిననంతమాంబికా। స్వామినుతింతు మన్మథభుజానతపుష్పధనుర్మధూళిధా। రామధురోక్తిగుంభనభరస్ఫురణాపరిణాహచాతురిన్ ॥ ౪౯ ॥ చ ॥ ఉరుమతిరంగమంత్రితనయుల్ విలసిల్లిరిఫుల్లమల్లికా। హరదరహారహీరహిమహారపటీరయశోధురంధరుల్। వరపరసుగల్గువారుగుణవంతులుశాంతులు కాంతిచంద్రముల్। వరదయమంత్రిపుంగవుఁడువాసవతుల్యుఁడు రాఘవయ్యయున్ ॥ ౫౦ ॥ క ॥ రంగయవరదామాత్యుని। హంగమవిభుసమనభజనహంసధ్వజుఁ సా। రంగధరహారనిభవా। గ్గంగాశృంగారితాస్యకమలుసుతింతున్ ॥ ౫౧ ॥ సీ ॥ సమకూర్పఁగా నేర్చు సకలవైష్ణవశాస్త్రసిద్ధాంతశుద్ధాంతసిద్ధిగరిమ। హావణింపఁగా నేర్చునఖిలావనీచక్రసామ్రాజ్యపూజ్యవిశాలలక్ష్మి। వలపింపఁగా నేర్చువాలారుఁజూపులకోపులుచూపుచకోరదృశలఁ।

---

గ్రిహ=గ్రహించునట్టి. సారంగలాఞ్ఛన=చంద్రునివైన. ప్రశస్తి=ప్రసిద్ధి ॥ ౪౦ ॥ ౪౩ ॥ ౪౪ ॥ ౪౫ ॥ రాధావిభుదేవేరి=విష్ణుదేవునిపట్టపురాణియగులక్ష్మి ॥ ౪౬ ॥ లక్ష్మీజాని=లక్ష్మికిపెనిమిటి—విష్ణువు. ॥ ౪౮ ॥ విదేహాధిపతి=జనకమహారాజు. శ్లాఘ=పొగడ్త ॥ ౪౯ ॥ చమూపశేఖరుని=సేనాపతిశ్రేష్ఠుని. స్వామి=పెనిమిటి. మధూళి=మధువు=తేనె. గుంభనస్ఫురణాపరిణాహచాతురిన్=కూర్పుయొక్క అతిశయమునలనిప్రకాశముయొక్క మిక్కుటపునేర్పుచేత ॥ ౫౦ ॥ ఫుల్ల=వికసించిన. హీర=వజ్రమణి. హార=ముత్యాలపేరు. పటీర=మంచిగంధము. వర=మేలైన ॥ ౫౧ ॥ ౫౨ ॥ హావణింపఁగాన్=ధరింప. వాలారు=దీర్ఘములైన. కోపులు=అందములు. చకోరదృశలన్=స్త్రీలను. ప్రకటశౌర్యధారి=ప్రసిద్ధమయినశూరత్వమును ధరించినవాఁడు. వాచాధరాధర

పాలింపఁగా నేర్చు బాంధవకవిగాయకార్థార్థినివహంబు ననుదినంబు। పంపనాథుని పుత్రుఁ డెదశదిశావకాశసంపూర్ణ విజయప్రకాశశాలి। రంగయామాత్యవరదయ్య ప్రకటశౌర్య। ధారివాచాధరాధరధారిశయ్య ॥ ౫౨ ॥ క ॥ తిమ్మాంబయు కొమ్మయు వరదప్ప భార్యలై వెలసిరి తే। జమ్మున శక్తిత్రయమును। గమ్మున సకలోన్నతప్రథాప్రథితమతిన్ ॥ ౫౩ ॥ ఉ ॥ మున్నొక రాఘవుండు తలనో విభవించు విభీషణాదులన్। మన్నన ప్రోచెఁ గాచె నను మాట లెకాని గుణప్రసన్నతన్। బన్నఁదనంబుఁ జూపఁగల రంగయ రాఘవమంత్రి నిచ్చలున్। వన్నెకుఁ దెచ్చు నిచ్చు నభివాంఛితవస్తువు లర్థికోటికిన్ ॥ ౫౪ ॥ క ॥ తేజమున రాఘవునియం। భోజేక్షణ లిమ్మమాంబ పోల్పం దగు నా। రాజీవవదన శారద। రాజార్ధకిరీటపూర్ణ రాజనిభాస్యన్ ॥ ౫౫ ॥ క ॥ శ్రీరామమంత్రివరదను। ధీరత్నము కులవధూటి దీపించు యశో। దారమణిరమణి విష్ణు। శ్రీరంజిత కొండమాంబ చిరపుణ్యములన్ ॥ ౫౬ ॥ క ॥ ఆదంపతులకుఁ గలిగిరి। గాదిలిసత్పుత్రివరులు గనుఁగొండనయున్। శ్రీదనరు నోబళయ్యయు। వేదస్మృతిజాయమానవినయనయగతిన్ ॥ ౫౭ ॥ క ॥ కనుఁగొండయు తనిధైర్యము। పెనుగొండగు నవని నెదిరి భీతిం బరఁగ వే। చనుఁగొండలకనఁగాఁ దగు। కనుఁగొండయ నాగమాంబ కావల్లభుఁడై ॥ ౫౮ ॥ ఆ ॥ అతని సోదరుండు మతికళాజంభారి। గురుఁడు బంధులోక సురభి వెలయు। నోబళాఖ్యమంత్రి యోబళాఖ్యాతని। జయము నయము నంచు జనులు పొగడ ॥ ౫౯ ॥ ఉ ॥ ఇమ్మనవద్యహృద్యసముదీర్ణగుణాళికిఁ గల్పవృక్షపుం। గొమ్మ నవీనదానగుణగుంభన సంభృతిఁ బద్మనాభుఁగ। న్నమ్మ సరామరస్తుతజయస్థితి కొబళమంత్రి భార్యయౌ। నమ్మ మయమ్మ దద్వరదయానకు నేసతు లీడు ధారుణిన్ ॥ ౬౦ ॥ వ ॥ ఏవంవిధాన్వవాయ పయఃపారావారంబునఁ దారకాకమనాకృతియగు కృతిపతి తెలంగెట్టిదనిన ॥ ౬౧ ॥ ఉ ॥ మానితరాజితస్మృతి నమంచిత మోహనమూర్తి వైష్ణవ। జ్ఞానపరాయణుం డమృతసాగరరాజ గభీరుఁ డర్థిసం। తానసురద్రుమంబతఁడు దాననానత శాస్త్రవుండు రా। మానుజమం(త్రి)

ధారిశయ్య=మాటలచేత విష్ణుదేవుని పానుపైన శేషుఁడు ॥ ౫౩ ॥ ప్రథా=ప్రసిద్ధి. ప్రథిత=ప్రసిద్ధమైన ॥ ౫౪ ॥ ప్రోచెన్=పోషించెను. కాచెన్=ఆపదలు తొలఁగించి కాపాడెను. ప్రన్నఁదనంబు=మనోహరత్వము. అభివాంఛిత=కోరఁబడిన. అర్థికోటి=యాచకులసమూహము ॥ ౫౫ ॥ శారదన్=సరస్వతిని. రాజార్ధకిరీట=అర్ధచంద్రుఁడు కిరీటము గాఁగల శివుని యొక్క ॥ ౫౬ ॥ సుధీరత్నము=పండితోత్తముఁడు. కులవధూటి=గృహిణి—పెండ్లాము. రమణన్=విధమున ॥ ౫౭ ॥ గాదిలి=ప్రియము యిన. జాయమాన=పుట్టుచున్న ॥ ౫౮ ॥ కనుఁగొండ=చూడుఁడు. ఎదిరి=పగవాఁడు ॥ ౫౯ ॥ జంభారి=ఇంద్రుఁడు. సురభి=కామధేనువు ॥ ౬౦ ॥ఇమ్ము=స్థానము. అనవద్యహృద్యసముదీర్ణ గుణాళిక్=నింద్యములు కానివియు మనసున కింపయినవియు ఘనమయినవియు నైన గుణములపజ్క్తికి. సంభృతి = భరించుట ॥ ౬౧ ॥ తారకాకమనాకృతి=నక్షత్రములకు కాముకుఁడైన చంద్రునిఁ బోలినవాఁడు ॥ ౬౨ ॥ అమృతసాగరరాజగభీరుఁడు=శ్రేష్ఠమయిన పాలసముద్రము

వర్ధిలు మహామహుఁడై నిజవంశకర్తయై ॥ ౨౨ ॥ సీ ॥ కతపత్రమిడవచ్చుఁగల గాంచునపుడైనఁగోరికఁబరకాంతఁ గోరఁడనుచు । మొడియవైవఁగవచ్చు మొన దారసించిన శూరత్వమునవెన్నుచూపఁడనుచు । దిబ్బెమెత్తఁగవచ్చునబ్బురంబగు కల్మిమేరమీఱినరీతిమెలఁగఁడనుచుఁ। జేసాఁపఁగావచ్చుశివుమీఁదనేనియుఁబూనికతోఁ బలికాంకఁడనుచు । జలధివలయితవసుమతీస్థలవతంస । భాసురాంససమాశ్రిత ప్రౌఢకీర్తి । శతమతనగోత్రభవమంత్రిచక్రవర్తి । యైనరామానుజయ్యకునైకడం గి ॥ ౨౩ ॥ శా ॥ రాధానాథపదాబ్జభృంగమగు నారామానుజామాత్యుతే । జోధారావళి భానుభానుపమం జూపట్టుమిత్రాంబుజో । ద్బోధంబుంబ్రతిపక్షకైతవనిరుద్బోధంబు నిర్మాంత్రియా । సాధుత్వంబు వహింప దుర్దమతమస్సంబాధముల్ జాఱఁగన్ ॥ ౨౪ ॥ క ॥ కామగవీ సురతరువులు । వేమాఱునునిచ్చుఁదవులువిడిబేరముగా । రామానుజయ్యదాన । ప్రామాణికముద్రకొంగు బంగారమగున్॥ ౨౫ ॥ శా ॥ ఆరామానుజమంత్రిచంద్రుఁడువివాహంబయ్యెనెయ్యంబుతో । భారద్వాజపవిత్రగోత్రనిధికిన్బల్పాటికన్నయ్యకున్। గారామైనకుమారికాతిలకమున్గారీధరాశారదా । మా రామాపరమప్రసిద్ధమతినమ్మాజమ్మఁదేజంబునన్॥౨౬॥ సీ॥ తొడవులుపెక్కులుదొడవియుండెనెకాని సత్యంబుతనకు నిజాలతొడవు । చుట్టాలసురభినైసొబగునొందెనెకాని నెనరైనచుట్టంబుదనకుఁగీర్తి । కులదైవతంబశాంబలనాథుఁడనెకాని పతిమూర్తి పరమదైవతముతనకుఁ । జక్కఁదనంబులుసహజంబులనికాని తనచక్కఁదనము వర్తనమునంద । యనఁగవిలసిల్లె నిఖిలవిద్యారహస్య । పరమవిజ్ఞానపాండిత్యభద్రమూర్తి । విప్రసురశాఖిరామానుజప్రధాన । మాళియర్ధాంగలక్ష్మి యమ్మాజియమ్మ ॥ ౨౭ ॥ క ॥ ఇమ్మహిరామానుజవిభు । నమ్మాజమ్మకు జనించిరబ్జభవముఖా । బ్జమ్ములఁబోలిన సుతర । త్నమ్ములునలువురును దారతాజిత శరధుల్ ॥ ౨౮ ॥ సీ ॥ మద్రేశనిభసమున్నిద్రశౌర్యోద్రేక విద్రావితారివేదాద్రిశౌరి । విష్ణుపదధ్యాననిష్ణాతవిజ్ఞానకృష్ణుండుశ్రీరామకృష్ణమంత్రి । శరశరచ్చంద్రికాహారహారహిమహీర కరకీర్తివరశయ్యతిరుమలయ్య । పక్ష్మలితత్యా

---

యొక్క గాంభీర్యమువంటి గాంభీర్యముగలవాఁడు. సంతాన=సమూహముయొక్క ॥ ౨౩ ॥ కతపత్రము=ప్రమాణపత్రిక. మొన=సేన. తారసించినన్=సమీపించినను. దిబ్బెము=దీపము. అబ్బురము=వింత ॥ ౨౪ ॥ భాను=ప్రకాశముచేతను. భానుసుపమన్=సూర్యుని పోలికను. ఉద్బోధము=వికాసము. నిరుద్బోధము=వికాసములేమి — సంకోచము. దుర్దమతమస్సంబాధములు=అణఁపరానిశోకములయొక్క రాయిడులు ॥౨౫॥ కామగవి=కామధేనువు. తవులువిడిబేరము=అంటియంటనివ్యాపారము ॥౨౬॥ గారాము=గారాబము ॥౨౭॥ తొడివి = తొడిగి — ధరించి. సొబగు=అందము. వర్తనము=నడవడి. విలసిల్లెన్=ఒప్పెను. విప్రసురశాఖి=బ్రాహ్మణులకుకల్పవృక్షము॥ ౨౮ ॥ ఉదారతాజితశరధులు=దాతృత్వముచేతగెలువఁబడినసముద్రముగలవారు ॥౨౯॥ సమున్నిద్ర=జాగ్రత్తగల. విద్రావితారి=యుద్ధమునుండి తొలఁగి పాఱిపోయినశత్రువులుగలవాఁడు.

గలక్ష్మీకరోద్యోగ లక్ష్మలక్షిత మూర్తి లక్ష్మణుఁడు । ననఁగ వెలసిరి రామానుజ
య్యసుతులు । దశరథక్షోణిపాలనందనసమృద్ధి । దైవతేశసుదావళదంతరేఖ । సు
రగపర్యంకనిజచతుర్వ్యూహలక్ష్మి ॥ ౧౯ ॥ ఉ ॥ ముద్రితవైరివక్త్రులగుసుప్రవ్వదు
తమ్ములఁబంపుసేయ వే । దాద్రివిహారి మందిరుఁడహర్పతితేజుఁడు రాజిలున్ య
శో । భద్రుఁడు రామభద్రుని ప్రభావనయుఙ్ గురుభక్తియుఙ్ బ్రతా । పద్రవిణప్రసిద్ధి
యనుబంధుజనంబుప్రియంబుసేయఁగన్ ॥ ౨౦ ॥ సీ ॥ పట్టెవట్రువయనుబరిపుష్టి
తలకట్టు గుడిసున్నకియ్యయు సుడియుముడియు । నైత్వంబునెత్వంబునందంబుచం
దంబు గిలుకయుబంతులు నిలుపుపొలుపు । నయముసిస్సందేహతయు నొప్పుమురువు
నుద్రచ్చివేసినయట్లు తనరుటయును । షడ్వర్గశుద్ధియు జాతియోగ్యతయును వృద్ధిప్రి
యంబునువిశదగతియుఁ । గిలుకొనప్రాయసంబులు వ్రాయవ్రాయఁ । గొంకుకొనసు
నుజేతప్పుగొనకయుండు । లలితముక్తాఫలాకార విలసనమున । నతిమరున్మంత్రి వే
దాద్రిమంత్రివరుఁడు ॥ ౨౧ ॥ తే ॥ మాద్రిమీఁదవిహారి వేదాద్రిరాజు । దానధారా
ర్థమఖిలప్రధాననదుల । వెచ్చపెట్టుటఁదలఁకియో విబుధతటిని । తరుణశశిమౌళిజడ
లలోఁ డాఁగియుండు ॥ ౨౨ ॥ ఉ ॥ చేతులుద్రిప్పుచున్ బ్రభులచెంతలనూరకదుర్వి
తులై । యేతులఁబోవుచున్ దిరుగునిప్పటిమంత్రులుతంత్రులిందఱున్ । భూతలకల్ప
వృక్షముఁ బ్రభూతగుణాఢ్యుని సర్వలోకవి । ఖ్యాతువినీతు వేదగిరిఁ గాతరచిత్తులు
పోలనేర్తురే ॥ ౨౩ ॥ సీ ॥ కరుణించి చూచెనాకవిగాయకార్థార్థి నివహాగేహం
బుల నెఱయుసిరులు । కోపించిచూచెనాకొండతోనైనవచ్చుననవచ్చునతఁడైననవనిఁ
దూఱు । మెచ్చిమన్నించెనామెదుకపాలసుఁడైన దొరతనంబుననిల్చిపరిఢవించుఁ ।
బొందుగావించెనాభువినెట్టిఖలునకు నాదటకరుణా ప్రసాదమొసఁగు । మంత్రిమా
త్రుండె మర్త్మంత్రిమథనకథన । చారుచర్యా చమత్కారచక్రవర్తి । యద్రినిభుఁడు
విహారి వేదాద్రిరామ । భద్రపాదసరోరుహబంభరంబు ॥ ౨౪ ॥ మ ॥ జలజాతాం
ఘ్రిసరోజషట్పదము విశ్వామిత్రగోత్రోద్భవుం । డలఘుప్రాభవుఁ డర్థిలోకసులభుం

---

నిష్ణాత=నేర్పుగల. పక్ష్మలిత=చెప్పలెత్తఁబడిన—వికాసమునొందిన. లక్ష్మ=గుఱుతు. సుదావశ-విసుఁగుయొక్క. చతుర్వ్యూహలక్ష్మిన్=వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధులనెడి నాలుగు మూర్తులరచనలయొక్క కలిమిని. (ఇక్కడలక్ష్మిన్ అనఁగావిధమునఅనిఅర్థము.) ॥ ౨౦ ॥ ముద్రిత=ముద్రవేయఁబడిన. పంపు=చెప్పినపని. అహర్పతి=సూర్యుఁడు. యశోభద్రుఁడు=కీర్తిచేతమేలైనవాఁడు. ద్రవిణ=బలము ॥ ౨౧ ॥ సుడి=వట్రుపసుడి. ముడి=మాముడి తాముడియను—మావత్తు తావత్తు. గిలుక=వలపలగిలుక. పొలుపు=విధము. మురువు=అందము. ద్రచ్చి=తరిచి—కరిమెనపెట్టి. మరున్మంత్రి=బృహస్పతి ॥ ౨౨ ॥ తలఁకి=భయపడి. విబుధతటిని=దేవనది—గంగ ॥ ౨౩ ॥ దుర్వినీతులు=వినయములేనివారు. ఏతులఁబోవుచున్=నిక్కుచు. ప్రభూత=గొప్పలైన. వినీతున్=వినయముగలవానిని. కాతరచిత్తులు=పిఱికిగుండెగలవారు ॥ ౨౪ ॥ నెఱయున్=నిండును. మొదుకపాలసుఁడు=అదృష్టహీనుఁడగు మూర్ఖుఁడు. పరిఢవించున్=అతిశయించును. పొందు=స్నే

దైకీర్తిఁ బెంపొందు నా। కలకాళహస్తితనూభవన్ సుగుణలక్ష్మ్యాదిర్మ్యలాంబస్ప్రభల్ ।
వెలయంగాఁ గులకాంతఁ జేసి వెలసెన్ వేదాద్రిభద్రోన్నతిన్॥ ౭౫॥ సీ॥ వృషభేంద్ర
గమనుఁడీ వేదాద్రినాథుండు గిరిరాజతనయయీ తిరుమలాంబ । వేదనిశ్వాసుండు వే
దాద్రినాథుండు ధృతిశారదాంబయీ తిరుమలాంబ। విహగేంద్రగమనుఁడీ వేదాద్రినా
థుండు శరధితనూజయీ తిరుమలాంబ। విబుధాధినాథుఁడీ వేదాద్రినాథుండు ధరశచీ
దేవియీ తిరుమలాంబ । యనఁగ ననుకూలదాంపత్య వినుతమహిమ । హరువు దీపిం
చెనౌర వేదాద్రివిభుఁడు । హరియశుఁడై సకలకాళహస్తితనయ । తిరుమలాంబయు
నిత్యవర్ధిష్ణులక్ష్మి॥ ౭౬॥ సీ॥ వేదమార్గప్రతిష్ఠాదైవతజ్యేష్ఠుఁ డభ్యస్తషడ్దర్శనార్థరాశి।
యతిరాజరచితభాష్యగ్రంథనిర్ణేత యఖిలపురాణేతిహాసకర్త। బంధురదివ్యప్రబంధా
నుసంధాత పంచసంస్కారప్రపంచచణుఁడు। వాధూలమునిచంద్రవంశవర్ధనమూ
ర్తి సకలదేశాచార్యనికరగురువు । పట్టమేనుంగు శ్రీరంగపతికి నెన్న । గారిగర్భాం
బురాశినీహారరశ్మి । సారసాహిత్యసర్వస్వశయ్య నేటి । యాళవందారు కందాళ
యప్పగారు॥ ౭౭॥ శా॥ తత్తాదృగ్విభవప్రభావనిధిఁ గందాళప్పగారిన్ దయా।య
త్తస్వాంతు నితాంతశాంతియుతు లోకాచార్యవర్యున్ సుధీ। చిత్తాంభోరుహభానుఁ
గొల్చుచుఁ దదాశీర్వాదలబ్ధోన్నతిన్ । హత్తెన్ దానువిరూరిమంత్రిమణి వేదాద్రీశుఁ
డుద్యత్ప్రరుచిన్॥ ౭౮॥ వ॥ వెండియు నవ్వేదాద్రిమంత్రీశ్వరుండు రవికులతిలకుండును
రణరంగధీరుండును నంబునిధిగభీరుండును భట్టరభావాంకుండును నకలంకుండును నవ
త్తారుమండలీకరగండుండును నుద్దండభుజాదండుండును నై పరనారీసహోదరుండ
య్యును నితరసముపార్జితవధూవల్లభుండును గోపికాగోవిందుండయ్యు నీశ్వరలక్ష
ణలక్షితుండును సౌనాంచారుదేవిదివ్యశ్రీపాద పద్మారాధకుండయ్యును బ్రతిష్ఠాపి

హము. చర్చ=విచారణ. బంభరంబు=తుమ్మెద ॥ ౭౫॥ కాళాస్తి=కాళహస్తి ॥ ౭౬॥ వృషభేం
ద్రగమనుఁడు=శివుఁడు. వేదనిశ్వాసుఁడు=బ్రహ్మ. ధృతిన్=ధరించుటచేత. విహగేంద్రగమ
నుఁడు=విష్ణువు. శరధి=సముద్రము. విబుధాధినాథుఁడు=ఇంద్రుఁడు. హరువు=మనోజ్ఞత ॥
౭౭॥ దైవతజ్యేష్ఠుఁడు=బ్రహ్మ. అభ్యస్త=నేరువఁబడిన. షడ్దర్శనార్థరాశి=ఆఱుశాస్త్రముల
యర్థసముదాయము గలవాఁడు. నిర్ణేత=నిర్ణయించువాఁడు. అనుసంధాత=అనుసంధానము చే
సెడువాఁడు. (అనుసంధానము చేయు=భక్తితోఁ జదువు.) నీహారరశ్మి=చంద్రుఁడు॥ ౭౮॥ తాదృక్=
అటువంటి. నితాంత=మిక్కుటమైన. సుధీచిత్తాంభోరుహభానున్=పండితులమనస్సులనెడికమ
లములకు సూర్యుఁడైనవానిని. హత్తెన్=పొందెను. ఉద్యద్రుచిన్=పుట్టుచున్నప్రకాశమును॥ ౭౯॥
రవికులతిలకుఁడు=సూర్యవంశశ్రేష్ఠుఁడు. రణరంగధీరుఁడు=యుద్ధభూమియందు ధైర్యము గల
వాఁడు. అంబునిధిగభీరుఁడు=సముద్రమువలె గాంభీర్యగుణము గలవాఁడు. అకలంకుఁడు=దోష
ములేనివాఁడు. ఉద్దండభుజాదండుఁడు=నిక్కినకఱ్ఱవంటి భుజము గలవాఁడు. ఇతరసముపార్జి
తవధూవల్లభుఁడు=శత్రువులచేత సంపాదింపఁబడిన జయలక్ష్మి యనెడి స్త్రీ ప్రియురాలుగాఁ గల
వాఁడు. గోపికాగోవిందుఁడు=గొల్లపడుచులకుఁ గృష్ణుఁడు — అంతఃపురస్త్రీలకు కృష్ణునివలె
విలాసపురుషుఁడైనవాఁడు. ఈశ్వరలక్షణలక్షితుండు=శివునిగుఱుతులచేతఁ జూడఁబడువాఁడు—

పారాశర్యుం డలంచి ప్రాంజలియగుచున్ ॥ ౯౭ ॥ వ ॥ మహాత్ములారా యీపురావృత్తంబు త్రిరావృత్తంబుగా నుత్తమశ్లోకుండగు కృష్ణద్వైపాయనువలనము న్నెఱింగినయది కలవత్తెఱం గఖిలంబును మీయంతరంగంబులకు వచ్చునట్లుగా విన్నవించెద వినుండని సూతుండిట్లనియె ॥ ౯౮ ॥ శా ॥ శీతాహార్యసుతాళినీ వికచరాజీవంబు విశ్వేశ్వర, జ్యోతిర్లింగవిశుద్ధరత్నఖని మోక్షోపాయదుగ్ధాబ్ధివే । లాతీరావనిదుండినామకగజాలానంబు గంగామృత, స్రోతోనిస్సృతిచంద్రగోళమనమించున్ గాశి శ్రీరాశియై ॥ ౯౯ ॥ శా ॥ ప్రాలేయాచలకన్యకావదనశుంభత్పద్మసౌరభ్యమున్ । గ్రోలం గల్గియుఁదుష్టిలేకముని హృత్క్రోడాబ్జసౌగంధ్యలీ । లాలాలిత్యముఁ గోరునాకరసితరోలంబంబు నైజాకృతిన్ । దాలొందించుఁబరాసులన్ భ్రమరకీటన్యాయరీతిన్ బురిన్ ॥ ౧౦౦ ॥ సీ ॥ ఒకనాఁడు తీర్థోపయోగిగా నిశరుండు నౌదలధరియించు నభ్రగంగ। నాప్రొద్దుపోయి రాజనట్టి నిర్పేదయు భోగించు నైశ్వర్యములేనిమిదియుఁ। బుష్కరాక్షులపొంతఁ బోనివర్షధరుండు దేహార్ధమునఁ దాల్చుఁ దీఁగఁబోఁడి । నాయుధప్రభగాంచియలఁగుభీరువుఁ బూనువాఁడిముమ్మొనల వేఁడియలుఁగు। మలినవర్తనుఁడు నసుధాలలితమూర్తి । మించివర్తించుమతి లేని మేదకుండు। వానివర్యులఁజదివించు మత్తినీడఁ। బంచముఖుపీఠమే నొసరించె నేని ॥ ౧౦౧ ॥ క ॥ ఆనందకాననంబున। నానందకపాణి కేశవాహ్వయమునఁ బెం। పానందగు ముక్తిప్రమ। దానందితహారనీలతరళోపముఁడై ॥ ౧౦౨ ॥ సీ ॥ శ్రీకరోదయవధూలోకాననప్రభా నాటితబహుచంద్రనాటనంబు । సమ్మర్దగళితభూషణరత్నమంజరీయోజితరథ్యాప్రపూజనంబు। కైలాసశైలసంకాశ సౌధనివేశ కౌముదీకవచిత గగనతలము । విస్తీర్ణవిపణివిన్యస్తవస్తువ్రజ

---

తచర్యన్=విష్ణుదేవుని అర్చనము నెడి మేలైన నడవడిగలవానిని ॥ ౯౮ ॥ పురావృత్తంబు=పూర్వవృత్తాంతము. త్రిరావృత్తంబుగాన్=మూఁడు తడవలుగా ॥ ౯౯ ॥ శీతాహార్య=హిమవత్పర్వతము యొక్క. అళిని=ఆఁడుతుమ్మెద. వికచ=వికసించిన. విశుద్ధ=స్వచ్ఛమయిన. ఆలానంబు=కట్టుకంబము. స్రోతోనిస్సృతి=ప్రవాహము వెడలుటకు ॥ ౧౦౦ ॥ ప్రాలేయ=మంచు. శుంభత్=వికసించుచున్న. సౌరభ్యము=పరిమళము. గ్రోలన్=అనుభవింప. తుష్టి=తృప్తి. హృత్క్రోడా...లాలిత్యమున్=హృదయములోపలిభాగమయిన కమలము యొక్క మంచివాసన యొక్క విలాసమునందలి మనోజ్ఞతను. సితరోలంబంబు=తెల్లతుమ్మెద ॥ ౧౦౧ ॥ ఔదలన్=తలమీఁద. నిర్పేద=మిక్కిలి పేదవాఁడు. పుష్కరాక్షుల=స్త్రీల యొక్క. పొంతన్=సమీపమున. వర్షధరుఁడు=నపుంసకుఁడు. అలఁగు=జంకునట్టి. వాఁడిముమ్మొనల వేఁడియలుఁగున్ = పదునుగల మూఁడు కొనలుగల తీక్ష్ణమయిన ఆయుధమును—త్రిశూలమును. ఓసరించెనేనిన్ = విడిచినపక్షమున ॥ ౧౦౨ ॥ ఆనందకాననంబునన్=కాశియందు. నందకపాణి=విష్ణువు. ముక్తిప్రమద=మోక్షమనెడి స్త్రీ. తరళోపముఁడు=పతకమును బోలినవాఁడు ॥ ౧౦౩ ॥ శ్రీకరోదయ=సంపదను కలిగించునట్టి పుట్టుకగల. నాటిత=నటింపఁజేయఁబడిన. నాటనము=నటనముగలది. సమ్మర్ద=జనులఒరయిక చేత. మంజరీ=గుత్తులతోడ. యోజిత=పొందింపఁబడిన. రథ్యా=పట్టణమునడిమి పెద్దబాట. సౌధ...గగనతలము=మేడల ప్రకాశమనెడి వెన్నెలచేత కవచముగలదిగా చేయఁబడిన (కప్పఁబడిన) ఆకాశప్రదేశముగలది. విపణి=

ప్రకటితరత్నగర్భాజఠరము । విపులపవమానతాండవవేపమాన । లాంఛనధ్వజపట్టపల్లవలలామ । మాళిరచితకశాకృత్యహేళిహయము । దీపితంబగు శ్రీకాశికాపురంబు ॥ ౧౦౩ ॥ చ॥ జలజపరాగరాగరససంగతమాపరిఖాజలంబులో । పలఁ బ్రతిబింబితంబులగు బంగరుకోటకుఁ బెట్టినట్టికో । మ్మలచెలువంబునంబురిగమారమణీమణి యొప్పురావియా । కులమొలనూలు వెట్టినసఁ గోరికనుంగొను వారుమెచ్చఁగన్ ॥ ౧౦౪ ॥ క॥ పెరిగినత్రివిక్రమేశ్వరు । చరణతులాకోటి యతఁడుసంహృతదేహా । స్ఫురణుండగునపుడూడిన । కరణిం బురికోట యొప్పుఁ గనకమయంబై ॥ ౧౦౫ ॥ చ॥ పరిఘనిజాశ్రయాంబుపరిపాటిఁదలిర్పఁబదాఱువన్నెబం । గరువున నైనరాజగృహకల్పనకర్ణికఁ గాఁగ గంధసిం । ధురములు తేఁటులై మొరయఁ బోరపుఁ గొమ్మలు రేకులట్లుగా । ధరయనుకొల్నిలో మొలచుతామరపూవనఁ గోటమీటగున్ ॥ ౧౦౬ ॥ క॥ పురి రాకొమరులకీర్త్యం । బరవాహినిభుజగపురికి బలువిడిఁ జనియం । దిరవుకొననెడము చాలమి । మరలినతఱిబుగ్గలననమరుసౌధంబుల్ ॥ ౧౦౭ ॥ ఉ॥ నాకనదీప్రదీప్తపులినంబుల నిచ్చలు నిల్చి సన్మునుల్ । సైకతలింగపూజనము సల్పుతఱిన్ తవణించుతత్పతా । కాకలకింకిణీరవముఘంటలు మ్రోఁగుటధూపధూమముల్ । పైకొలుపున్ సమర్త్మగతిఁబర్విడు గుగ్గులుధూపధోరణిన్ ॥ ౧౦౮ ॥ చ॥ చదువులపుట్టినిండ్లుశమసంపదయిక్కలు పుణ్యలక్ష్మికిన్ । మొదలిదివాణముల్ సురసమూహముసాఁకటిపంటలంచితా । భ్యుదయనిసర్గ బంధువులు పోఁడితనంబుల తాణముల్ పురిన్ । బొదలెడి భూసురోత్తములభూరిపవిత్రశరీరవల్లరుల్ ॥ ౧౦౯ ॥ ఉ॥ పుట్టిననాటనుండియుసుబుణ్యులు సత్ఫలమొందునంతకున్ । బట్టినకార్యమీశ్వరుఁడు పట్టిననీనిదృఢప్రతిజ్ఞలే । పట్టునధర్మము ల్విడనిప్రాజ్ఞులు తజ్జ్ఞలపాలివేలుపుం । జెట్టులు పోరనైచపదిసేయని

---

అంగడివీధి. విన్యస్త=ఉంచఁబడిన. రత్నగర్భాజఠరము=భూమియొక్క కడుపు (లోపలిభాగము) కలది. వేపమాన=చలింపఁజేయఁబడుచున్న. లాంఛన=గుఱుతైన. పట్టపల్లవలలామ. మాళి=పట్టుతోనైనబెత్తముచివరచేత. కశాకృత్య=చబుకుపనిగల—చబుకుదెబ్బగల. హేళి=సూర్యునియొక్క ॥ ౧౦౪ ॥ పరాగరాగ= పుప్పొడివలనిరంగుగల. పరిఖ= అగడ్త. కొమ్మల = కోటకొమ్మలయొక్క ॥ ౧౦౫ ॥ తులాకోటి=అందె. సంహృత= తగ్గింపఁబడిన. స్ఫురణుఁడు= ప్రకాశము గలవాఁడు ॥ ౧౦౬ ॥ పరిపాటి=క్రమము—పేర. బంగరువు =బంగారు, కర్ణిక=తామరపువ్వులోనిమిద్దె. గంధసింధురములు=మదపుటేనుఁగులు. మీటగున్=అతిశయించును॥ ౧౦౭ ॥ అంబరవాహిని=ఆకాశగంగ. బలువిడిన్= మిక్కిలియాటోపముతో. ఇరవుకొనన్ = ఉండుటకు ॥ ౧౦౮ ॥ నాకనదీ=స్వర్గంగయొక్క—ఆకాశగంగయొక్క. పులినంబులన్. ఇసుకదిబ్బలయందు. నిచ్చలు= ఎల్లప్పుడు. తవణించు=కలుగఁజేయునట్టి॥ ౧౦౯ ॥ ఇక్కలు=స్థానములు. దివాణములు=కొలువుకూటములు— తావులు. నిసర్గ=సహజమైన. తాణములు- స్థానములు. వల్లరులు=తీఁగలు ॥ ౧౧౦॥ ఈని=ఇయ్యని—వదలని. ధర్మములు=పుణ్యములు; విండ్లు. తద్జ్ఞులపాలివేలుపుంజెట్టులు=తత్వజ్ఞులు పాలిటి కల్పవృక్షములు— తత్వము తెలిసినవారు కోరినవాని నెల్లను ఇచ్చువారు. పోరన్ =యుద్ధమునందు. ఐదుపది సేయని=చేతులజోడించుకొని పాఱిపోని. వీటిరాసులు= పట్టణమునందలి

శూరులువీటిరాసుతుల్ ॥౧౧౦॥ తే॥ బలయురత్నాకరములుసంచులుగఁజేసి। పాదివినిధులెల్లఁగొనిసంచిమొదలుచేసి। బేరమాడెడుపాటియుదారలక్ష్మి। బచ్చులప్పురినున్నారుపెచ్చువెరిగి ॥ ౧౧౧ ॥ క ॥ హరమాళిహీరమచ్యుత। చరణాబ్జపురంధరజాహ్నవిలోకే। శ్వరితమసోదరియానఁట। పురివెలమలభాగ్యమహిమపొగడఁగవశమే ॥ ౧౧౨ ॥ ఉ। భూమియునాకసంబుతమపాంకమునన్ బిగియించుతత్పురీ। సామజకోటియున్నతికిసర్వజగంబులఁగల్గునున్నతుల్। భూమముడిందివామనతఁబూనఁగదక్షిణదిక్కునేనుఁగున్। వామనమంచునాడఁదగవాతగవాడరుగాక భూజనుల్ ॥ ౧౧౩ ॥ చ ॥ కెరలకక్రమ్మరింపనడుగంటనెనిల్చినొకింతనూకినన్। శరనిధులేడుదాఁటుమెయి చాఁచిచివుక్కున నుక్కుమీరిసం। గరమునగాయమైన పతిఁగాచుఁజలింపక తత్పురీహరుల్। హరిహయుమావు మున్ డిగినయంబుధిరేవునవచ్చెనోసుమీ॥౧౧౪॥ ఉ ॥ సారథిఛాందసుండు బడిసాగదుచక్రయుగంబు ప్రాఁతపం। చారపుగుఱ్ఱముల్ రథియు శౌర్యమునందరమానిసాత్మవి। స్తారముఖండఖండములుతానఁటమాసరి యంచుఁదత్పురిం। దేరులునవ్వుశంకరునితేరిని కేతనకింకిణీధ్వనిన్ ॥ ౧౧౫ ॥ క ॥ వేటాడుతునియలుగనరి। పాటనమొనరించుబాహుపాటవగరిమన్। మేటులగుపోటుమగల। వీటన్ విహరింతురుగ్రవిక్రములగుచున్ ॥ ౧౧౬॥ సీ ॥ మొలకచీఁకటి జలజలరాల్పఁగారాదె నెఱులుమించినవీరికురులయందు। కెరలించియమృతంబు గిలకొట్టఁగారా దెముద్దుచూపెడివీరిమోవులందు। పచ్చబంగారుకుప్పలుసేయఁగారాదె గబ్బుమీరినవీరిగుబ్బలందు। పండువెన్నెలతేటఁబరిఢవింపఁగరాదెనగవుగుల్కెడువీరిమొగములందు। నౌరకరవాఁడిచూపులయోఘళంబు। బాపురేభూరికటితటీభారమహిమ। చాఁగుమదమందగమనలక్షణములనఁగ। నేరుపుల

---

రాచకొమారులు॥ ౧౧౧ ॥ బలయు=భూమినిఆవరించిన. సంచిమొదలు= అసలు= మూలధనము. బచ్చులు=వైశ్యులు॥ ౧౧౨ ॥ హీరము=వజ్రమణి. పురంధ=పూఁదేనెయొక్క. జాహ్నవి=గంగానది. వెలమల=శూద్రులయొక్క॥ ౧౧౩ ॥పాంకమునన్=పొందికచేత—ఆకృతిచేత. ఉన్నతికిన్=పొడువునకు. భూమము=ఆధిక్యము. డిందు=అణఁగి. వామనతన్= పొట్టితనమును. తగవు=న్యాయము. ఆడరు=చెప్పరు ॥ ౧౧౪ ॥కెరలక=తత్తఱిల్లక. అడుగంట నె= అడుగుకొలఁది దూరమునసే. నూకినన్=తోలినను. శరనిధులు=సముద్రములు. సంగరమునన్=యుద్ధమునందు. హరిహయుమావు=ఇంద్రునిగుఱ్ఱము ॥ ౧౧౫ ॥ఛాందసుండు=వైదికుఁడు. బడిన్=క్రమముగా. ప్రాఁతపంచారపు= మిక్కిలిప్రాఁతవైన— బహుకాలమునాటివైన—మిక్కిలిముసలివైన. రథి=రథికుఁడు. అరమానిసి=సగముమనుష్యుఁడు—అర్ధనారీశ్వరుఁడు. ఆత్మవిస్తారము= తనవిరివి—స్వరూపమంతయు. శంకరునితేరినిన్=శివునిరథమును—భూమిని॥ ౧౧౬॥ వేటాడుతునియలుగన్=ఒకవేటునకుఆఱుతునకలు అగునట్లుగా. అరిపాటనము=శత్రువులనునఱకుటను. పాటవగరిమన్=సామర్థ్యగౌరవముచేత. మేటులు=అధికులు. పోటుమగలు=యుద్ధశూరులు॥౧౧౭ ॥ నెఱులు=వంకరలు. కెరలించి=రేఁపి. మోవులందున్=పెదవులయందు. గబ్బు=మదము. గుబ్బలందున్= స్తనములందు. పరిఢవింపఁగన్=అతిశయింపఁజేయ. ఔర=ఆశ్చర్యము. కరవాఁడి= మిక్కిలివాఁడియైన

మింతురప్పురివారసతులు॥ ౧౧౭ ॥ సీ॥ నారుతాపహతిరాలు నారికేళఫలాళినిడిసి
జల్లించుపుండ్రేక్షురసము । చిలుకపోటులచేతఁజిరిఁగినసహకారఫలములఁదొరఁగెడి
పచ్చితేనె । చిక్రోడదంష్ట్రిలుచెక్కు సుగంధియనంటిపండ్లనుగాఱునవ్యసుధయుఁ।
పాకవేళారంభపరిపాటిఁదమయంతఁబగిలినపనసక్రొంబండ్లజేస । మేకనైకాలు
వలుగట్టియేకహేలఁ। బఱవనందలిక్రియ్యాటపసిమితేటఁ। బండునవ్వేటిముక్కరుఁ
బసిఁడిగారు । సరసధాన్యంబుమంచిరాజనపుఁజేల॥ ౧౧౮ ॥ చ॥ తెలతెలవాఱునె
య్యనరుదెంచి నిశాంత రతాంతతాంతలౌ । చెలువలకింపుగా మొలఁగి చెక్కులఁ
గూరినచూర్ణకుంతలా । వళిసరళంబుగాజడిసివాడినసెజ్జలమీఁదిప్రావిరుల్ । దొ
లఁగఁ బ్రభాతవాయువులుదోఁచుఁ బురిం బరిచారికాకృతిన్ ॥ ౧౧౯ ॥ సీ॥ ఏవం
విధఖ్యాతినెసఁగు శ్రీవారాణసీ పట్టణంబునసిద్ధతటిని । పొంతసిద్ధాశ్రమంబు ఘటిం
చియుండులోపాముద్రయును దానుబ్రభయుఁ దరణి । యనుబోలెఁ బాయనియను
కూలదాంపత్యమునఁబొల్చి మునికోటి తనుభజింపఁ। దారకబ్రహ్మవి ద్యారహస్య
జ్ఞాతచులుకితాంభోరాశికలశసూతి । బ్రహ్మనిభమూర్తి పెక్కుకల్పంబులుండి । వి
బుధయూథంబు ప్రార్థింపవింధ్యశిఖరి । విక్రమాటోపమడఁపనవ్వేడవెడలెఁ । బ
రవిపత్ప్రతీకారతత్పరులఘనులు ॥ ౧౨౦ ॥ తే॥ అబ్ధితోఁగూడమునుగ్రోలునౌర్వవ
హ్ని । యుదరబిలముననొకచోటనుండియుండి । జటిలవరుసకుఁగద్రూజకటకకటక।
విరహతాపమిషంబున వెడలెనపుడు ॥ ౧౨౧ ॥ చ॥ పుడిసిటఁబట్టె నేతపసిపొంగు
పయోనిధినిల్వలానుజున్ । గడుపునవేల్చె నేతపసి గాథతపోనిధినయ్యగస్త్యునిన్ ।

---

కౌఘుళంబు=వ్యాపనము. బాపురే—ఔరా. కటిఘటీ=పిఱుఁదులయొక్క. బాఁగు=ఔరా ॥ ౧౧౮॥
ఇడిసి—పగిలి=చీలి. జల్లించు=కాఱు. పుండ్రేక్షు=నామాలచెఱకులయొక్క. చిరిఁగిన=చినిఁగిన. సహకారఫలములన్=తియ్యమామిడిపండ్లయందు. తొరఁగెడి=కాఱునట్టి. చిక్రోడ=ఉడుతయొక్క. నవ్యసుధ=క్రొత్తయమృతము—అమృతమునుబోలినరసము. పాక=పక్వమగునట్టి—పండెడి. క్రొంబండ్లజేసము=క్రొత్తపండ్లయొక్కగుజ్జు. ఏకహేలన్=ఒక్కమొగిని. పఱవన్=ప్రవహింపఁగా. క్రియ్యాటన్=క్రిందియాటచేత. పసిఁడి=బంగారు. రాజనపుఁజేలన్=వరిమళ్లయందు ॥ ౧౧౯॥
ఒయ్యన్=తిన్నఁగా. నిశాంతరతాంతతాంతలు=వేకువజామునందలికలయికలవలయందుబడలినవారు. చెలువలకున్=స్త్రీలకు. కూరిన=పొందిన. చూర్ణకుంతలావళి=పొడివెండ్రుకలవరుస—ముడికందనివెండ్రుకలసమూహము. జడిసి=తొలఁగఁద్రోసి. సెజ్జ=పానుపు. ప్రావిరులు=ప్రాంతపువ్వులు. ప్రభాత=ప్రాతఃకాలమునందలి ॥ ౧౨౦ ॥ ఏవంవిధ=ఈవిధమయిన. ఎసఁగు=అతిశయించునట్టి. సిద్ధతటిని పొంతన్=గంగగట్టున. ప్రభ=ప్రకాశము—ఛాయ. తరణి=సూర్యుఁడు. పొల్చి=ఉండి. జ్ఞాత=తెలిసినవాఁడు. చులుకిత=పుడిసిలింపఁబడిన. కలశసూతి=అగస్త్యుఁడు. విబుధయూథంబు=దేవతలసమూహము. శిఖరి=కొండ. ఆటోపము = విజృంభణమును. పరవిపత్ప్రతీకారతత్పరులు=ఇతరులఆపదలనుతొలఁగించుటయందు ఆసక్తులు ॥ ౧౨౧॥ ఔర్వవహ్ని=బడబాగ్ని. ఉదరబిలమునన్=కడుపు అనెడిగుహయందు. జటిలవరునకున్=ఋషిశ్రేష్ఠునకు. కద్రూజకటకకటకవిరహతాపమిషంబునన్=పాములుకడియములుగాఁగలశివునిపట్టణమయినకాశి

బొడగనివింధ్యభూధరము పొంకముబింకము దక్కి నేలలో । నడఁగెబిలాంతరస్థలిభ
యాహతిఁజొచ్చు కుళీరమోయనన్ ॥ ౧౨౨ ॥ శా ॥ ఆవింధ్యాచలమట్లువంధ్యనిజ
గర్వారంభమైయుండ న । గ్గోవిందాభుఁడభంగురోదయనిధిం గొల్లాపురీలక్ష్మిర ।
క్షోవిద్వేషి భుజాంతరాళపదవీ శుద్ధాంతసైరంధ్రికన్ । సేవించెన్ సుతియించె
నాగమకథా సిద్ధాంతశుద్ధోక్తులన్ ॥ ౧౨౩ ॥ క ॥ ఆపరమేశ్వరితనునా । జ్ఞాపింపఁ
గసామిమలకుషణ్ముఖపదసే । వాపరతఁజనియెనమ్ముని । లోపాముద్రయును శిష్యు
లును సేవింపన్ ॥ ౧౨౪ ॥ వ ॥ ఇట్లు చనునవసరంబున ॥ ౧౨౫ ॥ సీ ॥ కొనలఁజు
ట్టినతీఁగె పెనచేఁ జమరవాల పరికరంబులఁ జుట్టుపట్టితిగిచి । కమ్మసంపెఁగలమొ
గ్గలనిరుగడ రాయు జేగురుఁదిరికలుచెంపఁబెట్టి । లేడికినొడియుశిలీముఖశ్రేణిచేమేలి
ఫూగుత్తులు రాలరువ్వి । కబళనత్వరమాణ కరటితుండములచేఁ గదళికాతరువులఁ
గాళ్లఁదాఁచి । నెఱికురులుఁ జారునాసలు నిబ్బరంపు । గుబ్బచన్నులుఁ దొడల పె
క్కువయుఁ గలుగు । మృగవధాజీవ శుద్ధాంత మీననయన । లర్చనలుచేసి కొలిచిర
య్యాలుమగల ॥ ౧౨౬ ॥ వ ॥ ఇట్టులనుదినప్రయాణంబుల నమ్మిథునంబు కుంతల
దేశప్రాంతంబు గదిసిన ॥ ౧౨౭ ॥ క ॥ పంపాతరంగరింఖణ । ఝంపా సంపా
త్యమాన జలకణరేఖా । సంపాతశీతలానిల । సంపదపొదలించెఁబరమశైవోత్తం
సున్ ॥ ౧౨౮ ॥ సీ ॥ నఖరాగ్రలూనాన నస్వేదకోరకం బర్ధకషాయ దృగంచలం
బు । ప్రబలనిశ్వాస సౌరభతర్పిత మదాళిశోషితశ్రవణ శిరీషయుతము । దర్శిత

---

యొక్క యెడఁబాటువలనితాపము నెపముచేత॥ ౧౨౨ ॥ పయోనిధిన్=సముద్రమును. వేల్చెన్=ఆ
హుతిగాఁజేసికానైనో. పొడగని=చూచి. పొంకము=నిక్కయొక్క. బింకము—బిగువును. తక్కి=విడి
చి. కుళీరము=ఎండ్రకాయ॥ ౧౨౩॥ వంధ్య=వ్యర్థమయిన. ఆరంభము=త్వరగలది. అభంగురోద
యనిధిన్=చెడనిమేలునకుఉనికిపట్టయినదానిని. రక్షోవిద్వేషిభుజాంతరాళ పదవీశుద్ధాంత సైరం
ధ్రికన్=రాక్షసులకు శత్రువైనవిష్ణుదేవునివక్షస్స్థలమార్గమనెడిఅంతఃపురమునకు కావలికత్తెను ॥
౧౨౪ ॥ ౧౨౫ ॥ ౧౨౬ ॥ కమ్మ=పరిమళముగల. జేగురుఁదిరికలు=ఎఱ్ఱనిజడలు. ఒడియు=ఆక
ర్షణచేయునట్టి. శిలీముఖ= బాణములయొక్క. కబళన=మ్రింగుటకు. త్వరమాణ= తొందరపడు
చున్న. కరటితుండములతోన్=ఏనుఁగుతొండములతోడ. తాఁచి=తన్ని. నెఱికురులు=వంకరగలత
లవెండ్రుకలు. చారునాసలు=ఒప్పిదములైనముక్కులు. నిబ్బరంపు=సడలని. పెక్కువ=ఆధిక్యము.
మృగవధాజీవశుద్ధాంతమీననయనలు=బోయలయంతఃపురస్త్రీలు॥ ౧౨౭ ॥ మిథునము=దంపతులు॥
౧౨౮ ॥ పంపా...సంపద=పంపానదియందలిఅలలయొక్క పొరలికలతోడిదూఁకుళ్లచేత చెదరిపడుచు
న్ననీటిచుక్కలవరుసల పాటువలనిచల్లగాలి. పొదలించెన్ =సంతోషింపఁజేసెను. పరమశైవోత్తం
సున్=శ్రేష్ఠులైనశివభక్తులకుసిగబంతి(శ్రేష్ఠుఁడు) ఐనవానిని—అగస్త్యుని ॥ ౧౨౯ ॥ నఖరా
గ్రలూనాననస్వేదకోరకంబు=కొనగోటిచేత ఎగమీటఁబడినమొగమునందలి చెమటమొలకలుగలది.
అర్ధకషాయదృగంచలంబు=సగము ఎఱ్ఱవాఱినకనుఁగొనలుగలది. సౌరభతర్పితమదాళి=పరిమళము
చేతతృప్తిపొందింపఁబడిన తుమ్మెదలుగలది. శోషిత= వాడిన. శిరీష=దిరిసెనపువ్వుతోడ. దర్శి

మధ్యవృత్తస్రస్తమృదునీవియు బ్రయత్నపయోధరాంబరంబు। సంతప్తశర్కరా స
హాపదన్యాసంబు నచలరజోధూమ లాలకంబు। సరణి తరుణతరుచ్ఛాయ శమితఖే
ద। మలసమృదులాంగకంబు నైయరుగుదెంచు। నన్నిజపరిగ్రహముఁ గూర్మినాద
రించి। పలుకువింధ్యాద్రి నిర్బంధబాంధవుండు॥౧౨౯॥ మ॥ వనితా చూచితె మాల్యవం
తముఁ బ్రభావంతంబు నానామణీ। జనకోదంచితసానుకాంతము మరుత్సంపూర్ణచం
ద్రాననా। జనకేళీపదచంద్రకాంతము నభస్సంబాధకృత్కూటవ। ర్ధనదుర్దాంతము
సర్వపర్వతధాత్రీ ప్రాగ్వర్ణితోదంతముల్॥ ౧౩౦॥ సీ॥ ఇవె యూపవృతశాఖు లివె లూన
ముఖదర్భసందర్భ వేశంతసైకతంబు। లివె శష్పసహమృగయువయుగంబు లవిరెచలకాక
పక్షమస్తకులు బ్రహ్మ। చారులు నిజహోమసౌరభేయీతర్ణకముల నీడల నిల్చి కాచియు
న్నా। రదె సామోదితస్వరసంశయము నొంది చిలుకకోయిలని దె తెలియనడిగె। భసలక
లభకులాస్పృష్టకుసుమవివర। మసృణమకరందమయమైన మావి మోక। కిసలయచ్ఛవిపు
నరుక్తిననలుమనలు। ఋషుల చెంగావి వలువ౦దు నిందువదన॥ ౧౩౧ ॥ క॥ నిర్ధూ
తపాతకములు హా। విర్ధూమలతాగ్ర లాస్య విలసనశిఖలౌ। ధూర్ధరములు నిజభజన
వి। వర్ధితసుకృతంబు లిచటి వాయువు లబలా॥ ౧౩౨ ॥ ఉ॥ ఓలలితాంగి యిందు
సుఖమున్ వసించు మృకండుకణాదగాధి వా। ధూలముఖాతిరిక్తచరితుండు మతంగమహా

---

తే=చూపఁబడిన. వృత్త=వట్రువైన. స్రస్త=జాఱిన. నీవి=పోకముడిగలది. పయోధరాంబరంబు=చన్నులమీఁది వస్త్రము గలది—పైఁట గలది. సంతప్త...న్యాసంబు=కాలిన గులకరాలమీఁద నొయ్యనియడుగు పెట్టుట గలది—ఎండచేత కాలిన గులకరాలపై అడుగు పెట్టఁజాలకయు అడుగు పెట్టుచున్నది అనుట. అచల...కంబు=కొండయందలి దుమ్ముచేత నలుపు మించఁగలసిన యొప్పువన్నె గల ముంగురులు గలది. సరణి=మార్గమునందలి. తరుణ=లేఁతలైన. శమితఖేదము=అణఁపఁబడిన బడలిక గలది. అలసమృదులాంగకంబు=బడలిన మెత్తని దేహము గలది. నిజపరిగ్రహముల్=తన భార్యను. వింధ్యాద్రినిర్బంధబాంధవుండు=అగస్త్యుఁడు ॥ ౧౩౦ ॥ ప్రభావంతంబు=ప్రకాశము గలది. నానా...తము=అనేకములయిన రత్నములకు పుట్టుచోట్లయి యొప్పునట్టి చఱియలచేత మనోజ్ఞమయినది. మరు...కాంతము=దేవతాస్త్రీలకు క్రీడాస్థానములైన చంద్రకాంత పురాళ్లు గలది. నభ...దుర్దాంతము=ఆకాశమును ఒరయుచున్న శిఖరములు పెరుగుటచేత అణఁపరానిది. ప్రాగ్వర్ణితోదంతము=ముందె న్నఁబడిన వృత్తాంతము గలది ॥ ౧౩౧ ॥ యూపవృతశాఖులు=యూపస్తంభములచేత ఆవరింపఁబడిన వృక్షములు. లూన=కోయఁబడిన. సందర్భ=కూడిక గల. వేశంతసైకతంబులు=కొంచెపు నీటిపడియలవెంబడి యిసుకదిబ్బలు. సహ=సహించునట్టి. కాకపక్ష=పిల్లజుట్లతోడి. సౌరభేయీతర్ణకములు=ఆవుల లేఁగదూడలను. సామోదిత=సామవేదమువలనఁ బుట్టిన. భసల...మయము=కొదమతుమ్మెదల సమూహముచేత తాఁకఁబడని పువ్వుల సందాయమువలని మెఱుఁగులు దేఱుచున్న తేనె వికారము గలది. మావిమోక=మామిడి మొలక. కిసలయచ్ఛవి=చిగుళ్ల కాంతి. పునరుక్తిన్=యిబ్బడించుటచేత. అనలుమనలున్=బురదగొనును—అతిశయించును. ఇందువదన=చంద్రునివంటి ముఖము కలదానా॥ ౧౩౨ ॥ నిర్ధూత=బొత్తిగా తొలఁగింపఁబడిన. హవిర్ధూమ=హోమము పొగయనెడి. లాస్యవిలసన=నాట్యపు చతురత్వమును. ధూర్ధరములు=భారమును వహించినవి. నిజభజన=తమ్ము సేవించుటచేత॥ ౧౩౩ ॥ అతిరిక్త=మించిన. నిష్కాళిగళుండు=నల్లఁదనము లేని మెడగలవాఁడు. సర్యువతిగాత్రుఁడు=ఆఁహా

తపస్విని। పాకళగళుండు నిర్యువతిగాత్రుఁడు నిర్నిటలేక్షణుండుని। ర్వ్యాళవిభూషణుండు నగునంబరకేశుఁ డనంగఁబెంపగుఁ ॥ ౧౩౩ ॥ తే ॥ హోమ ధూమాసితప్రభ నీమహాత్మ్య। నాశ్రమంబొప్పునీయద్రి యంతికమున। వలుదర్మైమించునప్పంటవలఁతి నెలఁత। చంటి కడనంటు మృగనాభి చర్చవోలె ॥ ౧౩౪ ॥ ఉ ॥ భూరితరాభ్రవిభ్రమముపుష్కర రమ్యకరంబుదానల। క్ష్మీరుచిరంబు సత్వగుణకీర్తితమూర్తియు వాలిసాలసం। హారవిహార కారణము నౌరఘుకుంజరభర్తమున్న సం। చార మొనర్చె నీయచల సానుతలంబున నంబుజాననా ॥ ౧౩౫ ॥ సీ ॥ పద్మినీపద్మాతపత్రంబు శిథిలపత్త్రాగ్రమై రాయంచ యాశ్రయించెఁ। దాలుస్రవత్ఫేన జాలంబుతో ఘోణిపంచల రొంపిగలంచియాడె। దూరోద్గమద్దావధూమమంబుదబుద్ధి నెమ్మిలోపొదనుండి నిక్కిచూచె। జఠరస్థజలము నాసానాళమునఁ బీల్చి సామజంబిరుప్రక్కఁజల్లుకొనియె। సరసిపైనీరుసలసల దెరలె విపిన। సకలవీధులు నిర్మృగోచ్చయములయ్యె। మట్టమధ్యాహ్నమిదిసుధామధురవాణి। యధ్వమిచ్చోఁ బథశ్రమము పనయింప ॥ ౧౩౬ ॥ వ ॥ అనుచు సభార్యుండై వింధ్యాహార్య స్తంభయిత సంభృతానురాగంబున నిగిడిచని ॥ ౧౩౭ ॥ క ॥ నటనోద్భటుఁడైన మహా। నటునిజటాజూటమురిలినందొరఁగుమరుత్కటకనదియిదియనుచుఁజని। యటఁగనియెం మంగభద్ర నఘముఖ ముద్రన్ ॥ ౧౩౮ ॥ శా ॥ గంగా సంగమ మిచ్చగించు నెవఁడిన్

---

రూపు (అర్ధ) శరీరమునందు లేనివాఁడు. నిర్నిటలేక్షణుండు=నొసటకన్ను లేనివాఁడు. నిర్వ్యాళవిభూషణుండు=పాములసొమ్ములు లేనివాఁడు. అంబరకేశుఁడు=శివుఁడు ॥ ౧౩౪ ॥ అసితప్రభ=నల్లని కాంతి. అంతికమునన్=సమీపమునందు. వలుద=వట్రువ. పంటవలఁతి=భూమి. చర్చ=పూఁత ॥ ౧౩౫ ॥ భూరితరాభ్రవిభ్రమము=మిక్కిలియెచ్చైనమబ్బు యొక్క విలాసము. పుష్కర=తెల్లదామర; తొండము యొక్క కొన. దానలక్ష్మీ=ఈవికలిమి; చెక్కిటిమదము కలిమి. వాలిసాలసంహారవిహారకారణము=వాలియొక్కయు ఏడు చెట్లయొక్కయు చంపుటయనెడు వినోదసంచారమునకు హేతువైనది. వాలి=మొగ్గి—పూని. సాల=వృక్షములను. సంహార=నాశము చేయునట్టి. విహార=వినోదసంచారము. కారణము=హేతువు. రఘుకుంజరభర్త=రఘువంశశ్రేష్ఠుఁడైన శ్రీరాముఁడు. రఘువంశస్థుం డైనయేనుఁగులరాజు. సాను=చఱియ ॥ ౧౩౬ ॥ పద్మినీపద్మాతపత్రంబు=తామరతీఁగయందలి తామరపువ్వు అనెడి గొడుగును. శిథిలపత్త్రాగ్రము=తూఁట్లువడిన రెక్కకొనలుగలది. తాలుస్రవత్ఫేనజాలంబుతోన్=దవుడలనుండి కాఱుచున్ననురుఁగు తెట్టెలతో. ఘోణి=పంది. దూరోద్గమద్దావధూమము=దూరమునందెగసిన కార్చిచ్చుపొగ. అంబుదబుద్ధిన్=మేఘమనెడితలఁపుచేత. నెమ్మి=నెమలి. పొదలోపల=పొదలోపలిభాగము. జఠరస్థ=కడుపునందుండెడి. నాసానాళమునన్=ముక్కుగొట్టము. సామజంబు=ఏనుఁగు. సరసి=సరస్సు. తెరలెన్=తెల్లెను=ఉడికెను. నిర్మృగోచ్చయములు=మృగసమూహములు లేనివి. పథశ్రమము=త్రోవనడచుటవలని బడలికను. అపనయింపన్=పోఁగొట్టుటకు ॥ ౧౩౭ ॥ ౧౩౮ ॥ నటనోద్భటుఁడు=నాట్యము చేయుటయందు హెచ్చినవాఁడు. మహానటుని=శివుని యొక్క. ఉరిలినన్=వీడినను. తొరఁగు=స్రవించునట్టి. మరుత్కటకనది=ఆకాశగంగ. అఘముఖముద్రన్=పాపములముఖములకుముద్రయైనదానిని—పాపములను తలయెత్తనీయనిదాని

గా వేరిదేవేరిగా । నంగీకారమొనర్చు నేయమునతో నానందముం బొందు నే । రంగ
త్తుంగ తరంగ హస్తముల నారత్నాకరేంద్రుండునీ । యంగంబంటి సుఖించు నేని
గుణభద్రా తుంగభద్రానదీ ॥ ౧౩౯ ॥ క ॥ ఓపును భూపరిధింగల । యాపగల
విబాహ్యతాప మాఁపఁగనీవే । యోపుదుగా యంతర్గత । తాపత్రయ మడఁపనో
యుదన్వన్మహిళా ॥ ౧౪౦ ॥ చ ॥ అనికొని యాడి యన్నది మహానియమంబునఁదీ
ర్థమాడిబో । రన భవరోగజాడ్యములు గ్రాఁగఁదమజ్జ్వలకర్బురాబ్జగం । ధనిచిత
మౌరసౌషధము ద్రావి తటస్థితపూజ్యపూజనం । బునడపెఁగాశికా విరహభూ
రివిషాదము సాదమొందఁగన్ ॥ ౧౪౧ ॥ వ ॥ ఇవ్విధంబునఁద్రిభువన పవిత్రీకరణ
సమర్థ చరిత్రంబగునయ్యుదధికళత్రంబున ససతీ ఛాత్రుండై యంచిత కృత్యంబులా
చరించి నీవారముష్టిం బంచవారంబులుండి తద్వారిపూరంబు వినిర్గమించి మించుఁ
బోఁడియునుం దానును బంచాక్షరీ గుహాహర్యక్షంబగు విరూపాక్షు నుక్షధ్వజు
దాక్షాయణీవిభు వలక్షమయూఖ రేఖామకుటు భ్రుకుటిమాత్ర విద్రావిత పురని
శాటు హేమకూటనివాసు వాసుకివలయు వలయు తెఱంగునం బ్రస్తుతించి సమస్త
కలుష నిరసనలలితమూర్తియై చనిచని ముందట నమందమణికందళ దంతురంబయి

---

ని ॥ ౧౩౯ ॥ దేవేరిగాన్=పట్టపుదేవిగా. రంగత్తుంగతరంగహస్తములన్=చలించుచున్నయున్నతములయిన అలలనెడిచేతులతో. రత్నాకరేంద్రుఁడు=సముద్రరాజు. గుణభద్రా=మంచిగుణములచేత మేలైనదానా ॥ ౧౪౦ ॥ భూపరిధిన్=భూమండలమునందు. ఆపగలవి=నదులు. బాహ్యతాపము=బయటికాఁకను. ఆఁపఁగన్=అణఁపను. అంతర్గత=లోపలఁబొందియుండెడి. ఉదన్వన్మహిళా=సముద్రునియిల్లాలా ॥ ౧౪౧ ॥ తీర్థమాడి=స్నానముచేసి. బోరనన్=శీఘ్రముగ. భవరోగజాడ్యములు=జన్మములనెడివ్యాధులవలనిజడత్వములు. గ్రాఁగన్=కాలిపోఁగా. తమజ్జ్వలకర్బురాబ్జగంధనిచితము=ఆనదియందలి ప్రకాశించునట్టి బంగారుకమలములవాసనచేత అతిశయిల్లినది. రసౌషధమున్=జలరూపమయినమందును. తటస్థిత=గట్టునందుండెడి. కాశికావిరహభూరివిషాదము=కాశీపట్టణమును విడుచుటవలని అత్యంతమయిన మనస్తాపము. సాదము=నాశము ॥ ౧౪౨ ॥ త్రిభువనపవిత్రీకరణసమర్థ చరిత్రంబు=స్వర్గమర్త్యపాతాళములనెడి మూఁడులోకములను పావనములనుగాఁజేయఁజాలినప్రవర్తనముగలది. అయ్యుదధికళత్రంబునన్=ఆసముద్రునిభార్యయందు—నదియందు. ససతీఛాత్రుండు=పెండ్లాముతోను శిష్యులతోనుగూడినవాఁడు. అంచిత=ఒప్పిదములయిన—ముఖ్యములయిన. నీవారముష్టిన్=పిడికెఁడునివ్వరిధాన్యము నాహారముగాఁ జేసికొనుటచేత. పంచవారంబులు=అయిదువారములు—నలుపదిదినములు. తద్వారిపూరంబు=అందలిజలప్రవాహమును. వినిర్గమించి=దాఁటి. మించుఁబోఁడియున్—పెండ్లామును. పంచాక్షరీగుహాహర్యక్షంబు=పంచాక్షరీమంత్రము అనెడి గుహయందలి సింహము. ఉక్షధ్వజున్=వృషభకేతనముగలవానిని. దాక్షాయణీ విభున్=దక్షునికూఁతురి మగనిని. వలక్షమయూఖరేఖామకుటున్=చంద్రరేఖకిరీటముగాఁగలవానిని. భ్రుకుటిమాత్రవిద్రావితపురనిశాటున్=బొమముడిమాత్రముచేత నేపరుగెత్తింపఁబడిన త్రిపురాసురులు గలవానిని. వాసుకివలయున్=సర్పరాజుచేతికడియముగాఁగలవానిని. ప్రస్తుతించి=పొగడి. సమస్తకలుషనిరసనలలితమూర్తి=ఎల్లపాపములను తొలఁగించుకొనుటచేతమనోహరమయిన యాకృతిగలవాఁడు. అమందమణికందళదంతురము=తక్కువ

మహీగంధగమన కేళీకందుకంబునుంబోలె నుత్తాలంబగు స్వామిశైలంబు నధిరోహణంబుచేసి యక్కుధరమ్మునందు ॥ ౧౮౨ ॥ క ॥ షణ్ముఖు శిఖిసంతప్తహి। ర ణ్మయనిభవర్ణుఁ గేకిరాడ్ధ్వజుఁ గొలిచెన్ । షాణ్మాతురుఁ దపసితురా। షాణ్ముఖసుఖదప్రభావు సతియాండాసున్ ॥ ౧౮౩ ॥ క ॥ కొలిచినుతించెం గ్రౌంచా । చలవిదళనినిపుణబాహుపారుఁగుమారున్ । గలశసుతుండుంబలుకుల । మొలకలుపుష్పోపహారిములు చెలువెసఁగన్ ॥ ౧౮౪ ॥ సీ ॥ కావుకావనుట రక్కసులమూఁకనె కాని నసిచెనీమెడ సింహనాదవిహృతి । పొత్తులు తొలువేలుపుల గంట్లనే కాని హత్తెనీమేన వజ్రాంగిజోడు । వసవల్పుదైత్యులప్రయ్యగుండెనె కాని నినుఁగప్పెవీరచందనపుఁదావి । యంగుళీచర్వణం బసురులందునె కాని గెలుపుచిందము మోవి నిలిచెనీకు । నీవు తలమావిపీడని నిసువువయసు । నాడె జేజేలదళవాయి నాయకరవుఁ। బట్టమునసిల్చితారకుఁగిట్టిప్రౌఢి । తరరణక్రీడయొనరించుతటిమహాత్మ ॥ ౧౮౫ ॥ ఆ ॥ అహితగోత్ర హృద్వ్యథారోప కృతినీదు । శక్తికుగ్రబాహు శక్తికిఁదగు । ఘనవివృద్ధిఁబేర్చి గర్వించుటలునీదు । శిఖికిసత్ప్రతాప శిఖికినమరు ॥ ౧౮౬ ॥ వ ॥ అనియమ్మునికుల చక్రవర్తి వెండియుం గార్తికేయుండాశ్రితార్తిహరుండనియును శరవణభవుండు

---

కానిరత్నశ్రీమొలకలచేతమిట్టవల్లమయినది. మందగమన=స్త్రీయొక్క. కేళీకందుకము=ఆటచెండు. ఉత్తాలంబు=పొడువైనది. అధిరోహణంబుచేసి=ఎక్కి. అక్కుధరమ్మునందున్=ఆకొండయందు ॥ ౧౮౨ ॥ శిఖిసంతప్తహిరణ్మయనిభవర్ణున్=అగ్నియందుపుటము వేయఁబడినబంగారు వికారమునుబోలినదేహచ్ఛాయగలవానిని. కేకిరాడ్ధ్వజున్=నెమలిరాజు (గుఱుతు) టెక్కెమునందుఁగలవానిని. షాణ్మాతురున్=ఆర్గురుతల్లులుగలవానిని. తపసితురాషాణ్ముఖసుఖదప్రభావున్=మునులు దేవేంద్రుఁడుమొదలగువారికిసుఖమునిచ్చునట్టిమహిమగలవానిని ॥ ౧౮౩ ॥ విదళన=భేదించుటయందు. నిపుణ=సమర్థమయిన. పలుకులమొలకలు=మృదువులైన తిన్నని మాటలు. పుష్పోపహారములు=పువ్వులకానుకలు. చెలువు=అందము ॥ ౧౮౪ ॥ మూఁక=సేన. నసిచెన్=అతిశయించెను. విహృతి=విహారము. పొత్తులు=పొత్తిగుడ్డలు. తొలువేలుపులగంట్లనే=రాక్షసులగాయములయందే. హత్తెన్=అంటెను. వజ్రాంగిజోడు=వజ్రమయమయినకవచము. వసవల్పు=వసకంపు. ప్రయ్య=భేదిల్లు=వగులు. అంగుళీచర్వణంబు=వ్రేళ్లనములుట. గెలుపుచిందము=జయశంఖము. తలమావి=తేనుగప్పినమావి. నిసువువయసు=శిశుప్రాయము. జేజేలదళవాయినాయకరవుఁ బట్టమునన్=దేవతలసేనానాయకులకునాయకుఁడగునట్టిపట్టమును గట్టుకొనుటయందు. కిట్టి=సమీపించి. ప్రౌఢతరరణక్రీడ=మిక్కిలినేర్పుగలయుద్ధమనెడియాట ॥ ౧౮౫ ॥ అహితగోత్రహృద్వ్యథారోపకృతి=శత్రువంశముయొక్క మనోవ్యథను కలుగఁజేయునట్టిపని (లేక) శత్రురూపమయినకొండయొక్క మనోవ్యథను చేయునట్టిబాణవ్యాపారము. ఘనవివృద్ధిన్=మేఘములయొక్క విశేషవృద్ధిచేత; అధికమయినపెరుగుటచేత. పేర్చి=విజృంభించి. శిఖికిన్=నెమలికిని. సత్ప్రతాపశిఖికిన్=మంచిప్రతాపమనెడిఅగ్నికిని ॥ ౧౮౬ ॥ మునికులచక్రవర్తి=మునులసమూహమువందుశ్రేష్ఠుఁడు. కార్తికేయుఁడు=కృత్తికలకొడుకు. ఆశ్రితార్తిహరుండు=ఆశ్రయించినవారిబాధనుహరించువాఁడు. శరవణభవుండు=రెల్లుగంటయందుఁ బుట్టినవాఁడు. శ్రవణుండు=ఆసక్తుఁడు. మందా

పరమపురుషార్థ ప్రవణుండనియును మహాసేనుండు దీనజన మందారుండనియును శశ్వద్బాలుండు కృపావిశాలుం డనియును షడాననుండు కీడువలనం బాచి ప్రోచు ప్రోడయనియును నీలదంష్ట్రుండు జయశ్రీలాభంబులకు మూలంబనియును గాంగేయుండు పెన్నిధానంబనియును కుక్కుట ధ్వజుండు మ్రొక్కుటకుం దగినవేల్పు నియును బ్రహ్మగర్భుండు నిర్భరబ్రహ్మ విద్యోపదేశ దేశికుండనియును విశాఖుండు కుశాగ్రబుద్ధి యనియును సుబ్రహ్మణ్యుం డదభ్రగుణ రత్న ఖనియనియును శిఖివాహనుండు సాధుసఖుండనియును పార్వతీ నందనుండు సచ్చిదానందుం డనియును బాహులేయుండు మోహమహీధరవ్యూహ మేఘవాహనుం డనియును తారకారాతి యకారణ సుకృతియనియును శక్తిధరుండు భుక్తిముక్తి కరుండనియును స్వామి యోగక్షేమభూమియనియును స్కందుండు జగత్సందోహావనపరిస్పందుండనియును క్రౌంచదారణుండు పంచవదనాపరావతారుండనియును గుహుండు నిరవగ్రహ శుభావహుం డనియును కుమారుం డమరచమూసముద్ధరణ నిర్వికారుండనియును షాణ్మాతురుండు తురాషాణ్ముఖ సుఖప్రదుండనియును బ్రమదరసనిమగ్నమనస్కుండై యగ్నిభవుం బ్రణుతించి యసాదంబగు తదీయ ప్రసాదంబు వడసి కతిపయ దివసంబు లుచితగతిం గడపి తద్విరచిత మహాస్కాంద గ్రంథసందర్భంబునం బూర్వభాగంబువిని తదాశయావబోధ సుధాధునీ వినిమజ్జనంబునం గాశీవిహారాగ

---

రుండు= కల్ప వృక్షమయినవాఁడు. శశ్వద్బాలుండు= సదాబాలుఁడు అగువాఁడు. కృపావిశాలుఁడు=విశేషకృపగలవాఁడు. జయశ్రీలాభంబులకున్ = గెలుపు కలుములవచ్చుబడికి. మూలంబు= కారణమయినవాఁడు. గాంగేయుండు=గంగకొడుకు. పెన్నిధానంబు=పెద్దనిధి. నిర్భర= మేలైన. దేశికుఁడు = గురువు. అదభ్రగుణ రత్నఖని = శ్రేష్ఠములయిన గుణములనెడి రత్నములకుగని. సచ్చిదానందుఁడు = చెడనిజ్ఞానమును సంతోషమును గలవాఁడు. బాహులేయుఁడు= అనేకులకు కొడుకు. మోహ మహీధరవ్యూహమేఘవాహనుఁడు = అజ్ఞానమనెడి కొండలసమూహమునకు ఇంద్రుఁడు. సుకృతి= సత్కార్యములు గలవాఁడు. భుక్తిముక్తికరుఁడు = భోగమోక్షములనుకలుగఁజేయువాఁడు. యోగక్షేమభూమి = అపూర్వవస్తువులను పొందుటకును మేలునకునుస్థానమయినవాఁడు. జగత్సందోహావనపరిస్పందుఁడు= లోక సమూహమును రక్షించుటయందు చలింపనివాఁడు. క్రౌంచదారణుండు = క్రౌంచపర్వతమును భేదించినవాఁడు. సంచవదన= శివునియొక్క. నిరవగ్రహశుభావహుఁడు =కఱవులేక శుభములనిచ్చువాఁడు. అమరచమూసముద్ధరణనిర్వికారుఁడు = దేవతలదండును ఉద్ధరించుటయందు వికారముపొందనివాఁడు. తురాషాణ్ముఖసుఖప్రదుఁడు = ఇంద్రుఁడు మొదలగువారికి సుఖము నిచ్చువాఁడు. ప్రమదరసనిమగ్న మనస్కుండు = సంతోష రసమునందు మునిఁగిన మనస్సు గలవాఁడు — మిక్కిలి సంతోషించినవాఁడు. అసాదంబు = నాశములేనిది. ప్రసాదంబు = అనుగ్రహము. కతిపయదివసంబులు = కొన్నిదినములు. తద్విరచిత = అతనిచేత చేయఁబడిన. సందర్భంబునందున్ = రచనయందు =కూర్పునందు. తదా...మజ్జనంబునన్=దానియర్థము తెలియుటయనెడిఅమృతనదియందుమునుఁ

జనక క్లేశంబుకనిపైచి యందలి యుత్తరభాగంబున ॥ ౧౪౭ ॥ సీ ॥ మిన్నేటిపాటియుఁ జెన్నయున్నతియు విపాశవాసియుఁ జంద్రభాగచేగ। యునుశరావతిభూతి యును వేత్రవతిచరిత్రము బాహుదయుదారతయును గృష్ణ। వేణియగణ్యాభివృద్ధి యుఁ గావేరికీవియుఁ గపిలలీలావిభవము। వంజీర మంజువార్వైభవంబును భవనాశనిక్లేశనిర్నామకృతియుఁ। దుంగభద్రప్రసంగముత్తుంగభద్ర। రాజి రాజిల్లు గౌతమి యోజమఱియు। వార్తకెక్కిన తీర్థప్రవర్తనములు। స్వామివినిపించె వింధ్యసంస్తంభయితకు ॥ ౧౪౮ ॥ క ॥ ఆకుంభజుతోమఱియుం। గేకిధ్వజుఁడనియె మానికుంజరవినుమిం। కేకథవినియెదుసకలము। నీకెఱిఁగించితి నెకాధునీచరితంబుల్ ॥ ౧౪౯ ॥ క ॥ ఈగంగాదికతీర్థము। లీఁగంగా నీవుదమనమిద్ధాంబువులన్। దోఁగెడు వారలగనగన। గ్రాఁగెడు నంగారసింధుకల్లోలములన్ ॥ ౧౫౦ ॥ క ॥ వివిధక్షేత్ర చరిత్రలు। వివిధసుపర్వానుభావ విలసనములుదీ। ర్థవిశేషశ్రవణముతఱిఁ। జవిక్రింజవియొసఁగెనే విశిష్టవిచారా ॥ ౧౫౧ ॥ చ ॥ అనుడునగస్త్యుఁ డిట్లనియె హైమవతీసుతుతోడఁదోడిన। న్మనులలరంగ నోయనఘ మూర్తి సమస్తముఁ గ్రింధుచేసిమిం। చినబలువేల్పుఁ దీర్థమును క్షేత్రము నొక్కెడఁ గూడియుండెనే। నినిరుపమాదృతిం దెలిపినీవుమముం గరుణింపఁగాఁదగున్ ॥ ౧౫౨ ॥ క ॥ అనిపలుకుకలశభవముఖ। మునిజనముల ప్రశ్నవాక్యములు వినిపురభి। త్తనయుఁడు తత్త్రివిధమునొ। కక్కనెలం గుమిగూడియునికిఁ గనఁజాలమికిన్ ॥ ౧౫౩ ॥ వ ॥ ముహూర్తమాత్రవిచారడోలారూఢనిజస్వాంతుండై యా యాశ్రమవిశ్రాంతులం గూర్చియిట్లనియె ॥ ౧౫౪ ॥ క ॥ పత్త్రితయమునొకచో। భూతలమున మేళవించిపొగడొందుటమ। చ్చేతోగతి

---

గుటచేత — ఆపురాణకథను వినుటయందలి యాసచేత. క్లేశంబు = దుఃఖమును ॥ ౧౪౮ ॥ మిన్నేటిపాటి = ఆకాశగంగయొక్క కొలఁది. ఉన్నతి = గౌరవము. వాసి = మేలిమి. చేగ = సత్త్వ. భూతి = సంపద. ఉదారత = ఘనత. అగణ్యాభివృద్ధి = ఎన్నరాని పెంపు. కీవి = బాగు. లీలావిభవము = విలాససంపద. వార్వైభవంబు = జలసమృద్ధి. క్లేశనిర్నామకృతి = క్లేశము పేరులేకుండఁజేయుట. ప్రసంగము = ప్రస్తావము. ఉత్తుంగభద్రరాజిన్ = అధికమైనశుభములవరుసను. ఓజ = విధము. వార్తకున్ = ప్రసిద్ధికి. తీర్థప్రవర్తనములు = తీర్థములచరిత్రములు. సంస్తంభయితకున్ — అణఁచినవానికి ॥ ౧౪౯ ॥ కేకిధ్వజుఁడు = కుమారస్వామి. మానికుంజర = మునిశ్రేష్ఠుఁడా. ధునీచరితంబులు = నదులచరిత్రములు ॥ ౧౫౦ ॥ ఈఁగంగా నీవు = మునుఁగనీయవు. సమిద్ధాంబువులన్ = మిక్కిలిశ్లాఘ్యములయిన జలములయందు. తోఁగెడు = మునిఁగెడు. గ్రాఁగెడు = మండెడు. అంగారసింధుకల్లోలములన్ = నిప్పులేటిపెద్ద అలలయందు ॥ ౧౫౧ ॥ సుపర్వ = దేవతలయొక్క. శ్రవణముతఱిన్ = వినునప్పుడు. చవి = రుచి. విశిష్ట = విశేషమయిన ॥ ౧౫౨ ॥ హైమవతి = పార్వతి. అలరంగన్ = సంతోషింపఁగా. క్రిందుచేసి = తక్కువపఱిచి. నిరుపమాదృతిన్ = సాటిలేని ఆదరణముచేత ॥ ౧౫౩ ॥ పురభిత్తనయుఁడు = శివునికొడుకు. నెలన్ = నెలవునందు = స్థానమునందు ॥ ౧౫౪ ॥ విచారడోలారూఢనిజస్వాంతుఁడు = ఆలోచనయనెడి యుయ్యాలయందెక్కియున్నతనమనసుగలవాఁడు — ఆలోచనచేత చలించినమనసుగలవాఁడు. ఆశ్రమవిశ్రాంతులన్ = మునులను ॥ ౧౫౫ ॥ మేళవించి = కూడి. చేతోగతిన్ =

దోఃపదునము । పేతావృతి ముకురకుక్షి నిభమును బోలెన్ ॥ ౧౫౫ ॥ తే ॥ చిత్త
మాశ్చర్యరసమునఁ జొత్తిలంగఁ । జేయు నీప్రశ్న మక్షికాతేయుచేత । నిందుధరుచేత
హరుచేత నెఱుఁగవలయుఁ । రంతుపోదముమునులారరజతగిరికి ॥ ౧౫౬ ॥ క ॥ పొడ
మిన సందేహంబుల । జడిసీన మందేహులం బ్రసన్నులఁ జేయన్ । మృడునకుఁ బని
గావునమన । మడిగినయర్థంబున తఁడయాదేశించున్ ॥ ౧౫౭ ॥ క ॥ అనికృతనిశ్చయమ
తిస । న్మునులం గొనిరజతశైలమున కేఁగఁదలం । చినఘుహుఁ బొఁగడెదుక్రియబో । ర
న మ్రోసెఁ బ్రయాణభేరి ప్రసభారభటిన్ ॥ ౧౫౮ ॥ ఉ ॥ ఆసమయంబునన్ ధృత
నిజాయుధులాదృత భూషణుల్ మహోజ్జ్వా । సలసన్ముఖుల్ వివిధలాంఛన లక్షితు
లాసురాన్వయ । త్రాసకరుల్ విమానగులు దైవతవీరులు తారకారిపై । న్నోసల
మ్రోలనిల్చిరొక ముప్పదికోటులు మూఁడుకోటులున్ ॥ ౧౫౯ ॥ మ ॥ పనితప్రక్రియ
నద్దెఱుంగు లెసఁగన్ బ్రస్థానసైపథ్యశో । భనముం గైకొని బ్రహ్మగర్భుఁడు వహత్ప
ల్యాణకల్యాణమై । ఘనగర్జన్ సకిలించు వాపురము నెక్కెం బోవుచోఁ బర్వె సం। జనితా
శాకరికర్ణసంజ్వర భరాంచత్కాంచికీధ్వానముల్ ॥ ౧౬౦ ॥ సీ ॥ ఆటకు మెచ్చి బ
లారి యీఁ గొనుమరుత్ఫలమిది యన బర్హభారమమర । హరుఁ గుత్తుకనకాకశిరసునఁ
బోలఁ బాల్చినజటాచ్ఛటలీల శిఖ వెలుంగ । క్షితిశిరోభూషావిశేష నిర్మితికిఁ బాల్పడుప
డియచ్చులట్లమగులుదగ । ధాతృవాహముభుక్తిదానభ్యసింపబిసము క్రింగు భంగి దష్ట

---

మనోమార్గమునందు— మనస్సునందు. సముపేతావృతిముకురకుక్షిన్ = మూడినకప్పుదుగలఅద్దము
లోపలిభాగమునందు ॥ ౧౫౬॥ జొత్తిలంగన్=రాగిల్లఁగా—అనురాగమునుపొందఁగా. అక్షి
కాతేయుచేతన్=శివునిచేత॥ ౧౫౭॥ జడిసిన=చలించిన. మందేహులన్=(మంద+ఈహులన్)
వికాసముచెడినవారిని. ప్రసన్నులన్=వికాసము నొందినవారినిఁగా. మృడునకున్=శివునికి. ఆదేశిం
చున్=చెప్పును॥౧౫౮॥ కృతనిశ్చయమతిన్=నిశ్చయముచేయఁబడినబుద్ధితో. బోరనన్=గట్టిగా.
ప్రసభారభటిన్=అధికధ్వనితో॥ ౧౫౯॥ ధృత=ధరింపఁబడిన. లసన్ముఖులు=వికాసమునొందినము
ఖములుగలవారు. లాంఛనలక్షితులు=గుఱుతులచేతఁ జూడఁబడినవారు. ఆసురాన్వయత్రాసకరులు
= రాక్షసకులమునకు భయమును చేయువారు. విమానగులు=విమానములను పొందినవారు. నాసో
లమ్రోలన్=పెద్దదైన తలవాకిటిచావడిముందర ॥ ౧౬౦ ॥ పనితప్రక్రియన్=పొగడఁబడినవిధము
న. ప్రస్థానసైపథ్యశోభనమున్=ప్రయాణమునకుఁదగినవస్త్రాభరణాలంకారము యొక్క సౌందర్య
మును. వహత్పల్యాణకల్యాణము = వహించుచున్న పల్లముచేత మంగళమైనది. వాపురమున్=గుఱ్ఱము
ను. పర్వెన్=వ్యాపించెను. జనితా... ధ్వానములు = పుట్టిన దిగ్గజములయొక్క చెవులకు వేండ్రమ
యి అతిశయించిన ఒప్పిదమయిన బెత్తాలవారి కేకలధ్వనులు ॥ ౧౬౧ ॥ ఈన్=ఇయ్యఁగా. మరుత్ఫ
లము=దేవతలవలనిలాభము. బర్హభారము=మోపును బోలిన కుంచె. కుత్తుకన=మెడచేతనే. శిరసు
నన్=తలతోను. పోలన్=సరిపోలుటకు. జటాచ్ఛట=జడలసమూహము. లీలన్=విధమున. శిఖ=
జుట్టు. శిరోభూషావిశేషనిర్మితికిన్=ఒకవిధమయినతలకుఁ జెట్టుకొనెడిసొమ్మును చేయుటకు. పాల్ప
డు=పూనుకొనునట్టి—ఏర్పఱుపఁబడునట్టి. ధాతృవాహముభుక్తిన్=బ్రహ్మవాహనమైన హంసయొ
క్క యాహారమును. బిసము=తామరతూఁడు. దష్టఫణి= (నోటఁ) గఱచుకొన్న పాము. క్రాలన్=

ఫణిగాఁ గ్రాలఁ। గంతగంభీరనినదంబు ఖచరయువతి। గానవిద్యకు షడ్జసంధాన మొసఁగ। నెసఁగు దెలికన్ను గోనలయెక్కిరింత। నెక్కి బలుకొండఁదూఁటువోనేయు మేటి ॥ ౧౬౧ ॥ క ॥ అదిసజ్జస్యందనమై। మదకరియై తత్తదుచిత మార్గంబుల నే। ర్పొదవ నాకకొంతచనిపా। రదనిభశుభమూర్తి నశ్వరత్నంబగుడున్ ॥ ౧౬౨ ॥ క ॥ శితికంఠసుతుఁడు ఖచర। స్తుతుఁడై యాయచ్ఛరూపు తురికీనాస్కం। దితధౌరితకప్లుతరే। చితవల్గితగతులఁ దరటుచేసిననదియున్ ॥ ౧౬౩ ॥ క ॥ మురళిగొనియు రవణమునన్। బరువడిగోమూత్రికాది భంజళులఁగడున్। గెరలిచతుర్విధధావిత। పరిపాటీపాటవమునఁబతిమెప్పించెన్ ॥ ౧౬౪ ॥ సీ ॥ బలుపాపతలచుట్టు లలవరించినవారు లేఁతచందురులఁ దాలిచినవారు। పునుకతమ్మంటులఁ బొలుచువీనులవారు నొసలమిక్కిలిచూపులెసఁగువారు। బూదుపారఁగ మేనబూదిఁబూసినవారు త్రిముఖాస్త్రములు కేలఁద్రిప్పువారు। పులితోలు హొంబట్టు పుట్టముల్ గలవారు కొమ్ముతేజుల నెక్కి గునియువారు। ఘోరతపముల హరుదక్కఁ గొన్నవారు। కరటిదైతేయకుంభ ముక్తాలలామహారిభుజ మధ్యములవారు దారయశులు। ప్రమథవీరులు గొలిచిరా బాహులేయు ॥ ౧౬౫ ॥ శా ॥ క్షోణీరేణు కృతంబులంజనరజోగుచ్ఛాపితంబుల్ తమ। శ్శ్రే

ప్రకాశింపఁగా. ఖచరయువతి=గంధర్వస్త్రీలయొక్క. షడ్జసంధానము=షడ్జమనెడి స్వరము యొక్క కూర్పును. ఎసఁగు=అతిశయించునట్టి. తెలికన్నుగోనలయెక్కిరింతన్=తెల్లనికనుఁగొనలు కలదైన నెమలివాహనమును=(దీనికినరియైనసంస్కృతపదము—ధవళాపాంగము) బలుకొండఁదూఁటువోనేయుమేటి=కుమారస్వామి ॥ ౧౬౨ ॥ సజ్జస్యందనము=అలంకారము (సిద్ధము) చేయఁబడినరథము. పారద=పాదరసముతోడ శుభమూర్తిన్=తెల్లనియాకృతితో ॥ ౧౬౩ ॥ శితికంఠ=శివుని యొక్క. ఖచరస్తుతుఁడు=దేవతలచేత పొగడఁబడినవాఁడు. అచ్ఛరూపుతురికీన్=స్వచ్ఛమయిన (తెల్లని)రూపముగలగుఱ్ఱమును. ఆస్కందిత...గతులన్=ఆస్కందిత=మిక్కిలి వేగమును మందమును గానిదియు, ధౌరితక=ఆస్కందితమునకంటె కొంచెము వడి గలదియు, ప్లుత=అతి వేగముగ దాఁటుచుఁబోవునదియు, రేచిత=వంకరగా తిరుగక వడిగాఁబోవునదియు, వల్గిత=మీఁదికి కాళ్లెత్తి త్రొక్కలించుచు వడిగాఁబోవునదియునైన, గతులన్=నడకలచేత. తరటుచేసినన్=నడపింపఁగా ॥ ౧౬౪ ॥ మురళి, రవణము, పరువడి, భంజళి—ఇవిగుఱ్ఱము దవుడుపాటుటయందలి భేదములు. అందు భంజళి గోమూత్రికమొదలగు భేదములచే నానావిధము; (వీనివివరణము విచారింపఁదగినది.) కెరలి=రేఁగి. చతుర్విధధావిత పరిపాటీపాటవమునన్=నాలుగువిధములయిన దవుడుపాటుల క్రమమునందలి నేర్పుచేత ॥ ౧౬౫ ॥ పాపతలచుట్టులు=పాములతలపాగాలు. అలవరించిన=వహించిన. పునుకతమ్మంటులన్=తలపుఱ్ఱెలచేత చేయఁబడిన చెవిపోఁగులచేత. మిక్కిలిచూపులు—మూడవకన్నులు. బూఁదుపారఁగన్=బూఁజువట్టినట్టుగా. బూది=భస్మము. త్రిముఖాస్త్రములన్=మూఁడుమొనలు గలశూలములను. హొంబట్టుపుట్టములు=బంగారుపట్టువస్త్రములు. కొమ్ముతేజులన్=వృషభవాహనములను. గునియు=కులుకు. కరటిదైతేయ=గజాసురునియొక్క. కుంభ=కుంభస్థలమునందలి. ముక్తాలలామ=ముత్యాలహారములచేత. హారి=అందగించునట్టి. భుజమధ్యములవారు=ఱొమ్ములుగలవారు. ఉదారయశులు=అధికకీర్తిగలవారు ॥ ౧౬౬ ॥ క్షోణీరేణుకృతంబులు=నేలదుమ్ముచేఁ జేయఁబడిన. జనరజోగుచ్ఛాపితంబులు=కాటుకపొడిముద్దలవలెనల్లనైనవి. తమశ్శ్రేణులు=చీఁకటిబారులు.

ణుల్ దూషిత పూషభీషణగతిఁ జృంభించియుండూలెన । క్షీణోత్తంభితశక్తి భృద్ఘటశిరస్సీమా కిరీటస్ఫుట । న్మాణిక్యాతప పల్లవస్తబక సామగ్రీహృతాగ్రంబులై॥ ౧౬౬ ॥ క ॥ స్మరశశితటిదజ పవమా । న రవిసుధా సలిలమునిజనత్క్ష్మారిష్టా । సురమ్యత్యుజ్జ్వలనఁజెలఁగు । సురవేశ్యలు గొలిచిరపుడు సుబ్రహ్మణ్యున్ ॥ ౧౬౭ ॥ క ॥ దైవతభటభుజశిఖర । వ్యావల్గన్నవక్రృపాణ వల్లికలలరెన్ । దైవపథవారినిధినలి । లావిష్కృత విషమషీ మహోర్ములుఁబోలెన్ ॥ ౧౬౮ ॥ క ॥ నయనత్రిభాగ * వృతపహో । సయాంతంబుగ సాధ్వసతులుచల్లినలాజల్ । నయనాయుధ తనయాయోధ । చయలతికావళులఁ గుసుమసమత వహించెన్ ॥ ౧౬౯ ॥ తే ॥ వివిధదివిషద్వధూముక్తదివిజవిటపి । కుసుమకేసర లసదంస కూటుఁడగుచు । వేల్పుఁబడవాలు కడువాలువిరియఁబడిన । కందమునఁబొల్చు దుర్గకంఖాణమునఁగ ॥ ౧౭౦ ॥ తే ॥ విబుధ వధూరాధరాభుజావీజ్యమాన । విపుల చామర బహుసహస్రములు వొలిచె । స్వామి యురుగఁడఁబుష్పవర్షములఁ దలఁకి । సురవిమానమరాళముల్ దెరలెననఁగ ॥ ౧౭౧ ॥ తే ॥ స్వామిమలనుండి రాజతాచలముదాఁక । సేతువెత్తిన గతిమహాసేనసేన । రోదసీరంధ్రనీరంధ్ర రూపమగుచు । నడచెగిరిసింధు వనసృష్టి పుడమినడఁగ ॥ ౧౭౨ ॥ ఉ ॥ పుట్టినమోములై శిఖరముల్ వెలుఁగొందు నితంబమండలిం । గట్టినకృత్తినై నిబిడ

---

దూషితపూషభీషణగతిన్=దూషింపఁబడినసూర్యునికిభయంకరమైనవిధమున. జృంభించి=విజృంభించి తూలెన్=తొలఁగెను. అక్షీణో...గ్రంబులై= తగ్గనివియునిక్షింపఁబడినవియునైనకుమారస్వామిబంటులతలలయందలికిరీటములందుప్రకాశించుచున్నకెంపులవెలుఁగులగుత్తులయొక్కసమగ్రత్వముచే (పరిపూర్తి) చేతఅపహరింపఁబడినకొనలుగలవై॥ ౧౬౬॥ స్మర...జ్వలనన్=మన్మథుఁడు. చంద్రుఁడుమెఱపుయొక్కప్రకృతివాయువు సూర్యుఁడు అమృతము జలము సప్తమహర్షులు భూమిశివుఁడువీరియొక్కప్రకాశముచేత. చెలఁగు=అతిశయించునట్టి॥ ౧౬౭॥ భుజశిఖరవ్యావల్గన్నవక్రృపాణవల్లికలు=మూఁపులందంతటనుచలించుచున్నక్రొత్తకత్తులనెడితీఁగలు. అలరెన్= ప్రకాశించెను. దైవపథ...ర్ములు=ఆకాశమనెడి సముద్రజలమునందుండివెడలినవిషముయొక్కనల్లనిమంటలు॥ ౧౬౮ ॥ నయనత్రిభాగవృత=కంటియొక్కమూడుభాగములందావరించిన. లాజలు=పేలాలు. నయనాయుధ=శివునియొక్క॥ ౧౬౯॥ వివిధ...కూటుఁడు=బహువిధములయినదేవతాస్త్రీలచేతవిడువఁబడిన (చల్లఁబడిన) కల్పవృక్షపుఁబువ్వులలోని అకరువులచేతఒప్పుచున్న శిఖరములవంటి మూఁపులుగలవాఁడు. వేల్పుఁబడవాలు=దేవతలసేనానాయకుఁడు—కుమారస్వామి. విరియఁబడినకందమునన్=వికాసమునువహించినమూఁపురముచేత. దుర్గకంఖాణము=భద్రకాళియొక్కవాహనము—సింహము. వాలున్=అతిశయించును॥ ౧౭౦॥ విబుధ...స్రములు=దేవతాస్త్రీలచేతులయందువీవఁబడుచున్నఅనేకములగువింజామరలు, తలఁకి=భయపడి, సురవిమానమరాళములు=దేవతలవిమానములయందలిహంసలు. తెరలెన్=వెడలెను ॥ ౧౭౧ ॥ సేతువు=కట్ట. ఎత్తినగతిన్=కట్టినవిధమున. మహాసేనసేన=కుమారునిదండు. రోదసి=భూమికిఆకాశమునకునడుము.నీరంధ్ర=సందులేని. సింధు=నది॥ ౧౭౨ ॥ నితంబమండలిన్= నడుము ప్రదేశమునందు. కృత్తి=తోలు. నిబిడ=దట్టమైన. రేఖ=

---

* దరహాస అని పాఠాంతరము.

కాసనరేఖదలిర్ప లోనఁజూ । పట్టినవిశ్వమై వెలుఁగు ప్రాణికులంబలరన్ గిరీశుఁడ ।
ప్పట్టికిఁగాసిపించిన ప్రభం గలధౌతనగంబు దోఁచినన్ ॥ ౧౭౩ ॥ క ॥ జైవాతృక
బింబమునిజ । జీవాతువుఁ గాంచి ప్రాప్తజీవములగుచున్ । జీవంజీవము లలరెడు ।
భావంబున బాహుళేయు బలములు పొదలెన్ ॥ ౧౭౪ ॥ తే ॥ పద్మరాగమణీ మయ
పాదలబ్ధి । స్ఫురితగైరికశిఖరచంచూసమృద్ధి । గంధవతియను నొక్క పంకజమునడు
మ నిలుచునకొండకోదమరాయంచఁబోలి ॥ ౧౭౫ ॥ తే ॥ నీలగళవాహరింఖాఖని
హాతి । నింగికెగసిన వెండికానేలదుమ్ము । ప్రాంతవర్తిష్ణుసత్తర్షి పరివృఢులకు ।
నిరుపమ నిర్యత్నఘసిత విలసితముచట ॥ ౧౭౬ ॥ వ ॥ ఇట్లు నిజబల నిఖిలనిరీక్షణ ని
స్తంద్రచంద్రికాధీనంబగు నగ్గట్టుఱేని వైమానికసేనాని మానధనుఁడగు నధికుండు
నిజపురుషకారంబునుంబోలె నధిరోహించి ॥ ౧౭౭ ॥ క ॥ వాహనముడిగిగగనచర ।
వాహినిఁ దత్కుధరసవిధ వనవిహరణకాం । క్షాహూతహృదయ నటయట । యో
హోయనిలుమనుచు నిలిపియుల్లంబలరన్ ॥ ౧౭౮ ॥ ఉ ॥ ఆరవివాలఖిల్యయుతుఁడై
నిధుగర్భ ముదూహ సోయనన్ । దారకవైరిసంయమి కదంబయుతంబుగ నేగుదెం
చెను । క్రూరుచిరుంద్రమైనవసుధారధుగేహముఁజొచ్చునప్పుడా । రారియునిష్కు
టాంతరవిహార ముమాన్వితుఁడై యొనర్పఁగన్ ॥ ౧౭౯ ॥ తే ॥ మందిరోద్యానఖేల
నానందవిభవ । మవధరించెడు తారావిటార్ధమౌళిఁ । జివురుగుత్తులవిరులఁబూజించు

---

చాలు. తలిర్పన్=ప్రకాశింపఁగా. అప్పట్టికిన్=ఆకొండకునకు. కలధౌతనగంబు= వెండికొండ ॥ ౧౭౪ ॥ జైవాతృకబింబమున్=చంద్రబింబమును. నిజజీవాతువున్=తాముజీవించుమందును. ప్రాప్తజీవములు=పొందఁబడినప్రాణములుగలవి. జీవంజీవములు= చకోరపక్షులు. పొదలెన్=వర్ధిల్లెను—ఉప్పొంగెను ॥ ౧౭౫ ॥ పాదలబ్ధిన్= పాదములనుపొందుటచేత. (పాదము=కాలు; ప్రత్యంతపర్వతము) గైరిక=కొండయందుఁగలిగెడి యెఱ్ఱని వచ్చని వర్ణవిశేషముఁగల. చంచూ=పక్షిముక్కు యొక్క. గంధవతి=భూమి. రాయంచన్=రాజహంసను ॥ ౧౭౬ ॥ నీల...నిహతిన్=శివునివాహనమైనవృషభము యొక్కగిట్టలనెడి గుద్దండ్లతాఁకుడుచేత. నింగికిన్= ఆకాశమునకు. వర్తిష్ణు=ఉండునట్టిస్వభావముగల. పరివృఢులకున్=రాజులకు—శ్రేష్ఠులకు. నిర్యత్నఘసితవిలసితము=యత్నములేనిబువ్వాదియొక్క ప్రకాశము ॥ ౧౭౭ ॥ నిస్తంద్ర—తగ్గని. గట్టుఱేనిన్=పర్వతరాజును. వైమానికసేనాని=దేవతలసేనానాయకుఁడు. పురుషకారము=పురుషప్రయత్నము. అధిరోహించి=ఎక్కి ॥ ౧౭౮ ॥ గగనచరవాహినిన్=దేవతలదండును. తత్కుధర...హృదయన్=ఆపర్వతముచెంటితోఁపులయందు విహరించుటయందలి యాశచేత పిలువఁబడిన మనసుగలదానిని. అటయట= అక్కడనే అక్కడనే. ఉల్లంబు=మనస్సు. అలరన్=వికాసముపొందఁగా ॥ ౧౭౯ ॥ విధు=చంద్రుని యొక్క. కదంబయుతంబుగన్=సమూహముతోఁగూడ. రుంద్రము= అతిశయించినది. వసుధారధు=శివునియొక్క. పురారి=శివుఁడు. నిష్కుటాంతర = ఇంటితోఁజేరినశృంగారపుఁదోఁటలో. ఉమాన్వితుఁడు=పార్వతితోఁగూడినవాఁడు ॥ ౧౮౦ ॥ మంది...విభవము=ఇంటితోఁజేరిన శృంగారపుఁదోఁటయందు క్రీడించుటవలననంతోషవైభవమును. అవధరించెడు=ధరించెడు—పొందెడు. తారావిటార్ధమౌళి=అర్ధచంద్రుఁడుకిరీటముగాఁగలవాఁడు—శివుఁడు. విరులన్=పువ్వుల

టకునొ । యాఋబుతువులు సన్నిధియయ్యెనచట ॥ ౧౮౦ ॥ సీ ॥ మరువంపువల పుఁబల్మిఋ క్రోలి క్రోలి కన్ మ్రాన్చియూరక మేనునఱచుఁగొన్ని । యరవిచ్చు తెలిమొల్ల విరులమూతులు సాచిపొదగూడి తెక్కలఁబొదువుఁగొన్ని । గురువిందపూఁదేనె పెరలకై తమలోనఁ బొత్తుపోవక సారెఁబోరుఁగొన్ని । పక్వంబులగుదాఁకఁ బాటించి మల్లి కాకలికాని కాయంబుఁ గాచుఁగొన్ని । భోగివశమైన గేదంగిపూవునకును । వగచుమదిఁగొన్ని బంధుజీవకలతాంత । గుచ్ఛములలోననొకకొన్ని కొలువుసేయఁ । దేఁటులఖిలర్తుమయవనీ వాటిఁగమిచి ॥ ౧౮౧ ॥ తే ॥ పూవుఁదేనియఁ దడిసినమావిచిగురు । మీఁద నంటిచరించు తుమ్మెదదలిర్చు । సమయమాటయు మసి నెయ్యిసమరిమరుఁడు । త్రుపు ఎవోఁదో మఃనీలంపుఁదునుకయనఁగ ॥ ౧౮౨ ॥ తే ॥ గంధవిరహితము నుబుద్ధిఁగనక తేఁటి । మూతివిచ్చినమోదుగు మొగ్గఁదగిలి । సౌరభాకాంక్షఁజొచ్చి చెన్నారెఁగీర । తుండవశమైన నేరేడుపండుఁబోలె ॥ ౧౮౩ ॥ క ॥ ఖరకరకరహతిసలసలఁ । దెరలెడుమల్లీమరందదీర్ఘికచుట్టున్ । దిరుగు నళి యనుభవమునకుఁ । జొరదతిలోభాంధబుద్ధిసొమ్మరయుక్రియన్ ॥ ౧౮౪ ॥ క ॥ నలువదితొమ్మిదిరూపం । బులఁగొనియున్ బుష్పగంధములు మోవఁగలే । కలసియుఁదెమ్మెరలానుం । బలుమఱుయువజనముమేనిపలుచనిచెమటల్ ॥ ౧౮౫ ॥ చ ॥ విమలమయూఖ రేఖయునవీనతరోత్పలపత్రముఙ్ బ్రవా । శమణియునొక్కతీవియ బలాదృతిదాల్చెనటన్నవించువి । భ్రమశిథిలాంగియయ్యెఁగుచభారనితంబకపోలగోపన । క్రమకలనాకులాత్మయయికన్నులసీమనదల్చె గౌరియున్ ॥ ౧౮౬ ॥ తే ॥ ప్రావృషేణ్యపయోధరపటలిచేత । గాడ్పునీహారకరరేఖఁగప్పుకరణి । ధరణిధరకార్ముకుఁడు శైలతనయఁబొదివెఁ । బచ్చడంబునఁబొల్చుపూఁ బచ్చడమున ॥ ౧౮౭ ॥ చ॥ పొదువుపరాగవృష్టి మొగముల్ శ్రమ

చేతను. సన్నిధియయ్యెన్=చేరెను ॥ ౧౮౧ ॥ వలపు = వాసన. క్రోలి = త్రాగి—అనుభవించి. మ్రాన్చి=కొంచెముమూసి. పొది=గుంపు. పొదువున్=కప్పును. పెర=తెట్టె. పొత్తుపోవక=పాలుపోక. పాటించి=పొంది=చేరియుండి. కలికానికాయఁబున్=మొగ్గలసమూహమును. కాచున్=కావలికాచును. భోగి=పాము. బంధుజీవకలతాంతగుచ్ఛములలోనన్ = మంకెనపూగుత్తులలో. వనీవాటిన్=తోఁటలోనిచెట్లచాయను. కమిచి=ఆక్రమించి॥ ౧౮౨॥ సౌరభాకాంక్షన్=పరిమళమునందలియపేక్షచేత. చెన్నారెన్= అందగించెను. కీరతుండ= చిలుకముక్కునకు॥ ౧౮౩ ॥ ఖరకరకరహతిన్=సూర్యకిరణములుసోఁకుటచేత. తెరలెడు=తెర్లునట్టి=ఉడుకునట్టి. మల్లీమరందదీర్ఘిక=మల్లెపూఁదేనెదిగ్గియ. (డిగ్గియ=నడబావి) అళి=తుమ్మెద. అరయుక్రియన్=విచారించువిధమున—కనిపెట్టియుండురీతిని॥ ౧౮౪ ॥ కొసియున్=పొందియు. గంధములు=వాసనలు. తెమ్మెరలు=మందమారుతములు. ఆనున్=త్రాగును॥ ౧౮౫ ॥ ౧౮౬ ॥ ౧౮౭ ॥ ప్రావృషేణ్యపయోధరపటలిచేతన్=వర్షాకాలమునందలిమబ్బుతెగలచేత. గాడ్పు=గాలి. (ఇదికర్తృపదము) నీహారకరరేఖన్=గీఱగాఁగనఁబడెడిచంద్రుని. ధరణిధరకార్ముకుఁడు=శివుఁడు. డంబునన్=కాంతిచేత. పచ్చడమునన్=కప్పడమువస్త్రముచేత ॥ ౧౮౮ ॥ పొదువుపరాగవృష్టిన్=ఆవరించునట్టిపుప్పొడివెలుఁగుచేత. శ్రమవారిని= చెమటచేత. భానుదీప్తి= సూర్యప్రకాశము. చన్గడలు=స్తనసన్నివేశములు. తుంపదు=

లుమనుడు ॥ ౧౯౩ ॥ మ॥ లవలీపల్లవపాండురంబులగుగల్లస్థోణులం జంద్రికా । లవ
లీలం దరహాసమింపెసఁగఁ గేలన్ వైశమగ్గోలచే। లవరీతిం గొని తెచ్చి యంకకదళాలం
కారముం జేసెబా । లవిధూత్తంసుఁడు పల్కె మాధవకథాశ్లాఘాసుఖాసక్తుఁడై ॥
౧౯౪ ॥ క॥ కించిద్వలగ్న మిక్కలి । మంచిది నీప్రశ్న మిది సమర్మముగావి । న్వించెద
నను నాలోసన । కంచుకు లరుదెంచి ఘటితకరకిసలయులై ॥ ౧౯౫ ॥ క॥ దేవయగ
స్త్యాదికముని । సేవితుఁడై వచ్చినాఁడు సేనానిభవ । త్సేవార్థి యగుచు నతఁడిట।
రావచ్చునొ యనుడు రాగరసభరితమతిన్ ॥ ౧౯౬ ॥ వ॥ దేవీసహితుండై యద్దేవ
దేవుండు తదాగమనం బనుమతించుటయు వల్లెయని సౌవిదల్లనికరంబు నిజకరంబు
లం బుత్తడిబెత్తంబు లంబురుహచుంబిత తరుణతరణి కిరణంబులం బురణింపమరలి
పఱచి శరవణ ప్రభవునకు భవానీపతి యనుగ్రహించుటం దెలియ విన్నవించుటయు
నతండు ॥ ౧౯౭ ॥ సీ॥ వీడియం బెడలించి విధురత్నకనకాలు కాంచితాంబువు పుక్కి
లించియుమిసి । యుదిరిబంగరు వ్రాత పొంబట్టువలెవాటు సడలించి వెసఁగటిస్థలిని
జుట్టి । యనుయాయి పృథుకహస్తాంతరన్యస్తోపదోచితార్థము తానె యుద్వహిం
చి । యంగుళీసంజ్ఞ సంయములఁ బ్రత్యేకంబు మునుమున్న లోనికిఁ జననొసర్చి ।
ద్వారపార్శ్వస్థ వేదికావలులజరఠ । రక్షివర్గంబు టంక్రియారభటివఱలు । వలయ
మకుటాదికంబుగ నిలిచి మ్రొక్క । నగవుఁజూపులఁ జూచుచు నగరుసొచ్చి ॥ ౧౯౮ ॥
ఉ॥ వచ్చి పయోజపత్రముల వ్రాలెడు తుమ్మెదదొమ్మిమూఁకలన్ । దచ్చనసేయు
చున్ బిత్తృపదంబుల కూఁకటులంట దర్శనం। బిచ్చుటమున్న గాఁగ నుతియించుచు మ్రొ

---

—పొందినది॥ ౧౯౪॥ లవలీపల్లవపాండురంబులు=వెన్నెలతీఁగయందలి చిగుళ్లవలె తెల్లనివి. గల్లస్థో
ణులన్=చెక్కిలిప్రదేశములందు. చంద్రికాలవలీలన్ = వెన్నెలలేశము విధమున. వైశము=శీఘ్ర
ముగ. అగ్గోల=అయుగ్ధస్త్రీయొక్క. లవరీతిన్=లేశము విధమున. అంకకదళాలంకారమున్=తొడ
యనెడి అరఁటిబోదెయొక్క అలంకారమును. బాలవిధూత్తంసుఁడు=లేఁతచంద్రుఁడు శిఖయందుఁగల
వాఁడు. మాధవకథా=విష్ణుదేవునికథయొక్క ॥ ౧౯౫ ॥ కించిద్వలగ్న=నన్ననినడుముగలదానా. కంచు
కులు=అంతఃపురపుకావలివారు=బెత్తాలవారు. ఘటితకరకిసలయులు=చేర్పఁబడినచిగుళ్లనుబోలిన
చేతులుగలవారు ॥ ౧౯౬ ॥ ౧౯౭ ॥ తదాగమనంబు=అతనిరాక. వల్లె=మంచిది. సౌవిదల్ల = కంచుకు
లయొక్క. పుత్తడి=బంగారు. చుంబిత= ముద్దుగొనుచున్న—తాఁకుచున్న. తరణి=సూర్యునియొక్క.
పురణింపన్=వరిపోలఁగా. శరవణప్రభవునకున్=కుమారస్వామికి. భవానీపతి=శివుఁడు ॥ ౧౯౮ ॥
వీడియంబు=తమ్మ. ఎడలించి=తొలఁగించి—ఊఁచివేసి. విధురత్న...బువు=చంద్రకాంతమణుల
చేతఁజేయఁబడినగిండియందలి మంచిజలము. ఉదిరిబంగరు= పుటముదీరినబంగారు. పొంబట్టు=
బంగారుపట్టు. కటిస్థలిని=నడుమునందు. అనుయాయి...ర్థము=వెంబడివచ్చునట్టి పిన్నవానిచే
తనున్న కానుకకుఁదగినవస్తువును. ఉద్వహించి=వహించి=తీసికొని. జరఠరక్షివర్గంబు = ముసలి
కావలివారినమూహము. వఱలు=ఒప్పునట్టి ॥ ౧౯౯ ॥ పయోజపత్రములన్ = తామరరేకులపైని.
దొమ్మిమూఁకలన్= సందడిగుంపులను. తచ్చన=ఎగతాళి. కూఁకటులు=పిల్లజుట్లు—జులుపాలు.
దర్శనంబు=కానుక. వలిగుబ్బలిపట్టి=హిమవత్పర్వతముకూఁతురు—పార్వతి. వాఁకదాల్పుడు=

కృష్ణుఁడుఁ గేలు సాఁచివే । గ్రుచ్చికవుంగిలించి వలిగుబ్బలిపట్టియు వాఁకఁ దాల్పుఁడుఁ గన్ ॥ ౧౯౯ ॥ తే ॥ సమ్మదాశ్రులు కనుఁగవ గ్రమ్ముదేర । నాఱు మోముల బాలు నిజాంతరమున । నిలుపనతఁ డొప్పె రోహిణీ జలజవిమత । మధ్యమున నున్న తారాకుమారుఁ బోలె ॥ ౨౦౦ ॥ క ॥ నిటలాక్షువలన నప్పుడు । ఘటసంభవ ముఖ్యమునులు గని రెంతయు ము । చ్చటఁ బిలిచి పీటయిడియు । త్కట కృపతో నాఁగు పరమగౌరవ మంతన్ ॥ ౨౦౧ ॥ సీ ॥ అలవోక కనకాద్రి సెలయుచో విఱిగిన హరివరాహము దంష్ట్రి నవతరించె । నెద్దియున్న పరంజి యుసుకరా నేలలఁ జరియించు గంధర్వ పరిబృఢు వకుఁ । జిత్రాశ్వసకు నెద్ది చేకూరె నెద్ది తచ్ఛుద్ధాంత కామినీ సురతఖేద । మపనయింపఁగఁ జాలెఁ దపవాసరంబుల నంచయై గరుదంచలానిలముల । నెద్ది ప్రాపించె నాఖేచరేంద్రు గెలుపుఁ గొన్న తారకునకు వాని గుహుఁడు దునిమి । తెచ్చెఁ దా నెద్ది యమ్మృత్యమిచ్చె నచల । సుతకు శితికంధరునకు నిచ్చుటయు నలరి ॥ ౨౦౨ ॥ చ ॥ హరుఁడు శిరంబునం జెవిఁగ రాంబురుహంబునఁ దాల్పఁ జంద్రికాం । కురపరభాగమై యురగకుండలమై స్ఫటికాక్షసూత్రమై । గిరిజకచాళిఁ గర్ణమునఁ గేల వహింపఁ బ్రసూనమాలికా । కరిరదపత్ర విభ్రమశుకంబులునై మణి యుల్లసిల్లుచున్ ॥ ౨౦౩ ॥ వ ॥ వెండియు నక్కొండరాచూలియు ఖండపరశుండును డెందంబుల నెద్ది యభిలషించి రమ్మేరూపంబు లాపరమరత్నంబు ధరియించి తదాదరణచరితార్థం బయ్యెనంత ॥ ౨౦౪ ॥ క ॥ మత్స్వామిస్వామునకున్ । సత్సంయమివరులు నీవుఁ జనుదెంచుట కో । వత్సా యెయ్యది కతమని । వాత్సల్యముగఁ బరపంచవదనుఁడు పలుకన్ ॥ ౨౦౫ ॥ సీ ॥ తనతండ్రిఁ బలుకుఁ గాంచ

---

గంగానదిని ధరించినవాఁడు—శివుఁడు ॥ ౨౦౦ ॥ సమ్మదాశ్రులు= ఆనందబాష్పములు. గ్రమ్ముదేరన్=క్రమ్మఁగా. నిజాంతరమునన్= తనునడుమ. జలజవిమత=చంద్రునియొక్క ॥ ౨౦౧ ॥ నిటలాక్షువలనన్=శివునివలన. ఘటసంభవ=అగస్త్యుఁడు. కనిరి=పొందిరి. ముచ్చటన్= ప్రీతితో. ఉత్కట=అధికమైన ॥ ౨౦౨ ॥ అలవోకన్=వేడుకగా. సెలయుచోన్= పొడిచి యెగఁజిమ్మునపుడు. దంష్ట్రిన్=కోఱకొమ్మునందు. చేకూరెన్= దొరకెనో. తచ్ఛుద్ధాంత... ఖేదము=ఆచిత్రాంశుని యంతఃపురస్త్రీలయొక్క క్రీడవలని శ్రమమును. అపనయింపఁగన్=పోఁగొట్టను. తపవాసరంబులన్=వేసంగిదినములయందు. గరుదంచలానిలములన్=ఱెక్కలకొనలవలనిగాలిచేత. ప్రాపించెన్=పొందెనో. ఆఖేచరేంద్రున్= ఆగంధర్వరాజును. గెలుపుగొన్న=జయించిన. ఎద్ది=దేనిని. శితికంధరునకున్=శివునికి. అలరి=సంతోషించి ॥ ౨౦౩ ॥ చంద్రికాంకుర=వెన్నెలమొలకలకు. కచాళిన్=కొప్పునందు. ప్రసూనమాలికా=పూలదండయు. కరిరదపత్ర=దంతపుఁగమ్మయు. విభ్రమశుకంబులునై=విలాసార్థము చేతనుంచుకొన్న చిలుకయు. మణి=ఆముత్తెము. ఉల్లసిల్లుచున్= ప్రకాశించుచు ॥ ౨౦౪ ॥ కొండరాచూలి=పార్వతి. ఖండపరశుండు=శివుఁడు. డెందంబులన్=మనసులందు. అభిలషించిరి=కోరిరో. ఆపరమరత్నంబు = సర్వోత్కృష్టమయినయాముత్తెము. తదాదరణచరితార్థంబు=వారియాదరణకుఁ దగినడవడికి విషయమయినది ॥ ౨౦౫ ॥ వత్సా=బిడ్డా. కతము=కారణము. పంచవదనుఁడు=శివుఁడు ॥ ౨౦౬ ॥ తండ్రిన్=తండ్రినిగూర్చి. క్రౌంచనిషూదనుఁడు=కుమారస్వామి. చంద్రపరిషన్నిరుద్ధనీరరుహముకుళభాతిన్=చంద్రులసమూహముచేత ఆక్రమింపఁబడిన

నిషూదనుఁడు చంద్రపరిపన్నిరుద్ధనీరరుహముకుళ । భాతి మోడుపుఁగేలు ఫాలాగ్ర
వీథికవిలసిల్లి యలర నో వృషభగమన । నా పేర స్కాందంబు నాఁదగు నొక పురాణ
మునీవు కరుణకలిమి రచించి యిమ్మునీంద్రుల కెల్ల నెఱిఁగింప నందు వీరలు సుర క్షేత్రతీర్థ
ములకథలు । చాలవిని విని సర్వాతిశాయి యైన । దేవుఁడేనియు నటువంటి తీర్థమేని
వఱలు క్షేత్ర మేని భోగాపవర్గ। దాయి గలదేని యెఱిఁగింపు తడయక నిన॥ ౨౦౬ ॥ వ॥
సర్వోత్కృష్టంబులగు తీర్థ క్షేత్ర దైవతంబుల మహాప్రభావంబు మదీయభావదర్ప
ణంబునం బ్రతిఫలింపమిం జేసి ॥ ౨౦౭ ॥ క ॥ నీవలనన కడముట్టిన । దైవతమహిమ
యును క్షేత్రతత్త్వము తీర్థ । శ్రీవిభవము శ్రుతిమార్గసు। ధావిసృతి గాఁగ వినుట కై
ముద మొదవెన్ ॥ ౨౦౮ ॥ ఉ ॥ ఈ కలశోద్భవ ప్రముఖు లేనును వచ్చితి మీహితార్థ
ల । క్ష్మీకర దీని మాకు నెఱిఁగింపు మనంబున నున్న సంశయో । త్సేకము మాన్పింపు
కృప దేరెడు చూపులఁ జూడుమన్నఁ దా । రాకమనార్థమౌళి మధురంబుఁ బ్రియంబును
గాఁగ నిట్లనున్ ॥ ౨౦౯ ॥ మ ॥ మము నీయర్థమ వేఁడుచున్న యది యుష్మన్మాత యో
పుత్రయో । యుమకు న్నీకు నెఱుంగఁ జెప్పెద వినుం డూహించి యే తచ్చరి । త్రము సర్వం
బు కరోదర స్ఫటికరత్నశ్రీఁ బ్రకాశింప గో । ప్యము సేయన్ దగు దీని విన్నపిదపన్
బ్రాణంబుగాఁ జూచుచున్ ॥ ౨౧౦ ॥ తే ॥ శఠమతికి నాస్తికునకుఁ బాషండునకును ।
గర్మముగుఱించి యాచించు గర్హితునకు । నీపరమగోప్య మోపుత్ర యోపురంధ్రి ।
తప్పి దారియు నెఱిఁగింపఁ దగవుగాదు ॥ ౨౧౧ ॥ క ॥ అని నిజతనూభవునకును ।
దనమగువకుఁ దీర్థ దైవత క్షేత్రము లో । కన్ నెలవున నభువనత్రయి । వినుతిఁగనుట
దెలుపఁగడఁగి విధుమౌళి మదిన్ ॥ ౨౧౨ ॥ సీ ॥ వెడఁద కన్నులవాని వేయి నామ
ములవాని శ్వేతలవలపించు వెరవువానిఁ । జిప్పకూఁకటివానిఁ జిన్నినవ్వులవానిఁ జేరి

---

తామరమొగ్గవిధమున. ఫాలాగ్రవీథికన్ = నొసటిప్రదేశమునందు. విలసిల్లి= ప్రకాశించి. అలరన్= ఒప్పఁగా. సర్వాతిశాయి= అన్నిటిని మించినది. భోగాపవర్గదాయి= భోగమును మోక్షమును ఇచ్చునది ॥ ౨౦౭ ॥ మదీయభావదర్పణంబునన్=నా మనసనెడి యద్దమునందు. ప్రతిఫలింపమిం జేసి=తోఁచకపోవుటచేత ॥ ౨౦౮ ॥ శ్రుతిమార్గసుధావిసృతి= చెవిరంధ్రములందు అమృతమును విడుచుట. ముదము=సంతోషము ॥ ౨౦౯ ॥ కలశోద్భవ=అగస్త్యుఁడు. ఈహితార్థలక్ష్మీకర=కోరిన విషయములను కలుగఁజేయువాఁడా. సంశయోత్సేకము= సందేహముయొక్క ఆధిక్యము. తారాకమనార్థమౌళి=శివుఁడు ॥ ౨౧౦ ॥ యుష్మన్మాత=మీతల్లి. కరోదరస్ఫటికరత్నశ్రీన్=అరచేతియందలి పటికపురాతి కలిమిచేత. గోప్యము=రహస్యము. ప్రాణంబుగాన్=ప్రాణమువంటిదానిఁగా ॥ ౨౧౧ ॥ శఠమతికిన్=మూర్ఖబుద్ధిగలవానికిని. నాస్తికునకున్=దేవుఁడు లేఁడు అనువానికిని. పాషండునకున్=వేదాచారములను నిందించువానికిని. కర్మముగుఱించి=తాను చేయునట్టి యాగాది క్రియలను ఉద్దేశించి. గర్హితునకున్= నిందింపఁబడినవానికిని. పరమగోప్యము= మిక్కిలి రహస్యము. ఓపురంధ్రి=ఓ యిల్లాలా ॥ ౨౧౨ ॥ మగువకున్=భార్యకును. విధుమౌళి=శివుఁడు ॥ ౨౧3 ॥ వెడఁద=విశాలమైన. శ్వేతలన్=గొల్లపడుచులను. వలపించు= మోహింపఁజేయు. వెరవు=నేర్పు. చిప్పకూఁకటి= పిల్లజుట్టు. చిన్ని=మనోహరమైన. పింఛియము=పింఛెము=నెమలియీఁకలకుచ్చు. పులుఁగుతత్తడి=పక్షివాహన

కినవరిపింఛియమువానిఁ । బులుఁగుతత్తడివానిఁ బొడవులతుదవానిఁ బొక్కిటిపెలి డమ్మిపూవువాని । మినుకుటూర్పులవాని మిసిమిమేఁతలవాని మెఱుఁగుఁజామనిచాయ మేనివాని । దిస్సమొలవానిఁబసిఁగానిఁ ద్రిప్పువాని। ముగళిగలవానిముమ్వంకముఱుపువాని । విట్ఠలాధీశుఁ దలఁచి తద్విపులమహిమ । నొడువుఁ బ్రాఁచమఱ్ఱిక్రీనీడ విడిదిప్రోడ ॥ ౨౧౩ ॥

శా ॥ సారాచారవిచారచారణవధూసంస్తూయమానప్రథా । ధారోదారవిహారహారసుషమా ధన్యస్ఫురత్కీర్తిక । ఘనసారాలంకృత దిక్కరిక రాభోగస్ఫూర్జద్యశా । ఖారారజ్యదశేషభూభరణదక్షా దక్షజిద్వైభవా ॥ ౨౧౪ ॥

క ॥ నారాయణపదసేవా । పారాయణ బంధులోకపాలనదీక్షా । ప్రారంభ కల్పభూరుహ । భారతరామాయణాది పరమార్థజ్ఞా ॥ ౨౧౫ ॥

మాలిని ॥ సకల సుజన వర్యా శాంభవాహార్యధైర్యా । సుకవివినుతకీర్తీ శుద్ధసత్త్వప్రవర్తీ । ముకురనిభకపోలా ముగ్ధలక్ష్మీవిశాలా । కకుబధిప సమానా గౌరవ శ్రీనిధానా ॥ ౨౧౬ ॥

గద్యము ॥ ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధికకృపాపరిపాక పరిచిత సరసకవితా సనాథ రామకృష్ణ కవినాథ ప్రణీతంబయిన పాండురంగమాహాత్మ్యం బను పరమ భాగవత చరిత్రంబు నందుఁ బ్రథమాశ్వాసము.౨౧౭.

---

౨౧౩. పాతకులు=ఆకృతులయొక్క—ఎల్లప్రాణులయొక్క (లేక) ఉన్నతముల—పూజ్యములైనవానియొక్క. మినుకుటూర్పులు=వేదనిశ్వాసములు. మిసిమి=మెఱుఁగు=వెన్న. దిస్సమొల=దిగంబరత్వము. పసి=ఆవులు.[illegible] ముగళి=పిల్లనగ్రోవి. ముమ్వంక=మూడువంకలచేనైన. ముఱుపు=అందము. ప్రాఁచమఱ్ఱిక్రీనీడ=ప్రాఁతదైన మఱ్ఱిచెట్టు క్రిందినీడ. విడిదిప్రోడ=విడియుచోటుగాఁ గలవాఁడు॥ ౨౧౪. చారణవధూ=చారణులనెడి దేవజాతిస్త్రీలు. సంస్తూయమాన=పొగడఁబడుచున్న. ప్రథా=ప్రసిద్ధిగలవాఁడా. ఉదార=ఉవిదయము. హార...దిక్క=ముత్యాలపేరులయొక్క మేలయిన ప్రకాశముచేతఁ [illegible] ప్రకాశించునట్టికీర్తిగల నైడికర్పూరముచేత అలంకరింపఁబడిన దిక్కు[illegible]వాఁడా. దిక్కరి...[illegible]=[illegible]జములయొక్క తొండములవలె నిడుపులయి ప్రకాశించునట్టికొమ్ములు [illegible] యెల్లభూమిని భరించుటయందు సమర్థుఁడా. దక్షజిద్వైభవా=[illegible]వాఁడా॥ ౨౧౫॥ ౨౧౬॥ శాంభవాహార్య=శివునిదైన వెండికొండవ[illegible]. శుద్ధసత్త్వప్రవర్తీ=పరిశుద్ధమయిన సత్త్వభావముచేత వర్తించువాఁడా. ముకురనిభకపోలా=[illegible]ముల వంటి చెక్కిళ్లు గలవాఁడా. ముగ్ధలక్ష్మీవిశాలా = మనోజ్ఞమయిన సంపదచేత అధికుఁడా. కకుబధిప= దిక్పాలకులతోడ. గౌరవ శ్రీనిధానా = గొప్పతనముకలిమికి నిధియైనవాఁడా॥ ౨౧౭ ॥ నిరవధిక=మేరలేని. పరిపాక=పక్వమయిన. పరిచిత=వాడుకపడిన. సనాథ=కూడిన.

శ్రీమత్పాండురంగవిఠ్ఠలస్వామినే నమః.

# పాండురంగమాహాత్మ్యము.

## ద్వితీయాశ్వాసము.

క ॥ శ్రీదయితచరణసేవా । ప్రాదుర్భవదఖిలవిభవభాసురసరసా । హ్లాదకవితరణవిద్యా । వేదీ రామానుజేంద్ర వేదాద్రీశా ॥ ౧ ॥ వ ॥ ఆకర్ణింపుము గోకర్ణకుండలుండు సకుమారంబుగాఁ గొండరాచూలింగనుంగొని ॥ ౨ ॥ సీ ॥ శైలజ వినుము షట్కంఠ కరవీరకుశపల్లవంబులఁ గొమరుమిగులు । ఘర్మవీరానదిగలసెనచ్చటనట్టిభైమిదక్షిణతీరభాగమునకు । యోజనంబునసమస్తోన్నతంబగుతీర్థమును క్షేత్రమునుజాలఁబొగడువడయుఁ । పౌండరీకములనభాసిల్లునచట నద్దేవతోత్తముఁడు లక్ష్మీవరుండు । భక్తరక్షణదాక్షిణ్యసక్తబుద్ధి । యఖిలనిగమౌఘ గిరిగుహాహరిపృథుకము । పాండురంగండు సాకృతిబ్రహ్మలీల । నిలిచియున్నాఁడు భువనవర్ణితవిభూతి ॥ ౩ ॥ వ ॥ ఆదికల్పంబునందలిపదునెనిమిదవద్వాపరంబు కడకందువ శతానందాదిబృందారకసందోహ శిరశ్శిఖర మణిగణమయూఖచ్ఛటారోప మహనీయ చరణనఖర శిఖరుండగు పుండరీకాక్షుండు పాండురంగాహ్వయంబునం బుండరీకుం డను నొక్క భూసుర పుండరీకునకుఁ బ్రత్యక్షుండై భక్తపక్షపాతంబునఁ దక్షేత్ర తీర్థంబులకుఁ బౌండరీకంబులను నామకల్పనంబు నాచరించి యాచతుర్భుజుండు నేఁడు నచ్చోటనున్నవాఁడు. అవ్వెన్ననిచరిత్రంబు మీకు శ్రోత్రరసాయనంబుచేసెద వినుండు. ఇదిమీ యిద్దఱిప్రశ్నంబులకు నుత్తరంబయ్యెడునని మృడుండు మునిసన్నిధానంబునఁ గుమారుండువినుకొనన గిరికుమారింగటాక్షించి ద్రాక్షారస పక్వంబులగు నక్షరవిక్షేపంబులొలయనిట్లనియె ॥ ౪ ॥ చ ॥ అలికులవేణి విన్ము రచితాఖిలపుణ్యుఁడ గణ్యగణ్యుఁడు।

---

[శ్రీదయిత=విష్ణుదేవునిదైన. ప్రాదుర్భవత్=పుట్టుచున్న. సరసాహ్లాదక=రసికులను సంతోషింపఁజేసెడి. వేదీ=తెలిసినవాఁడా ॥ ౧ ॥ గోకర్ణకుండలుండు = పాములచెవిపోఁగులుగలవాఁడు——శివుఁడు. కొండరాచూలిన్=పార్వతిని ॥ ౨ ॥ షట్కంఠ=కుమారుఁడా. భాసిల్లున్=ప్రకాశించును. సక్త= ఆసక్తమైన. నిగమౌఘ= వేదసమూహము అనెడి. హరిపృథుకము= సింహపుపిల్ల. సాకృతి= ఆకృతితోఁగూడిన ॥ ౩ ॥ కందువన్=కాలమునందు. శతానంద= బ్రహ్మ. శిరశ్శిఖర=తలలయందలి కిరీటముల. మయూఖచ్ఛటా=కాంతిసమూహమును. ఆరోప=మోపుటచేత. మహనీయ=పూజ్యమయిన. నఖరశిఖరుఁడు=గోళ్లకొనలుగలవాఁడు. పుండరీకునకున్=శ్రేష్ఠునకు. కల్పనంబు=కలుగఁజేయుటను. వెన్నని=విష్ణుని. శ్రోత్రరసాయనంబు= చెవులకు ఇంపును. మృడుండు=శివుఁడు. వినుకొనన్=వినఁగా. ద్రాక్షారసపక్వంబులు=ద్రాక్షపండ్లరసమును బోలినవి. అక్షరవిక్షేపంబులు——మాటలు ॥ ౪ ॥ అత్యల్పలఘువివేకపాకభుక్తి=మిక్కుటమైన తెలివియొక్క పరిపా

త్యలఘువివేకపాకఖని యార్యజనస్తవనీయచర్యుఁడు । జ్వలగుణరత్నరత్ననిధిసత్య
దయార్జవశాంతిదాంతిమాం । సలగతిపుండరీకుఁడను సన్మునిపొల్చునొకండు పెంపు
సా॥ ౫ ॥ సీ ॥ చలిచీమనేనియుఁ జాఁద్రొక్కఁ శంకించుఁబలుకఁడెన్నఁడును మృషాభా
షణములు । కలుషవర్తనులున్న పొలముపొంతఁజనండు కలిమికుబ్బఁడు లేమికలఁగఁ
డాత్మఁ । దలమెత్తిచూడఁ డెవ్వలనఁబరస్త్రీల ధైర్యంబువిడఁడెట్టిదద్దఱుటల । నొ
రులసంపదకునై యుపతపింపఁడులోన నిందింపఁడెంతటినీచునైన । మిన్నకయుమాడఁ
డాఁకలిగొన్నకడుపు । సర్వభూతదయా దయోత్సవమొనర్చు । నిగమఘంటాప
థైకాధ్వనీనబుద్ధి । బ్రహ్మవిద్యానవద్యుండు బ్రాహ్మణుండు ॥ ౬ ॥ చ ॥ హరిహ
యదేశికాభుఁడగుసన్మహిదైవతపాళియందు బం । గరువునకున్ మృగీమదసుగంధ
ముసంధిలుభాతినంబుజో। దరచరణారవిందసతతస్మృతిలోలుపమైనబుద్ధియున్ । బరి
ణతిగాంచెసంపదలపైమరియుంజనియించుసంపదల్ ॥ ౭ ॥ సీ ॥ మొదలఁగామక్రోధ
ములబరాబరిచేసిసత్యవాఙ్నియమంబుసంగ్రహించి । సాత్వికస్వల్పభోజనలబ్ధిఁ గ్రొ
వ్వఁగియుంగాత్రకాసక్తిహావణువఱిచి । తరిచిముప్పదిరెండుతత్త్వంబులూహించి
మదినతత్త్వసంపదమస్తరించి । తెలిసిముద్రాసనంబులమేనిపనిగొని పాపపూరుషప
టాపంచచేసి । యతఁడుమూలాలవాలగహ్వరకరండ । కుండలీస్థానగోకర్ణకులకలా
ప। తత్త్వదర్శనవర్ణాధిదైవతదళ। నిర్ణయంబెంతయంతయునిజముగాంచి॥ ౮ ॥ చ॥
మనుహఠరాజయోగముల మర్మ మెఱింగి తదర్థసిద్ధినె । మ్మనము దలిర్చి హృజ్జలజ

---

కమునకుగని. స్తవనీయచర్యుఁడు= పొగడఁదగిన నడవడిగలవాఁడు. ఉజ్జ్వలగుణరత్నరత్ననిధి= ప్రకాశించునట్టి మేలైనగుణములనెడి రత్నములకునిధి. ఆర్జవ = ఋజుభావము. మాంసలగతి=బలిసిన నడవడిగలవాఁడు ॥ ౫ ॥ చాన్= చావ. మృషా=అబద్ధమయిన. కలుషవర్తనులు=పాపపు నడవడిగలవారు. పొలముపొంతన్= తావువెంబడిని. అలఁగఁడు= చలింపఁడు. దద్దఱుటలన్= సంకటములందును. ఉపతపింపఁడు= సంతాపమునొందఁడు. నిగమఘంటాపథైకాధ్వనీనబుద్ధి= వేదమార్గమనెడిపెద్దబాటయందుముఖ్యముగవర్తించునట్టిబుద్ధిగలవాఁడు॥ ౬ ॥ హరిహయదేశికాభుఁడు=బృహస్పతినిబోలినవాఁడు. మహిదైవతపాళియందున్=బ్రాహ్మణశ్రేష్ఠునియందు.బంగరువు= బంగారు. మృగీమద=కస్తూరియొక్క.సంధిలు= కూడు.భాతిన్= విధమున.సతతస్మృతిలోలుప= ఎల్లప్పుడుతలఁచుటయందు ఆసక్తము. పరిణతి=పరిపాకము ॥ ౭ ॥ బరాబరి=హెచ్చరిక. వాఙ్నియమంబు=మాటలనియమము. సాత్విక= క్రొవ్వునుకలుగఁజేయని. లబ్ధిన్ = కలుగుటచేత. అఁగి =అణఁచి. హావణువఱిచి= పొందుపఱిచి. తరిచి= చక్కఁగా విచారణచేసి. మస్తరించి= లోకువపఱచుకొని. మేనిపనిగొని= దేహమును శ్రమపెట్టి. పటాపంచ = అగోచరము —నాశము. మూలా...నిర్ణయంబు=మూలాధారచక్రమనెడి గుహారూపమయిన బరణియందలి కుండలీస్థానమునందుండుసర్పసమూహమునకు ఆభరణమువంటి శేషునిదైన తత్త్వమును, అనఁగా విష్ణుతత్త్వమును కనఁబఱచునట్టి బీజాక్షరములు అధిదేవతలు దళములు వీనియొక్క నిర్ణయము ॥ ౮ ॥ మను =మంత్రము. తదర్థసిద్ధిన్ = వానివలని ప్రయోజనముయొక్క నెఱవేఱుటచేత.హృజ్జలజమండితమానసపట్టపదంబున్ — హృదయకమలముచేతఁ బ్రకాశించుచున్న మనస్సనెడి సరోవరమును

మండిత మానసషట్పదంబున । గ్జసరథభూషణంబు వెలిఁ జూడనినిద్దపునిట్టచూపునన్ ।
మునుకొనిచొక్కులోన నిజమూర్ధగళత్సుధ సేదదేర్పఁగన్ ॥ ౯ ॥ మ ॥ శతపత్రాక్షు
ముశిక్యసఖ్యభృతి చంచన్మౌళిసన్నాహము । న్నతనాసాముకుళంబు పూర్ణతరచంద్ర
స్నిగ్ధముగ్ధాననం । బతసీసూనసవర్ణవర్ణమతిసౌమ్యంబబ్జనాభంబు శ్రీ । శ్రితవక్షంబు
మహామహంబు కడుఁబర్వెం దన్మనఃపేటికన్ ॥ ౧౦ ॥ సీ ॥ సనకసనందనాది నిఖిలాంత
ర్వాణిహృల్లీనభావంబుసల్లపెట్టి । విశ్వంభరాభోగవివిధమూర్త్యంతరస్ఫురితాను
భావంబుబుజలువైచి । శింశుమారాకృతిస్వీకృతివైకుంఠపట్టువిహారంబుజాఱవిడిచి ।
క్షీరోదమధ్యస్థలీరత్ననగగుహాగర్భనివాసంబుకచ్చువదలి । పుండరీకేక్షణుండుశిఖండిబ
ర్హా । మండితశిఖండకుఁడునతాఖండలుండు । పుండరీకునిమానసాంభోజపీఠి । మిండతు
మ్మెదయైయుండునిండుకొలువు ॥ ౧౧ ॥ ఉ ॥ అన్వహముం బ్రవృద్ధమగునంబుజనాభ
పదారవిందభ । క్తిన్వహికెక్కుచున్ వసుమతీసురవంశవతంస మెల్లవా । రున్విను
తింపఁబెంపెసఁగుప్రోదియొనర్చుచుఁ దల్లిఁదండ్రినెం । దున్విధానురూపతనుదోహ
దభోజనపూజనాదులన్ ॥ ౧౨ ॥ క ॥ హరిభక్తియుఁగురుభక్తియు । నురురక్తియుఁ
బుటముగాఁగయోగీంద్రశిఖా । భరణముముక్తామయతా । స్ఫురణముభువనప్రశస్త

---

దలితుబ్బెదను. వెలిన్ = బయట. నిద్దపునిట్టచూపునన్ = స్నేహముతోడి చలింపని చూపుచేత. మునుకొని = ముంపుమించి. నిజమూర్ధగళత్సుధ = తనతలనుండిజాఱుచున్న యమృతము. సేద = శ్రమను ॥ ౯ ॥ శతపత్రాక్షము = కమలములవంటికన్నులుగలది. శిక్య...సన్నాహము = ఉట్టియొక్క మైత్రినిభరించునట్టిమనోజ్ఞమైనశిఖాకవచము (కిరీటము) గలది. నాసాముకుళంబు = మొగ్గవంటిముక్కు. పూర్ణతరచంద్రస్నిగ్ధముగ్ధాననంబు = నిండుచంద్రునివలెశళలుదేఱుచున్న అందమయిన మొగము. అతసీసూనసవర్ణవర్ణము = నల్లగిసెపువ్వుయొక్క వర్ణమువంటి వర్ణముగలది. అతిసౌమ్యము = మిక్కిలిరొప్పిదమయినది. అబ్జనాభంబు = తామరబొడ్డుగలది. శ్రీశ్రితవక్షంబు = లక్ష్మీదేవిచేత ఆశ్రయింపఁబడినఱొమ్ముగలదియునైన. మహామహంబు = గొప్పదియగుతేజస్సు. తన్మనఃపేటికన్ = అతనిమనస్సుఅనెడి పెట్టెయందు. బర్వెన్ = వ్యాపించెను ॥ ౧౦ ॥ అంతర్వాణిహృల్లీన భావంబు = తత్త్వశాస్త్రము నెఱిఁగినవారిమనస్సులందలయించియుండుటను. సల్లపెట్టి = సల్లించి — వదలి. విశ్వంభరా... అనుభావంబు = సర్వమునుభరించునట్టిగొప్పవియునానావిధములునైనరామకృష్ణాదిమూర్తులచేతప్రకాశించునట్టిమహిమను. బుజలువైచి = సున్నలుపెట్టి — మాని. శింశుమారాకృతిస్వీకృతిన్ = మొసలిరూపమునుపొందుటచేత — మత్స్యావతారమెత్తుటచేత ననితోఁచెడి. క్షీరోద = పాలసముద్రముయొక్క. గుహాగర్భనివాసంబు = గుహలోపలియునికియందలి. కచ్చు = అపేక్ష. శిఖండిబర్హామండితశిఖండకుఁడు = నెమలిపించెచేత అలంకరింపఁబడిన పిల్లజుట్టుగలవాఁడు. నతాఖండలుండు = మ్రొక్కినయింద్రుఁడుగలవాఁడు. మానసాంభోజపీఠిన్ = మనఃకమలమనెడిసింహాసనమునందు. మిండ = మగడైన ॥ ౧౧ ॥ అన్వహమున్ = ప్రతిదినమును. ప్రవృద్ధము = పెరిగినది. వహికిన్ = ప్రసిద్ధికి. వతంసము = శ్రేష్ఠుఁడు. పెంపెసఁగు = మిక్కిలి యతిశయించునట్టి. ప్రోది = రక్షణము. అనురూపతనుదోహద = తగినసలఁగుపెట్టిస్నానముచేయించుట ॥ ౧౨ ॥ ఉరురక్తి = అధికమయిన యనురాగము. పుటముగాఁగన్ — హెచ్చఁగా. ముక్తామయతాస్ఫురణము = ముత్తెపువికారము

ముగజిగిమీఱఁగ ॥ ౧౩ ॥ సీ ॥ మునుమీనగుటఁబట్టి మునులువైచినబత్తివలఁబోలెఁజి
క్కమావలఁదలిర్ప । వెలితిగాఁజవిగొన్న వెన్నముద్దయుఁబోలె శంఖంబువామహస్త
మునఁదనర । జగదండవహకాలచక్రభ్రమణహేతుదండమైనిజధేనుదండముమరస్రం
చిఁబట్టినపద్మజాతాండములలీల వలకేలఁగ్రచ్చకాయలుఘటిల్ల । గలయఁబూచినకల్ప
వృక్షంబుచాయ । సరసవనపుష్పమాలికాభరసమగ్ర । విగ్రహముతోడ విలసిల్లువిష్ణు
నెమట । మందపొఁడ్రయాంఢ్రకూరిమి మ్రానిపండు ॥ ౧౪ ॥ క ॥ నియమాంతంబున
సత్యా । ప్రియరూపముతోడఁగూడఁబెనఁచినయంత । ర్నయనముసడలిచిపిత్రుపా ।
దయుగార్చాధీనబుద్ధిఁ దహతహ వెఱుగఁ ॥ ౧౫ ॥ ఉ ॥ పావనదృగ్వి లాసములు
బాహ్యగతిం బచరించిచంద్రికా । శ్రీవిభవంబులంబలుచ సేయుముఖప్రభలుల్లసిల్లఁగా ।
మైవదలించిపూర్వమగుమట్టును గాడ్పునసాగనిచ్చి పైఁ । గావలియిడ్డశక్తులనగౌరవ
దృష్టిఁబరిగ్రహించుచుఁ ॥ ౧౬ ॥ సీ ॥ తనువుతోఁజరియించుధర్మదేవతఁబోలె మె
లఁపునవనవాటిఁగలయఁదిరిగి । గణనమీరినశార్ఙ్గిగుణములుహృదయసం పుటినించుక్రి
యవిరుల్ బుట్టెఁబెట్టి । తనకుఁబవిత్రవర్ధనమెకృత్యంబను కరణినూతనకుశోత్కరము
గూర్చి । యపవర్గఫలసిద్ధిహదనైనఁజేపట్టు కైవడిబహుఫలోత్కరములొడిచి । యో
గయాగంబుసలుపుచోనూర్మిపశువి । శసన మొనరించుటకుయూపసమితిదెచ్చు । భా
తిసమిధలుగొనిమహాప్రాజ్ఞుఁడతఁడు । వచ్చెఁబగటికినిజావాసమునకు ॥ ౧౭ ॥ క ॥
విహితమతంబరిచారక । సహస్రమయిపిత్రుయుగంబు సంభావించుచుఁ । గృహమేధివ
తంసముసజ । మహిళామణియప్రతీపమతిఁదోడ్పడఁగఁ ॥ ౧౮ ॥ సీ ॥ ఆపాదమస్తంబు

---

గలప్రకాశము. భువనప్రశస్తముగఁ=లోకమునందుశ్లాఘ్యముగ. జిగి=నిగనిగనికాంతి॥౧౩॥బత్తి
=భక్తి. చవిగొన్న=రుచిచూచిన—భుజించిన. జగదండ...దండమై=బ్రహ్మాండమునువహించినకా
లచక్రమునుతిరుగుటకు కారణమైన కఱ్ఱయై. ధేనుదండము=పసులనుదోలెడికఱ్ఱ. లీలఁ=విధమున.
వలకేలఁ=కుడిచేతియందు. చాయఁ=విధమున. మంద...పండు = గొల్లయిల్లాండ్రయొక్క
స్నేహమనెడివృక్షమునందుపండినపండు—బాలకృష్ణుఁడు॥౧౪॥సత్యాప్రియ=కృష్ణునియొక్క. అం
తర్నయనము=లోచూపు—యోగదృష్టి. తహతహ=తమకము ॥౧౫॥ బాహ్యగతిఁ= బయటి
సంచారమునందు. చరించి=ప్రసరింపఁజేసి. వలుచ=అలక్ష్యము. మైవదలించి=దేహమును సడ
లపడిచి. శక్తులఁ=ఇచ్ఛాదిశక్తులను ॥౧౬॥ మెలఁపునఁ=మెలఁకువతో. హృదయసంపుటిఁ=
మనస్సనెడిపెట్టియందు. కుశోత్కరము=దర్భలసమూహమును. అపవర్గ=మోక్షముయొక్క.
హదను=సమయము. ఊర్మి పశువిశసనము=శ్వాసమనెడి పశువును చంపుటను. యూపసమితిఁ=
యాగపశువునుకట్టెడికంబములసమూహమును. భాతిఁ=విధమున. పగటికిఁ=తెల్లవాఱిపదిగడి
యలప్రొద్దెక్కునప్పటికి. నిజావాసమునకుఁ=తనయింటికి ॥ ౧౭ ॥ పరిచారకసహస్రమయి=ప
రిచారకులయొక్క సహస్రము కలవాఁడై—అనేక పరిచారకులమూఁకు తానేఅయి. పిత్రుయుగం
బుఁ=తల్లిదండ్రులను ఇద్దఱను. గృహమేధివతంసము=గృహస్థులలో శ్రేష్ఠుఁడు. మహిళామణి=
స్త్రీరత్నము. అప్రతీపమతిఁ=అనుకూలబుద్ధితో ॥ ౧౮ ॥ఆపాదమస్తంబు=తలమొదలు కాళ్లదాఁక

నంటునూనియ గాఁచి నయముగా నుద్వర్తనం బొనర్చి । జలకమార్చి నఖంపచస్వ
చ్ఛజలములఁ దడియొత్తుఁ గడు మెదుగుడుల బొగవి । లఘుధౌతవసనపల్లవములు గట్టిం
చు శిరసార్చు న్మృదులీల సురఁటి విసరి । చేయూఁత యొసఁగి వేంచేయించు లోనికి ద్వా
రావతిగళంతిఁ దానె యొసఁగు । తెలుపు సంధ్యాసమాధివిధిప్రయుక్తి । నగ్ని వేల్పించు
విష్ణుసహస్రనామ । పాఠ మొసరించు తటిఁ దోడుపడు గురునకు । కవలు వోకుండఁ బు
త్రుఁడొకలువకంటి ॥ ౧౯ ॥ తే ॥ చూపు చాలమి వివిధరూపోపకరణ । వితతిఁ దడవా
డు జనకు నానతి శిరమునఁ । దాల్చి నిద్దంపు బుద్ధిఁ దద్దారకుండు । చక్రహస్తార్చనమునకుపక్ర
మించు ॥ ౨౦ ॥ సీ ॥ అభిషేక మొనరించు నాకాశవాహినీ జననకారణపాదజలరుహు
నకు । వైచుఁ దోమాలియ వైజయంతీకాంతి వలయితవక్షఃకవాటునకును । కౌశేయ
మర్పించుఁ గాంచనమయపటపల్లవారుణ కటిబంధురునకుఁ । జందనంబలఁదు నింది
రాకుచకుంభ సంగికుంకుమపంకిలాంగునకును । రత్నహారంబు సాతు నిర్యత్నసిద్ధ । కౌ
స్తుభోదర్చిరభిరామకంధరునకు । ధూపకల్పనమున్ను గాదీప మిచ్చుఁ । దెరవయాతఁ
డు త్రైలోక్యదీపకునకు ॥ ౨౧ ॥ క ॥ నిడుదచిగురనఁటియాకున । నిడివివిధాన్నము
లుభూసురేశ్వరుఁడొసఁగున్ । బడిఘంట మొరయఁజేయుచు । జడనిధితల్పునకుఁ బూ
ర్ణసంకల్పునకున్ ॥ ౨౨ ॥ క ॥ భూమిసురసూతి సాల । గ్రామశిలావారికంబుగర్భస్థ
ముది । వ్యామోదశ్రీతులసీ । కోమలదళసురభితంబు గురునకు నొసఁగున్ ॥ ౨౩ ॥ మ ॥
తిరువారాధనమిట్లొనర్చి ధరణీదేవాన్వయశ్రేష్ఠుఁడా । హరి కర్పించుటఁ బావనంబుల
గు శాల్యన్నంబులున్ నేతులున్ । వరుగుల్ చేరులు పప్పులప్పడములున్ దాలింపు
లుం బూపముల్ । పరమాన్నంబులుఁ బెట్టి నెట్టన భుజింపన్ దల్లికిం దండ్రికిన్ ॥ ౨౪ ॥
వ ॥ ఇట్లు కడువృద్ధులు శిథిలబుద్ధులునగు జనయిత్రీజనయితలం గనిపెని నడచుచు నడు

---

క. ఉద్వర్తనంబు=నలఁగు. జలకమార్చున్=స్నానముచేయించును. నఖంపచ=గోరువెచ్చనైన. మెదుగుడులన్=మెత్తనిగుడ్డలతో. లఘుధౌతవసనపల్లవములు=తేలికయై పరిశుద్ధములైన చిగుళ్ల వంటి వస్త్రములను. సురఁటి=విసనకఱ్ఱ. ద్వారావతిన్=ద్వారముతోడిముక్కుగల. గళంతిన్=గిండిచెంబును. కవలువోకుండన్=ముందు పఠించినదిమఱలపాఠమునందుగలయకుండ ॥ ౧౯ ॥ తడవాడు=తడవుకొను. ఆనతి=ఆజ్ఞ. నిద్దంపు=ప్రేమతోడి. తద్దారకుండు=ఆచిన్నవాఁడు. చక్రహస్తార్చనమునకున్=విష్ణుదేవుని ఆరాధనమునకు ॥ ౨౦॥ ఆకాశవాహినీ=మిన్నేటియొక్క. తోమాలియ=నవమాల. వైజయంతి=వైజయంతి యనెడి పూలమాలిక చేత. కౌశేయము=పట్టుపచ్చడము. కటి=నడుము చేత. బంధురునకున్=ఒప్పిదమయినవానికి. సంగి=అంటిన. పంకిల=అడుసైన. చాతున్=ధరింపఁజేయును. నిర్యత్న... ధరునకున్=యత్నము లేకయే సిద్ధించిన కౌస్తుభమణియొక్క మిక్కుటపుప్రకాశము చేత మనోజ్ఞమయిన మెడగలవానికి ॥ ౨౧॥ అనఁటి=అరఁటి. బడిన్=వెంబడిని. మొరయఁజేయుచున్=వాయించుచు. జడనిధి=సముద్రము ॥ ౨౨ ॥ కంబుగర్భస్థమున్=శంఖములోనిదానిని. దివ్యామోదశ్రీ=మంచివాసనయొక్క కలిమిగల. సురభితము=పరిమళయుక్తముగఁజేయఁబడినది ॥ ౨౩ ॥ తిరువారాధనము=దేవతార్చనము. పూపములు=పిండివంటలు. నెట్టన్=సమృద్ధిగా ॥ ౨౪ ॥ శిథిల=పటుత్వములేని. జనయిత్రీజనయితలన్=తల్లిదండ్రులను. మచ్చికన్

సంకటములఁ గలోద్ధుచు నడుగునెడఁ బలిజున్నెనియుం దెచ్చియిచ్చుచుఁ గోప్రీత్తయు
గమచ్ఛికం గచ్చువదలక గోము మెఱసి యోమనగాయలంగా నోముచుఁ గాలోచి
తంబుగా నోములునోమించుచు నర్ధరామర నందనుండు జగదభినందితుండై యుం
డి వెండియు ॥ ౨౫ ॥ క ॥ పరలోకావాసనుఖా । దరపరతంజనినతల్లిదండ్రులకొనఁ
గన్ । గురుభక్తినిగుడుకొడుకతి । కరుణామతిగంగనస్థిగయఁబిండంబుల్ ॥ ౨౬ ॥ క॥
ప్రేయసివలనఁ బ్రబోధవి । ధేయమతులసుతులఁగాంచితీర్చెఁబితలాణం । బాయయ్య
తదీయంబగు । ప్రాయపుఁబ్రొద్దంతఁ గొంతపడమరదిరిగెన్ ॥ ౨౭ ॥ క ॥ భాషా
విభునిభుఁడమ్ముని । యీషణదూషణ మొనర్చి యిలుమఱచిమదిన్ । శేషఫణిశయనుఁ
గనునభి । లాషోన్నతిఁజేయుఁదప మిలాధరతనయా ॥ ౨౮ ॥ సీ ॥ మిసిమింతుఁడు
నుగాకవసియించుఁగుత్తుక బంటినీరనుబుండువంటిచలిని । మోముదమ్మికిఁదేటి మొత్త
మైపొగపర్వ వ్రేలుఁ గ్రిందలగాఁగవృక్షశాఖ । వేరువెల్లఁకికాయగూరపండనికోరకుద
రాగ్నిగాడ్పుచేనుజ్జగించు । నేఁచియీచెవిగాడ్పనాచెవిఁబోవఁగ నుబ్బిలింగముబో
లెనుండు నెండ । నంతరాయాంధకారంబులలమికొనిన । నడఁచునిజధైర్యసూర్యోదయం
బుచేత । దానవారినిగుఱిచేసితనకుఁబోదు । నాకుఁబోదనినమ్మినుశ్లోకుఁడతఁడు ॥ ౨౯ ॥
ఉ ॥ ఓగజరాజగామిని మహోగ్రపునోములు నోఁచుచున్నయ । యోగ్యగివరే
ణ్యునేనుమునసుల్లము వెన్నవలెంగరంగెప్పా । దాగిసమగ్రగోపవనితాజనతాపరి
రంభసంభ్రమో । ద్యోగకళాప్రవర్తికిఁ జతుర్ముఖవంచితధూర్తకీర్తికిన్ ॥ ౩౦ ॥ సీ॥
యతిమనోగృహదీపికాంకూరమగులీల గోవర్ధనాచలగుహ మెలఁగుచు । గిరికూటతటర
టత్కేకిరాజమురీతి రాధచన్దవమీఁదవ్రాలినగుచుఁ । జిత్రాభ్రముల నేలుసుత్రాము
కైవడిఁబలువన్నెయాల మందల మెలఁపుచుఁ । గమలకాననమధ్యకలహంస విభు భా
తిఁగూర్మినెచ్చెలిపిండుగొనిచెలఁగుచుఁ । జంద్రబింబునకుమృదుస్వనముగఱవు । రచ
నసంజ్ఞార్నశంఖమూఁదుచునొనర్చు । నాటలన్నియుఁజాలించియరిగెఁదపసి । పర్ణశా
లకుదేవకీతర్ణకంబు ॥ ౩౧ ॥ చ ॥ లలితశిరీషపుష్పమృదులంబులు నీచరణంబులకట్టెటా ।

=మరులుచేత. కచ్చు=ప్రీతి. గోము=శ్రమమెఱుఁగమి. ఓమనగాయలంగాన్—చేతులమీఁద నేత్రి
ప్పుటగా. ఓముచున్=పోషించుచు. జగదభినందితుండు=లోకులచేతఁబొగడఁబడినవాఁడు ॥ ౨౫ ॥
౨౬ ॥ ప్రేయసి=ప్రియురాలు= పెండ్లాము. ప్రబోధవిధేయమతులన్= విశేషజ్ఞానము వినయము
లతోడిబుద్ధిగలవారిని. పిత్రాణము=పితృదేవతలఋణమును ॥ ౨౭ ॥ భాషావిభు=బ్రహ్మతో
డ. ఈషణ=పెండ్లాము బిడ్డలు ధనము వీనియందలియాశను ॥ ౨౮ ॥ మిసిమింతుఁడు=అలసినవాఁ
డు. క్రిందల=తలక్రిందు. ఉజ్జగించున్=పోఁగొట్టును—అణఁచును. గాడ్పు=గాలి. అంతరాయాం
ధకారంబులు=విఘ్నములనెడిచీఁకట్లు ॥ ౨౯ ॥ నేమమునన్=నియమముచేత. ధూర్త=మోసపు ॥ ౩౦ ॥
దీపికాంకూరము=చిగురుముగ్గవలెఁదోఁచెడిదీపము. రటత్=కేకలువేయుచున్న. వ్రాలి=ఒఱగి.
చిత్రాభ్రములన్=నానావర్ణములుగల మేఘములను. సుత్రాముకైవడిన్=ఇంద్రునివలె. మెలఁపు
చున్=త్రిప్పుచు=కాచుచు. పిండు=సమూహము. చెలఁగుచున్=సంతోషించుచు. రచనన్=వి
ధమున, దేవకీతర్ణకంబు=దేవకీదేవి బిడ్డ — కృష్ణుఁడు ॥ ౩౧ ॥ శిరీష=దిరిసెను. మృదులంబులు=

యిలయిది రూక్షమిట్టు లలయించుట గాదని ప్రార్థనా మృదూ । క్తులు సెలఁగం
గవెంపొడివితొల్పదువుల్ తగువిన్నపంబులం । బలుమఱుఁ జేయుచందమున బంగ
రుటందియ లుగ్గడింపఁగన్ ॥ ౩౨ ॥ క ॥ మెత్తఁగ నూటినచుట్టుం । గత్తిన్ మధుకైట
భోరుకంఠములలనా । డొత్తినపొత్తిన చెన్నుం । దిత్తులక్రియఁ దొడల యడ్డతిత్తు
ల్మెన్ ॥ ౩౩ ॥ క ॥ మాయావృతుఁ డగునాత్ముని । సోయగమునఁ దెగడుటేఁగ
సోఁగలుముచ్చు । ప్రైయునికిసంగరహితం । బయ్యెన్ గాకున్న జఘనమభిరామమగున్ ॥
౩౪ ॥ క ॥ ఇటనభమిటభూవలయం । బిటబలిసద్మంబునుండు నిరవులనియనన్ ।
బటువులగువళులచెలువునఁ । బుటపుటనై యున్నచిన్నిబొజ్జగదలఁగన్ ॥ ౩౫ ॥ చ ॥
తులసికిఁబచ్చరాకుదురు తోయదవాహనరత్నవేది య । క్కలిమిమెఱుంగుఁబోఁడికిని
గౌస్తుభఘర్మగభస్తికిన్ నభ । స్థలమున నంగబొల్చి నిరతంబు కృపావిభవంబు నింటిబో ।
ర్తలుపుఁదలంపు సేయుచు నురంబు గరంబు పరిస్ఫురింపఁగన్ ॥ ౩౬ ॥ క ॥ కలు
షఖగవధవిధానా । కలితఘుటికలనఁ గ్రచ్చకాయలు వలచే । నెలకొనునలజిలిబిలివ ।
న్నెలవన్నెలసంచినిండియుంపల రారెన్ ॥ ౩౭ ॥ క ॥ లలితనిజవామకరతల । కలి
తకనత్కంబుకాంతిగలకలనవ్వెన్ । గలువలచెలిగిలిగింతల । నలువగుజాలన్ బిసాళి
నలువగుజాలన్ ॥ ౩౮ ॥ క ॥ నిజధైర్యౌదార్యములను । గజములకుంబోడమునిడుదక
రములుఁబోలెన్ । భుజములుపోషితభక్త । వ్రజములుకరవిజితపుష్కరజములుబొద
లున్ ॥ ౩౯ ॥ క ॥ వదనైకస్తంభ కనక । సదనముసిరికోయకోనర్చు స్రష్టనిలుపున ।
మ్మొదలింటిశంఖశంకువో । యిదియనఁ గాఁగంబుకంఠమింపువహింపన్ ॥ ౪౦ ॥ క ॥ బిం
కపుబ్రాఁతలవాతెఱ । పంకెనపూఁచేనె తేటమానకపైపై । నింకఁగనింకఁగఁబల్మఱుఁ ।

---

మిక్కిలి మెత్తనివి. రూక్షము=కఠినము. కాదు=తగదు. వెంపొడివి=వెంబడించి. తొల్పదువులు=వేదములు. ఉగ్గడింపఁగన్=మ్రోఁగఁగా ॥ ౩౨ ॥ నూటిన=వదును పెట్టిన. పొత్తిన=అంటిన. చెన్నుం దిత్తులక్రియన్=అందమైన సంచులవిధమున ॥ ౩౩ ॥ మాయావృతుఁడు=మాయచేత ఆవరింపఁబడినవాఁడు. సోయగమునన్=అందముచేత. తెగడు=తిరస్కరించు ॥ ౩౪ ॥ నభము=ఆకాశము. బలిసద్మంబు=పాతాళము. ఇరవులు=చోట్లు. బటువులు=గుండ్రనివి. వళులచెలువునన్=ముడుఁతలయందముచేత. పుటపుటనై=క్రమముగా పెరుగుచున్నదై ॥ ౩౫ ॥ తోయదవాహనరత్నవేది=ఇంద్రనీలమణులయరుఁగు. ఘర్మగభస్తికిన్=సూర్యునికి. నభస్స్థలము=ఆకాశప్రదేశము. బోర్తలుపున్=పెద్దతలుపును. పరిస్ఫురింపఁగన్=చక్కగా ప్రకాశింపఁగా ॥ ౩౬ ॥ ఆకలితఘుటికలు=గ్రహింపఁబడినగుండ్లు. జిలిబిలి=చిన్న. వన్నెలసంచి=అందమైనతిత్తి ॥ ౩౭ ॥ లలిత=మనోజ్ఞమయిన. కలిత=కూడిన. కనత్కంబు=ప్రకాశించునట్టి శంఖముయొక్క. కలువలచెలిగిలిగింతలన్=చంద్రునిచక్కిలిగింతలచేత—స్పోఁక్కుటలచేత. నలువు=ఒప్పిదము. జాలన్=చంద్రకాంతమణులను. బిసాళినలువగుజాలన్=ప్రకాశించునట్టిహంసలను ॥ ౩౮ ॥ కరవిజితపుష్కరజములు=అరచేతులచేత జయింపఁబడిన తామరలుగలవి. బొదలున్=అతిశయించును ॥ ౩౯ ॥ సదనము=ఇల్లు. స్రష్ట=బ్రహ్మ. శంకువో=మేకో ॥ ౪౦ ॥ బింకపు=నిక్కుగల. పంకించుట=పూయుట. బచ్చెన=వర్ణ

బంకించుటఁబోలె మోవిబచ్చెనహెచ్చెన్ ॥ ౪౧ ॥ క ॥ తళుకుమొగము నెలపడకము।
నెలవుననిడుదీరుగాఁగనిలిపినయాఖం । డలనీలకళికక్రియని । ట్టలమైస్ఫుటనాసికావు
టముదీపింపన్ ॥ ౪౨ ॥ తే ॥ తళుకుఁజెక్కులు మకరకుండలకలాప । మరకతద్యుతి
రింఛోళిహారిణలక్ష్మి । మండలంబులలాంఛనమంజిమములు । గానిపించువిధంబునఁగ
లయఁబ్రాఁక ॥ ౪౩ ॥ చ ॥ తరళమసారసారనిభతారకముల్ సితపక్ష్మపత్త్రబంధు
రములు రాధికాహృదయతోయజకోరకబోధనక్రియా । తరుణతరార్కరుగ్విలసిత
స్ఫుటరక్తిమసక్తకోణభా । స్వరములుసూక్ష్మపక్ష్ములువాలికకన్నులుచెన్నుమీఱఁ
గన్ ॥ ౪౪ ॥ తే ॥ అలకతిమిరంబు తనుఁగప్పననుభయమున। ముఖసుధాసూతిను
నువెల్గుములికిఁగూర్చి । సవదరించినసింగిణి చాయనొసలి । వంకచూపునఁదగెఁ గఱతె
వంకబొమలు ॥ ౪౫ ॥ క ॥ బలభిదుపలాద్రిమౌళిన్ । బలపలగాఁబొమవుముదిర
పటలముపగిదిన్ । లలితోత్తమాంగతలమున । జిలుఁగుండళుకొత్తుచలిదిచిక్కుముద
నరన్ ॥ ౪౬ ॥ శా ॥ దిగ్వాసుండురుపింఛలాంఛితశిఖోదీర్ణుండు వర్షాపయో ।
ముగ్వర్ణుండు నవాంబుజాహితలతాముక్తాంగదుండున్ సుధా । రుగ్విస్మేరముఖుం
డనంగశతజిన్మాధుర్యవాధికుం డగ్రభూ । వాగ్గర్భోద్భవభూమి శ్రీవిభుఁడు శ్రీవత్సాం
కవత్సుండునై ॥ ౪౭ ॥ క ॥ నొడువులపడఁతుకమగనికిఁ । బొడచూపనితనదురూపు
పొడగనిపించెన్ । జడనిధిశయనుఁడుకొంగున । ముడిచినమణిగాదె భక్తముఖ్యులకె
ల్లన్ ॥ ౪౮ ॥ క ॥ నిగనిగనివిదళకదళీ । యాగళిన్నగి జిగిదొలంకు నూరులఁగనిచా ।

టీ॥ ౪౧ ఆఖండలనీలకళికక్రియన్=ఇంద్రనీలపుమొగ్గవలె. ఇట్టలము=హెచ్చినది॥ ౪౨॥ రిం
ఛోళి=సమూహము. మంజిమములు=మనోజ్ఞతలు. కలయఁబ్రాఁకన్=అంతటనువ్యాపింపఁగా॥
౪౩॥ మసార=ఇంద్రనీలమణులయొక్క. తారకములు=కంటినల్లగ్రుడ్లు. బంధురములు=ఒప్పిద
ములైనవి. బోధనక్రియా=తెలియఁజేయువ్యాపారముచేత. అర్కరుక్=సూర్యకాంతిచేత. సక్త=
పొందిన. కోణభాస్వరములు=కొనలచేతప్రకాశించునవి. పక్ష్ములు=ఱెప్పలుగలవి. వాలిక=దీర్ఘ
ములైన॥ ౪౪ ॥ అలకతిమిరంబు=ముంగురులనెడిచీఁకటి. సుధాసూతి=చంద్రుఁడు. నునువెల్గు
ములికిన్=కొంచెపుప్రకాశమనెడి బాణమును. సవదరించిన=పట్టిన. సింగిణిచాయన్=వింటి
విధమున. కఱతె=నల్లనైన ॥ ౪౫ ॥ బలభిదుపలాద్రిమౌళిన్=ఇంద్రనీలమణులకొండకొమ్మునందు.
పలపలగాన్=విరళముగా. ముదిరపటలము=మేఘసమూహము. లలితోత్తమాంగతలమునన్=
మనోజ్ఞమయినతలమీఁద. జిలుఁగుండళుకొత్తు=కొంచెపువెలుఁగుదోఁచునట్టి॥ ౪౬ ॥ దిగ్వాసుండు
=దిగంబరుఁడు. ఉరు...దీర్ణుండు=గొప్పనెమలిపించెచేతగుఱుతిడఁబడినసిగచేతఅధికుఁడు. వర్షా
పయోముగ్వర్ణుండు=వానకాలపునల్లమబ్బువన్నెగలవాఁడు. నవాంబుజాహితలతాముక్తాంగదుం
డున్=క్రొత్త(లేఁత)చంద్రరేఖవంటి ముత్యాలభుజకీర్తులుగలవాఁడు. సుధారుగ్విస్మేరముఖుండు
=చంద్రునివలె వికాసముపొందిన ముఖముగలవాఁడు. అనంగ...ధికుండు=మన్మథులను అనే
కులనుజయించెడిచక్కఁదనముచేనధికుఁడు. అగ్రభూవాగ్గర్భోద్భవభూమి=బ్రాహ్మణులమాటగ
ర్భమునకుపుట్టినచోటు॥ ౪౭ ॥ నొడువులపడఁతుక=సరస్వతి. పొడగనిపించెన్=చూపెను॥ ౪౮ ॥
విదళ=ఆకులులేని. జిగిదొలంకు=కాంతి అతిశయించెడి. చొక్కుగదురన్=పరవశత్వముకలు

కుఁగదురఁజేయుజగత్పతిఁ । దగిలికనుంగొనుచుమునిమదావళి మెలమిన్ ॥ ౪౯ ॥ తే॥
విపులవీక్షణశక్తిచే వెండికుండ । లీంద్రతలిమాంగరుచిసుధ యెత్తిగ్రోలి । సంతత
వ్రతకల్పనాజాయమాన । దుస్తరక్లేశమంతయుఁదొలఁగఁద్రోచి ॥ ౫౦ ॥ ఉ॥ అవ్వ
నదల్చువచ్చువెదురంఘ్రియుగాంతరవీథినూఁది య । గ్రావనిఁదేజరిల్లు గటిహస్తన
మన్వితుఁ గౌస్తుభాంకు నిం । దీవిభు నింద్రనీలనిభదేహుఁ గనుంగొని హర్షవర్ష
ధా । రావిలమానసుండగుచు నమ్మునికృత్యవిమూఢబుద్ధియై ॥ ౫౧ ॥ చ ॥ విలిఖి
తమో శిలాకృతియొ విస్మృతిరూపవహించెనో యనన్ । జలనవిదూరుఁడయ్యుఁదొ
లుపావిపయోధరధారఁదోఁగున । య్యలఁదళుకొత్తుకొ్రత్తపులు నేపున వేపులకల్
తనూలతన్ । మొలవఁగనున్నవివ్వియదుముఖ్యుఁడుతాపసముఖ్యునిట్లనున్ ॥ ౫౨ ॥ ఉ॥
నిచ్చలునిచ్చలోఁబొడలునీపితృభక్తిజ్ఞానశక్తికిన్ । మెచ్చితినిచ్చితింగరమునీయెడనీ
యెడయేలవేఁడుకో । మ్మిచ్చెదఁజెచ్చెరన్ వలయునీప్సితముల్ శత మేనిదీననే । పొచ్చె
మునొచ్చెముంజొరదుభూసురకేసరినమ్మునావుడున్ ॥ ౫౩ ॥ శా ॥ భస్మోద్ధూళిత
పాండురాంగము రమాప్రాణేశుపాదద్వయిన్ । విస్మేరాంబుజగామిహంసమిది
నావేఁ బ్రాల్చుచున్ లేచి దే । వాస్మాకంశరణం త్వమేవగతిరన్యోనాస్తిదుర్వాస
నా । పస్మారంహర యంచుఁబల్కెనతియున్ భక్తుండుభక్తిస్పృహన్ ॥ ౫౪ ॥ సీ॥
పొదలునీపొక్కిటిపువ్వు గాన్పునఁగదా పెనుమాయపిల్లలఁ బెట్టుటెల్లఁ । బొడమునీమొ
దలియూర్పులనేర్పులనకదా చదువుసంధ్యలుగల్గి జగమునునుట । కెరలునీయడుగుఁ
దామరలతేనియఁగదా పాపంపుఁ బెనురొంపి పలుచనగుట । పొసఁగునీతెలిచూపు
పసఁగదాయిదిరాత్రి యిదపగలను మేరలెఱుఁగఁబడుట । భవనఘటనకు మొదలికంబ
మునుబోలె । భువనములకెల్లనీవాదిభూతుఁడగుట । నిట్టనిలుచునిక్క చేఁగాదె నెట్టు

---

గఁగా. మదావళిగా = ఏనుఁగు — శ్రేష్ఠుఁడు॥ ౪౯ ॥ కుండలీంద్ర...సుధ = శేషశయ్యయొక్క
ప్రకాశమనెడియమృతమును॥ ౫౦॥ అగ్రావనిన్ = ఎదుట. ఇందీవిభున్ = లక్ష్మీభర్తను. ఆవిల =
కలఁకఁబాఱిన. కృత్య = తాను చేయఁదగినకార్యములయందు॥ ౫౧॥ విలిఖితమో = వ్రాయఁబడిన
దో — చిత్తరువో. విస్మృతి = స్మృతిలేమి. తొలుసావిపయోధరధారన్ = తొలుకరిమబ్బువలననీటిధా
రలచేత. తోఁగు = తడిసియు. తళుకొత్తు = ప్రకాశించు. పులు నేపునన్ = గడ్డియొక్క యాధిక్యముచే
త. పులకలు = గగుర్పాటులు ॥ ౫౨ ॥ నిచ్చలు = నిత్యమును. ఇచ్చలోన్ = మనసునందు. ఇచ్చితిం
గరము = అభయహస్తము నిచ్చితిని. ఎడ = అవకాశము. ఈప్సితములు = కోరికలను. పొచ్చెము = త
క్కువ. ఒచ్చెము = అనుమానము॥ ౫౩ ॥ ఉద్ధూళిత = దట్టముగ యఁబూయుటచేత. విస్మేరాంబుజగామి
= వికసించినతామరనుపొందునది. అస్మాకంశరణంత్వమేవ = నాకురక్షకుఁడవునీవే. గతిః = దిక్కు.
అన్యః = ఇతరము. నాస్తి = లేదు. దుర్వాసనాపస్మారంహర = చెడ్డవిషయాపేక్షయనెడిమూర్ఛనుపోఁగొ
ట్టుము. స్పృహన్ = ఇచ్ఛచేత॥ ౫౪॥ పొదలు = వర్ధిల్లు. కాన్పునన్ = ప్రసవముచేత. ఊర్పుల = శ్వాస
ముల. కెరలు = అతిశయించు. తెలి = తేటయైన. భవనఘటనకున్ = ఇల్లుకట్టుటకు. నిట్టనిలుచునిక్క =
నిలువునవిలిచియుండుట. నెట్టుకొనియెన్ = అతిశయించెను — తేటపడియెను. గెంటు — కదలిక.

కోనిమొ। గెంటుఁగుంటును లేకలక్ష్మీకళత్ర॥ ౫౫ ॥ చ॥ ముదమునసోమకాసురుఁ
డు మ్రుచ్చిలియచ్చలమారఁ గొన్నప్రాఁ। జదువులు తెచ్చి తజ్జఠరసాంద్రతరాంత్ర
ములంటనంటుబల్। గదురుదొలంగఁ గీర్తియనుగంగఁదొలంచి విధాతృవిస్ఫుర॥
ద్వదనసరోజగంధ లలితంబులు చేసితిగాజగన్నిధీ॥ ౫౬ ॥ ఉ॥ కోపనశాపనవ్యశి
ఖిగోర్మసఁగం గసుగందిమ్రందిత। త్తాపమునాఁపలేక తిమిధామజలభ్రమిఁ గూలి
తూలు జం। భాపహరాజ్యలక్ష్మి వెరవారఁగఁదేల్పవెయీఁతకాయరూ। పై పృథు
కర్పరంబమరనాశ్రితరక్షణదక్షిణేక్షణా॥ ౫౭॥ ఉ॥ ఆపెనువెల్లిఁద్రెళ్లుమకరాకరమే
ఖలనీ ప్రదేష్ట్రియ। ష్టాపదటంకవిభ్రమవిడంబినియౌనిజదంష్ట్రఁగూర్చుత। ద్రూపము
దీపితంబగుసరోరుహలోచనసప్తజిహ్వజి। హ్వాపరిభాగధూమవలయోపమమై
విలయోపలబ్ధులన్॥ ౫౮॥ చ॥ అలఘుజగిద్విషద్విపఘటాంకుశశాతనఖాంకురాగ్ర
లాం। గలములమున్ను నీవసురఘస్మర వైరిభుజాంతరాళజాం। గలమహిఁజాలువట్టిప
యిఁగ్రమ్మెడు నెత్తురునీరు వెట్టియం। దలుకవెకీర్తివల్లరికలమాంకురమింద్రరమాంఘ
లాఢ్యమై॥ ౫౯॥ క॥ దండితబలివైజగములు। నిండఁబెరుగుచున్న వేళ నీయడుగు నభా। మం
డలమటి సూక్ష్మాకృతిఁ। గొండికమచ్చయునుబోలెఁగొమరొందు హరీ॥ ౬౦॥ ఉ॥ మా
త్సకఠోరకంఠబిలమార్గగళద్రుధిరారుణాననం। బై తటుక్కొత్తుదోఃపరశుహంసికిపేఁ
తయొసంగవే రిపు। క్ష్మాతలనాథమేచకకచాకుచహారరమ్యకాళనాళసం। ఘాతము
నాకనై ణమదకర్దమవర్ధనసంప్రభూతముల్॥ ౬౧॥ ఉ॥ దారుణబాణపాతమదధా

---

కుంటు ...గు॥ ౫౫॥ అచ్చలము= ఉత్సాహము. ప్రాఁజదువులు=వేదములను. ఆంత్రములు=
ప్రేగులు. బల్గదురు=అధికమయినసీచుగబ్బు. తొలంచి=కడిగి. విస్ఫురత్=వికసించుచున్న॥ ౫౬॥
కోపనశాపనవ్యశిఖి=కోపస్వభావముగలదుర్వాసునిశాపమనెడిక్రొత్తనిప్పు. గోర్మసఁగన్=మిక్కిలి
చెలఁగఁగా. కసుగంది= మిక్కిలి తపించి. మ్రందిన=పోలి. తిమిధామజలభ్రమిన్ = సముద్రజలము
యొక్క తిరుగుడుచేత. తూలు=చలించు. జంభాపహ=ఇంద్రునిదైన. ఈఁతకాయ=ఈఁదునప్పుడు
ఆనుకొనుటకు ...సారకాయ. కర్పరము=వీఁపుచిప్ప. దక్షిణేక్షణా= దాక్షిణ్యముతోడి
చూపుగలవాఁడా॥ ౫౭॥ మకరాకరమేఖలన్=భూమిని. అష్టాపదటంకవిభ్రమవిడంబిని=బం
గారుపని ...యొక్క విలాసమును పోలినది. సప్తజిహ్వ=అగ్నియొక్క. జిహ్వాపరి=
...లంద. విలయోపలబ్ధులన్=ప్రళయములు కలుగునప్పుడు॥ ౫౮॥ అలఘు...
...ములన్=అధికులైన లోకశత్రువుల నెడియేనుఁగుల గుంపునకు అంకుశములైనవాఁడులైన గోళ్ల
...నెడినాఁగేళ్లచేత. అసురఘస్మర=అసురులను నశింపఁజేయువాఁడా. వైరి...మహిన్=పగవా
ని ఱొమ్ము అనెడి ...నేలను. చాలువట్టి=చాళ్లేర్పడునట్లు. కలమాంకురము=వరిమొలక॥ ౫౯॥ గొండి
కము=చిన్న॥ ౬౦॥ కఠోర=కఠినమయిన. గళద్రుధిరారుణాననంబు=కాఱుచున్న నెత్తుటిచేత ఎఱ్ఱనైన
మొన ... దోఃపరశుహంసికిన్ =చేతులయందలి గండ్రగొడ్డలియనెడి ఆఁడుహంసకు. మేచకక
చా=స్త్రీలయొక్క. ఏణమద= కస్తూరియనెడి. కర్దమవర్ధనసంప్రభూతముల్= బురదయందు వర్ధి
ల్లినదియును॥ ౬౧॥ దారుణబాణపాత మదధారలుగాఁ...గన్=క్రూరములైన

రలుగాఁ జెఁగఁ గ్రాలు దోర్ఘను । ర్వారణరాజుఁ గొల్పి దశవక్త్రముఖాంబుజవాటిఁ గూల్చి బృం । దారకహృత్సరోజములు దాననచేసి వికాసమాసరా । కారత నొందఁజేసిన ప్రగల్భత నీకతగుఁ దగుఁ గాహారీ ॥ ౬౨ ॥ మ ॥ వికటోత్తంభితసీరభోగపటలీవిస్ఫూర్తిమన్మూర్తికం । చుకనిర్మోకభయానకంబు వికృతాశుక్ష్వేళమగ్నిచ్ఛటా । వికిరత్క్రూరనిరీక్షణంబు నగు నీవేషంబు శేషానుకా । రి కళఁ గ్రాలదె క్రోలదే సముదవైరిప్రాణవాతూలముల్ ॥ ౬౩ ॥ చ ॥ ప్రతిదినకేశలుంఛనపురాయిడి నెట్టనబట్టగట్టి పైఁ బుతపుతమంచునున్న కుఱుబోడతలక్ ధరియింప నోడియుక్ । సతముఁగ సౌమ్యగా ననిడఁ జాలవు గాశిఖిపింఛవల్లి సౌ । గతమతధుర్య దానిఁ గటిఁగట్టుము పుట్టము మిన్న కేటికిక్ ॥ ౬౪ ॥ చ ॥ కలిహిమవేళ శోభనపుఁ గమ్మవిరుల్ సకలంబు డుల్చి భూవలయవనంబుఁ గప్పికొని వర్తిలుజాడ్యపుటీఁద పర్వఁగా । నలరులకారులీల భవదాగమనం బిటఁ గల్గ రోషపా । టలమగు నీకనుంగడల డాలు నగుక్ జిగురాకునాకృతిక్ ॥ ౬౫ ॥ సీ ॥ నీటిలోఁ జివుకక నిలిచి క్రమ్మఱు ఫ్రాన్కిఁ గఠినకర్పరపుఁ జుక్కాను బిగువు । దంష్ట్రనెత్తిన మహీతలపు గాడుపుఁ జీర యురు దారుకలనయం దుదయమగుట । పరులకుఁ దనకట్లబలిమి చూపువిధంబు పులిమిన నెత్రు గుగ్గిలపు నూనె । ద్వీపాంతరమునకుఁ

---

బాణములు పడుటయనెడి మదజలధారలు కాఱుచుండఁగా. క్రాలు = ప్రకాశించునట్టి. దోర్ఘనుర్వారణరాజుక్ = భుజములయందలి విల్లనెడియేనుఁగులరాజును. కొల్పి = పురికొలిపి. దశవక్త్రముఖాంబుజవాటిక్ = రావణుని పైనముఖములనెడి కమలములవరుసను. బృందారకహృత్సరోజములు = దేవతల మనస్సులనెడి కమలములు. వికాసమాసరాకారతక్ = వికాసముచేత అతిశయించినయాకృతికలిగిన తనమును. ప్రగల్భత = నేర్పరితనము ॥ ౬౨ ॥ వికట = వంకరై. ఉత్తంభిత = మీఁది కెత్తఁబడిన. సీరభోగపటలీ = నాఁగేలనెడిపడగలయొక్క సమూహముచేత. విస్ఫూర్తిమత్ = ప్రకాశించుచున్న. మూర్తి = ఆకృతి. కంచుకనిర్మోకభయానకంబు = కుబుసము విడుచుట చేత భయంకరమయినది. వికృతాశుక్ష్వేళము — వికృత = వికారమైన. ఆశు = వడితోడి. క్ష్వేళము = విషముగలది; సింహనాదముఁగలది అని అర్థాంతరము. అగ్నిచ్ఛటావికిరత్క్రూరనిరీక్షణంబు = నిప్పులసమూహమును వెదచల్లునట్టి క్రూరమైన చూపుగలది. శేషానుకారి = శేషునిఁబోలుచున్న. కళక్ = ప్రకాశముచేత. క్రాలదె = ప్రకాశింపదా. క్రోలదే = త్రాగదా. సముదవైరిప్రాణవాతూలములు = మదముతోఁగూడిన శత్రువుల ప్రాణవాయువులను ॥ ౬౩ ॥ లుంఛనపురాయిడిక్ = ఊడిపోవునట్టి యుపద్రవముచేత. నెట్టనక్ = మిక్కిలి. పుతపుతమంచుక్ = అదురుచు. కుఱుబోడతలక్ = కుఱుచయైన బోడితలయందు. సతముగక్ = శాశ్వతముగ. శిఖిపింఛవల్లిక్ = తీఁగవంటి నెమలిపురిని. సౌగతమతధుర్య = బుద్ధుఁడా. పుట్టము = వస్త్రము ॥ ౬౪ ॥ కలిహిమవేళక్ = కలియుగమనెడిమంచుకాలమునందు. శోభనపుఁగమ్మవిరులు = మేలులనెడి వాసనతోడి పువ్వులను. డుల్చి = రాల్చి. భూవలయవనంబుక్ = భూమండలము అనెడి అడవిని. వర్తిలు = ఉండునట్టి. జాడ్యపుటీఁద = మూఢత్వమనెడి చలిగాలి. పర్వఁగాక్ = వ్యాపింపఁగా. అలరులకారులీలక్ = వసంతఋతువు విధమున. అటక్ = అంతట. రోషపాటలము = కోపముచేత ఎఱ్ఱనైనది. కనుంగడల డాలు = కడకన్నులకాంతి ॥ ౬౫ ॥ కర్పరపు = వీఁపుఁజిప్పయనెడి. గాడుపుఁజీర = గాలికి ఎత్తైదు చాఁపగుడ్డ. దారుకలనయందుక్ = ప్రూనిపొందునందు. చేముట్టు = ఆయుధమయిన. జీనుతగులు = లంగరుతగిలించుట. సౌగతాగమమాలిమిశాస్త్రనరణి = బౌద్ధమతాగమమనెడి ఓడనడపు శాస్త్రరీతి.

దెగుర మ్రింగను పెంపు చేముట్టు నాఁగంటి జేనుతగులు । సౌగతాగమమహాలిమిశాస్త్రి సరణి । వల్లువల్లన చిత్రధావనము గల్గు । నిన్నుఁ దరిచేసి భవవార్ధిని స్తరించి । దరిఁ దఱియకున్నఁ గలదె మోదము మురారి ॥ ౯౬ ॥ చ॥ లలితకళావళీస్ఫురదుపలాశపరీతసుధామరందపి । చ్ఛిలసువమాప్రబోధగుణ జృంభిత పూర్ణసుధాంశుబింబపు । ష్కలసిత పుష్కరాయతన పట్చరణేంద్రనవేంద్ర నీలక । జ్జలజలజాస్తజాజ్జ్వలనిజద్యుతివంచక కాంతికంచుకా॥ ౯౭॥ క॥ ఉత్పత్తిస్థితివిలయా । ర్థోత్పాదక విట్ఠలాహ్వ యోన్నత సత్రా । జిత్పుత్రికాసత్యష్టదృ । గుత్పిబసుఖదాపఘనపయోధర శాలీ ॥ ౯౮ ॥ స్రగ్విణి ॥ అండజాధీశవాహా జగద్గేహ దో । ర్దండచండారినిర్దారితారీ నతా । ఖండలా గండరింఖన్మణీకుండలా । పుండరీకేక్షణా ప్రోవు సత్సుత్రుణా॥ ౯౯॥ చ॥ అలికులభాగకుంతలములందపుముద్దు మొగంబుఁ జేరలం। గొలువఁగవచ్చు కన్నులుఁ జిగుర్నగు మోవి మెఱుంగుఁ జెక్కులున్। వలమురియట్టు లేమొసలివాగడపోఁగులు లోఁతు పొక్కిటన్। మొలచిన తెల్లదమ్మిబలు మూఁపులు నీలవినీల దేహమున్॥ ౧౦౦॥ చ॥ కలిగినవాని ప్రాఁబలుకుఁ గమ్మని యూర్పులవాని యొందునే । వెలుఁగును గాని పెన్వెలుఁగు వెంబడి నింజనువాని నంతటన్। వెలసినవాని నిన్ గనని వెంబరపుట్టువు జాతి పుట్టువుం । బలెగతి గాన లేదు యతిమానసహంసక కంసహింసకా॥ ౧౦౧॥ ఉ॥ ఛత్రిత

---

వల్లువల్లన చిత్రధావనము=చక్కనైన వల్లిత మనెడి విచిత్రమయిన గుఱ్ఱము దవుడు పాఱుట. తరిన్=ఓడనుగా. నిస్తరించి=దాఁటి. దరిఁ దఱియకున్నన్=గట్టు చేరకుండిన. మోదము=సంతోషము.— ఈపద్యమునందు విష్ణుని దశావతారములును ఓడ పరికరములుఁగా వర్ణింపఁబడియున్నది. అందులకు అనుగుణముగా అర్థాంతరమూహించుకొనవలెను ॥ ౯౬ ॥ లలిత ... ఆయతన=ఒప్పిదములయిన కళలసమూహ మనెడి మెత్తనియాకుల చేత చుట్టఁబడిన యమృతమనెడి పూఁదేనెమీఁగడయొక్క మేలయిన కాంతివిశేషమును తోఁపించెడి గుణము చేత లేఁగినవిండు చంద్రుని బింబముయొక్క కొఅంతలేని తెల్లనైన జలప్రదేశము (పాలసముద్రము) యిల్లుగాఁగలవాఁడా. షట్చరణేంద్ర...కంచుకా=శ్రేష్ఠమయిన తుమ్మెద నూతనమయిన యింద్రనీలమణి కాటుక యమునానదియందలి జలము వీనిని తనకాంతి చేత తక్కువపఱుచునట్టి దేహకాంతియనెడు కవచము గలవాఁడా ॥ ౯౭ ॥ ఉత్పాదక=కలిగించునది యైన. ఉన్నత=అధికుఁడా. సత్రాజి...శాలీ=సత్యభామయొక్క ఆశతోడి చూపులకు నిష్పాదనము చేయుటవలని సుఖము నిచ్చునట్టి దేహమనెడి మేఘము చేత ఒప్పినవాఁడా॥ ౯౮॥ జగద్గేహ=లోకమే యిల్లుగాఁగలవాఁడా. దోర్దండ...తారీ=కఱ్ఱలవంటి చేతులయందలివాఁడియైన చక్రము చేత చెనకఁబడిన శత్రువులుగలవాఁడా. నతాఖండలా=మ్రొక్కినయింద్రుఁడుగలవాఁడా. గండరింఖన్మణీకుండలా=చెక్కిళ్లయందు నటించుచున్న రత్నముల చెవిపోఁగులుగలవాఁడా. సుత్రుణా=మంచియత్నము గలవాఁడా॥ ౯౯ ॥ అలికులభాగకుంతలములు=తుమ్మెదలను బోలినముంగురులు. చిగుర్నగు మోవి=చిగురును పరిహసించునట్టి పెదవి. వలమురియట్టు=శంఖమువంటి మెడ. లేమొసలివాగడపోఁగులు=క్రొత్తవైన మకరకుండలములు. తమ్మి=తామర॥ ౧౦౦॥ వెంబర=దుష్టునియొక్క. యతిమానసహంసక=యతులయొక్క మనస్సులనెడి మానససరస్సునకు హంసయైనవాఁడా॥ ౧౦౧॥ ఛత్రితశేష=గొడుగుగాఁ జేయఁబడిన శేషుఁడుగలవాఁడా. అయ్యైదవేన్=అయ్యైదుపక్షమున. కృతోగ్రశత్రు

శేష నాయెడఁ బ్రసన్నుఁడ వయ్యెద వేఁ గృతోగ్రశ । త్రుత్రపమైన యీలలితరూప
ముతోనిచటన్ వసింపుమే । క్షేత్రము నెట్టితీర్థమును జెందనియున్నతిఁబొందుఁగాక
యీ । క్షేత్రము తీర్థమున్ గడుఁబ్రసిద్ధి మదాహ్వయలబ్ధిఁబొందుచున్ ॥ ౨౨ ॥
తే॥ క్షేత్రకులరాజమైనయీక్షేత్రమునకుఁ । దీర్థకులరాజమైనయీతీర్థమునకు ।
నిఖిలసురనాథకర్తృత్వనియతిఁబొదలి । యీవిటవసించుటయ వరంబిచ్చుటనుడు॥
౨౩ ॥ సీ ॥ అనుకంపపెనువేఁపుగనుసొంపునకువింత చెలువంబు మొలపింపఁజిగురు
మోవి । పవడంపుఁగోన దంతపఙ్క్తిప్రభలు పుష్పితముగాఁగహరిపల్కుధరణిది
విజ । నివహావరేణ్యునానిఖిలధర్మధురీణ యగునట్లు భవదాహ్వయము వహించు ।
నితీర్థమునవసియించెదనడుచక్కి నీకుఁజేతఃప్రీతినెలకొనంగ । భీమఘర్మాంబుసం
భూతభైమినీదు । క్షేత్రమునుదీర్థమునునిజోత్కృష్టసలిల । వేణిసంప్లావితమ్ముగా
వింపఁగలదు । నాకునెంతయునిష్టమొనర్పఁగడఁగి॥ ౨౪ ॥ వ॥ ప్రకటసుప్తాకారంబునం
బశ్చిమాభిముఖుండనై సర్వోత్తమత్వంబు నిర్వహింపనేనిచ్చటముచ్చటందవిలివర్తిం
చెద. సకలక్షేత్రతీర్థోత్తమంబులగు నీ క్షేత్రతీర్థంబులుం బౌండరీకంబులై పాండు
రంగాహ్వయుండనగు నాకునెక్కాలంబును శ్వేతద్వీప సుధాసాగరంబులకంటెఁ
బ్రియంబులై నిత్యనివాసంబులై యత్యంతవిభవంబులనభిరామంబులయ్యెడు. నీకో
రినయట్లయిచ్చితినని యచ్చతుర్భుజుండు పుండరీకునిఁజేకొనియె॥ ౨౫ ॥ శా ॥ శీతా
హార్యకుమారి విస్మితులు లక్ష్మీజానివాచంయమి । వ్రాతశ్రేష్ఠునకున్ వరంబొసఁ
గిసాంద్రప్రీణనచ్ఛన్నమ । ధ్యేతీర్థంబుననున్నవాఁడిపుడు భుక్తిన్ ముక్తినీఁజాలువి ।
ఖ్యాతిందాల్చి విచిత్రరత్నచయరమ్యస్వర్ణహర్మ్యంబునన్ ॥ ౨౬ ॥ చ ॥ నలువమొ
గంబులెస్లుసృజనప్రథమాహమునందలిగ్చన । న్నలువున సిద్ధసాధ్యనరనాగమరుద్వ
రయోగిమండలీ । కలకలగుంభితంబులయి కాంచనచారువులైన నాల్గువా । కిళుల
వెలుంగు సున్నతనికేతనరాజమునం బ్రసన్నుఁడై ॥ ౨౭ ॥ తే ॥ పుండరీకుండు క్షేత్ర
పాలుండు గొలిచి । యుండ నవ్యక్తముఖ్యసంయుక్తుఁడగుచుఁ । బాండురంగండు
భక్తకల్పద్రుమలీల । నిష్టఫలసిద్ధిఁదోరహత్రించునింతి ॥ ౨౮ ॥ క ॥ ఆకంబులలితకరు

---

త్రపము=చేయఁబడినక్రూరశత్రువుల భయము కలది—క్రూరులైనశత్రువులకు భయమునుకలుగఁజే
యునది. మదాహ్వయలబ్ధిన్=నాపేరు కలుగుటను॥ ౨౨॥ ౨౩॥ అనుకంప=దయ. వింత చెలువంబు=
క్రొత్తయందము. చక్కిన్=చోటను. చేతఃప్రీతి=మనస్సంతోషము. భీమఘర్మాంబుసంభూత=శివు
నిచెమటనీటివలనఁబుట్టినది. నిజో...సంప్లావితమ్ము=తనదైనమంచినీటిపాయచేతచక్కఁగాఁదడుపఁ
బడినదానిఁగా ॥ ౨౪ ॥ సుప్త=నిద్రపోయినవాని. తవిలి= ఆసక్తుఁడనై ॥ ౨౫ ॥ శీతాహార్యకు
మారి=హిమవంతునికూఁతురా. లక్ష్మీజాని=విష్ణుదేవుఁడు. వాచంయమివ్రాత= మునులసమూహ
మునకు. భుక్తిన్=ఇహలోకసుఖమును ॥ ౨౬ ॥ అన్నలువునన్=ఆవిధమున. మరుత్=దేవత
లు. మండలి=సమూహముయొక్క. గుంభితంబులు=కూడినవి. కాంచన చారువులు= బంగారుచేత
మనోహరములు. నికేతనరాజమునన్=శ్రేష్ఠమయినయింటియందు ॥ ౨౭ ॥ ౨౮ ॥ కంబులలిత

బుధ । కోశంబులపాలిహేళిఁగొలుతు రబలము । ల్లోకంబులవారలుఁబరి । పాకంబులనాత్మసుకృతపరికరమొప్పన్ ॥ ౭౯ ॥ వ ॥ అర్ధయోజనవిస్తారంబునుదదర్ధాయామసంయుతంబును నై కంబుకంధరునకు నావసం బ్రియజనకంబై సనక సనందనాది సజ్జనచింతితార్థప్రదంబై సర్వోత్తమంబై నయమ్మహాక్షేత్రరాజంబు పుష్కరంబునకంటెఁ ద్రిగుణంబును కేదారంబునకంటె షడ్గుణంబును వారణాసికంటె దశగుణంబును శ్రీశైలంబునకంటె ననంతంబునునై పుండరీకుని పేరం బౌండరీకంబును మహీమండలమణికుండలంబగుచు నుండు నప్పరమధామంబు నే నధిష్ఠించి ॥ ౮౦ ॥ ఉ ॥ ఆయదుభర్త నాహలధరానుజు నానవనీతచోరు నేఁ । బాయనిభక్తితోఁ గొలుతుఁ బ్రత్యహముం గృహదైవతంబుగా । నోయరవిందకోరకసహోదరచారుపయోధరాఢ్య ని । శ్శ్రేయసకాంక్షఁ దక్కొరులు చేరిభజింతు రనంగ నేటికిన్ ॥ ౮౧ ॥ క ॥ ఇతరక్షేత్రస్థితదై । వతపూజలఁగలుగుఫలమవశ్యముగలుగున్ । శతదశకగుణితమై యూ । ర్జితమతిఁ దత్క్షేత్రపూజ సేయునరునకున్ ॥ ౮౨ ॥ క ॥ నరుఁడరువదివేలేఁడులి । తరదైవతదర్శనమునఁ దాఁగనుఫలమున్ । బొరయునలవోకవలె శాం । కరి యాక్షేత్రోత్తమంబుఁగనుఁగొన్నంతన్ ॥ ౮౩ ॥ క ॥ సకలక్షేత్రావాసము । నకంటె నందానికియొప్పునరునకు మృగడిం । భకనయన యేకదినవా । సకృతికి వేదొరకుఁగాన సాయుజ్యంబున్ ॥ ౮౪ ॥ సీ ॥ దొరకుజన్మమునకుఁ బరమభైషజ్యమా మాతృశుశ్రూషాసమాధి యొకటి । చిలువాయనపువేల్పుఁగొలముఁగొల్వక వాసుదేవు నారాధించు తెలివి యొకటి । దుర్వాసనలబెట్టుదొసఁగులు విడఁదన్ని యధ్యాత్మవాసన నలరుటొకటి । యార్వీజీవులకెల్లనుదయించియుదయించి తుదిమర్త్యుఁడై పుట్టు పదవి యొకటి । కాలమున వచ్చునర్థులకాంక్ష యెఱిఁగి । తృప్తినొందింపఁగలుగంగఁ దిరుగుటొకటి । దుర్లభంబెట్టులట్లతిదుర్లభంబు । మఱువ తత్క్షేత్రవాసంబు మానవులకు ॥ ౮౫ ॥

---

కరున్=శంఖము చేత నొప్పుచున్న చేయిగలవానిని. బుధకోశంబుల=విద్వాంసుల నెడి చక్రవాకపక్షులు. హేళిన్=సూర్యుని. పరికరము=ఉపకరణము ॥ ౭౯ ॥ ఆయామ=వెడలుపుతోడ. చింతితార్థప్రదంబు=కోరినదానినిచ్చునది. త్రిగుణంబు=మూడంతలు. షడ్గుణంబు= ఆఱంతలు. అనంతంబు=తుదలేనిది. ధామంబు=ఆలయము. అధిష్ఠించి= ఉనికిచేసికొని ॥ ౮౦ ॥ అరవింద...రాఢ్య=తామరమొగ్గలనుబోలిన యొప్పిదములగు స్తనములుగలదానా. నిశ్శ్రేయసకాంక్షన్=శుభమునందలియపేక్షచేత. తక్కొరులు=తక్కినయితరులు. భజింతురు=సేవింతురు ॥ ౮౧ ॥ శతదశగుణితము=వేయంతలుగా పెరుగునది. ఊర్జితమతిన్=స్థిరబుద్ధితో ॥ ౮౨ ॥ పొరయున్=పొందును. అలవోకవలెన్=అనాయాసముగ. శాంకరి=ఓపార్వతీ ॥ ౮౩ ॥ మృగడింభకనయన=జింకపిల్లకన్నులవంటికన్నులుగలదానా. ఏకదినవాసకృతికిన్= ఒకదినమువాసముచేసినవానికి. సాయుజ్యంబు=మోక్షము ॥ ౮౪ ॥ దొరకు=కలుగు. భైషజ్యము = మందు. చిలువాయనపు వేల్పుఁగొలము = చిల్లరదేవతలసమూహమును. దుర్వాసనలబెట్టుదొసఁగులు=దుష్టములయిన విషయాపేక్షలనెడి గొప్పయాపదలను. అధ్యాత్మవాసనన్=తత్త్వవిచారాపేక్షచేత. అలరుట=ఆనందించుట. పదవి=భాగ్యము ॥ ౮౫ ॥

చ॥ వినవె యజస్రమున్ గుతపవేళ క్షుధార్తులకోటిఁ గూర్చి నేతన్ నెసఁగు వెట్టివండు కల
ధౌతపుఁగూడు పసిండిపళ్ళభో | జనమిడి యొండుచోఁ బడయఁజాలదు పుణ్యమగ
ణ్యమై ఘటిల్లు నెలఁత పౌండరీకమహీలో మెతుకొక్కటి పెట్టువానికిన్॥ ౮౬॥ మ॥
నియతిం బాతికయెత్తు కాంచనముగా నీ వెండిగా నీజగ | త్ప్రియప్రాజ్యంబగు పాండు
రంగవసతిన్ దానంబు గావించు పు | ణ్యాయత్తుం డుండు నఖండలీల కలధౌతాహార్యవ
ర్యాత్మక | ప్రియగేహంబులలో భవాంతరమునన్ బృథ్వీధరేంద్రాత్మజా ॥ ౮౭॥
శా॥ ప్రావారాజినరాజిఁ గంబళతతిన్ బట్టాంబరాళిన్ దయా | ప్లావస్నిగ్ధమతిన్ జ
లిన్ గృపణవిప్రశ్రేణి పైఁ గప్పఁ బో | యే వాఁ డేనియుఁ బౌండరీకమహిం వాఁ డిందుప్రభా
కందళ | శ్రీవిభ్రాజియశంబులం బొదలు ధాత్రీదిఙ్నభస్సీమలన్ ॥ ౮౮॥ ఉ॥ వృత్రవిరో
ధిముఖ్యులగు వేల్పులుఁ బుట్టఁదలంతు రోలలా | గాత్రి త్రివిష్టపస్థితిసుఖంబులు గావని
కర్మభూమి పైఁ | బత్త్రరథాధినాథరథు బాంధవవత్సలుఁ బౌండరీకసు | క్షేత్రపతిన్ భజిం
చి తమ చెన్నఁటి పుట్టువు వీఁగ కోరికన్ ॥ ౮౯ ॥ సీ ॥ పితరు లుబ్బుదురు హృద్గతుల నా
త్మకులోద్భవుఁ డెవ్వఁడైనను బౌండరీక | మునకు నేగక యున్నె యనియందు నొసఁగు
హవ్యముఁ గవ్యము నమేయమై ఫలించు | నవధరించఁగ లేరు సాత్త్వికంబగు భావమే
నొక్కఁడునుదక్క నివ్వులనవ్వుల | భక్తులెవ్వరు రజఃప్రకృతిఁ దాల్తు రేకాని పౌండరీకేశు
శాంబరికతమునఁ | దలఁపమానవమునఁ గల్గుకలుషమడఁగు | పొగడుమాటల నగుదోష

---

అజస్రమున్=ఎల్లప్పుడును. కుతపవేళన్=అపరాహ్ణసమయమునందు. క్షుధార్తులకోటిన్=ఆఁకలిబాధగలవారిసమూహమును. నేతన్=నేతితో. కలధౌతపుఁగూడు=వెండియన్నము. పసిండి=బంగారు. ఒండుచోన్=ఇతరస్థలమునందు. అగణ్యమై=ఎంచరానిదై. ఘటిల్లున్=కలుగును. పౌండరీకమహీలోన్=పుండరీకక్షేత్రమునందు॥ ౮౬॥ కాంచనము=బంగారు. వసతిన్=ఉనికిపట్టునందు. కలధౌతాహార్యవర్యాత్మక ప్రియగేహంబులలోన్=శ్రేష్ఠమయిన వెండికొండగల (అనఁగా) వెండికొండనుబోలిన యిష్టములైనయిండ్లయందు. భవాంతరమునన్=ఇంకొకజన్మమునందు. పృథ్వీధరేంద్రాత్మజా=పార్వతీ॥ ౮౭ ॥ ప్రావారాజినరాజిన్=తోలుఉత్తరీయపుసమూహమును. పట్టాంబరాళిన్=పట్టువస్త్రములసమూహమును. దయాప్లావస్నిగ్ధమతిన్=మిక్కిలి దయగలస్నేహబుద్ధితో. చలిన్=చలికాలమునందు. కృపణ=దరిద్రులైన. ఇందుప్రభాకందళశ్రీవిభ్రాజియశంబులన్=వెన్నెలమొలకలకలిమిచేత వెలుఁగునట్టి కీర్తులచేత. పొదలున్=వర్ధిల్లును. ధాత్రీదిఙ్నభస్సీమలన్= భూమియొక్కయు దిక్కులయొక్కయు ఆకాశముయొక్కయు పేరలయందు॥ ౮౮ ॥ వృత్రవిరోధి=ఇంద్రుఁడు. త్రివిష్టపస్థితిన్=స్వర్గమునందలి యునికిచేత. కావు=కలుగవు. పత్త్రరథాధినాథరథున్= గరుడవాహనుని. చెన్నఁటి=వ్యర్థమయిన. వీఁగు=తొలఁగు ॥ ౮౯ ॥ ఉబ్బుదురు=సంతోషింతురు. హృద్గతులన్=మనసులందు. ఆత్మకులోద్భవుఁడు=తమకులమునందుఁబుట్టినవాఁడు. ఉన్నె= ఉండునా. హవ్యమున్=దేవతలకియ్యఁదగినయన్నమును. కవ్యమున్=పితృదేవతలకియ్యఁదగిన యన్నమును. అమేయము=ఇంతమాత్రమని యూహించి చెప్పరానిది. నవధరించఁగలేరు=వహింపఁజాలరు. సాత్త్వికంబు=సత్త్వగుణమువల్లనైనది. రజః ప్రకృతిన్=రజోగుణభావమును. శాంబరి= మాయ. కతమునన్= కారణముచేత. కలుషము= కలవరము. అఘంబులు =పాపములు. ఉడుగున్=

ములువోలెంపు । కనుఁగొనఁగఁ జేతఁ బెట్టునఘంబులుడుగు । నమ్మహాక్షేత్రమునకు నెయ్యదిసమంబు॥౧౦॥ సీ॥ కుఱుచలై గుమురులై గొనబులై లేఁబాఁపకొమ్మఁజుట్టిన జడల్ గుముదుకొనఁగ । మెఱుపులై మిట్టలై మిక్కిలి బటువులై క్రాలుకన్నులచెన్ను గబ్బఁ జేరఁ । జిక్కనై చెలువమై చిన్నదియైయొప్పు మోముదంష్ట్రాటంకములఁ దలిర్ప । నీలమై నిబిడమై నిద్దమై నింగిఁ గ్రిందుగనున్న బలువేనిపొగరు మెఱయఁ । బత్రిపతికేతనుని పుర:క్షేత్రమూఁది । యున్న శ్రీక్షేత్రపాలకుఁ డొగిలోక । రమణుముప్పదిరెండక్షురములమంత్ర । రాజము జపించి కొల్వ దొరకు శుభములు ॥ ౧౧ ॥ ఉ ॥ చేరిచతుశ్శ్రుతుల్ చిలుకఁ జేఁజదివించుచు నక్షమాలికా । ధారిణియై తనుప్రభలు దట్టపు వెన్నెలపంటపండఁగాఁ । దూఁటుపువాకిటన్ వెలయు తోయజగర్భునిరాణి వాణి నీ । హారమయూఖజిన్ముఖదశాక్షరమంత్రమయుంగనందగున్ ॥ ౧౨ ॥ ఉ ॥ శ్రీరమణీమనోరమణు చేతఁ బ్రతిష్ఠితుఁడై టదక్షిణ । ద్వారమునందు లింగతనువైభవ మొప్ప మదత్సరీశిఖుల్ । గౌరిభజించువారలకుఁ గొంగుధనంబయి వేణుముద్రతో । నారదుఁడున్న వాఁడు రదనచ్ఛదభర్త్సితవిద్రుమప్రభుఁడై ॥ ౧౩ ॥ ఉ ॥ శౌరిభజించుచున్ భుజగసద్మమునన్ విహరింపువాజ్ఞనో । హారిణులై దుగోటులు మహామహిమాన్వితులర్థిదక్షిణ । ద్వారమున్ హిరణ్యపురరతి వర్తిలియున్విభుఁ జేరియున్నఁడో । యారతులిచ్చి నారఁట తదాఁ నతధూమము నేమఁబర్వెడున్ ॥ ౧౪ ॥ క ॥ చేడియయా ద్వారమెయ్యది । చూడామణి క్రీడలాడు చోటమ్మహితా । క్రీడనభూస్థలిహరిఁగూ । డాడుఁ జూమీయమురవల్లభావలి నేఁడున్ ॥ ౧౫ ॥ ఉ ॥ సేచనముఖ్యకర్మముల సేఁతకు నూతనమైన యచ్చటన్ । శ్రీచరణంబులున్న యవి సింగము వెన్నననంటివానికిన్ । వేచని మొక్కిపూజనము నేమముతో రచియించెనేని శ్రీ । తాచలపుత్రిపూరుషుఁ డిహంబుఁ బరంబుఁ

---

మానుడు ॥ ౧౦ ॥ గుమురులు=ఉబురులు. గొనబులు= అందములు. బటువులు=గుండ్రనైనవి. క్రాలు=ప్రకాశించు. చెన్ను= అందము. గబ్బుచేరన్=గర్వమునుతోఁపింపఁగా. చిక్కన=సన్నములేమి. చెలువమై= అందమై. మోము=ముఖము. దంష్ట్రాటంకములన్=కాసెయులులవంటి కోఱలచేత. తలిర్పన్=ప్రకాశింపఁగా. నిబిడము=దట్టము. నిద్దము=నిగనిగలాడునది. నింగి=ఆకాశము. బలువేనిపొగరు=గొప్పదేహమునొక్క నిక్క. పత్రిపతికేతనుని=గరుడధ్వజముగల పాండురంగవిఠ్ఠలుని. పుర:క్షేత్రము=ఎదుటిప్రదేశమును. ఊఁది= అవలంబించి ॥ ౧౧ ॥ ధారిణి=ధరించినది. తోయజగర్భునిరాణి= బ్రహ్మయొక్క పట్టపుదేవి. నీహారమయూఖజిన్ముఖ = చంద్రునిజయించునట్టి ముఖముగలది ॥ ౧౨ ॥ లింగతనువైభవము= లింగదేహముయొక్క కలిమి. రదనచ్ఛదభర్త్సితవిద్రుమప్రభ=పెదవిచేత తిరస్కరింపఁబడిన పగడపుప్రభను గలవాఁడై ॥ ౧౩ ॥ భుజగసద్మమునన్=నాగలోకమునందు. వాఙ్మనోహారిణులు=మాటలచేతమనోజ్ఞులగువారు. రతిన్=ఆసక్తిచేత. వర్తిలి= ఉండి. తదాఁనతధూమము=దానిదైన విశేషపుపొగ. పర్వెడున్=వ్యాపించుచున్నది ॥ ౧౪ ॥ యదుచూడామణి=కృష్ణుఁడు. అమ్మహితాక్రీడనభూస్థలిన్= లెస్సగా క్రీడింపుటకుఁ దగిన ఆ పూజ్యమయినప్రదేశమునందు ॥ ౧౫ ॥ సేచన=స్నానము. చేఁతకున్=చేయు

గరంబునంగొనున్ ॥ ౯౬ ॥ చ ॥ మురలఁగఁబట్టఁగట్టఁగ సమస్తమరుత్కరిఁ దన్నుఁగూర్చియు । చ్ఛురికధరింపఁబోలు ననశాతముఖాంకుశపాశముల్ వికస్వరరుచిఁ దాల్చి పశ్చిమపువాకిట హ్రీంకృతిమంత్రరూపధా । స్వరభువనాధినాయికలసద్రసనాయిక యొప్పు నెప్పుడున్ ॥ ౯౭ ॥ ఉ ॥ హారిపథాఘరూఢమహిహాసురకీకసవర్గదుర్గనాగారిమహాపవాహ్యసదశాతురమంత్రవిశేషయుత్తర । ద్వారమునం దనుండు నిరతంబును దాఘలఘూపపాయసా । హారములం దనుం దెలచు నయ్యలదొడ్డికి వేల్పుగిడ్డియై ॥ ౯౮ ॥ క ॥ ఇవి నాలుగు ద్వారంబులు । భవళితులు ద్వారదేవతలు నల్వురు వీ । రవధానబుద్ధి నేత । త్సవిశేషార్చనము నర్పసంపదలొందవుఁ ॥ ౯౯ ॥ తే ॥ సమరసన్నద్ధరక్షోనిశాతహేతి । పాతజాతక్షతవ్రాతభూతిఁ దనరు । పరమపదనాథు నైమ్మెనఁ బరఁగు వర్ణ । రాజియఖిలంబు శ్రీమంత్రరాజమున బల ॥ ౧౦౦ ॥ మ ॥ అహరారంభమునం దురక్తుఁడయి మధ్యాహ్నంబునన్ శుభ్రుఁడై । గ్రహరాడస్తమయంబునం దసితుఁడై గాయత్రియుం బోలియ । య్యహిపర్యంకుఁడు మూఁడుమూర్తులకు నిమ్మై యొప్పఁ బూజింతుర । న్వహముం గోమలి మూఁడుమంత్రములనిత్యానందకాంతున్ మనుల్ ॥ ౧౦౧ ॥ క ॥ మూర్తిత్రితయమయత్వ । స్ఫూర్తిన్ వర్తించు చిహ్నములు మంత్రముశ్రీ । భర్తకృప నెనెఱుంగుమ । కార్తికరాకాసుధాంశుకమనీయముఖీ ॥ ౧౦౨ ॥ మ ॥ గదసారించి త్రిదంష్ట్రి నాముఁ డసురక్షఃపాటుఁడా కర్కండబి । ట్టిగల్ వాఱమురారి యొడ్మ బరిశ్రేయన్ దానవద్విట్కరా । చ్ఛెదళింపంబడియున్ దదుగ్రహతిగాసిన్ సుల్లకాధిక్యమున్ । మృదుసంరంభముతో డనప్పుచునుమన్నెన్ వాని సద్భావఁ

---

టీక ॥ ౯౬ ॥ మురలఁగఁబట్టన్=తిరుగఁబట్టుటకును. కట్టఁగన్=కట్టివేయుటకును. సమస్తమరుత్కరిన్=ఎల్లదేవతలలోను పెనఁగైన—ప్రధానదేవతయైన. తన్నున్=పాండురంగనిని. శాతముఖాంకుశపాశములు=వాఁడిమొనగలఅంకుశమును త్రాటిని. వికస్వరరుచిన్=వికాసముతోడి ప్రకాశముతో. భువనాధినాయిక=లోకములయేలికసాని. లసద్రసనాయిక= ఒప్పిదములైనరసములకు నాయకురాలు—సరస్వతి ॥ ౯౭ ॥ హారి=మనోహరమయిన. కీకసవర్గ=ఎముకలరాశిగలది. నాగారిమహాపవాహ్య=సింహమనెడి రాజవాహనముగలది. ఘూప=పిండివంట. పాయస=పరమాన్నము. తెలచు=ఆరాధించు. అయ్యలదొడ్డికిన్=ఉత్తమజనులసమూహమునకు. వేల్పుగిడ్డి=కామధేనువు ॥ ౯౮ ॥ అవధాన= ఎచ్చరికతోడి ॥ ౯౯ ॥ సమర...భూతిన్=యుద్ధమునకుసిద్ధపడినరాక్షసులవాఁడియైన ఆయుధములపాటువలననైన గాయములసమూహముయొక్క కలిమిచేత. వర్ణరాజి= అక్షరముల పఙ్క్తి ॥ ౧౦౦ ॥ అహరారంభమునందున్=ప్రాతఃకాలమునందు. రక్తుఁడు= ఎఱ్ఱనివాఁడు. శుభ్రుఁడు=తెల్లనివాఁడు. గ్రహరాడస్తమయంబునందున్=ప్రొద్దుగ్రుంకునప్పుడు. అసితుఁడు=నల్లనివాఁడు. అహిపర్యంకుఁడు=విష్ణుదేవుఁడు. ఇమ్ము=ఉనికిపట్టు. అన్వహమున్= ప్రతిదినమును ॥ ౧౦౧ ॥ స్ఫూర్తిన్=తోఁపికచేత. కార్తికరాకాసుధాంశు=శరత్కాలమునందలి పున్నమనాఁటిచంద్రునివలె. కమనీయ=సుందరమైన ॥ ౧౦౨ ॥ సారించి=చాఁచి. బిట్టు=మిక్కిలి. అదరులు=నిప్పురవలు. పాఱన్= ప్రవహింపఁగా— రాలఁగా. బరిన్=ప్రక్కను. శ్రేయన్= కొట్టఁగా. దళింపంబడియున్= కొట్టఁబడియును. తదుగ్రహతిగాసిన్= అతిఘోరమయిన దెబ్బవలని

డుఁ ॥ ౧౦౩ ॥ సీ ॥ ధాత్రీధరాత్మజ క్షేత్రాత్మయనఁగఁ దీక్షాత్మయనఁగ నమూ
ర్త్యాత్మయనఁగఁ । త్రివిధమూర్తులు దాల్చి దీపించునతఁడు మూన్నెలవులయెడఁ బూజనీ
యుఁడగుటఁ । గంబళ కౌశేయ కలధౌత కాంచన గంధసింధుర తురంగమ శతాంగ । కర్ణి
కాగ్రైవేయ కటక కన్యా గంధ కాశ్మీర కస్తూరికా గవాజ్య । ధాన్యదానాది బహుపదా
ర్థంబుల వటుఁ । బెద్దలకు వేదవిదులకుఁ బ్రీతినొసఁగ । క్షేత్రమయమూర్తి యగు దేవకీ
సుతునకుఁ । బాండురంగాధిపతికిని బ్రమద మొదవు ॥ ౧౦౪ ॥ ఉ ॥ చేడియ తీర్థమూర్తి
కడఁ జేయఁదగున్ మనుజుండు సేచనా । క్రీడనముల్ మహీదివిజకేసరులన్ బరమాన్న
శర్కరా । పాడబగోఘృతేక్షురసశాకములన్ ఫలపానకాదులన్ । వీడెములన్ బ్రమో
దపదవీమదలిప్సఁ జెలంగఁ జేయుచున్ ॥ ౧౦౫ ॥ క ॥ ప్రణుతమతి నర్ఘ్యపూజా । ర్పణ
మునఁ దత్తీర్థమూర్తి భజియించు సుధీ । మణులకు నభిముఖమతిబ । ర్హిణబర్హాకల్పుఁ
డొసఁగు నిహాముంబరమున్ ॥ ౧౦౬ ॥ వ ॥ అని మూర్త్యర్చనావిధానకథనోన్ముఖుం
డై పంచముఖుండు శిఖరినందనతో నిట్లనియె ॥ ౧౦౭ ॥ సీ ॥ మంత్రపూతము గాఁగ మజ్జ
నంబొనరించి ప్రసన్ననిశుభ్రాంబరములుగట్టి । ఘనసారమిశ్రితగంధసారములందిపరి
మళంబుడివోని విరులుముడిచి । సిగరలతోడ గోక్షీరపూరముతోడ బహువిధంబగుఫల
ప్రతతితోడ । పిండివంటలతోడ ఖండశర్కరతోడ నేతులతోడ జేనియలతోడ । దధు
లతోఁగూడఁ దగు నివేదనలతోడ । వనధివనధాముఁ బీతాంబరునిరమాకు । చరజవినిలి
ప్తుశిఖిబర్హధరుని మఖాంశభోక్తఁ బూజింపఁదగుఁ జైత్రమున శుభాంగి ॥ ౧౦౮ ॥ సీ ॥
గంగఁగా బుకకొండగప్పనొప్పిదముడల్గ్రొత్తనావులపాల నోలలార్చి । బలితంపుసు

---

బాధచేత. తుల్లకాధిక్యమున్ = ఆయల్పునిదైన హెచ్చువు. వ్యదునరంభముతోన్ = కొంచెపు త్వరతో. నవ్వుచున్ = ఎగతాళిచేయుచు. తున్మెన్ = చంపెను ॥ ౧౦౩ ॥ ధాత్రీధరాత్మజ = ఓ పార్వతీ. దీపించున్ = ప్రకాశించును. మూన్నెలవులయెడన్ = మూడుస్థానములయందు. కౌశేయ = పట్టు. కలధౌత = వెండి. గంధసింధుర = మదపుటేనుఁగు. శతాంగ = రథము. కర్ణిక = చెవికమ్మ. గ్రైవేయ = మెడలోధరించెడియాభరణము. కటక = కడియము. గవాజ్య = ఆవునెయ్యి. దాన = ఇచ్చుట. ప్రమదము = సంతోషము. ఒదవున్ = కలుగును ॥ ౧౦౪ ॥ సేచనాక్రీడనములు = జలకమాడుటలు. కేసరులన్ = శ్రేష్ఠులను. పాడబ = ఆఱురసములతోఁగూడినపదార్థములు. ఇక్షు = చెఱకు. శాకములన్ = కూరలచేతను. ప్రమోదపదవీమదలిప్స = సంతోషమార్గముచేతమత్తుకొనునట్టి ఇచ్ఛ. చెలంగన్ = అతిశయింప ॥ ౧౦౫ ॥ బర్హిణబర్హాకల్పుఁడు = నెమలికుంచెయలంకారముగాఁగలవాఁడు = కృష్ణుఁడు ॥ ౧౦౬ ॥ ౧౦౭ ॥ ప్రసన్ని = మనోజ్ఞమయిన. గంధసారము = మంచిగంధము. డివోని = తగ్గని. సిగర = తాలింపుచేసిన మజ్జిగ. పూరము = ప్రవాహము. వనధివనధామున్ = సముద్రజలము ఉనికిపట్టగువానిని. రమాకుచరజవినిలిప్తునిన్ = లక్ష్మీదేవి చన్నులమీఁది గందపుకొఱుపులచేత పూయఁబడినవానిని. శిఖిబర్హధరున్ = నెమలికుంచెను ధరించినవానిని. మఖాంశభోక్తన్ = యజ్ఞభాగమును భుజించువానిని ॥ ౧౦౮ ॥ ఓలలార్చి = అభిషేకముచేసి. ధార్తరాష్ట్రములన్ = నల్లని ముక్కుకాళ్లుగలహంసను. ముక్తికన్ = సముద్రమును. కమిచి = కన్ని. శాద్వలము హి

రుపుజొంపముధార్తరాష్ట్రంబుఁజుట్టినక్రియ తెల్లపట్టుగట్టి। ముదురువెన్నెలయొప్పు మున్నీటిఁగమిచిపట్టినలీల గ్రాలఁజందనముఁబూసి। వడగండ్లుపొదువు శాద్వలమహిఁ బొల్చుపొల్పుగమల్లెపువ్వులఁబూజచేసి। మందువేసవి వాసవిమనువుకాపు। విబుధతతి పాలివీడరవెల్లమ్రాఁకు। భక్తసులభునిఁదెలిచిభూరోర్వ్యుక్తభూరి। భక్ష్యభోజ్యాదుల ర్పింపభద్రమొదవు ॥ ౧౦౯ ॥ సీ ॥ వృష్టిగా శుద్ధాంబువేణిమజ్జనమార్చి శిఖరి మేఘముగమంజిటిఘటించి। కరకపాతంబుగా విరిగొజ్జఁగలఁబూన్చిక్షమపంకిలతగఁ గుంకుమముఁబూసి। మఘవగోపములుగా మణిహారమర్పించి పలుమెఱుంగులుగ దీపములెత్తి। గర్జితంబులుగ శంఖశ్వాణములుచూపి పచ్చికగాధూపపటలిఁబనిచి। యుర్విబంటులభుక్తిగానుష్ణతైల। పక్వగుడమిశ్రపిష్టసూపపరమాన్న। రాసులొసఁగం గఁదగుఁగారు రాకహరికి। నట్టిఋతుధర్మములు చూపు చందమొంద ॥ ౧౧౦ ॥

సీ ॥ మహినాలపాఁడి ముమ్మరముగాఁ బ్రభవింప నవనవోజ్జ్వలదధిస్నానవిధియు । శుభ్రాభ్రపట్టంబు లభ్రంబుపైఁబర్వఁగలధౌతవిమలచేలములకప్పు। సితకుశేశయ కాశ శశధరద్యుతి హెచ్చ దొరకినయుచితంపువిరులపూజ। శాలిపాకస్ఫూర్తి గ్రాలగోరోచనాసంమిశ్రచర్చిక్యసంఘటనము । వ్రజభుజభుజుల భోజనావలుల వంట । కములు గావింప గోధూమఖండఖండ। శర్కరాఢ్య సుపక్వ భోజ్యములు నెఱపి । విష్ణుఁ బూజింపఁ దగు శరద్వేళయందు ॥ ౧౧౧ ॥ సీ ॥ పాథోధి విహృతి సంభవ తనూజాడ్యంబు సంతప్త గోఘృత స్నపన రచనఁ । దులసిదండయు కాని కలుగనితక్కువ మరువక కుంద కుట్మల సమృద్ధిఁ । గఠినకర్చ్చురపీతకౌశేయ

---

=పచ్చికనేల. వీడరవెల్లమ్రాఁకు=ముంగిటనుండెడి కల్పవృక్షము. తెలచి=మ్రొక్కి. భూరి= అధికమైన. భద్రము=మేలు ॥ ౧౦౯ ॥ శుద్ధాంబువేణిన్ = తేటనీటిధారచేత. మజ్జనమార్చి=స్నానముచేయించి. మంజిటి=పీతాంబరము. కరకపాతంబుగాన్=వడగండ్లుపడుటగా. విరిగొజ్జఁగలన్=విరిసినగొజ్జంగిపూవులను. క్షమపంకిలతగన్=నేలబురదగా. మఘవగోపములు=పట్టుపురుగులు. శ్వాణములు=ధ్వనులు. ఉష్ణతైలపక్వగుడమిశ్రసూప= కాఁగిననూనెలోవండఁబడిన బెల్లముకలిసినపిండివంటలు పప్పు. కారు=వర్షాకాలము ॥ ౧౧౦ ॥ ముమ్మరముగాన్= అధికముగా. నవనవోజ్జ్వల= మిక్కిలిక్రొత్తదై ప్రకాశించునట్టి. శుభ్రాభ్రపట్టంబులు= తెల్లనిమేఘములనెడిపట్టువస్త్రములు. లఘు= తేలికైన. ధౌత=మడుఁగైన. సితకుశేశయ... ద్యుతి= తెల్లదామరలయు రెల్లుపువ్వులయు చందమామయు కాంతి. శాలిపాకస్ఫూర్తి=వరిపంటయొక్కప్రకాశము. చర్చిక్య=పచ్చగంధపుపూఁత. వ్రజభుజభుజుల=గొల్లవారిభోజనమునుభుజించువారియొక్క. వంటకములు=అన్నములు. గోధూమఖండ= గోదుమనూక. ఆఢ్య=కలిగిన. పక్వభోజ్యములు=వండఁబడినభుజించువస్తువులు. శరద్వేళ= శరత్కాలము ॥౧౧౧॥ పాథోధివిహృతి=సముద్రమునందలివిహారము. జాడ్యంబు=జడత్వము. సంతప్త=కాఁగిన. స్నపనరచనన్ =స్నానముచేయించుటచేతను. కుందకుట్మల= మొల్లమొగ్గలయొక్క. కర్చ్చుర=ముఱికియైన. పీతకౌశేయనిర్బంధము= పచ్చపట్టుకట్టు. చిత్ర=నానావర్ణమయిన. ముదురువెన్నెలన్=పూర్ణచంద్రునికిరణములచేత— అమృతముచేత. నవ్య= క్రొత్తయై. దివ్య=మనోజ్ఞమయిన. ఉజ్జగింపించి=విడిపించి. డెందానకున్=మనస్సునకు. ఉబ్బు= సంతోష

నిర్బంధ మభిరామచిత్రాంబ రార్పణమున । ముదురువెన్నెలఁ జేయు నుదరపోషణ
వృత్తి నన్యాదివ్యాన్నపానప్రశస్తి । నుజ్జగింపించి డెందానకుబ్బొనర్చి । నిశలఁ గుం
కుమమగులు మైనిండ నలఁది । గేహమున ధూపధూమ మెక్కించి కుధర । ధరుని హేమాసం
తమునఁ గొల్వ దొరకు ముక్తి ॥ ౧౧౨ ॥ క ॥ శిశిరాగమవాసరముల । యశోదగారా
బుపట్టి నర్చింపఁదగున్ । శశిముఖి తత్కాలోచిత । కుశకుసుమపటాంగరాగకూర్పా
సాదిన్ ॥ ౧౧౩ ॥ క ॥ ఋతువుల నాటి సత్క్రియఁ । బ్రతిదినము భజింపఁ బరమపద
నాథుఁడు వాం । ఛితశతము లొసఁగి భక్త । ప్రతతుల మన్నించు భక్తపరతంత్రుండై ॥
౧౧౪ ॥ తే ॥ మురవిభంజను శ్రీక్షేత్రమూర్తిఁ దీర్థ । మూర్తిమూర్తులకడ నేమమున
నొనర్చు । నర్చభాగవిశేషంబు లానుపూర్వి । వినుము వినిపింతుఁ బరమాణువిభవ
మధ్య ॥ ౧౧౫ ॥ తే ॥ పరమపదనాథుఁ డిరిగిరానిరువదేను । చేతులప్రమాణమునఁ
గల్గుభూతలంబు । ముక్తికరిదైన శ్రీక్షేత్రమూర్తియందు । నర్చభాగంబు సుమ్ము
చంద్రార్ధనిటల ॥ ౧౧౬ ॥ క ॥ సకలోత్కృష్టోన్నతిఁ బా । యక యెయ్యది కీర్తి వడయు
సత్తీర్థము పొల్తుక యర్చాభాగంబై । యకుటిలగతిఁ దీర్థమూర్తియందు వెలుంగున్ ॥
౧౧౭ ॥ క ॥ ఏ నేల మూర్తియందర్చానియమవిభాగముఁ బ్రశస్తంబగు నా । స్థానము
నర్చింపక యె । వ్వానికిఁ దాఁ జేయుపూజ వమ్మగుఁ జుమ్మీ ॥ ౧౧౮ ॥ వ ॥ కావున క్షేత్ర
మూర్తి తీర్థమూర్తి మూర్తిమూర్తులయందలి యర్చాభాగంబులెఱింగి యర్చించుచు
ననుచితాచరణవిముఖుండగు పుణ్యనిధికి సుముఖుండై పాండురంగం డఖండానందం
బాపాదించునని యాపరమేశ్వరుండు పార్వతితో వెండియు నిట్లనియె ॥ ౧౧౯ ॥ మ ॥
హరిపశ్చాద్దిశ నూఱువిండులప్రమాణాసక్తి కల్మిన్ శుభో । త్కరపద్మంబగు పద్మతీ
ర్థమునం దీర్థంబొప్పు నచ్చోన సు । స్థిరతన్ శంఖము పద్మమున్ నిధులు వర్తించుం దపో
దీపితుల్ । నరనారాయణులున్న వారచట బాలాపిప్పలాకారులై ॥ ౧౨౦ ॥ సీ ॥ సమ
ధికజ్ఞానవిభ్రమముతోఁ గూడంగ హరి మేననవతారమైనవారు । మదముపోవఁగనిం
డు మనసుతోఁ గూడంగ బ్రహ్మచర్యము చిక్కఁబట్టువారు । పరపురుషార్థసంపదతో
డఁ గూడంగ ధనురాదిశస్త్రముల్దాల్చువారు । దుష్టనిగ్రహవిధాధురతోడఁ గూడంగఁ
బూర్ణాకృతోన్నతిఁ బూనువారు । మహితగాంభీర్యధైర్యసామగ్రితోడఁ । గూడ నౌ

---

ము. నిశలన్ = రాత్రులందు. అగులు = అగరుగంధము. ఎక్కించి = అతిశయింపఁజేసి. కుధర
ధరునిన్ = విష్ణుమూర్తిని ॥ ౧౧౨ ॥ పటాంగరాగకూర్పాసాదిన్ = వస్త్రములు గంధపుపూఁతలు
కుబుసములు (అరచొక్కాలు) మొదలగువానిచేత ॥ ౧౧౩ ॥ ౧౧౪ ॥ ఆనుపూర్విన్ = మొదటనుం
డి క్రమముగా ॥ ౧౧౫ ॥ కరి = సాక్షి. అర్చభాగంబు = పూజించుభాగము. నిటల = నొసలుగల
దానా ॥ ౧౧౬ ॥ నేల = చోటు. వమ్ము = వ్యర్థము ॥ ౧౧౭ ॥ ౧౧౮ ॥ ఆపాదించున్ = కలిగిం
చును ॥ ౧౧౯ ॥ శుభోత్కరపద్మంబు = శుభసమూహములనెడి పద్మములుగలది. పిప్పలాకారులు =
రావిచెట్టురూపము నొందినవారు ॥ ౧౨౦ ॥ విభ్రమముతోన్ = విలాసముతో. చిక్కఁబట్టు = ప
రిగ్రహించు. దుష్టనిగ్రహవిధాధురతోడన్ = దుష్టులను శిక్షించుటయను భారముతో. సౌజన్యరమన్

జన్యరమఁగూడియాడువారు । ఘనప్రతిబింబనిభులు సహస్రకవచ । కవచనిర్భేద
నులువారు ధవళనయన ॥ ౧౨౧ ॥ క ॥ పట్టునఁజూపట్టుదు । రాపట్టున మూఁడుకో
టులమరాంగనల । ష్టాపదపాత్రనిహితమణి । దీపకళికలగుచుఁ శ్రీపతింబూజింతుర్ ॥
౧౨౨ ॥ ఉ ॥ దోశ్శమితారి శౌరి తనతోడ్వినకుండలముల్ నిజక్షమాం । తశ్శిలలోన
డాఁపఁ బ్రమదా యొకతీర్థము కుండలాఖ్యమై । దుశ్శకునాదిసంజనిత దోషశతంబు
హతంబు సేయునం। భశ్శుచితన్ బ్రసిద్ధమగుఁబన్నగశాయికినీశుదిక్కునన్ ॥ ౧౨౩ ॥
క ॥ వరసింహమధ్య యచ్చో । నరసింహుఁడు కుంజరాశనతఁదాల్చుటన । చ్చేరు
వ దేవుఁడు నిజమం । త్రరాజపూజైకతానతాయుతుఁ బ్రోచున్ ॥ ౧౨౪ ॥ క ॥ ఓరా
జవదనయచటన । నీరాజనలజ్జనాభునికినీనున్నా । రేరాళముహరివల్లభ । లారా
ములఁగొల్వవలయునయకాములకున్ ॥ ౧౨౫ ॥ శా ॥ అంశేందూద్వహదేవిహ్రీం
కృతిధ్రువంబై యున్నయచ్చోటకిన్ । త్రింశచ్చాపమితోర్వినుత్తరమునందీపించుతీర్థం
బుమున్ । భ్రింశంబొందకవెన్కఁదత్సలిలధారంగూడెఁబుష్పావళీ । సంశుద్ధాంబు
వులారొడందగుజపస్నానార్ఘ్యదానక్రియల్ ॥ ౧౨౬ ॥ సీ ॥ భరమానుతఁటేఁదోడు
పడవచ్చు గతిఁదేవితోఁ గరమూలజద్యుతులసాఁగ । నెలకులంబులచల్వ నేర్చునవా
ర్కాంశు లనఁ గపోలములదీపాంశులంటఁ । గోడిఁబుట్టుకాళిమాంకురవు మేఘములకు
మెఱుఁగులై చూపుఁ గ్రొమ్మించులలర । స్నేహంబుపాత్రనిక్షిప్తమాటకునుబ్బుపగిది
పాలిండ్లునిబ్బరమునికర । హరికిఁబలువంకలనుదగనగ్రవీధి । నిలిచిశతకోటిసంఖ్య
ల నియమపరత । నారతులొసంగు దివ్యకన్యకలుధన్య । మతులుగ్రీడింతురయ్యుత్తమ

---

=మంచితనపు కలిమిని. ఘనప్రతిబింబనిభులు = సూర్యబింబమును బోలిన వారు. నిర్భేదనులు=
చక్కఁగా భేదించువారు ॥ ౧౨౧ ॥ పట్టు=స్థానము. చూపట్టుదురు=కనఁబడుదురు. అష్టాపద
పాత్రనిహిత= బంగారుపళ్లెరములందుంచఁబడిన ॥ ౧౨౨ ॥ దోశ్శమితారి=భుజములచేత అణఁ
పఁబడిన శత్రువులుగలవాఁడు. నిజక్షమాంతశ్శిలలోన్ = తనభూమిలోనిరాతియందు. అంభశ్శుచి
తన్ = నీటిపరిశుద్ధతచేత. ఈశుదిక్కునన్ = ఈశాన్యపు దిక్కునందు ॥ ౧౨౩ ॥ కుంజరాశన
తన్=అశ్వత్థత్వముచేత. ఏకతానతా=ఇతరవిషయములందుబుద్ధినిచొరనియ్యకుండుట= ఏకా
గ్రత ॥ ౧౨౪ ॥ నీరాజనలు= ఆరతులు. ఏరాళము= లెక్కలేనివారు. అయకాములకున్=
మేలుకలిమినికోరువారికి ॥ ౧౨౫ ॥ అంశేందూద్వహా = కళామాత్రమయిన చంద్రునివహించిన.
హ్రీంకృతిన్=హ్రీంకారముచేత. ధ్రువంబై=శాశ్వతమై. త్రింశచ్చాపమితోర్విన్=ముప్పదివిం
డ్లపట్టుకొలఁది నేలను. పుష్పావలీసంశుద్ధాంబువులు=పువ్వులనముదాయముచేత పరిశుద్ధమయినజ
లములు ॥ ౧౨౬ ॥ భరము=బరువు. తోన్=వెంబడిని. కరమూలజద్యుతులన్=చంకలనిగనిగనివె
లుఁగులతో. సాఁగన్=నడచిరాఁగా. నెలకులంబుల=చంద్రసమూహములయొక్క. చల్వ=చల్లఁ
దనమును. నవార్కాంశులు= క్రొత్త (ఉదయకాలమునందలి) సూర్యకిరణములు. కపోలము
లన్= చెక్కిళ్లయందు. కోడిన్=దీపపుశిఖయందు. కాళిమాంకురవు=నల్లఁదనపుమొలకలనెడి.
మెఱుఁగులై= మెఱపులై. క్రొమ్మించులు=క్రొత్తమెఱపులు. అలరన్=ప్రకాశింపఁగా. స్నేహం
బు=మైత్రి; నూనె. పాత్రము = యోగ్యము; గిన్నెమొదలగునది. నిక్షిప్తము = ఉంచఁబడినది.

స్థలమున ॥ ౧౨౭ ॥ ఉ ॥ గోపికతొల్లి మోర్త హరిఁగూర్చి తపంబొనరింపఁ దానిన్
బ్రాపరతన్ మదింగరఁగి శార్ఙ్గి యుఁదోఁచినఁ జూచి వేడ్కతో । నాపసిఁగాపుఁ బూవప
యసా కెఁద్రిలోకవిమోహనక్రియా । రోపనిరూపణంబగు సరోరుహలోచను రూ
పుఁ జూచుచున్ ॥ ౧౨౮ ॥ తే ॥ వైషమేషవవిషమేషుశోషణమున । వేషమొకరీ
తిగా నిర్నిమేషనయన । యగుచు నెరగొంటఁ గదలని పొగరుమీను । దోయిఁ జూపట్టు
సప్తసింధువును బోలె ॥ ౧౨౯ ॥ తే ॥ క్లేశపాశంబుతోఁ గూడఁ గేశపాశ । మురుల
బర్హావతంసుండు కరుణనిచ్చు । నీవి యొలుఁగక యొక్కింత నీవి జాఱఁ । దచ్చరణము
లుమది నంటమచ్చెకంటి ॥ ౧౩౦ ॥ సీ ॥ ఊరకుండినఁ జూచి యొక్కింత నగి కృష్ణుఁ డిది
యేమి నీవన్న నిందువదన । కుంచితావయవభంగురవృత్తిఁ దత్పాదబిసరుహంబులు
కేలబిగియఁబట్టి । మచ్చిత్తహరములు మధువైరి నీపాదవనరుహంబులు వీని వదలఁ జా
ల । వీనిలావణ్యమీ వేషభూషణముగ నాకస్మికార్థితంబగుట నడుగుఁ । గవయిది స
లాంఛనంబగుఁ గాతయనుడు । నట్లయగుఁ గాక సర్వంబు నతివ నీవ । నంబరవు ముక్త
కేశివి నఖిలభూష । కాంచితాంగివినై యుండుమని యొ శౌరి ॥ ౧౩౧ ॥ ఆ ॥ అదియు
నట్లయగుచు నభిరామమూర్తియై । తనపసిండిజడలు దలఁగ ద్రోచి । యానతార్ధమూ
ర్తియై తేత్రమునకునీ । శాన్యమున వసించు చంద్రవదన ॥ ౧౩౨ ॥ క ॥ ఆమహనీయక్షేత్రశి ।
ఖామణి పైఁబిదపఁ బర్వేఁగా మిని నినానా । భూములను నిగిడి మదగజ । భైమి బహుళలహ
రిగహనభయదాకృతియై ॥ ౧౩౩ ॥ సీ ॥ జడధి చల్లిన గంధవృడి నేత్రములఁ బడ్డగతిఁ దామ
రలపరాగంబు గ్రమ్మ । తదితరక్షేత్రముల్ తమయందు నిలుమన్న నొడ్డించుటలు వాోలె
నూర్మ్యలెసఁగఁ । బంకదంభమునఁ బాపములఁ బ్రమింగిన నీటి పెద్దనవ్వలలీల ఫేనమలరఁ । బెర

ఉబ్బు=సంతోషించు—ఉబుకు. పాలిండ్లు=స్తనములు. నిబ్బరము=మిక్కిలి. అగ్రవీధిన్=ఎదు
టను ॥ ౧౨౭ ॥ ఓర్తు=ఒకతె. తోఁచినన్=ప్రత్యక్షముకాఁగా. ఆపసిఁగాపుఁబూవవయసాకె=
ఆగొల్లపడుచు ॥ ౧౨౮ ॥ వైష...మునన్—వైషమేషవ=మన్మథునియొక్క. విషమేషు=బేసి
బాణములవలని. శోషణమునన్=చిక్కుటచేత. నిర్నిమేషనయన=రెప్పపాట్లులేనికన్నులుగలది.
ఎరగొంటన్=ఆహారమును తీసికొనుటచేత. పొగరుమీనుదోయిన్=మత్తుగొన్న చేపలజంటతో.
సప్తసింధువున్=ఏడవసముద్రమును—శుద్ధోదకసముద్రముచు ॥ ౧౨౯ ॥ క్లేశపాశంబుతోన్=తె
వస్సువలని క్రమము నెడి త్రాటితో. కేశపాశము=వెండ్రుకలముడి. ఉరులన్=జాఱఁగా. బర్హావతం
సుండు=కృష్ణుఁడు. ఈవి=దానమును—కోరికను. నీవి=పోఁకముడి. తచ్చరణములు=ఆకృష్ణుని
పాదములు ॥ ౧౩౦ ॥ కుంచితావయవభంగురవృత్తిన్=వంపఁబడిన అవయవములయొక్క వంకర
తోడి వ్యాపారముతో. బిసరుహంబులు=కమలములను. ఆకస్మికార్థితంబు=ఉన్నట్టుండి కోరఁబడినది.
అడుగుఁగవయిది=ఈపాదములజంట. సలాంఛనంబు=గుఱుతుతోఁ గూడినది. అనంబరవు=వస్త్ర
ములేనిదానవు. ముక్తకేశివి=ముడివీడిన వెండ్రుకలు కలదానవు. అంచిత=ఒప్పిదమయిన ॥ ౧౩౧ ॥
౧౩౨ ॥ జడధి=సముద్రము. వరాగంబు=పుప్పొడి. ఒడ్డించుటలు=చాఁగించుటలు. ఊర్మ్యలు=
అలలు. దంభమునన్=నెపముచేత. లీలన్=విధమున. పెరవాహినులమీఁదన్=ఇతరనదులమీఁద.
మత్సర=ఈర్ష్యయొక్క. గ్రాహవికృతులు=ప్రాణిహింసచేయు మత్స్యములవికారములు. అడరన్

వాహినులమీఁదఁబెరిగినమత్సరావేశంబులనగ్రాహవిక్రృతులడర| భానుభూమైకజని
భూమిభైమినడచి| యమ్మహాక్షేత్రమటడాసియధికభీతిఁ| జొరకగిరిరుద్ధగతియైనకర
ణీఘూర్ణ| నంబునొందుచుఁ శ్రీజగన్నాథుఁ డెటఁగి‖౧౩౪‖ఉ‖ పటిగుటించిపల్కు వినుమే
టికిసీభయమోశుభాంగిరొ| ఎప్పాటభవత్సమానమగుపాటిసరిన్నికరంబులేదువాః|
పాటవమొప్పమత్పదముపైఁబ్రవహింపుమదాజ్ఞనన్నన| చ్చోటసపాటమైకడలిజోటి
యుఁగొల్చెనిజప్రవాహమున్‖౧౩౫‖ తే‖ క్షేత్రమునభైమినిల్చిపొల్చినప్రదేశ| మునజ
నాభీష్టదమనాద్యమునుజతుర్ము|ఖాదిసేవ్యంబునగునృసింహాఖ్యతీర్థ| మమరుత్రింశద్ధనుః
ప్రమాణమునమెఱసి‖౧౩౬‖సీ‖ ఉక్కు-ఁగంబమువ్రచ్చియుదయించె నే దేవుఁడరణిను
ద్భవమొందునగ్నికరణి| వాలారుగోరుమేల్ గాలముచేసె నే జేజె హిరణ్యాసుశిశు
కమునకు| భక్తివృద్ధుఁడుగాఁగఁ బాటించె నే వేల్పు ప్రహ్లాదుఁగడుఁ బాలపడ్డ నాడు| నిజ
సింహతఁ దగసుజనహృద్గుహలందుఁ గ్రీడించె నే త్రిలోకీనియంత| యానృహర్యక్షువ
ర్యుండుయత్నుపక్షి| ఖచరగంధర్వకిన్నరగ్రామణీశి| రోమణీఘృష్టిచరణసరోజుఁడం
దు| నుండుముప్పదిరెండుబాహులనుగలిగి‖౧౩౭‖శా‖ ఆకుంభప్రభవుండొకానొకత
పంబత్యుగ్రతం జేసిము| న్నోన్నకుంభస్తనియాజలాంతరమునందుస్పంగ నేదివ్యలిం|గా
కారంబుననిల్చెనట్టిదెయగస్త్యాఖ్యాకతీర్థంబుత| ద్వ్యక్కోచాకృతిసప్తసప్తి కరా
యామావృతిన్ జెన్నగున్‖౧౩౮‖ మ‖ నవనీతప్రియుఁగొల్చిపిష్ణుపతితన్మంత్రాంగ
తంబాల్చియేమి| యవధింబొనిగణాధిపత్యపదవిం బ్రాపించియద్దానిచెం| తవసింపంగఁ
దబాహ్వయంబునన గాణాపత్యమాసత్త్రితీ| ర్థవతంసంబు నగస్త్యతీర్థమునకాద్యం
బంద్రుపిద్యాధికుల్‖౧౩౯‖ సీ‖ నగపుత్రియట్టి గాణాపత్యతీర్థంబునకుఁ బూర్వమైమ
జ్జనంబొనర్చు| వారికిమరివారివారికినపవర్గవర్గంబునీఁజాలువారిగలిగి| యచటసంక

---

=అతిశయింపఁగా. భానుభూమైకజనిభూమి=సూర్యునియొక్క (లేక) ప్రకాశములయొక్క ఆధిక్యమునకుముఖ్యమయిన జన్మస్థానము. భైమి=భైమీనది. డాసి=సమీపించి. గిరిరుద్ధగతి=కొండచేత అడ్డగింపఁబడినగమనముగలది. ఘూర్ణనంబున్= తిరుగుడుఁబాటును. ఒందుచున్= పొందఁగా ‖ ౧౩౪ ‖ ఎప్పాటన్= వివిధముచేతను. సరిన్నికరంబు=నదీసమూహము. వాఃపాటవము=జలసమృద్ధి. సపాటము=మట్టము. కడలిజోటి=ఏఱు. కొల్చెన్=వ్యాపింపఁజేసెను ‖ ౧౩౫ ‖ పొల్చిన= ఉన్న. జనాభీష్టదము=జనులకోరికలనిచ్చునది. త్రింశద్ధనుఃప్రమాణమునన్=ముప్పదివిండ్లపట్టు కొలఁదిని ‖ ౧౩౬ ‖ వ్రచ్చి=పగుల్చుకొని. అరణిన్=నిప్పుత్రచ్చెడుసాధనమునందు. వాలారుగోరు=వాఁడిమొనచే అతిశయించినగోటిని. జేజే=దేవుఁడు. హిరణ్యాసుశిశుకమునకు =హిరణ్యాక్షుని ప్రాణమనెడియలుచమీనునకు. త్రిలోకీనియంత. మూడులోకములసముదాయమునునియమించువాఁడు. నృహర్యక్షువర్యుండు=నృసింహోత్తముఁడు. గ్రామణీ=శ్రేష్ఠులయొక్క. ఘృష్టి= వెలుఁగులుగల‖ ౧౩౭ ‖ కుంభప్రభవుఁడు=అగస్త్యుఁడు. తద్వ్యక్కోచాకృతి=దానివికాసతోడియాకారము. సప్తసప్తికరాయామావృతిన్= డెబ్బదియేడుచేతులవిరివిగల యావరణముత. చెన్నగున్= అందగించును ‖ ౧౩౮ ‖ నవనీతప్రియున్= కృష్ణమూర్తిని. అవధిన్= [illegible]ను. ప్రాపించి=పొంది‖ ౧౩౯ ‖ పూర్వము=తూర్పు. అపవర్గంబు=మోక్షము. త్రివిష్టపమైన్

ర్షణాహ్వయతీర్థరాజంబు వెలయునచ్చోమున్నుహలధరుండు । తీర్థయాత్రయొనర్చు
త్రిప్పటమైవచ్చియవగాహవేళఁ బ్రత్యక్షుమైన । పాండురంగాధిపతికృపవడసితద్ద్వా
రాప్తినిజనామము తీర్థమధిగమింపఁ । జేసి కార్తార్థ్యమునఁ బొందె శ్రీసఖుండు । సం
దియఁ దన్తర్హితుండయ్యె నద్భుతముగ॥ ౧౮౦॥ శా॥ ఆసంకర్షణతీర్థరాజమునకాద్యం
బై నమద్వేదని। శ్యావసంబై తనదైర్ఘ్యమంతయును బంచాశద్ధనుర్మేయమై। భాసిల్లెన్
నిజవారిమజ్జదఖిలప్రాణీప్సితత్యాగదీ । క్షాసన్నద్ధమనం బ్రసిద్ధినడయన్ జ్ఞాబాలితీ
ర్థంబిలన్॥ ౧౮౧॥ క॥ ఆ తీర్థమునంతరమున। వృత్తస్తని బ్రహ్మతీర్థవిభుపభినుతసం।
పత్తివిలసిల్లు శతదో । ర్వ్యృత్తాకృతి కాంతదానివృత్తంబెల్లన్॥ ౧౮౨॥ క॥ అందువ
సియించుయనుకుల । నందనసేనావిధాననందన్మతియై । కుందవిశదరదనః శతా । నం
దుఁడువాణీవధూసనాథుండగుచున్॥ ౧౮౩॥ తే॥ బ్రహ్మతీర్థంబునకుదండపాణియా
శ । కులశిఖరిపుత్రిదీపించుఁగలశతీర్థ । మేను బారలనిమపునదీనుమిగిలి । యదియుయ
మ్యతామహాదేవికాస్పదంబు ॥ ౧౮౪ ॥ తే॥ బ్రహ్మతీర్థంబుగలశతీర్థంబుఁబొగడ।
నేరరెవ్వారుచంద్రికాగౌరమయ్యుఁ । దత్పరోధరముక్తినిధానమునకు । నంజనచ్ఛా
యమైతోఁచుటద్భుతంబు ॥ ౧౮౫ ॥ ఉ॥ తామరపాణియందునకు దక్షిణదిక్కున స
ప్తదోర్మితా । యామమయాతయామగుణమైయొసఁగున్ బితృతీర్థమచ్చటన్ । దానొ
నరించుదానములుఁ దానములున్ గయఁజేయు సత్క్రియా । స్తోమములై పితృప్రియముఁ
జొన్పుసుఖింపుదురెల్లవారలున్ ॥ ౧౮౬ ॥ ఉ॥ దానికి దక్షిణాశ వసుధాధరనంద
నయొప్పు బ్రహ్మవి । ద్యానిధి సేవితంబు నవహస్తమితంబగు చక్రతీర్థమ । చ్చోనలవోక
యుంబలెవిశుద్ధజలంబులఁ గ్రుంకి మాధవ । ధ్యానము సేయుమానులకు నత్రము లేయపవ
ర్గదుర్గముల్ ॥ ౧౮౭॥ క॥ చక్రస్తని తజ్జలములఁ । జక్రాలంకృతశిలానిచయముదయిం
చున్ । శక్రముఖాఖిలమఘభుక్ । చ్చక్రము గొనియాడుఁ దత్ప్రశస్తగుణంబుల్ ॥ ౧౮౮॥ శా॥

---

త్రిప్పటతో. అవగాహ= స్నానముచేసెడి. తద్ద్వారాప్తిన్= ఆయనవలనివరకును పొందుటచేత. అధిగమింపన్=పొంద. కార్తార్థ్యమునఁబొందెన్= కృతార్థత్వమును పొందెను. అంతర్హితుండు = అంతర్ధానమునొందినవాఁడు ॥ ౧౮౦ ॥ దైర్ఘ్యము=నిడివి. పంచాశద్ధనుర్మేయము= ఏఁబది విండ్లపట్టుకొలఁదిగలది. మజ్జత్= స్నానముచేయుచున్న. ఈప్సిత=కోరికలను. దీక్షాసన్నద్ధము= నియమముచేతసిద్ధపడినది ॥ ౧౮౧ ॥ అంతరమునన్=నడుమ. శతదోర్వ్యృత్తాకృతి=నూఱుచేతుల మేరగుండ్రని యాకారము. వృత్తము= ఉనికి ॥ ౧౮౨ ॥ నందన్మతి= సంతోషించుచున్న బుద్ధిగల వాఁడు. కుందవిశదరదన=మొల్లమొగ్గలవలెస్వచ్ఛమైనపలు (వరుస) గలదానా. శతానందుఁడు =బ్రహ్మ. సనాథుండు=కూడినవాఁడు ॥ ౧౮౩ ॥ దండపాణియాశ= దక్షిణదిక్కు. కులశిఖరి పుత్రి=కులపర్వతముకూఁతురా. దీపించున్=ప్రకాశించును. దీను=మనోజ్ఞత ॥ ౧౮౪ ॥ చం ద్రికాగౌరము=వెన్నెలవంటి తెలుపుగలది. అంజనచ్ఛాయ=కాటుకవన్నె ॥ ౧౮౫ ॥ సప్తదో ర్మితాయామము= ఏడుచేతులకొలఁదినిడివిగలది. అయాతయామ= విడువఁబడని. తానములు= స్నానములు॥ ౧౮౬ ॥ ఆశన్=దిక్కునందు. అలవోకయుంబలె=స్వేచ్ఛగా. అత్రము=వింత. అపవర్గదుర్గములు=మోక్షమనెడిపొందరానికోటలు॥ ౧౮౭ ॥ మఘభుక్చక్రము=దేవతానమూహ

ఆతీర్థంబునకుం గృతాంతదిశ నాద్యంబౌ త్రివైద్యంబుల। క్ష్మీతీర్థంబన నొక్కతీర్థము
ప్రకాశించున్ రమాదేవి పీ। తాతంకస్థితి నచ్చటం దపము సేయన్ నేర్చి కాతొల్లి యా।
దైతేయారిభుజాంతరాళమణిసౌధం బెక్కెఁ బెన్నక్కవన్ ॥ ౧౪౯ ॥ సీ ॥ ధూతాఘ
మైన లక్ష్మీతీర్థమునకు దక్షిణమునఁ గౌమోదకీయును బద్మ। మును శంఖమును జక్రమును
నిజనామచిహ్నములుగా వెలయుతీర్థములు పొలుచు। మెలఁతయీనాల్గు లక్ష్మీతీర్థము
నఁగూడి శక్తిపంచకనామసంప్రయుక్తిఁ। దఘుకొత్తువీనివిస్తారంబు షష్టిహస్తప్రమా
ణంబనఁ జాలియుండుఁ। బరమపావనంబు పాతకనిర్మూల। నైకకర్మఠంబు లోకనుతము।
తత్ప్రభావము సుకరదమనుననీయేను। ప్రాణధనములగుచుఁ బ్రణుతివడయు॥ ౧౫౦ ॥ ఉ ॥
ఆమధువైరిదివ్యతనువై సకలోన్నతమూర్తియై దశ। వ్యామవిశాలమై పరమమై భువ
నత్రితయాభిగమ్యమై। యీమునుపన్నతీర్థముల కెక్కువ చూపుచుఁ బౌండరీకముఁ।
క్షౌమగుణాభిరామమునఁ గావిఁగాఁ గనఁగాఁ దగుం దగున్ ॥ ౧౫౧ ॥ సీ ॥ నిడువాలు
గనుచూపు నిగిడినచో నెల్ల బీటెండ రేయెండఁ బెండ్లియాడ। నిశ్శ్వాసపవనంబు నెలకొ
న్నచో నెల్లఁ బ్రామిన్కు నెత్తావు లాముకవియఁ। బొక్కిటితమ్మిపుప్పొడి దొలుకుచో
నెల్లఁ బ్రహ్మాంకురంబులు పాదుకొనఁగ। నడుగులేఁజిగురాకు లంటినచో నెల్ల వివిధతీర్థ
శ్రేణి వెల్లివాఱుదు। బర్హామణిబంధమా వేల్పువచ్చు వెదురు। గ్రచ్చకాయల తిత్తియుఁ
గంబుశక్తి। గలిగి విహరించుఁ బౌండరీకంబునందు। నందులేఁ బట్టి ప్రాలేయనగముప
ట్టి ॥ ౧౫౨ ॥ వ ॥ అఖిలతీర్థరాజంబగు నమ్మహాతీర్థంబునకు జముదిక్కున ధిక్కృ
తావిముక్తంబగు ముక్తకేశితీర్థం బఖిలార్థప్రదంబై యుండు. మున్నట్లు వెన్నునివల
నం దీర్ఘాపత్యంబును ముక్తిదాయిత్వంబునుం గాంచిన యమ్ముక్తకేశియు నచ్చోట
నచ్చువెన్నెలఁ దొచ్చెంబు చేసి యొసఁగు నిసుకదిన్నెలపై నున్నయది యట్లగుటం జేసి ॥
౧౫౩ ॥ క ॥ పులినోపరితలగతనా। తలోదరి నిశిథిలవసనధమ్మిల్లమహా। జ్వల

---

ము ॥ ౧౪౮ ॥ కృతాంతదిశన్ = దక్షిణపుదిక్కునందు. వీతాతంకస్థితిన్ = పోయిన భయము కలయునికితో. భుజాంతరాళమణిసౌధంబు = ఱొమ్మనెడి రత్నాలమేడ ॥ ౧౪౯ ॥ ధూతాఘము = తొలఁగింపఁబడిన పాపములు గలది. పొలుచున్ = కలవు. సంప్రయుక్తిన్ = కూడికతో. షష్టి = అఱువది. కర్మఠంబు = కార్యమును నెఱవేర్చునది. ఏను = అయిదు. ప్రణుతి = పొగడ్త ॥ ౧౫౦ ॥ దశవ్యామవిశాలము = పదిబారల వెడల్పు గలది. అభిగమ్యము = పొందఁదగినది. క్షౌమ = నిర్మలమైన ॥ ౧౫౧ ॥ వాలు = వాఁడియైన. బీటెండ = తీక్ష్ణమైనయెండ. రేయెండ = వెన్నెల. నెలకొన్న = నిలిచిన = ఉన్న. ప్రామిన్కు నెత్తావులు = వేదవాసనలు. ఆముకవియన్ = ఆవరించుకొనఁగా. బొక్కిటితమ్మి = బొడ్డుతామర. దొలుకు = చిందు. బ్రహ్మాంకురంబులు = బ్రహ్మలయొక్క మొలకలు. వెల్లివాఱుదున్ = ప్రవహింపఁగా ॥ ౧౫౨ ॥ జముదిక్కునన్ = దక్షిణదిక్కునందు. ధిక్కృతావిముక్తంబు = తిరస్కరింపఁబడిన కాశిగలది. ముక్తిదాయిత్వంబు = మోక్షము నిచ్చుతనము. తొచ్చెంబు = తుచ్ఛముగా ॥ ౧౫౩ ॥ పులినోపరితలగతన్ = ఇసుకదిన్నెమీఁద నున్నదానిని. శిథిలవసనధమ్మిల్లన్ = వీడినవస్త్రమును కొప్పును గలదానిని. నిశ్చలపదవిప్రదన్ = చలింపని మార్గము నిచ్చుదా

భూషణభూషితని । శ్చలపదవిప్రద భజింపఁజనుగుహాజననీ ॥ ౧౫౪ ॥ శా ॥ భక్తుం డెవ్వఁడుముక్తకైశికపయఃపానంబుగావించినన్ । ద్భుక్తక్లేశకుముక్తకేశికిగరంబుల్ మోడ్చి సత్యామన । స్సక్తుంగన్గొనువాఁడు గన్నయదివోజన్మంబు మేదాల్చి యుణ్ । ముక్తుండాతఁడు భావికాలజననంబుల్ వానికింబూజ్యముల్ ॥ ౧౫౫ ॥ చ ॥ హరి మును సంగమాహ్వయమహాసురునాసురవృత్తిఁ ద్రోచివే।రురవడివానిపైఁబడు గులూఁదఁదదంకములెట్టిచోటగో । చరమగుచూడ్కి కాష్ఠలముసన్నిధిపెన్నిధివాని పేరిటం । బరఁగెనుదీర్ఘమొప్పఁగలభాషిణియీషణశోషణస్థితిన్ ॥ ౧౫౬ ॥ క ॥ ప్లావితభూతలయగుపు । ష్పావతియనునేఱుగలయఁ బావనమైయో । దేవీసంగము తీర్థం । బావిర్భూతాఖిలాద్భుతార్థత వెలయున్ ॥ ౧౫౭ ॥ సీ ॥ ఆతీర్థమునకునాఁడ్య ముసోమతీర్థంబు సోమాలోకావాససుఖకరంబు । దానికిదేవతీర్థముపూర్వమైయుండు దేవతాభోగోపదేష్టయగుచు । నందునకటమున్నయవతరించినసూర్యతీర్థంబుసౌర సిద్ధిప్రదంబు । తత్తీర్థమునకుఁబ్రాక్తనముసరస్వతీ తీర్థంబువాఙ్మయోద్దీపకంబు।వీన నాళ్గింటనాడినవీనిమహిమఁ। బ్రస్తుతించినవీనివైభవముగన్నఁ । బ్రాజ్యసాయుజ్యసా మ్రాజ్యపూజ్యభూరి।భోగములుపంచజనులకుఁబొదలుఁగొల్ల ॥ ౧౫౮ ॥ స్రగ్ధర ॥ పూర్వద్వారస్థఁ సితాంగిన్ భువనవినుతనంభోరుహభ్రూణరాణిన్ । బర్వేందుస్పర్ధివక్త్రిన్ భగవతినఖిలప్రాణిధీమూర్తివాణిన్ ।మార్వ్యశ్రీపత్రమల్లీతులసిదళశమీధూపదీపాక్షతౌఘా । గుర్వాజ్యక్షీరధారల్ గొని కొలిచినచోఁగోరుకోర్కుల్ ఫలించున్ ॥ ౧౫౯ ॥ స్రగ్ధర ॥ తరణ్యాయుతజిత్ప్రభాధగధగాయితాశాంతరుం। డరణ్యావృకభూమికావ్యథితదానవస్వాంతుఁడా । హిరణ్యకశిపుద్రుహుండెపుడునుండునచ్చోసమ । చ్చరణ్యపదపద్ముఁడై చలదిళాకృతిస్వీకృతిన్ ॥ ౧౬౦ ॥ క ॥ నీవడిగినఁజెప్పి

సని ॥ ౧౫౪ ॥ ముక్తకైశికపయఃపానంబు=ముక్తకేశితీర్థమునందలిజలమునుద్రాగుటను. మే = దేహమును. పూజ్యములు=సున్నలు ॥ ౧౫౫ ॥ పేరురవడిన్=మిక్కిలియెక్కువవేగముతో. ఊఁదన్=మోఁపఁగా. తదంకములు= ఆగుఱుతులు. సన్నిధిపెన్నిధి=దగ్గఱనుండెడిగొప్పనిధి. ఈషణశోషణస్థితిన్=ధనాదులయందలియిచ్ఛనుతొలఁగించునట్టియునికితో ॥ ౧౫౬ ॥ ప్లావిత=తడుపఁబడిన ॥ ౧౫౭ ॥ సౌరసిద్ధిప్రదంబు=సూర్యలోకసిద్ధినిచ్చునది. ప్రాక్తనము=పురాతనము. వాఙ్మయోద్దీపకంబు=వాగ్రూపమైప్రకాశించునది. ఆడినన్=స్నానముచేసినను. ప్రాజ్య...భోగములు. ప్రాజ్య= అధికమైన. సాయుజ్య=భగవంతునితోడికూడికయునికి. సామ్రాజ్య= మండలేశ్వరత్వమువలని. పూజ్య= గౌరవింపఁదగిన. భూరి= విశేషమయిన. భోగములు= సుఖానుభవములు. పంచజనులకున్=మనుష్యులకు. కొల్ల=కొల్లఁగా. పొదవున్=కలుగును ॥ ౧౫౮ ॥ పూర్వద్వారస్థన్=తూర్పువాకిటనుండుదానిని. అంభోరుహభూరాణిన్=సరస్వతిని. పర్వేందుస్పర్ధివక్త్రిన్=పున్నమనాటిచంద్రునెదిరించెడిముఖముగలదానిని. ధీమూర్తిన్=బుద్ధియేరూపముగాగలదానిని ॥ ౧౫౯ ॥ తరణ్యయుతజిత్ప్రభా=పదివేలసూర్యులనుగెలుచునట్టితేజస్సుచేత. ఆశాంతరుఁడు=దిక్కులమధ్యప్రదేశముగలవాఁడు. భూమికా= వేషముచేత. హిరణ్యకశిపుద్రుహుఁడు= హిరణ్యకశిపునిశత్రువు. సమచ్ఛరణ్యపదపద్ముఁడు= సేవించువారికిపొందఁదగిన పాదపద్మములుగ

తినో । దేవిచతుర్ముఖముఖులకుఁ దెలియఁగరాదీ । దైవతతీర్థక్షేత్రమ । హావిర్భా
వములు చింతితార్థప్రదముల్ ॥ ౧౬౧ ॥ ఉ॥ ఈచరితంబు విన్నఁ బఠియించిన వ్రాసినఁ
బుత్రపౌత్రలక్ష్మీ చతురంగనాదికవిశేషము లిమ్మెయిఁ గాంచి మీఁదటన్ । జూచు నరుం
డు ప్రాము నులు చూడని చక్కనియిక్క నిక్క మో । మేచకమేఘసంసదుపమేయశిరో
జ సరోజదృక్కృపన్ ॥ ౧౬౨ ॥ క॥ అని శివుఁడు కుధరకన్యకు । వినిపించినయట్టి సరణి విని
పించెమహా । మునులకు ననుపమితతపో । ధనులకుఁ గథకుండు తత్క్రియ మేళనమున్ ॥
౧౬౩ ॥ క ॥ వినిపించిన విని శౌనక । ముని ప్రముఖ నిఖిలమునుల మోఘానందం । బును
మనములఁ దాల్చిరి నెల । కొను నిజతనుఫలకపులకకులకలనమునన్ ॥ ౧౬౪ ॥ క ॥ ఆశౌ
నకుండు మటి యుబ్బి । లేశయతలిమోపధానలీలాలోల । స్వాశయుఁడు పరమపదబ
ద్ధాశుఁడు నైరోమహర్షణాత్మజుఁ బలుకున్ ॥ ౧౬౫ ॥ చ ॥ దమనిధివిట్ఠలేశ్వరుఁడు దై
వతరత్నము భైమితీర్థర । త్నము సలపౌండరీకవసుధాతలమన్నది క్షేత్రరత్న మీ । త్రి
మణులు సూక్తిసూత్రవితతిం గుదిగ్రుచ్చితి మచ్ఛ్రవోవిధే । యమగుచు నుండు నక్కవల
యాకృతి నీకృతి యొప్పు నెప్పుడున్ ॥ ౧౬౬ ॥ క ॥ చతురభవదుక్తిముకుర । ప్రతి
ఫలదఖిలేశగుణపరంపరకలుషో । జ్ఝితమగు నంతర్దృష్టిన్ । సతతము నీక్షింపఁ దనివి
సనదు మహాత్మా ॥ ౧౬౭ ॥ మ ॥ హరియాద్యం డఖిలాండనాయకుఁడు నందాపత్య
మేలయ్యెఁద । చ్చరితం బెయ్యది రాధయొవ్వతె తదిచ్ఛావృత్తి యేరీతి శం । కరు దేహం
బున భైమి యెట్లొదవె శ్రీకాంతాంగజాతాతురో । త్కర మేమంత్రరహస్య మింతి
యును వక్కాణింపు మాకింపుగన్ ॥ ౧౬౮ ॥ ఉ॥ నావుడు సూతుఁ డిట్లనియె నారదమౌ
నికి మున్ను మేచక । గ్రీవుఁడు పుండరీకుని చరిత్రము దెల్పెఁ దదర్థవైభవం । బే వినిపిం
తు మీరు వినుఁడిందఱు సందియ మెల్ల డిందఁ ల । క్ష్మీవిభు దివ్యలీలలఁ జేతఁ గనందగు దీన

---

నాఁడు. చలదళ=అశ్వత్థము యొక్క ॥ ౧౬౦ ॥ ముఖులకున్ = మొదలగువారికి. చింతితార్థప్ర
దములు=కోరినకోరికల నిచ్చునవి ॥ ౧౬౧ ॥ ఇమ్మెయిన్ = ఈదేహమునందు—ఈజన్మమునందు.
చక్కనియిక్కన్ = మంచిచోటును. మేచకమేఘసంసదుపమేయశిరోజ=నల్లమబ్బులగుంపు ఉప
మేయముగాఁగల తలవెండ్రుకలుగలదానా. సరోజదృక్ = విష్ణుదేవునియొక్క ॥ ౧౬౨ ॥ కుధర
కన్యకున్ = పార్వతికి. సరణిన్ = విధమును ॥ ౧౬౩ ॥ నిజతనుఫలకపులకకులకలనమునన్ =
తమదేహములనెడి పలకలయందు గగుర్పాటుగుంపు మిక్కిలి కూడికతో ॥ ౧౬౪ ॥ బిలేశయతలిమోప
ధానలీలాలోలస్వాశయుఁడు = పాము పానుపును దిండునుగాఁగల విష్ణుదేవుని లీలలయందు ఆసక్త
మయిన తనమనసుగలవాఁడు ॥ ౧౬౫ ॥ దమనిధి = ఇంద్రియనిగ్రహమునకు ఉనికిపట్టయిన
వాఁడా. సూక్తిసూత్రవితతిన్ = మంచిమాటలనెడి దారములచేత. గుదిగ్రుచ్చి = కుత్తిగాకూ
ర్చితిని. మచ్ఛ్రవోవిధేయము= మాచెవులయందు పొందినది ॥ ౧౬౬ ॥ భవదుక్తి...పరంపర
=నీమాటలనెడి యద్దమునందు తోఁచుచున్న సర్వేశ్వరుని గుణములపఙ్క్తులు. కలుషోజ్ఝితమున్=
పాపముచేత తొలఁగింపఁబడినది. అంతర్దృష్టిన్=లోచూపుచేత. తనివిసనదు=తృప్తికాదు ॥ ౧౬౭ ॥
నందాపత్యము=నందుని బిడ్డ. వక్కాణింపు=చెప్పుము ॥ ౧౬౮ ॥ మేచకగ్రీవుఁడు=శివుఁడు. డిందన్ =

దీనఁగన్ ॥ ౧౭౯॥ అనిసూతుఁడు వెండియు న | గ్నసూనువిహారములు నిరూఢోక్తుల
వి | న్ననువొప్పఁ జెప్పఁదొణఁగెన్ | మును వేదవ్యాసువచనమున వినియునికిన్ ॥ ౧౮౦॥
చ ॥ ధనపతిమిత్రుఁడట్లు ప్రమదాప్రమదార్థము గా నుపన్యసిం | చినవచనామృతంబు
శ్రుతిసీమలఁ గాఁ దిగి బోధభూజసే | చన మొనరించుటన్ సఫలసంభ్రము లై సమయూర
రాజవా|హనముగ వానులబ్ధిజలమానఘనంబులలీల నేఁగఁగన్ ॥ ౧౮౧ ॥ సీ॥ జాలపాద
మునంఘ్రిఁ గీలితంబగు సితాబ్జముఖాంతఁ గుంచెహస్తమునఁ గ్రాల | బిరుదంబుఁబోఁగ
డు శ్రీశ్వరు శంఖమనఁ జాలితవ్యాముముఖరకంధర దనర్ప | రజతాద్రికూటగర్జత్కాళికా
కృతిబృహదంసమున నడ్డమహాతిపలుక | నిగిడి మఖమ్నయినానిపిల్ల వెలుఁగులవడువు
న నెఱసంజజడలు నిక్కఁ | దెగినచుక్క ధరణికి నే తెంచుకరణిఁ | దరణిజిత్ప్రభతో మే
ఘుసరణిఁ జిగ్గి | నందనీటశతానందనందనుండు | మజ్జనం బాడి బాలేందుమాళిఁ బాడి॥
౧౮౨ ॥ చ ॥ తటపుటబిల్వభూరుహవితానలతానవపుష్పనిష్పత | జ్జటిలమధూళి
ధూళిభవసౌరభమాం భ్రమింపఁ జొచ్చెని|చ్చటవనదేవతోద్ధతకుచద్వితయాశ్రితయక్ష
కర్దమ| చ్ఛటలఁ దటాలునన్ వెడలు సౌరపుఁదావులు ద్రోవలాఁగుచున్ ॥ ౧౮౩ ॥ తే॥
ఉచితనేపథ్యయుతలయ్యు సురగసతులు | నిఘ్నునిజమాళిమణిఘృణివిఘ్నలబ్ధి | నభిక
సంకేతములకు రేలరిగియు రిగి | తిరుగు మొగమైనచిక్కుల తెరువులివిర ॥ ౧౮౪॥ ఉ॥
వ్యాళకరాళకుంభములు వ్రచ్చుట గ్రుచ్చుటఁ బోలెఁ బచ్చిమ | త్యాలు నఖాగ్రధారలకు
నాభరణాచరణంబొనర్పవీ | శైలగువాగృహస్థలులఁ జప్పెడు నిద్దుర లౌరగట్టురా | చూ
లివయాళి వాపురము సూడుకుఁ బట్టుమహోగ్రసింహముల్ ॥ ౧౮౫ ॥ సీ॥ కాఁ

---

టీకఁగా. దీనన్=ఈచరిత్రమునువినుటచేత ॥ ౧౭౯ ॥ విన్ననువు=నేర్పు ॥ ౧౮౦ ॥ ప్రమదాప్రమదార్థముగాన్=భార్యయొక్క సంతోషముకొఱకు. ఉపన్యసించిన=చెప్పిన. శ్రుతిసీమలఁగాన్=చెవిమార్గములగుండ. బోధభూజసేచనము=జ్ఞానవృక్షముయొక్క తడుపుటను. సమయూరరాజవాహనముగన్=కుమారస్వామితోఁగూడ. అను=ప్రాగునట్టి ॥ ౧౮౧ ॥ జాలపాదము=హంస. కీలితము=కూర్పఁబడినది. ముఖర=మొరయుచున్న. కంధర=మెడ. కూట=శిఖరమునందు. గర్జత్కాళికాకృతిన్=ఉఱుముచున్ననల్లమబ్బులవన్నూహాయువిధమున. బృహదంసము=పెద్దమూఁపు. ఎఱ్ఱనసంజజడలు=ఎఱ్ఱనిసంధ్యారాగకాంతిగలజడలు. తరణిజిత్ప్రభతోన్=సూర్యునిజయించునట్టివెలుఁగుతో ॥ ౧౮౨ ॥ నిష్పతత్=పడుచున్న. జటిల=ధారారూపమైన. మధూళి=పూఁదేనెయొక్క. ధూళి—తుంపరలవలన. భవ=పుట్టిన. సౌరభము=పరిమళము. ఉద్ధత=నిక్కిన. యక్షకర్దమచ్ఛటలన్=కర్పూరాదులతోఁ జేయఁబడిన కలపముల తెగలచేత. ఆఁగుచున్=అడ్డగించుచు ॥ ౧౮౩ ॥ నేపథ్యయుతలు=వస్త్రములు మొదలగు నలంకారములతోఁగూడినవారు. నిఘ్న=స్వాధీనములై యుండెడి. నిజమాళి=తమతలలయందలి. మణిఘృణివిఘ్నలబ్ధిన్=రత్నకాంతులవలని విఘ్నము కలుగుటచేత. అభిక=కాముకులయొక్క. తెరువులు=మార్గములు ॥ ౧౮౪ ॥ వ్యాళకరాళకుంభములు=దుష్టగజములయొక్క విశాలములయిన కుంభస్థలములను. వ్రచ్చుట=భేదించుట. నఖాగ్రధారలకున్=గోటికొనలమొనలకు. గట్టురా... మహోగ్రసింహములు=పార్వతీదేవియొక్క విహారమునకై వాహనములగు సింహములతో విరోధింపఁ

బోలునివిగణగ్రామణికల్పితానల్పవిహారగేహాంగణములు। కాఁబోలునివిచరత్ఖచరచారుస్త్రీసమ్మర్దగళితభూషాస్రజములు। కాఁబోలునివి దక్షకన్యాంఘ్రివిన్యాసధన్యాసకృతార్థలీలామాన్యగుహలు। కాఁబోలునివి మోదకప్రియప్రబలదంతప్రాసనిర్భిన్నధాతుఖనులు। తెలియఁగాఁబోలుఁ దివివహ్నితిలకచలక। పర్దనిర్దోషసుసరిద్బహుళలహరి। గహనకుసుమాయమానశీకరనిపాత। శీతలక్ష్మాతలోత్థ ద్రుమపోతకములు॥ ౧౭౬॥ తే॥ రాజతాహార్యగోరాజరాజమునకుఁ। జంద్రశేఖరవరకకుచ్చారువునకు। నీమహాసింధువుపకంఠసీమనిగిడి। డాలుదీపించెనిదెగంగడోలుఁబోలె॥ ౧౭౭ ॥ ఉ॥ ఈపృథివీధరంబుననిభేంద్రకటోదితదానధారలై। ద్వీపవతీతరంగతటవిస్ఫుటశైవలకందళంబులై। తాపసబాలికాశ్రవణదత్తయవాంకురభూషణంబులై। రేపుదమంబుసేయుశబరీకబరీనిబరీసనీలిమల్ ॥ ౧౭౮ ॥ క॥ ఇటులనుచుఁ ద్రోచిచనిముం। దటమునిఁగనుఁగొనియె వేల్పుదళములుగోలువన్। ఘటవటుకప్రముఖమహా। జటిలులతోవచ్చునాభుజగభుగ్వాహున్ ॥ ౧౭౯ ॥ మ॥ కనియేశారణమేగుదెంచిగోకొయాకామాధరుండీమునుల్। కనఁజిత్రంబగుఁగంటికంటిస్వకృతసాంద్రోక్తియందావహి। ల్లినసందేహముఁ గండ్రిచేఁ దెలియుమాళిస్వీఁదోకొంచుఁగ్రాం। చనగోచ్ఛ్వాదియువచ్చెనిట్లుగుటకున్ శంకింపనింకేటికిన్ ॥ ౧౮౦ ॥ క॥ శరవణభవయుతులగుని। పరమమునులుశ్రోతలఁటయపారప్రజ్ఞా। కరుఁడునిశాకరశిఖుశే। ఖరుఁడుహరుఁడువక్తయఁటయగమ్యముగలదే ॥ ౧౮౧ ॥ తే॥ అతిరహస్యంబుశుద్ధంబు నాజవంజ। వార్తిహరణంబునగునెద్దియడిగెనాకొ–। కొడుకుసర్వజ్ఞువిజ్ఞానకుశలుధర్మ। మర్మనిగ్ఘ

---

దగినభయంకరములయిన సింహములు ॥ ౧౭౫ ॥ గణగ్రామణి= గణాధిపతి. అంగణములు= ముంగిళ్లు. చర...స్రజములు=సంచరించుచున్నగంధర్వస్త్రీల రాయిడివలనరాలిన అలంకారములైన హారములు. దక్షకన్యా...గుహలు= పార్వతీదేవి అడుగులుపెట్టుటచేతకృతార్థములగు ఒకానొకప్పుడుక్రీడించెడి శ్లాఘ్యములయినగుహలు. మోదక...ఖనులు = వినాయకునియొక్క మిక్కిలి బలముగలదంతములనెడియీఁటెలచేత భేదింపఁబడినమణిసిలమొదలగువానిగనులు. వహ్నితిలక...కములు=శివునియొక్క కదలుచున్న జడయందలి దోషములేనిదైనగంగయొక్కమిక్కుటమైనప్రవాహమునందలి అడవిలోని పువ్వులవలెఁ దోఁచుచున్న తుంపరలుపడుటచేత చల్లనైననేలయందుఁబుట్టినచిఱుచెట్లు ॥ ౧౭౬ ॥ కకుత్= ఎద్దుమూఁపురము. సింధువు=ఏఱు. ఉపకంఠసీమన్ = సమీపప్రదేశమునందు. గంగడోలు = ఎద్దుమెడక్రింద వ్రేలాడెడుతోలు ॥ ౧౭౭ ॥ ఇభేంద్రకటోదితదానధారలు = శ్రేష్ఠములైనయేనుఁగులయొక్క చెక్కిళ్లయందుఁబుట్టినమదపునీటిధారలు. ద్వీపవతీ= ఏఱు. విస్ఫుట=ప్రకాశించునట్టి. శైవలకందళంబులు=పాచిమొలకలు. శ్రవణదత్త=చెవులయందుఁబెట్టఁబడిన. రేపు=రేవటివేళ. శబరీకబరీనిబరీసనీలిమలు= బోయపడుచులకొప్పులవలనిమిక్కుటమైన నల్లఁదనములు ॥ ౧౭౮ ॥ త్రోచి=ముందుమించి. ఘటవటుక= అగస్త్యుఁడు. జటిలులతోన్=జడలుదాల్చినమునులతో ॥ ౧౭౯ ॥ కామాధరుఁడు=కుమారస్వామి. హాళిన్= ఆసక్తిచేత ॥ ౧౮౦ ॥ శ్రోతలు= వినువారు. వక్త=చెప్పువాఁడు. అగమ్యము= తెలియరానిది ॥ ౧౮౧ ॥ ఆజవంజవార్తిహరణంబు=సంసారదుఃఖమును మాన్పునది. వాఙ్మ

యవాఙ్మయమహితుఁదండ్రి ॥ ౧౮౨ ॥ మ॥ మునుపుట్టైఁ బ్రకృతిం డమంబు నురజం
బుఁ సత్త్వముఁ నాఁగనం। దునిలింపాదులు దామసాత్మకులు మర్త్యుల్ రాజసుల్ సా
త్త్వికుల్ । దనుజద్వేషణులందుఁ బూజ్యులునితాంతఖ్యాతినాజానుజుల్ । ఘనుఁడం
దింద్రుఁడు పేంద్రుఁడీశుఁడమరుల్ గా రెవ్వరుం డత్సముల్ ॥ ౧౮౩ ॥ ఉ ॥ డక్కిన
విష్ణుభక్తియు దృఢంపువిరక్తియుఁ గల్గునమ్మురు । ద్భుకకోటకుఁ భజించుమతి పుట్టక
కంపలఁ బడ్డకాకినై । యక్కట మోసపోయితిఁ గదా పెనుద్రిమ్మట నెంత వారికిఁ। జి
క్కునె ముఖ్యసౌఖ్యము విశిష్టజనంబులసఖ్యమందమిఁ ॥ ౧౮౪ ॥ స్రగ్ధర ॥ ఐనం గా
నిమ్ము నన్నీ యతిగురుఁడు విడంగాఁ ద్త్వత్సృత్యుండుగా స । న్మానాధీనుండు గా వైష్ణవసు
ఖముఁ ఘగామతత్కృపాపాత్రభూతుం । డౌనంచుఁ బ్రోచి గోప్యంబగునది తెలుపుఁ
బ్రార్థితుండైమురారి । ధ్యానానూనాశయుల్ తుల్యదృశులు దమశిష్యాలిభావింతు
రెందుఁ ॥ ౧౮౫ ॥ క ॥ కావున శరణము వేఁడెద । నా వైష్ణవసార్వభౌముఁ నడిగె
దనాకుఁ । గావలసినయర్థము లా । దేవుండును దెలుపు తేటతెల్లము గాఁగఁ ॥
౧౮౬ ॥ క ॥ అనినిశ్చలతరనిశ్చయ । మున నారదుఁ డరిగె సురనమూహవాసం । బు
నకుం గైలాసమునకు । ననుబింబితశాంభవాట్టహాసంబు నకుఁ ॥ ౧౮౭ ॥ సీ ॥ నగధన్వి
వాహనంబగు గోవృషము ఱంకె లనఁ బొల్చు ఘంటామహాక్వణములు । హరశిరశ్శశిశే
ఖయపరావతారంబు లనఁ బొల్చు సేవాగతాబ్జముఖులు । కాద్రవేయాకల్ప కంఠ
మాలచ్ఛాయ లనఁ బొల్చు నగరుధూపాయతంబు । లీశానభూషణాహిస్ఫటామణి
కాంతు లనఁ బొల్చు రత్నదీపాంకురములు । ఖండపరశుతనుప్రభాఖండదుగ్ధ । జలధి
జలశీకరములనఁ బొలుచు వేల్పు । టేలికలు చల్లుపూవుదోయిళ్లు గలుగు । నగము ముని
ముఖ్యునకుఁ దృగానంద మొసఁగె ॥౧౮౮॥ సీ॥ ఆకొండ నెత్తాన హైమసాలావళీ వేల్లి
తంబగు బలువీడు గాంచె । నావీటి నడుచక్కి నభిరామశుభవిభా ధగధగాయిత మొ
కనగరు గాంచె । నామహాప్రాసాదమల్లన నల్లన డాసి వాకిట నొకకేశవదనుఁ గాంచె।

యమహితుఁ= మాటలయొక్క మహిమగలవానిని ॥ ౧౮౨ ॥ ౧౮౩ ॥ ॥ మరుద్భుకకోటకుఁ =
సర్పాభరణములుగల శివుని. భజించు మతి=కొలుచునట్టి బుద్ధి. ద్రిమ్మటఁ=త్రిప్పటచేత ॥౧౮౪॥
యతిగురుఁడు=యతులకు ఆచార్యుఁడు. సన్మానాధీనుండు=సన్మానించుటకుఁదగినవాఁడు. పాత్ర
భూతుఁడు=పాత్రమైనవాఁడు. గోప్యంబు=రహస్యము. మురారి ధ్యానానూనాశయులు= విష్ణు
ధ్యానమునందు మతకుఁ వపడని మనసులుగలవారు. తుల్యదృశులు= సమదృష్టిగలవారు ॥ ౧౮౫ ॥
తేటతెల్లము= మిక్కిలి స్పష్టము ॥ ౧౮౬ ॥ నిశ్చలతర= మిక్కిలి చలనములేని. అనుబింబిత=మా
ఱుమొరయుచున్న. శాంభవ=శివునిదైన ॥ ౧౮౭ ॥ నగధన్వి=కొండధనస్సు గాఁగలవాఁడైన శివు
నియొక్క. మహాక్వణములు=గొప్పధ్వనులు. కాద్రవేయాకల్ప= సర్పభూషణములుగల శివుని
యొక్క. స్ఫటామణి=పడగలయందలిమణులయొక్క. దుగ్ధజలధి= పాలసముద్రమునందలి. వేల్పు
టేలికలు=దేవతాప్రభువులు. దృక్= చూపులకు ॥ ౧౮౮ ॥ నెత్తానఁ= విశాలమైనసమప్రదేశ
మునఁదు. హైమసాలావళీవేల్లితంబు=బంగారుప్రాకారములవఱ్ఱులచేత ప్రకాశించునది. బలు
వీడు=పెద్దపట్టణము. చక్కిఁ=స్థానమునందు. ఆమహాప్రాసాదము= ఆగొప్పనగరు. కేశవదనుఁ

నాకపిలపను చేననుమతుండై చొచ్చి చనియొక్క ముత్యాలచవికఁ గాంచె। నందువిధు
కాంతవేదికాభ్యంతరమున। ద్వీపిచర్మోపరిస్థలదీపితార్క। కోటినిభమైన యొకని
రాఘాటనిరఘు। నిరుపమప్రభఁ గాంచె నిర్నిమిషదృష్టి ॥ ౧౮౯ ॥ ఉ ॥ కాంచి విరిం
చినందనుఁడు కన్నులు బిమ్మిటినొందఁ డిందియొ। క్కించుక కొంకు దేఱి కనియెం దమద
గ్రమహాహాగ్రదీప్తిలోఁ। బంచముఖున్ శిఖితృణవిభాసిలలాటు మరుజ్ఝరీధరున్। సం
చితసత్కృపారసవశంవదు నాదికపిన్ వృషాకపిన్ ॥ ౧౯౦ ॥ చ ॥ విడువనివైర
వృత్తిఁ దఱి వేచి రతీశుఁడు చేలికత్తెనై। కుఱుదురభసంబునన్ శిరసు గ్రుద్దిన నయ్యలుఁ గె
ల్లుఁ బోయిలో। నడఁగ బహిస్థతత్సరుపథార్పితసూకరదంష్ట్రికైవడిన్। జడముడిఁ
జంద్రరేఖ వెదచల్లఁగఁ జల్లనిచిన్ని వెన్నెలల్ ॥ ౧౯౧ ॥ ఉ ॥ కుంకుమపంకశోణయ
గు కొండలమండలనాథుపట్టివా। మాంకము డాకొనన్ ఘుణఘుణారవభూరికపాల
మాలికా। లంకృతులోంకృతుల్ నొడువులాగ డరన్ దటవిద్రుమద్రుమ। క్రేంకృతి
కారిసారసపరీతసుధానిధిరీతిఁ గ్రాలుచున్ ॥ ౧౯౨ ॥ చ ॥ ఉమపసుపాడి మోముత
డియొత్తినహత్తిన తన్నిశాంకదృ। క్కమలదళాంజనాంకకులకంబుగ నిమ్మగు చేలఁ
గే లివి। భ్రమరతిఁ గప్పినాఁడనఁగఁ బచ్చనినల్లని చాఅలన్ మనో। రమమగు ద్వీపిరా
డజినరత్నము యత్నము మీఱఁ దాల్చుచున్ ॥ ౧౯౩ ॥ ఉ ॥ దండనమస్క్రియాభిరతి
దండములై బలభిన్ముఖామరుల్। తంపు సువర్ణదండముఖ తాడనభిన్నకిరీటులయ్యు

---

కోఁతిమొగముగలవానిని. కపిలపనుచేన్ = కోఁతిమొగమువానిచేత. అనుమతుఁడు = అంగీకరింపఁబడినవాఁడు. విధుకాంతవేదికాభ్యంతరమునన్ = చంద్రకాంతపు రాళ్ల అరుఁగునడుమ. ద్వీపి=పెద్దపులి. నిరాఘాటనిరఘునిరుపమప్రభన్ = మేరలేనిదియు దోషములేనిదియు ఈడులేనిదియునైన ప్రకాశమును. నిర్నిమిషదృష్టిన్ = ఱెప్పపాటులేనిచూపుతో ॥ ౧౮౯ ॥ బిమ్మిటి=సంకోచము. ఒందిన=పరవశత్వమునొందినవాఁడై. కొంకు=సంకోచము. శిఖితృణవిభాసిలలాటున్=నిప్పుకంటిచేత ప్రకాశించెడి నొసలుగలవానిని. మరుజ్ఝరీధరున్ = దేవనదిని ధరించినవానిని. ఆదికపిన్ =ప్రధానచైతన్యమైనవానిని. వృషాకపిన్ =శివుని ॥ ౧౯౦ ॥ తఱివేచి=సమయముకనిపెట్టి. రభసంబునన్ = వేగిరపాటుతో. బహిస్థతత్సరుపథార్పితసూకరదంష్ట్ర= బయటనుండెడిదానిపిడితొలియందుంచబడినపందికోఱ. వెదచల్లఁగన్ = వ్యాపింపఁజేయఁగా. (దీనికికర్త పదము వెన్నెలలను ॥ ౧౯౧ ॥ కుంకుమపంకశోణ= కుంకుమపువ్వుకలపముచే ఎఱ్ఱనైనది. కొండలమండలనాథుపట్టి=పార్వతి. డాకొనన్ =చేరఁగా. ఓంకృతులు=ఓంకారములు. నొడువులాగు=చెప్పనట్టివిధము. అడరన్ =అతిశయింపఁగా. క్రేంకృతికారి=క్రేంకారముచేయునది—క్రేం అనిధ్వనించునది. సారసపరీత = తామరలచేతచుట్టఁబడిన. సుధానిధిరీతిన్ = చంద్రునివిధమున ॥ ౧౯౨ ॥ ఉమ=పార్వతి. పసుపాడి=పసుపుపూసికొని స్నానముచేసి. హత్తిన=అంటిన. తన్నిశాంకదృక్కమలదళాంజనాంకకులకంబుగన్ =ఆపసుపుగుఱుతుతోడితామరలవంటికన్నులయందలి కాటుకగుఱుతులకు మేలిమిగా. చేలన్ = వస్త్రమును. విభ్రమరతిన్ = విలాసేచ్ఛచేత. ద్వీపిరాడజినరత్నము= శ్రేష్ఠమైనపెద్దపులితోలు ॥ ౧౯౩ ॥ దండనమస్క్రియాభిరతిన్ =కఱ్ఱవలెసాగిలఁబడి మ్రొక్కుటయందలియాసక్తిచేత. దండములై= గుంపులై. బలభిన్ముఖామరులు = ఇంద్రుఁడుమొదలగుదేవత

బెన్ । జండితనంబునన్ మిగుల సందడిసేయుచుఁ జొచ్చి రాఁగ నృపం । బండిననిండుఁ జూపుపయిఁ బర్వఁగ వారలఁ గారవించుచున్ ॥ ౧౯౪ ॥ తే ॥ చరణపీఠోపకంఠనివణ్ణవృషభ । రాజకకుదర్పితాంఘ్రిసరోజుఁడగుచు । నిండుకొలువున్న దేవతామండలేశు । నీశుఁ డగ్గతి మొక్కి యోగీశ్వరుండు ॥ ౧౯౫ ॥ క ॥ కనదధరకాంతిపల్లవ । మునుదశనద్యుతిలతాంతమును గా వాక్పూ । జన మొనరించెం బురారికి । దనివిసనక వాఙ్నకులవతంసుఁడు వేడ్కన్ ॥ ౧౯౬ ॥ తే ॥ కాళరాత్రీశుఁడగు నీకుఁ గడిఁదితమము । పుండరీకాభుఁడగు నీకు భూరిరజము । సత్కృపాంభోధియగు నీకు సత్త్వభృతియు । ననుగుణంబులు మూర్తిత్రయైకనిలయ ॥ ౧౯౭ ॥ ఉ ॥ వేదవివాదగోష్ఠిఁ బడి వృద్ధులు బుద్ధులఁ గొల్పవచ్చు శ్రీ । గాదిలియై మెలంగఁగల కాలము గ్రాలఁగవచ్చు నిచ్చలుం । బ్రోదిడునవ్యభవ్యసుఖముల్ మఖమూల్యము లొందవచ్చుఁ గా । కేదొరకేటికిం దొరకు నీవు విహాగ్నులు నానఁ బెట్టుటల్ ॥ ౧౯౮ ॥ క ॥ అనిపలుకు సిద్ధసంయమిఁ । గనుఁగొని కృపమీఱ నీలకంఠుఁడు రార । మ్మని కూర్చుండుట కుందగ । ననుజ్ఞ గావించె హాసపాండ్రాధరుఁడై ॥ ౧౯౯ ॥ క ॥ కలహాశనముని చెన్నగు । నలికేక్షణు సవిధవసుధ నాసీనుండై । వలిమలపురోధరిత్రిన్ । మొలచిన ప్రత్యంతకుధరమునకుఁ దరంబై ॥ ౨౦౦ ॥ చ ॥ హరుకృప నిట్లు కన్గొని తదాననదత్తనిరీక్షణాబ్జుఁడై । సురముని పల్కె నో పురనిషూదన నీయనుజీవి నేను మీఁ । దరయక మోసపోయితి గుహాన్వితులై మునులర్థి వేఁడను । స్థిరమతి మీ రుతత్త్వము నుదెల్పెడుచో నిటనుండఁగల్గమిన్ ॥ ౨౦౧ ॥ తే ॥ సాధుజనులతోడి సంసర్గ మురివిన । హానిభయము క్లేశమావహిల్లు । నెంతవారికైన నిదినిక్కమనుమాట । నన్ను మోచివచ్చె నాగహార ॥ ౨౦౨ ॥ తే ॥ దండితానంగ నీదండ నుండియుండి । యిపుడు నేఁ జన్న నింతలో ఋషులువచ్చి । యద్రిప్రార్థించిరో మీర లే విధమున । నుత్తరంబిచ్చితిరొ వారియుక్తులకును ॥ ౨౦౩ ॥ క ॥ కాలీఁచవడఁ జరింపుదు । నీలోకము

---

లు. పండిన=ఫలించిన. పర్వఁగన్=వ్యాపింపఁగా ॥ ౧౯౪ ॥ చరణ...సరోజుఁడు=పాదపీఠమునకు సమీపమందుండెడి నందియొక్క మూఁపురమునందు ఉంచఁబడిన పాదకమలములుగలవాఁడు ॥ ౧౯౫ ॥ కనత్=ప్రకాశించుచున్న. దశనద్యుతిలతాంతము=పండ్లకాంతియనెడిపువ్వులుగలది. వాక్పూజనము=మాటలచేఁ బూజించుట ॥ ౧౯౬ ॥ కడిఁది=అసాధ్యమయిన. తమము=చీఁకటి; తమోగుణము. రజము=పుప్పొడి; రజోగుణము. సత్త్వభృతి=బలమును దాల్చుట; సత్త్వగుణమును దాల్చుట. అనుగుణంబులు=యుక్తములు ॥ ౧౯౭ ॥ గాదిలి=ప్రియము. నిచ్చలున్=నిత్యమును. ప్రోదిడు=వృద్ధిపొందించునట్టి. మఖమూల్యములు=యజ్ఞము వెలఁగాఁగలవి ॥ ౧౯౮ ॥ సిద్ధసంయమిన్=నారదుని ॥ ౧౯౯ ॥ అలికేక్షణు=శివునియొక్క. సవిధ=సమీపమునందలి. వలిమలపురోధరిత్రిన్=మంచుకొండయొక్క ముందరి ప్రదేశమునందు. ప్రత్యంతకుధరమునకున్=దగ్గఱనుండు చిన్నకొండతోడ. తరంబై=పోల్పఁదగినదై ॥ ౨౦౦ ॥ తదాననదత్తనిరీక్షణాబ్జుఁడు=అతనిముఖమునందుంచఁబడిన చూపులనెడికమలములుగలవాఁడు. అనుజీవిన్=అనుసరించి బ్రతుకువాఁడను ॥ ౨౦౧ ॥ సంసర్గము=కూడిక. ఉరివిన=విడిచినను. మోచి=వహించుకొని ॥ ౨౦౨ ॥ దండన్=సమీపమునందు ॥ ౨౦౩ ॥ ఈఁచవడన్=నిస్సత్త్వమును బొందఁగా. పొలుపు

నందు నెల్లనీహితబోధ । శ్రీలాభబుద్ధి నెవ్వరుఁ।బోలరుతత్త్వంబుఁదెలుపుపోలుపుననిన్నున్ ॥ ౨౦౪॥ ఉ॥ కావునఁగ్రౌంచభేదియునగస్త్యుఁడుదక్కఁ మునుల్ త్రిలోకర। క్షావశబుద్ధి నిన్నడిగి కాంచినయర్థములానతిచ్చినన్। బ్రోవఁగఁబాడియట్లగుటఁబోష్యులుశిష్యులునైనవారలన్ । దేవరవంటివారలఁతదర్థికృపారసవృష్టిఁదెల్పరే॥ ౨౦౫ ॥ క ॥ అనిపలికియూరకుండిన । మునిముఖ్యునివినయవాక్యములకలరిమనం। బునఁగృష్ణునిలిపి పురమ । ర్దనుఁడిట్లనుఁ దత్కథాకథనలాలసుఁడై ॥ ౨౦౬ ॥ చ॥ వినుమునినాథ నన్ ఋషులు వేఁడినయర్థముబోధతీర్థమ । త్యనఘమనంతపుణ్యఫలదానని దానమునశ్వరంబు వి।శ్వనుతముదీని పెంపుగనఁజాలరుతక్కినవారలెవ్వరుం। దనుజరిపుప్రసాదజనితప్రతిభానిధి నేనుదక్కఁగన్ ॥ ౨౦౭ ॥ సీ ॥ తరిఁద్రాడుసీఁద్రంపు బోరలంటిగాలిచే జడియుచందముననంచలుభ్రమింప । సురలుబంతులుసాగిసుధమిథస్స్పృహఁద్రాగు తీంద్రఁజేఁటులుపూవుఁదేనెలాన । నామహావిషమానునామూర్తులనజంబు ఫలములందెల్లచిల్కలుభుజింప । నాశ్రితాభ్రముల భ్రమతినిగూఁకలువెట్టు క్రియమయూరంబులుకెరలిపలుక । నబ్ధిమథియింపనొక్కటనవతరిల్లు । నాటిసిరివ్రెల్చుచాడ్పుననవనవర్తు । లక్ష్మిఁదిలకింపమదికినుల్లసనమొసఁగు । మందరంబున మున్నేను నుమయుఁగూడి॥ ౨౦౮ ॥ ఉ॥ లాలితలీల నైందవశిలాస్థలినాస్థలిగుర్వఁద్రాలుచో । నాలలితాంగిఁజూచి వినుమద్రిజ నామదిఁగూలముద్రుజం। బైలలినిల్చెనీదగు విహారముతోరముగాఁగ వేడుమి వ్వేళ । వరంబులిత్తుని దె వేళమనా వినిదేవియిట్లనున్॥ ౨౦౯ ॥ ఉ ॥ సేవకకల్పభూరుహము శిష్టసుధాంబుధి భక్తరోహిణ। గ్రావము దేవముఖ్యుఁడనఁగాఁదగు వేలుపనల్పరక్తినీ । సేవకురాలికిట్లుదయచేసినయావరమిప్పుడొల్లనేఁ। గావలెనన్ననాఁడొసఁగఁగాఁదగునాదగువిన్నపంబునన్ ॥ ౨౧౦॥ క॥అనిపలికికొంతకాలము । చననేడుపవనవిహారసమయమునందున్ । మునునాకడనున్నవరమ। కొనివేఁడెఁగుమారజననిగురుతత్త్వనిధీ ॥ ౨౧౧ ॥ సీ ॥ కాశిగుహాటవిగయకురుక్షేత్రంబు సైంధవంబును నైమిశంబుపుష్క। రంబునుదండకారణ్యంబుచంపకారణ్యంబుగాంచనారణ్యకంబు । కేదారమునుమహాక్షేత్రంబుగంగయమునసరస్వతి

---

నన్=విధముచేత॥ ౨౦౪॥ అలఁత=శ్రమము ॥ ౨౦౫॥ లాలసుఁడు=మిక్కిలి యాసక్తిగలవాఁడు॥ ౨౦౬॥ అనశ్వరంబు=చెడనిది ॥ ౨౦౭ ॥ తరిఁద్రాడు = తరుచునట్టిత్రాడైన. సీఁద్రంపుఁబోరలు=పాముయొక్కకుబుసములు. జడియు=చలించు. అంచలు=హంసలు. మిథస్స్పృహన్=అన్యోన్యము ఆసక్తిచేత. తీంద్రన్=చొరవతో. కూఁకలు= కూఁతలు. కెరలి=విజృంభించి. మథియింపన్=తరువఁగా. ఒక్కటన్= ఒక్కసారిగా. తిలకింపన్ =ప్రకాశింపఁగా. ఉల్లసనము=ఉల్లాసము ॥ ౨౦౮ ॥ ఐందవశిలాస్థలిన్ = చంద్రకాంతపురాళ్ల నేలలయందు. ఆస్థలు=కోరికలు. కూలముద్రుజంబు=గట్టునొరయునది—మిక్కుటమయినది. లలిన్= ఒప్పిదముగా. తోరము=అధికము. వైళము=శీఘ్రముగానే ॥ ౨౦౯ ॥ రోహిణగ్రావము=రత్నపర్వతము. అనల్పరక్తిన్=హెచ్చైనయనురాగముతో ॥ ౨౧౦ ॥ చనన్=కడవఁగా॥ ౨౧౧॥ వేనవేలు=అనేకములు.పై = దే

కూడి మొనసి మెలఁగుఁ । నెలవును మొదలుగాఁ గల క్షేత్రములు వేనవేలుర్విఁ బొగడొం
దు వీనిలోనఁ । గాపురము సేయఁగొన్నిటఁ గలుగు మేలు । మహిమ గొన్నిటఁ జేకుఱు
మైదొలంగ । నిట్టి క్షేత్రంబులకు నెక్కుడెద్దియొద్ది । గనఁబరంబిచ్చు నే క్షేత్రమునికి నీకు ॥
౨౧౨ ॥ సీ ॥ నీరజగర్భుండు నీవు నింద్రుండు భాస్కరుఁడు చంద్రుఁడు బృహస్పతియు ద
క్షు । ముఖ్య ప్రజేశ సమూహంబు మన్వాది చక్రవర్తులు మునుల్ సాధ్య సిద్ధ । మనుజ
మహోరగ దనుజ సరీసృప పశు కీట మృగ పక్షి పరికరంబు । స్థావర జంగమాత్మకము
భౌతికం బెవ్వని చేఁ బుట్టు నెవ్వని కృప । నిలుచు నెవ్వని కినుక చే విలయ మొందు । నమ్మ
హాశక్తి సంపన్నుఁ డమ్మహాత్ముఁ । డమ్మహానందుఁ డెచ్చోట నధివసించు । నెట్టి వాఁడ
మ్మహావిష్ణుఁ డిందుమకుట ॥ ౨౧౩ ॥ క ॥ గంగాది తీర్థ మహిమము । హింగాదనుతీ
ర్థమెద్ది యిమ్మాడు సదా । సంగతి నెచ్చోనుండును । నంగాహిత దీని నెఱిఁగి యానతియీ
వే ॥ ౨౧౪ ॥ మ ॥ అని దాక్షాయణి వేఁడ నుత్తరము నెయ్యంబొప్ప నీకున్నయం । తనగ
స్త్యాదులు గొల్వవచ్చె శిఖిమీఁదం బొల్చి సేనానియే । ననుపక్షస్కందపురాణ మమ్ము
నులకుఁ వ్యాఖ్యానముఁ జేయముఁ । చని వారల్ శ్రుతతీర్థులై యవియ కాంతుఁ వేఁ
డఁ దాఁ గానమిఁ ॥ ౨౧౫ ॥ తే ॥ వచ్చి శ్రీక్షేత్ర తీర్థ దైవత చరిత్ర । మన్ముఖంబున
మానిసమన్వితముగ । నెఱిఁగి వారలు దానిప్పుడిల్ల యరిగె । నంత నీ వేసు దెంచితి వజత
నూజ ॥ ౨౧౬ ॥ ఉ ॥ నావిని శంకరుం బలుకు నారదుఁ డోమదనారి భూరి కా । ర్యావ
హ బుద్ధిఁ బోలె భువనాళిని హాళిఁ జరింతు భ్రాంతియుఁ । కావిరి వావిరిం దగిలి కాళులధా
వతియయ్యె క్షేత్రముఁ । దేవుఁడు దీర్ఘ మొక్కకడఁ దీవ్రతర ప్రభ నిల్చుఁ టేఁగనఁ ॥ ౨౧౭ ॥
తే ॥ క్షేత్ర దైవత తీర్థ చారిత్రమెవ్వుడు । గరళకంధర యొకచోటఁ గలసియునికి । యా
నతి యొసంగి నన్నుఁ గృతార్థుఁ జేయు । మనుఁడుఁ గలహాశిఁ బలుకు నమ్మనసిజారి ॥ ౨౧౮ ॥
చ ॥ తనమది వల్చు భామినికి దక్కని కప్పు మోహిఁ బోలెనే । మనుజుఁడు బుద్ధి నిల్పు
మురమర్దను దివ్య కథానుబుద్ధియై । యనిశము మతిక్రియుండ తఁడ యట్లగుటఁ పనిపిం
తు నీకు నేఁ । గనివిని యున్న గోప్యము నగమ్యము నై నయధః ప్రపంచముఁ ॥ ౨౧౯ ॥ ఉ ॥
ఈ పము దగ్ర తత్త్వ పద మేనాకరుండ నెఱుంగుముఁ సరో । జాసనుఁ డొక్కఁడుండెఱుఁ
గు నబ్ధితనూజ యొక్కతె యెఱుంగున । వ్యాసుఁ డొక్కఁడుండెఱుఁగు వాఙ్మనుభోగిప శా

హము. తొలఁగన్ = విడువఁగా. పరంబు = మోక్షమును ॥ ౨౧౨ ॥ భౌతికంబు = భూత సమూహము.
కినుక చేన్ = కోపముచేత. అధివసించున్ = ఉండును ॥ ౨౧౩ ॥ సంగతిన్ = చేరికతో. అనంగాహి
త = మన్మథునికి శత్రువైన శివుఁడా ॥ ౨౧౪ ॥ నెయ్యంబు = స్నేహము. శిఖి = నెమలి ॥ ౨౧౫ ॥ ౨౧౬ ॥
భువనాళిన్ = లోకపఙ్క్తి యందు — అన్నిలోకములందును. హాళిన్ = ఆసక్తితో. కావిరి = నలుపు
— చీఁకటి. వావిరిన్ = క్రమముతో. ధావతి = త్రిప్పట ॥ ౨౧౭ ॥ కలహాశిన్ = నారదుని. మనసి
జారి = శివుఁడు ॥ ౨౧౮ ॥ వల్చు = కోరు. మోహి = మచ్చికగలవాఁడు. అనుబంధి = సంబంధము గల
వాఁడు. అనిశము = ఎల్లప్పుడు. అగమ్యము = దుర్లభము. అధఃప్రపంచముఁ = కడచిన సమాచార
మును ॥ ౨౧౯ ॥ అబ్ధితనూజ = లక్ష్మీదేవి. వాఙ్మనుభోగిపశార్ఙ్గ్యలు = సరస్వతి మనువు ఆదిశేషుఁడు గ

ఘృశైలాత్మఁ బ్రాగ్వాసనమై నెఱుంగుదురుగాని తదన్యులెఱుంగ రెవ్వరున్ ॥ ౨౨౦ ॥
తే ॥ దాఁపఁదగువానిమిక్కిలి దాఁపఁగలిగి । క్షేత్రములకెల్లఁ బరమమైకీర్తివడయు । నిమ్మహాక్షేత్రరాజంబు నెఱుఁగఁజాలు । ప్రాజ్ఞుఁడగువాఁడుమనుఁగఁడు పాపజలధి ॥ ౨౨౧ ॥ క ॥ కుడమికి వితస్తిమాత్రపుఁ । బొడవున నాక్షేత్రరాజము విరాజిల్లున్ । నడుమన జ్యోతిర్యానము । వడుపునఁ దేజోమయాభివర్ణితమూర్తిన్ ॥ ౨౨౨ ॥
క ॥ ఆక్షేత్రమునకు సురస । ద్మక్షితిపాతాళములసమంబై బుధలో । కక్షేమంకరమగునది । యేక్షేత్రముగాకయుండు నిద్ధవిభూతిన్ ॥ ౨౨౩ ॥ క ॥ ఏవంవిధబహుమహిమై । కావాసంబైనయమ్మహాక్షేత్రమునం । దేవసియింపుదువినువసు । దేవసుతార్చావిధేయధీయోగమునన్ ॥ ౨౨౪ ॥ సీ ॥ సహ్యపాదోద్భూతసరిదన్వయమునకు నేనుధాతయును లక్ష్మీశ్వరుండు । నభిమానులముగాన నందుఁ గృష్ణుఁడు కృష్ణబ్రహ్మగౌతమి నేను భైమిగాఁచి । యధివసింతుము దండకాటవి మొదలు పంపతుదగాఁగల క్షేత్రపటలమెల్ల । నజునకు హరికినా కాయత్తమై హత్తు భైమివిష్ణుక్షేత్రభూమిఁ బఱచి । వైష్ణవియనంగఁదగు నందువలననాదు । క్షేత్రమున శిల్పిశైవినాధాత్రి వెలయుఁ । దామరససంభవక్షేత్రతలమునందు । బ్రాహ్మియై యొప్పు నిప్పాట బ్రహ్మపుత్ర ॥ ౨౨౫ ॥ తే ॥ పుణ్యగుణగణ్య పాతకారణ్యహేతి । బహుళపుణ్యార్వ్రజవ్రజపిహితకూల । దీపితాకృతి బుధబోధదీపకళిక । యఖిలలోకవిపచ్ఛాంతి యాస్రవంతి ॥ ౨౨౬ ॥ తే ॥ నడచి భగవంతుక్షేత్రంబు నడుమఁ జొచ్చి । విరజయనుసింధు వెచ్చోట విడిసియుండు । నృహరి ప్రత్యక్షమైయుండు నెట్టిచోట । నట్టిచోటను వైష్ణవియనఁగఁబరఁగు ॥ ౨౨౭ ॥
తే ॥ కృష్ణవేణి ప్రకాశించు నెంతమేర । నంతమేర మదీయమై యతిశయిల్లు । భైమియటమున్న జలజసంభవుని యదియ । కానమూర్తిత్రితయమయాకారయయ్యె ॥ ౨౨౮ ॥
చలిదిచిక్కుపుజిల్గుపాలుముల్ కాసుపై నొయ్యారముగ పించ మొయ్యఁ జెరివి । భాస్క—

---

రుష్టంతుఁడు. ప్రాగ్వాసనమైన్ = పూర్వవాసనచేత ॥ ౨౨౦ ॥ పరమమై = శ్రేష్ఠమై ॥ ౨౨౧ ॥ వితస్తిమాత్రపుఁబొడువునన్ = జేనెడు కొలఁదిపొడుగున. విరాజిల్లున్ = ప్రకాశించును. జ్యోతిర్యానము = వెలుఁగయిన వాహనము. వడుపునన్ = విధమున ॥ ౨౨౨ ॥ సురసద్మ = స్వర్గము. బుధలోకక్షేమంకరము = పండితసమూహమునకు మేలు చేయునది. ఇద్ధ = ప్రసిద్ధమైన ॥ ౨౨౩ ॥ ఏవం...వాసంబు = ఈవిధమయిన అనేకమహిమలకు ఉనికిపట్టు. ధీయోగమునన్ = బుద్ధితోడికూడికతో ॥ ౨౨౪ ॥ సహ్య...దన్వయమునకున్ = సహ్యపర్వతము వెంబడి చిన్నకొండలయందుఁ బుట్టిన నదులసముదాయమునకు. ధాత = బ్రహ్మ. క్షేత్రపటలము = క్షేత్రములసమూహము. ఆయత్తమై = అధీనమై. హత్తున్ = చేరును. పఱచి = ప్రవహించి ॥ ౨౨౫ ॥ పుణ్యగుణగణ్య = మంచిగుణములచేత ఎన్నఁదగినది. పాతకారణ్యహేతి = పాపములనెడి అడవికి కొఱవి. పిహితకూల = కప్పఁబడిన తీరములచేత. బుధబోధదీపకళిక = పండితుల తెలివికి దీపజ్వాల. అఖిలలోకవిపచ్ఛాంతి = ఎల్లజనుల యాపదలను అణఁచివేయునది. స్రవంతి = ఏఱు ॥ ౨౨౬ ॥ విడిసి = ప్రవహించి ॥ ౨౨౭ ॥ కృష్ణవేణి = నల్లని నీటిపాయ ॥ ౨౨౮ ॥ ఉల్లాసము = అల్లిక. ఒయ్యన్ = తిన్నఁగా. చెరివి = చెక్కి. అంశులు = కిరణములు. వ్రేలు = వ్రేలా

రాంశులుమూటిపాఱుఁ బ్రేల్వీసులవెలలేనిమకరకుండలములునిచి । మోచేతివంపుగా ముడిచిపట్టినకేల వరదాభయంబులావటముచేసి । పొరలేనియరఁటులనిరసించుమృదులోరుయమళమధ్యమునగోయష్టినిలిపి । నిగమనూపురములు మ్రోయనిరుకుళముగ । సిగ్గువాసినకటిప్రకాశింపనురము । కెంపులేయెండగ్రక్కుఁ జెక్కుళ్లనగవు । మొలవన్ తీర్థమునవిల్చిపొల్చుఁ జక్రి ॥ ౨౨౯ ॥ తే ॥ తీర్థహారంబునకువాసుదేవమూర్తి । నీలతరళాకృతిస్ఫూర్తి నెలవుకొనఁగ । నత్తొడవునకుసంగమాఖ్యాకతీర్థ । తలముదళుకొత్తుహత్తినకొలికిఁబోలె ॥ ౨౩౦ ॥ చ ॥ ఖరనఖరాగ్రనిర్దళితకర్బురరాజభుజాంతరుండుశ్రీ । నరహరియుండుసంగమమునంజలమాడినృసింహునంఘ్రిపం । కరుహయుగంబుగాంచితనకల్గినమాత్రముదానమిచ్చునే । నరుఁడొకపూఁటవాఁడునుగనంగలఁడాదిమవిష్ణుధిష్ణ్యముల్ ॥ ౨౩౧ ॥ క ॥ కలుషవనప్లోషదవా । నలకీలావలయమైననరహరిక్షేత్ర । స్థలపుణ్యమహిమలెన్నినఁ । గలుగుల్ సుక్షేత్రముఖ్యగమనఫలంబుల్ ॥ ౨౩౨ ॥ తే ॥ అపునరావృత్తిశాశ్వతవిపులసౌఖ్య । సిద్ధిప్రపన్నోదునికిదయచేసినట్టి । యానృహర్యక్షవిభుక్షేత్రమధిగమించు। జనుఁడుపాపంబువలనమోచనముగాంచు ॥ ౨౩౩ ॥ శా ॥ ఆక్షేత్రస్థలిక్రోశపంచకమితంబై యుండుఁదత్రత్యులన్ । వీక్షించుందివినుండి వేల్పుగమిదిగ్వేదండతుండాకృతా । రక్షుద్రేతరదోశ్చతుష్టయులఁగా రాజీవరాజీవస । చ్చక్షూరమ్యులఁగాహిరణ్మయపటీసక్తోరులంగామహిన్ ॥ ౨౩౪ ॥ ఉ ॥ వంచనయింతలేకబహువారములెంతయుఁ గ్రూరచిత్తుఁడై । పంచజనుండుపంచవిధపాతకముల్ మునుచేసెనేనియున్ । బంచత శ్రీనృసింహుకడిభాగమునంగనుఁబున్నమొక్కఁడున్ । గాంచినఁజాలువిష్ణుపదగామియగున్ గల

---

డు. వరదాభయంబులు=వరమిచ్చుటవలనిభయములేములు. ఆవటముచేసి= పొందుపఱిచి. నిరసించు=తిరస్కరించు. మృదుల=మిక్కిలిమెత్తనైన. ఊరుయమళ=తొడలజంటయొక్క. గోయష్టి= ఆవులనుతోలెడికఱ్ఱ. నిరుకుళముగన్= అడ్డములేక. లేయెండ=ప్రాతఃకాలమందలియెండ. పొల్చున్= ఉండును ॥ ౨౨౯ ॥ తరళ = నాయకమణియొక్క. స్ఫూర్తి = ప్రకాశము. అత్తొడవునకున్= ఆయాభరణమునకు. తళుకొత్తున్=ప్రకాశించును ॥ ౨౩౦ ॥ నఖరఖరాగ్రనిర్దళితకర్బురరాజభుజాంతరుండు= గోళ్లయొక్కతీక్ష్ణములైనకొనలచేత భేదింపఁబడినరాక్షసరాజైనహిరణ్యకశిపునిదైనఱొమ్ముగలవాఁడు. జలమాడి=స్నానముచేసి. ధిష్ణ్యములన్= స్థానములను॥ ౨౩౧ ॥ కలుషవనప్లోషదవానలకీలావలయము= పాపములనెడి అడవినికాల్చునట్టికార్చిచ్చుమంటల ఆవరణముగలది ॥ ౨౩౨ ॥ అధిగమించు= పొందునట్టి. మోచనము= విడుపు ॥ ౨౩౩ ॥ క్రోశపంచక= అయిదుకోసుల. తత్రత్యులన్= అచ్చటివారిని. దిగ్వేదండతుండాకృతారక్షుద్రేతరదోశ్చతుష్టయులఁగాన్= దిగ్గజములతొండములకుఁగలుగఁజేయఁబడినవడిగలవిశాలములయిననాలుగుచేతులుగలవారినిగాను. రాజీవరాజీవసచ్చక్షూరమ్యులఁగాన్=తామరలవంటికిఁ ఉనికిపట్టులగుకన్నులచేతఅందగించువారిని. హిరణ్మయపటీరమ్యోరులన్=బంగారుపట్టువస్త్రముచేతమనోహరములైనతొడలుగలవారినిగాను ॥ ౨౩౪ ॥ బహువారములు= పలుతడవలు. పంచజనుండు= మనుష్యుఁడు. పంచతన్=చావును. ఒకఁడున్=ఒక్కఁడే॥ ౨౩౫॥ ఊడ్చినన్=విడిచినను. సార్వభౌ

కోటితోడుతన్ ॥ ౨౩౫ ॥ ఉ॥ దేవునివామభాగమున దేహమునూడ్చినసార్వభౌముఁడౌ । దేవునివెన్క మేల్క నినత్రేనుపుగైకొని నాకవాసియౌ । దేవునిమోఁదిలదక్షిణపుదిక్కు నసీల్గినయేనిముక్తుఁడౌఁ । గావునమానవుండెపుడు గాపురమాయెడఁజేయఁగాఁదగున్ ॥ ౨౩౬ ॥ క॥ యతిపతియేతత్క్షేత్రో । ర్జితచరితం బ్రకటనంబుచేయఁగఁ దగున । య్యితిహాసమొకటిగలదది । శ్రుతిపేయము చేయుమనుచు రుద్రుఁడు పల్కెన్ ॥ ౨౩౭ ॥

శా॥ అంభోరాశిగభీరభీరహితచిత్తాభోగభోగావళీ । సంభారామరరాజరాజకృతపూజాయోగ్యయోగ్యర్థిమి। త్రాంభోజాహిమధామధామహితనిత్యావాసలక్ష్మీసముజ్జృంభాలంకృతవక్త్రవక్త్రభీముఖరవా శ్రీమద్గుణప్రాభవా॥ ౨౩౮॥

క॥ శఠమఠనవంశవర్ధన । కఠినకుఠారాగ్రదళితగర్వితవిద్వి । డ్జఠరమునితుల్యవితరణ । పఠనకళాభ్యాసవిభవపారీణమతీ ॥ ౨౩౯॥

---

ముఁడు=చక్రవర్తి. మేల్క నిన త్రేనుపు=మేలుపొందుటవలని త్రేఁపు=చావు. సీల్గినయేని=చచ్చినవక్షమున. ముక్తుఁడు=మోక్షమును పొందినవాఁడు॥ ౨౩౬ ॥ యతిపతి= ఓనారదుఁడా. ఏతత్క్షేత్రోర్జితచరితన్ = ఈ క్షేత్రముయొక్క శ్లాఘ్యమైనచరిత్రమును. ప్రకటనంబు=ప్రసిద్ధము. ఇతిహాసము=పూర్వకథ. శ్రుతిపేయము చేయుము=వినుము॥ ౨౩౭ ॥

అంభోరాశిగభీర=సముద్రముయొక్క గాంభీర్యమువంటి గాంభీర్యముగలవాఁడా. భీరహితచిత్తా=భయములేనిమనసుగలవాఁడా. ఆభోగ...రాజ=విశేషములైనభోగములను అనుభవించుటయందు ఇంద్రుఁడా. రాజకృతపూజాయోగ్య= రాజులచేతఁజేయఁబడు పూజలకుఁ దగినవాఁడా. యోగ్యర్థిమిత్రాంభోజాహిమధామ = యోగులు యాచకులు స్నేహితులు ననెడి తామరలకు సూర్యుఁడా. ధామమహితనిత్యావాసలక్ష్మీసముజ్జృంభాలంకృతవక్త్ర=ఇంటికిమేలై యెల్లప్పుడు వసించునట్టిలక్ష్మియొక్క విజృంభణముచేత అలంకరింపఁబడినముఖముగలవాఁడా. వక్త్రభీముఖరవా=ముఖమునందు భయము మొదలగువానిని గలిగించెడిధ్వనిగలవాఁడా. — అచ్చటగలవారికి భయము పుట్టించుట మొదలగు లక్షణములుగల మాటలు గలవాఁడా అనుట. శ్రీమద్గుణప్రాభవా. =సంపద్గుణములతోడి ప్రభుత్వముగలవాఁడా ॥ ౨౩౮ ॥

శఠమఠనవంశవర్ధన=శఠమఠనగోత్రమును వృద్ధిపొందించువాఁడా. కఠినకుఠారాగ్రదళితగర్వితవిద్విడ్జఠరమునితుల్యవితరణ=కఠోరమయినగండ్రగొడ్డలిమొనచేత భేదింపఁబడినగర్వించినశత్రువుల కడుపులుగలమునియైనపరశురాముని తోఁబోల్పఁదగిన దాతృత్వముగలవాఁడా. పఠనకళాభ్యాసవిభవపారీణమతీ=చదువుటవలనిశాస్త్రాభ్యాససంపత్తిచేత పారమునుపొందినబుద్ధిగలవాఁడా ॥ ౨౪౦ ॥

మాలిని॥ కవిశుకసహకారా కల్పవృక్షావతారా। సవినయనిజమూర్తీ సర్వదిగ్గ్రాహికీర్తీ। భువనహితచరిత్రా పుణ్యదాక్షిణ్యమిత్రా। నవరసికవతంసా నవ్యసూక్తిప్రశంసా॥ ౨౮౦॥

గద్యము॥ ఇది శ్రీపరమపదనాథ నిరవధిక కృపాపరిపాక పరిచిత
సరసకవితాసనాథ రామకృష్ణ కవినాథ ప్రణీతంబైన
పాండురంగమాహాత్మ్యంబను పరమభాగవత
చరిత్రంబునందు ద్వితీయాశ్వాసము.

---

కవిశుకసహకారా = కవులనెడి చిలుకలకుతియ్యమామిడియైనవాఁడా. సర్వదిగ్గ్రాహికీర్తీ = ఎల్లదిక్కులనుగ్రహించునట్టికీర్తిగలవాఁడా — ఎల్లదిక్కులందువ్యాపించినకీర్తిగలవాఁడా. భువనహితచరిత్రా=లోకమునకు మేలైననడవడిగలవాఁడా. పుణ్యదాక్షిణ్యమిత్రా = ధర్మము మోమోటము ననెడిమిత్రులుగలవాఁడా. నవరసికవతంసా= తొమ్మిదిరసములు తెలిసినవారిలోశ్రేష్ఠుఁడా - లేక - నవీనులైనరసికులలోశ్రేష్ఠుఁడా. నవ్యసూక్తిప్రశంసా= శ్లాఘ్యములైనమంచిమాటలపొగడ్తగలవాఁడా.



శ్రీ పాండురంగవిఠ్ఠలస్వామినే నమః.

# పాండురంగమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీరమ్యచరణతల లా । క్షారసరాగాభిరమ్యశంకావహదృ । గ్ధారస
మారాధితరఘు । వీరా రామానుజయ్యవేదాద్రీశా ॥ ౧ ॥ వ ॥ ఆకర్ణింపు మా
యర్ణవతూణీరుండువీణామునింగనుంగొనియిట్లనియె ॥ ౨ ॥ ఉ ॥ ప్రాసఁగువిత్తువం
టినెఱపాఱు కొలంబునఁ బుట్టివేదముల్ । వ్రాసినగాదె శాస్త్రములుపుట్టినయిల్లు
కళాకలాపముల్ । డాసినరచ్చయెంచునఖిలంబుదనుంగొనియాడనొప్పును । ద్భాసి
తభాసితద్యుతి సభాపతి నా నొకఁ డాహితాగ్నియై ॥ ౩ ॥ వ ॥ అతండు కళింగ
దేశాభరణంబగు పీఠికాపురం బధిష్ఠించి సకలమహీసురవర్యశ్రేష్ఠుండై వెలయునం
త ॥ ౪ ॥ తే ॥ ఆమహీసురు లేమకునతులనిష్ఠ । నింగివేల్పుల నెలకునేల వేల్పు । కొ
లమునింగికిఁదెచ్చుచుఁగొలువఁబుత్త్రుఁ । డొకరుఁడుదయించెదత్ప్రాభ్యుదయమ
హిమ ॥ ౫ ॥ మ ॥ వనితామానస సూనసాయకుఁడు జీవత్తాత పాఱుండు భూ । జ
నసన్మాన్యవిశుద్ధవర్తనుఁ డుదంచత్త్యాగశీలుండుచంద్రుని పెన్నిద్దిసమగ్రకాంతిమ
హిమన్ జాన్నుఁగుమిసాలలే । గొనబుంబ్రాయపుఁదేజుకూనయతఁడుత్తోచుండు
వాచాలతన్ ॥ ౬ ॥ వ ॥ అజ్జగతీసురవర్యసంభవునకుఁ బితృదత్తంబగునిగమశర్మాభి
ధానంబుప్రసిద్ధంబై యుండువెండియు ॥ ౭ ॥ తే ॥ అతఁడనూచానసంతతినవతరిలియు ।

---

లాక్షారస=లత్తుకవలని. రాగ=ఎఱ్ఱఁదనముచేత. దృగ్ధార=కంటిగీఱలుగలవాఁడా ॥ ౧ ॥
అర్ణవతూణీరుఁడు=సముద్రములు అమ్ములపొదులుగాఁగలవాఁడు. వీణాముని౯=నారదుని ॥ ౨ ॥
ప్రాసఁగువిత్తు=రాజనవ్రువరి విత్తనము. నెఱపాఱుకులంబునన్=ఉత్తమబ్రాహ్మణవంశమునందు.
కలాపములు=సమూహములు. డాసిన=సమీపించిన. రచ్చ=సభ. ఉద్భాసిత=మీఁదికి వెలిఁగింపఁ
బడిన. భా=వెలుఁగుచేత. సితద్యుతి=చంద్రుఁడు. ఆహితాగ్ని=ఎల్లప్పుడు అగ్నిహోత్రములు
చేయువాఁడు ॥ ౩ ॥ పీఠికాపురంబున్=పిటాపురమును. అధిష్ఠించి=ఉనికిచేసికొని. మహీసురవ
ర్య=బ్రాహ్మణులలో ॥ ౪ ॥ లేమకున్=భార్యకు. నింగివేల్పులన్=ఆకాశమునందలిదేవతలను.
నేలవేల్పు కొలమున్=బ్రాహ్మణసమూహమును ॥ ౫ ॥ సూనసాయకుఁడు=మన్మథుఁడు. జీవ
త్తాత=బ్రతికియున్న తండ్రిగలవాఁడు. పాఱుండు=బ్రాహ్మణుఁడు. విశుద్ధవర్తనుఁడు=పరిశుద్ధమ
యినడవడిగలవాఁడు. లేగొనబుంబ్రాయపుఁదేజుకూన=లేఁతదియు మనోజ్ఞమునైన యౌవనపు
తేజస్సుగలబిడ్డ. ఉత్తోచుండు=అధికుఁడు. వాచాలతన్=మాటకారితనముచేత ॥ ౬ ॥ ౭ ॥ అనూ

సకలనిగమశిఖారహస్యములుగనియు । మనసుఁ దార్తీయపురుషార్థమునకె చేర్చి । దై
వఘటనావశంబున నోవశీంద్ర ॥ చ ॥ తలగడుగంగమర్దనము ధౌతపటావర
ణంబు సంస్కృతో । జ్జ్వలకలమాన్నభోజనము చందనచర్చప్రసూనదామకం । బు
లుకపురంపువీడ్యమును భూషణపఙ్క్తులుకల్గి నిచ్చలుక్ । బులుకడుగంగఁ బడ్డనునుముత్య
ముఁబోలుచు వాలుచుండురిక్ ॥ ౯ ॥ సీ ॥ కలదు లేదనువాదములకోర్చి మీసుమీస
ము వంటి యొంటి జందెము మెఱవఁగ । బహుసంకుమదపంకపాటిఁధమంబైన తాళిగో
ణపుఁజెంగు నేలఁజీరఁ । గడలేని వీడ్యంపుఁ గప్పు చందురుకావి మోవిపల్లొత్తులను ముసుఁగు
దన్న । సానతాఁకులుగల్గు సూనాస్త్రశంఖంబు గతిసఖరేఖాంకగళము దనర । సఖు
లుపరిహాసకులు వెంటఁజనఁగ యువతి । భుక్తనిర్ముక్తపరిధానయుక్తుఁడగుచు । నగర
ఘంటాపథంబున నగుచుఁదిరుగు । నొఱపుగలఠీవి జాతిమాత్రోపజీవి ॥ ౧౦ ॥ తే ॥ భా
ర్యపాలిండ్లు రిక్తకుంభములు రోయి । వెలఁది చనుదోయి నిండుకుండలు కులంబు । తరు
ణి ఫాలంబు చవితిచందురుఁడు వేశ్య । నుదురు వానికిఁ బ్రతిపదిందుండునయ్యె ॥ ౧౧ ॥ సీ ॥
ఉష్ణాన హోమాగ్ని యూఁదనొల్లఁడుగాని విరహజ్వరార్తుఁడై వెచ్చనూర్చు । సం
ధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింపఁడుగాని యెరఁగు నీర్ష్యాకషాయితలకర్థి । నాగమవాదం
బులొరఁగాదనఁడుగాని విటవాదములు తీర్చు వేగిలేచి । కంబుభృత్పాదోదకంబు గ్రోలఁ
డుగాని యౌవతాధరసీధువాని చొక్కుఁ । బుణ్యచిహ్నంబు లపఘనంబున ఘటింప ।

---

చాన=అంగములతోడ వేదాధ్యయనము చేసిన బ్రాహ్మణుని యొక్క. అవతరిలి=పుట్టి. నిగమశిఖారహస్యములు=వేదాంతరహస్యములను. తార్తీయపురుషార్థమునకె=మూడవపురుషార్థమయిన కామమునకె. చేర్చిక్=చేర్చెను ॥ ౮ ॥ తలగడుగు=తలకు నూనెయంటి స్నానము చేయుట. ధౌతపటావరణంబు=మడుఁగువస్త్రము కట్టుకొనుట. సంస్కృతోజ్జ్వలకలమాన్న=పక్వము చేయుటచే ప్రకాశించునట్టి వరియన్నము. ప్రసూనదామకంబులు = పూవుదండలు. నిచ్చలుక్ = ఎల్లప్పుడును. బులు=(ముత్యముల)మురికి. వాలుచుక్=మీఱుచు—అతిశయించుచు ॥ ౯ ॥ సంకుమద=జవ్వాజిచే నైన. పాటిఁధమంబు=కొలిమితిత్తియైనది—వ్యాపింపఁజేయునది. తాళిగోణము=మూలగోఁచి. చందురకావిమోవి=సిందూరవర్ణము గల పెదవి. పల్లొత్తులక్=దంతక్షతములచే. ముసుఁగుదన్నక్=మసఁగుపడఁగా. నఖరేఖాంకగళము=గోటినొక్కుల గుఱుతులుగల మెడ. యువతిభుక్తనిర్ముక్తపరిధానయుక్తుఁడు=యౌవనస్త్రీలు అనుభవించి విడిచిన కట్టువస్త్రముతోఁ గూడినవాఁడు. ఘంటాపథంబునక్=పెద్దబాటయందు. ఒఱపు=చక్కఁదనము—అందము. ఠీవిక్=వైభవముతో ॥ ౧౦ ॥ పాలిండ్లు=స్తనములు. రోయి వెలఁది=భోగముది. కులంబు తరుణి=పెండ్లాము. ప్రతిపదిందుండు=పాడ్యమినాటిచంద్రుఁడు ॥ ౧౧ ॥ ఆర్తుఁడు=పీడింపఁబడినవాఁడు. ఘటింపఁడు=చేర్పఁడు. ఎరఁగుక్=నమస్కరించును. ఈర్ష్యాకషాయితలకుక్= ఇతరసాంగత్యమును ఓర్వలేక కన్నులెఱ్ఱచేసికొన్న స్త్రీలకు. అర్థిక్=ప్రీతితో. ఆగమనాదంబులు=వేదధ్వనులు. వేగి=తెల్లవాఱి. కంబుభృత్=శంఖమును బూనిన విష్ణుదేవుని. గ్రోలఁడు=త్రాగఁడు. యౌవతాధరసీధువు= యౌవనస్త్రీ సమూహము యొక్క మోవితేనెను. ఆని=త్రాగి. అపఘనంబునక్=దేహమునందు. శర...క్షతాంకములు=చేతిగోటివాఁడిమొనలు గ్రుచ్చుటవలనఁ గలిగిన క్రొత్తగాయపుగుఱుతులను. అరజము=ఇంపు. దుర్విహారశాలి=చెడ్డనడతలు గలవారిలో అందగించువాఁడు ॥ ౧౨ ॥ అయథార్థగాథక్=అబద్ధపుక

సిగ్గుపడఁగానికరనఖశిఖరలిఖిత । జాతనూత్నక్షతాంకముల్ సమ్మతించు । నారజ
మునీరి యాదుర్వ్యవహారహారి॥ ౧౨ ॥ తే॥ నిగమశాస్త్రాభిధానంబు నేఱబీఱ। కాయయు
నుబోలె నయథార్థగాథఁదాల్ప । వైదికాచారదూరప్రవర్తనముల । వీటవిహరించు
చుండునవ్వీటిప్రోగు ॥ ౧౩ ॥ క ॥ వెడవెడదుర్వ్యవహారపు । నడవడిగడిదేఱిగురు
జనముశిక్షింపఁగ । గడుసువడి విప్రతనయుఁడు । నడికోరిచివంకపరకచాటుగ మా
నెఁగ ॥ ౧౪ ॥ తే ॥ తాతముత్తాతతండ్రులుతరతరంబు । చీమవలెఁగూడఁబెట్టియూ
ర్జితముసేయు । విత్తముడివోయెఁదత్కరాయత్తమగుచు। నురగదష్టుని మేని నెత్తురు
నుబోలె ॥ ౧౫ ॥ సీ॥ దినవెచ్చమునకునై తనమేనఁగలసొమ్ము కొమకకబచ్చింటఁగుదు
వవైచు। నిందుగీసినరీతినించుకించుక చేరిగిలుబాఁడుఁదల్లి పైఁగలపసిండి । తండ్రికిఁదొడ్డప
త్రములుదొంగిలిపోయిపోయినంతకునిచ్చిపొరయువిత్తి। *ఇష్టవడ్డికి నోర్చి ప్రత్యురూ
పములైనసాహులచేఋణగ్రాహియగుచు। గుడ్డవృత్తులువృత్తులుగొలుచుగుత్త। చే
లుగ్రామాంశములునాఁదినేలలెల్లఁ । జనవరులకమ్మెఁజూపునిచ్ఛావిహార । వర్తివాఁ
డేమిగానున్నవాఁడొహీఁద ॥ ౧౬ ॥ క ॥ అతఁడుకళింగోద్భవుఁడను । కతమునవో
వ్రేలఁజూపఁగనుగండకయో। గ్యతమస్వీకారమునకు । నితరుండైయుండెమునికులే
శ్వరవింటే ॥ ౧౭ ॥ తే ॥ పొందుఁబట్టులనప్పులుపొడిచిపొడిచి । దొరతనంబునఁజు
ట్టాలదిరిసితిరిసి। నలఁగిశిశ్నోదరపరాయణత్వమునకుఁ। బారమెఱుఁగకతిరుగునా బ్రా
హ్మణుండు॥ ౧౮॥ చ॥ తనచెలులిండ్లయందదవద్రాపుడుత్రాపుచునింటికెన్నఁడున్ ।

ఠను. వీటిప్రోగు = కొల్లలరాశి—దుర్వ్యయము మిక్కిలిచేయువాఁడు ॥ ౧౩ ॥ వెడవెడ = కొంచె
ము కొంచెము. గురుజనము = తండ్రిమొదలగు పెద్దవారు. గడుసువడి = అసాధ్యుఁడై. నడికిన్ =
నిందకు. వంకపరక = వంకరపుల్ల ॥ ౧౪ ॥ ఊర్జితము = దృఢము—నానాటఁస్థిర పడినది. ఉడివో
యెన్ = ఉడిగిపోయెను—నశించెను. తత్కరాయత్తము = వానిచేతచిక్కినది. దష్టుని = కఱవఁబడిన
వాని ॥ ౧౫ ॥ కొమకక = సంకోచపడక. ఇందుగీసినరీతిన్ = చిల్లగింజ రాచినవిధమున. గిలుబా
డున్ = అపహరించును. పోయినంతకున్ = ఎంతధనమునకు పుచ్చుకొందురో అంతధనమునకు. పొ
రయున్ = పొందును. ఇష్టవడ్డికిన్ = ఎంతయిచ్చెదనన్న యేర్పఱచినను అంతవడ్డికని. సాహులచేన్ =
సాహుకారులచేత. ఋణగ్రాహి = అప్పుతీసికొన్నవాఁడు. గుడ్డవృత్తులు = చేనిసేద్యపుఁబనులు.
వృత్తులు = మాన్యపుఁ జేలు. కొలుచు = ధాన్యము. గుత్తచేలు = ఒకరివద్ద ధాన్యపు గు
త్తకుతీసికొన్నచేలు. గ్రామాంశములు = ఊరిలోనిభాగములు. జనవరులకున్ = అధికారుల
కు ॥ ౧౬ ॥ కళింగోద్భవుఁడు = కళింగదేశమునందుఁ బుట్టినవాఁడు. వ్రేలఁజూపఁగన్ = చూచి
నవారెల్లను వీఁడిట్టివాఁడని వ్రేలితోని తెరులకుఁ జూపుచుండఁగా. కనుగండక = కొంచెమైన
నుజంకక. యోగ్యతమస్వీకారమునకున్ = మిక్కుటమయినయోగ్యులయొక్క అంగీకారమున
కు. ఇతరుఁడు = అన్యుఁడు—సరిపడనివాఁడు ॥ ౧౭ ॥ పొందుఁబట్టులన్ = సరిపడిన తావులందు.
పొడిచి = లేపి. తిరిసి = యాచించి — అడిగి. పారము = దరి ॥ ౧౮ ॥ చెలులిండ్లయందున్ = స్నే
హితులయిండ్లయందు. అదవదాఁపుడు = స్థిరములేనిత్రాగుట. దురోదరార్జితము = జూదమున

* మిండవడ్డికి యని పాఠాంతరము. మిండ = అధికము.

జనకమరోదరార్జితముచౌర్యహృతంబన్యతోపపన్నముగా । జెనఁటిపిసాళివెచ్చములఁ జేర్చుచుఁదొల్లిటివైభవంబులె । ల్లనడఁగనవ్వెడంగుకడులాఘవవృత్తికిఁజొచ్చెని చ్చలుగా ॥ ౧౯ ॥ క ॥ మితిగడచినఋణదాతలు । వెతవెట్టఁగనూరుచూరక వెలివె లిఁదిరుగుగా । దతిగూడలేకయాఁకటఁ । గుతిలపడునతండుగువ్వగుత్తుకతోడన్ ॥ ౨౦ ॥ క ॥ వలువకుఁగూటికినైనీ । చులవేడంబోడచూరవఁ జొచ్చునతఁడుపూ । వులుమ్ముడిచి నయంగళ్లనె । కలకలపీడెల్లనవ్వఁగట్టెలుమోసెన్ ॥ ౨౧ ॥ తే ॥ పదనుదివిసినకస్తూ రిప్రాఁచియలరు । పాయఁబాటినకూడునీర్వట్టుమడుఁగు । గళితమణియగుసొమ్మునై కానఁబడియె । దుర్విదగ్ధుండుగౌరవదూరుఁడగుచు ॥ ౨౨ ॥ క ॥ ఆలోనొకనాఁడాదు । శ్శీలరతునియక్కయోర్తుశిక్షించెదనీ । బాలిశునసితనముఁగనిన్ । బాలురఁగొనివచ్చెమా తృభవనంబునకున్ ॥ ౨౩ ॥ వ ॥ ఇట్లు పంచయోజనమాత్రదూరంబగు తనయూర నుండివచ్చి పితృభవనంబుచొచ్చియచ్చటఁగొన్నిప్రొద్దులుగడపి కొడుకుచెడునడవడిక నడలుకడలింబడిసుడివడియెడుతల్లి దంష్ట్రలఁ దీండ్రగల వచనరచనాచమత్కారంబు ల నుదారముదారోపణకరణోపచారంబులఁ గొంతకొంత వంతకుం దొలంగించుచు మందిరముకుందారాధనాతిథిసంతర్పణంబులు నేర్పునం బచరింపించుచు జనయిత్రీద ర్శితంబగుమూలవిత్తంబు నష్టావశిష్టంబగు నదిగుప్తంబుసేయుచుఁ బశుశిశుదాసదా సీజనంబులఁదనవారింగా మెలంగించి నలంకువలకుందొలంగించుచుఁ బుస్తకభాండా గారంబునిజభర్తృహస్తాంతరంబున నాశుశుక్షణిశిథిలబంధన యాచకప్రముఖోప ద్రవంబులవలనంబాఁచిప్రోచుచు విగళితసన్నాహంబగుగేహంబుయథాపూర్వనిర్వ హణమనోహరంబుగా ననుసంధింపించి చదువుసంతసాగించినడపించుచు నిజానుజు

---

సంపాదింపఁ బడినది. చౌర్యహృతము = దొంగతనము చేత అపహరింపఁ బడినది. అన్యతోపప న్నము = బొంకుచేతలభించినది. చెనఁటి = వ్యర్థుఁడు. పిసాళి = దొంగయెత్తుఁగలది. వెడంగు = అవివేకి. లాఘవవృత్తికిన్ = తక్కువ వ్యాపారమునకు ॥ ౧౯ ॥ మితి = గడువు. వెత = వ్య థ = శ్రమము. తఱిన్ = సమయమునందు. కుతిలపడున్ = బాధపడును. గువ్వగుత్తుకతో డన్ — హీనస్వరముతో ॥ ౨౦ ॥ బోడచూరవన్ = సన్యాసిచొచ్చునట్టిచూరవతో ॥ ౨౧ ॥ ప దను = తడి. దివిసిన = తీసిన — పోయిన. ప్రాఁచి = ప్రాఁతదైన. నీర్వట్టు = నీరుఇంకిన ట్టి. గళిత = జాఱిన. దుర్విదగ్ధుఁడు = దుర్వ్యాపారములందు చూరవగలవాఁడు ॥ ౨౨ ॥ బా లిశున్ = మూర్ఖుని. మాతృభవనంబునకున్ = తల్లియింటికి ॥ ౨౩ ॥ ప్రొద్దులు = దినములు. అడ లుకడలిన్ = దుఃఖసముద్రమునందు. సుడివడియెడు = కలఁతపడునట్టి. తీండ్రి = చూరవ. ఉ దారముదారోపణ కరణోపచారంబులన్ = మిక్కిలి సంతోషమును హెచ్చించునట్లుచేసెడియు పచారములచేతను. వంతకున్ = దుఃఖమునకు. ముకుందారాధన = విష్ణుపూజ. పచరింపించు చున్ = చేయించుచు. జనయిత్రీదర్శితంబు = తల్లిచేతచూపఁబడినది. విత్తంబు = ధనము. న ష్టావశిష్టంబు = నశించినదిపోఁగామిగిలినది. గుప్తంబు = దాఁచఁబడినది. నలంకువలకున్ = కష్ట ములకు. భాండాగారంబు = బొక్కసము. ఆశుశుక్షణి = నిప్పు. పాఁచి = తొలఁగించి. విగళి తసన్నాహంబు = తొలఁగినప్రయత్నముగలది — చక్కఁజఱపఁబడనిది. అనుసంధింపించి = జతపఱి

దుర్వ్యసనంబువలన గాసింబొందని రాజానుగ్రహలబ్ధంబులగు నేకభోగగ్రామంబు
లాత్మాధీనంబులుగా నొనరించుచుఁ దప్పిదారినమడిమ్రటచేనుచెట్లున్నపట్లరసితనప
ట్టులంగాపువెట్టుచు గుట్టికనలంగియు నత్తమామలచిత్తంబు వచ్చునట్లు భక్తిశక్తు
లుమెఱసి పాటులంబడుమఱందలి సౌందర్యంబు ననివార్యజృంభణంబగుయావనా
రంభంబును వనచంద్రికావైభవంబును వనకేళీపలాశదోహదంబు నగుటకువగచివ
గచితెగచి కడుపుచుమ్ములుచుట్టి కన్నీరుట్టిపడంబొట్టుపొరలగుచుండు నంతంజుక్క
తెగిపడినవడువున నెక్కడనుండియోయాకస్మికంబుగ నింటికింజలిదివంటకంబుఁగుడు
వంజనుదెంచి తన్నుంగాంచి డెందంబునంగొంచియుం బోరాక చేరినమస్కరించి త
లవంచికొనియున్న తమ్మునింగని కదిసి కొదమనెలవంకలవంకలొత్తుచు నెత్తురులుచి
లుకుచుం గుకవిపదబంధంబునుంబోలె నసకలప్రవృత్తంబులై మదోన్మత్తమత్తకాశి
నీదత్తంబులగునఖాంకంబులకతన కర్కశంబగునతనిశరీరంబు గౌఁగిలింపనంగలించి
శంకించియాసీమంతినియొక్కింత ఋజుస్వాంతయైయాదుర్విదగ్ధవిదగ్ధాలాపంబు
లాలయ సీమంతపుంబెండ్లికొడుకవుగమ్మని హేతుగర్భితంబుగా నాశీర్వదించి య
తండుతమకంబుగమకంబునంబోవనుంకించిన వానిసోఁకోర్వమియెఱింగి తరంగితవి
నయ సౌహార్దమార్దవ మధురంబులగు మాటల తేటలంబందిరి వెట్టి యిందుబిం
బంబునుంబోని నిజనందనుం జిఱుతవాని మేనల్లుని నిందమని చంకకిచ్చి యొచ్చటి
కేగెదవు మీబావబంతి నారగింతువు గాక శాకపాకంబులు నిమిషంబు లోనం
గావింతునని నిలిపి వెనుకదెస నెడగలసియున్న తత్కళత్రంబునకు నేత్రసంజ్ఞ యొసం

---

చునట్లుచేసి. దుర్వ్యసనంబువలనన్ = దుష్టవిషయమునందలి యపేక్షవలన. ఆత్మాధీనంబులు= తనకుఆధీనమైనది. తప్పిదారిన= పొరపాటుచే తప్పిపోయిన. మ్రట= మళ్లలోచీలికగా నేర్పడిన పాది. వట్టులన్ = బిడ్డలను. కాపు = కావలి. గుట్టిక = రహస్యము బయలుపడుపక. నలంగియున్= శ్రమనొందియు. అనివార్యజృంభణంబు= అడ్డగింపరాని విజృంభణముకలది. యావనారంభంబు=క్రొత్తప్రాయము. వనచంద్రికావైభవంబు= అడవిగాసినవెన్నెలకలిమి. అడవికిచేసిన. దోహదంబు=అకాలమునందు చిగిర్చిపూచుటకైచెట్లకుచేయుక్రియ. తెగచి=తెగించి. చుమ్మలుచుట్టి= వేదనపడి. ఉట్టిపడన్= కాఱఁగా. పొట్టుపొరలగుచుండుఃనంతన్ = నంకటపడుచుండఁగా. వడువునన్= విధమున. ఆకస్మికంబుగన్= తటాలున. వంటకంబు= అన్నము. కుడువన్= భుజింపను. కొంచి= జంకి. కొదమనెలవంకలన్= బాలచంద్రరేఖలను. పదబంధంబు= పదములయొక్కకూర్పు. మత్తకాశినీ= క్రొవ్వినస్త్రీలచేత. నఖాంకంబుల = గోటినొక్కుల. కర్కశంబు= బిఱుసైనది. అంగలించి = పూని. సీమంతిని = ముత్తైదువ. ఋజుస్వాంత= సరియైనమనసుగలది. విదగ్ధాలాపంబులు= నేర్పుమాటలు. హేతుగర్భితంబు = లోపలనణఁగిన హేతువుగలది. తమకంబుగమకంబునన్= మోహముయొక్క ప్రయత్నముచేత — మోహానంబంధమైన ప్రేరేపణచేత. ఉంకించి= యత్నించి. సోఁకోర్వమి= తానుచెప్పినమాటనువినసహింపమి. తరంగిత= హెచ్చింపఁబడిన. సౌహార్ద= స్నేహముతోడి. మార్దవ= సులభోచ్చారణముగల. ఇందుబింబంబుఁబోని= చంద్రబింబమువంటి. శాకపాకంబులు = కూరవంటలు. ఎడగల

సుటయును ॥ ౨౪ ॥ క ॥ ఆపైదలి ప్రాణేశ్వరు । శ్రీపాదద్వయము గడిగె శీతలవారిన్ । వ్యాపృతనిజనిశ్వాసజ । తాపంబునఁ గొంతకొంత తప్తము గాఁగన్ ॥ ౨౫ ॥ క ॥ విను వేల్పునకును మెచ్చొల । యని బలువిందునకుఁ బోలె నఖిలాన్నంబుల్ । కనుగీటినంతలోననె । యనుజునకుం దదగ్రజాత యమరించితగన్ ॥ ౨౬ ॥ చ ॥ తలగడిగించి ధౌతపరిధానము గట్టఁగ నిచ్చి లెస్సగా । నలకలయందుఁ గల్గుతడి యారఁగఁ దిక్క్రొవ్విరులావటించి మై । మలయజచర్చ సేసి గృహమాధవదత్తమనోజ్ఞభోజనం । బులొసఁగెం దల్లితండ్రినిజపుత్రులు భర్తయుఁ దోభుజింపఁగన్ ॥ ౨౭ ॥ ఉ ॥ ఇష్టము లైనవంటకము లిట్లు భుజించి యతండు వార్చి సం । తుష్టమనస్కుఁడై తనదు తొయ్యలి వీడ్యము చుట్టి యీ మహా । శిష్టుఁడుఁ బోలెదినే పయిచిర్నగవు ప్పఁగఁగూరుచున్న చోఁ । బుష్టిసమస్తముం గడపి పుచ్చి తదగ్రజపూర్ణచిత్తమై ॥ ౨౮ ॥ క ॥ ఇంతలు నంతలు నగు తన । సంతానము చంటవెంట సందడి సేయన్ । భ్రాంతమున నిలిచి తమ్ముని । కుంతలబంధంబు విడిచి కుశలాశయయై ॥ ౨౯ ॥ తే ॥ ఎలయు సీకాయరములతోడ సిల్లుగుక్కి । యంటు సంటులు పరికించి యంట్లఁబొడిచె । గోరుముక్కలదిగదువ్వె తూరు పెత్తి । నెఱులఁ గలిగిన పేలనన్నింటిఁ దిగిచె ॥ ౩౦ ॥ క ॥ మెడకున్న నలఁచియలకలు । ముడిగొని నిజపాణిపద్మములు గరగరగాఁ । గడుగుకొని తనకు మఱఁదలు । విడె మొసఁగుచుఁ బసిమి పసిఁడి పీవన వీవన్ ॥ ౩౧ ॥ తే ॥ చేటికానీతపీఠికాసీనయగుచుఁ । బద్మకర్ణికఁ గొలువున్న పద్మవోలెఁ । గుడివలననింత యోరగాఁ గొమరు మెఱసి । బిడ్డ నుఁ ద్రావనిట్లను బిసరుహాక్షి ॥ ౩౨ ॥ శా ॥ ప్రారంభించిన వేదపాఠమునకున్ బ్రత్యూహమౌ నంచుహో । యేరా తమ్ముఁడ నన్నుఁ జూడఁ జనుదే వెన్నాళ్ళనో యుండి చ । క్షురా

సి= ఎడమై. తత్కళత్రంబునకున్=వానిభార్యకు. ॥ ౨౪ ॥ పైదలి= ఇల్లాలు. వ్యాపృత... జనన్= వ్యాపింపఁజేయఁబడిన తననిట్టూర్పులవలని తాపముచేత. తప్తము= వెచ్చచేయఁబడినది ॥ ౨౫ ॥ మెచ్చొలయని = మెప్పు లేని. బలువిందునకున్ = గొప్పచుట్టమునకు. కనుగీటినంతన్ = కన్నుత్రిప్పినంతలోపల. అగ్రజాత= అక్క ॥ ౨౬ ॥ ధౌతపరిధానము = మడుఁగుదోవతి. అలకలయందున్= తలవెండ్రుకలయందు. క్రొవ్విరులు= అప్పుడు పూఁచిన పువ్వులు. ఆవటించి= పెట్టి. గృహమాధవదత్త=ఇలువేలుపైన విష్ణుదేవునికి నివేదనచేయఁబడిన ॥ ౨౭ ॥ వార్చి= ఆచమనముచేసి. తొయ్యలి= ఆఁడుది — పెండ్లాము. పుష్టిన్= నిండుకొన్నతనము చేత ॥ ౨౮ ॥ భ్రాంతమునన్= వెంబడిని. కుంతలబంధంబు = తలవెండ్రుకలముడి. కుశలాశయ= మంచిమనసుగలది ॥ ౨౯ ॥ అంట్లన్ = అంటుపేలను. నెఱులన్ = చుట్టవెండ్రుకలందు ॥ ౩౦ ॥ గరగరగాన్= నిర్మలముగా ॥ ౩౧ ॥ ఆనీత= తేఁబడిన. పీఠికా= పీఁటయందు. పద్మకర్ణికన్=తామరదుద్దునందు. పద్మ=లక్ష్మీదేవి ॥ ౩౨ ॥ ప్రత్యూహము=విఘ్నము. చక్షూరాజీవయుగంబు=కనుఁదామరలజంట— రెండుకన్నులును. నీరాకరంబున్=సముద్రమును ॥ ౩౩ ॥ ఉత్సేకంబు=ఎత్తు—ఆధిక్యము. ఉద్వేలస్ఫూర్తిన్=అధికప్రకాశముచేత. తలిర్చు=అతిశయించునట్టి. పోలున్=తగును. భవాదృశుండు=నీవంటివాఁడు. ఇతరుఁడు=అన్యుఁడు— అక్రమప్రవర్తకుఁడు. ఖనిన్=గనియందు ॥ ౩౪ ॥ ఏనమ్ముకున్=ఏనమ్మకమును. తత్సూనులు=వారికొడుకులు—

జీవయుగంబు వాచెనుఁ గన్గొనుఁడీ మీ బావయున్ । నీరాకల్ మదిఁగోరు చంద్రప్రొ డుపున్ నీరాకరంబుం బలెన్ ॥ ౩౩ ॥ శా ॥ శ్రీలాలిత్యము నిత్యశుద్ధియుఁ గుణోత్సేకంబునుం గల్గియు । ద్వేలస్ఫూర్తిఁ దలిర్చు తండ్రి యను నబ్ధిం జంద్రుఁడై తోఁచినన్ । బోలుం గాక భవాద్యశుండితరుఁడై పుణ్యంబులం బాసినన్ । సాలగ్రామము ఖనిం జనించు నెకదా జాత్యల్పపాషాణముల్ ॥ ౩౪ ॥ క ॥ ఏసమ్మదము గడవఁ గఁద । తూస్నులుకసుగందులఁ గ్రాగుండవు నీవి । క్లైనత అతి నెంతదుఃఖమొ । యూనిప్రోపాసపడెడు నిరుగురుపులకున్ ॥ సీ ॥ పరమేష్ఠినుండి నీతరము దాఁక విశుద్ధతరమైన వంశంబుఁ దలఁచవైతి । దరిద్రొక్కి యున్న యీ తల్లిదండ్రులఁ జాలపఱచవై సంతోషపఱచవైతి । వహ్నిసాక్షిగఁ బెండ్లియాడిన యిల్లాలి నిల్లాలితాఁకారనోల్లవైతి । ధర్మశాస్త్రార్థవిత్తముల విత్తములచే నలరించి విఖ్యాతి నందవైతి । శీలమఖిలంబు నిడిపిల్లి శీలమనుచుఁ । జదువులి విమొల్లఁజిల్కలచదువులనుచుఁ । దోడివారలు నవ్వ నాతోడ యేల । వేలవైతివి యీగుణంబేలనికు ॥ ౩౬ ॥ వ ॥ అని తదీయదురాచరణస్మరణసంతప్తస్వాంతయై యకంఠీరవమధ్య యమర్షోత్కంఠ కలకంఠకులకంఠ కాకలీపాకలీలాపహంబగు నెలుంగు చెలంగం గలంగి కుంఠితప్రబోధుండగు వాకుంఠునిం గెరలి పలికి యలుక మగిడించి యుదంచితప్రయోజనఘటనాపారవశ్యంబున సామరస్యంబు మీఱ నిట్లనియె ॥ ౩౭ ॥ చ ॥ పడఁబడఁ బాఱుచున్ వడఁకుపట్టిన తల్లిని దండ్రి నేల లో । వెడలని తమ్ముఁ గుఱ్ఱల నవీనకులాంగన నోరులేని యీ । తొడుకులఁ బంటుఁబైదవిడఁ ద్రోవక ప్రోవఁగ నెందు నీకపాల్పడినదికర్జునోదలనె భారతసంహిత నిల్చి చాటెనన్ ॥ ౩౮ ॥ ఉ ॥ నాదు సహోదరుండు సుజనస్తవనీయ నయప్రసక్తిఁబ్ర । హ్మాదులు మెచ్చఁ జేసె తని యజ్ఞమునం గడుఁ

---

తక్కిన కొడుకులు. కసుఁగందులు=మిక్కిలి పసిబిడ్డలు. ప్రోపు=పోషణమును. ఇరుగురుపులకున్=తల్లిదండ్రులిద్దఱకును ౩౫॥ విశుద్ధతరము—మిక్కిలి పావనము. తఱిఁద్రొక్కి—(చావు) సమయమును సమీపించి. పఱచవు—అల్పుఁడవు. ఇల్లాలితాఁకారన్—ఈ మనోజ్ఞమయిన యాకృతిగలదానిని. ధర్మశాస్త్రార్థవిత్తములన్—ధర్మశాస్త్రములయర్థములు తెలిసినవారిలో నధికులగువారిని. విత్తములచేన్—ధనములచేత. నాతోడ=నాసహోదరుఁడా. వేలవు=మూఢుఁడవు ॥ ౩౬ ॥ దురాచరణస్మరణసంతప్తస్వాంత=చెడుపనులు చేయుటను తలఁచుటచేత సంతాపమునొందిన మనసుగలది. కంఠీరవమధ్య=సింహమునడుమువంటి నడుముగలది. అమర్ష=కోపము వలని. ఉత్కంఠ=గొంతెత్తివలుకుటచేత. కలకంఠకుల=కోవెలల సమూహము యొక్క. కంఠ=గొంతును బోలి. కాకలీ=సూక్ష్మమైన యవ్యక్తమధురధ్వని యొక్క. పాక=పరిపాకము యొక్క. లీలా=విలాసమును. అపహము=తొలఁగించునది. చెలంగన్=మ్రోఁగఁగా. కుంఠితప్రబోధుండు=ముక్కపోయిన తెలివిగలవాఁడు. కుంఠునిన్=మూఢుని. కెరలి=కోపించి. అలుక=కోపము. ఉదంచితప్రయోజనఘటనాపారవశ్యంబునన్=మేలైన ప్రయోజనముయొక్క సమకూర్పుటయందలి పరవశత్వముచేత. సామరస్యంబు=సమరసత్వము ॥ ౩౭ ॥ తోడుకులన్=ఆవులను. బంటుఁబైదన్=కొలువుడుకాండ్రను బిడ్డలను ॥ ౩౮ ॥ నయప్రసక్తి=నీతియొక్క పాడిక ॥ ౩౯ ॥ కేదారంబులు=పరిమళ్లు. సర్దారుండవే—వెం

బూజ్యురాలనై । వేదియలంకరింతునని వేవురిలోపలనాడుకొందునీ । వేదియులేక సర్వగుణహీనుఁడనౌటయెఱుంగఁ దమ్ముఁడా ॥ ౩౯ ॥ శా ॥ వీరావేశముదాల్చిన ర్వధనము న్వెచ్చింతుగాకేమియు । క్రూరుం బందునఖండసేతువ్రతముల్ శాశ్వి రఖండంపుఁగే । దారంబుల్ తెగనమ్ముఁగాజనునె నిద్రారుండవే వెన్కనే । వ్యా రుకాలేరె సహోదరాదులు కులధ్వంసంబునీకర్హమే ॥ ౪౦ ॥ ఉ ॥ కామవికా రమాత్మనవగాఢతఁదాల్చినయేనినిర్భర । శ్రీమెఱయంగరూపగుణశీలకులోన్నతిగల్గు విప్రక । న్యామణులన్ సహస్రమయినన్ వరియించిరమించరాదె యే । మీమునుశై గృహస్థులురమించుటయొగ్గె కులాంగనాతతిన్ ॥ ౪౧ ॥ శా ॥ లోలత్వంబునమత్తకా శినులకిల్లుంబొల్లునుంజెల్లఁగా । నేలా వెచ్చముసేయ నెవ్వలనమన్నీలాఢ్యులుంజాల రే । కోలంబోజనియించువేఁడిననువీడ్కోలాభమోతండ్రిదు । శ్శీలాగారమువార యోషావతమునిస్సీ మేటివాటించునే ॥ ౪౨ ॥ సీ ॥ నర్మగర్భోక్తులునకటకట్లులువిం త నయగారములుబహునాటకములు । పిలుపిచ్చవిద్యలుపీఁకవన్నియలును బెలుచఁద నంబులుప్రేలడములు । వక్రభావంబులు వలకారిబాగులువలసియొల్లములునువట్టిప నలు । కేరడంబులుసాళగింపులుకిల్బిషా క్రీడనంబులునడకించువగలు। బాసపోవనము లువిడంబములు బిగ్గులు । లేనిమచ్చికలివియాదిగానైనవివిధ । దుర్గణంబులప్రోవులు ద్రోహమతులు । వారకాంతలదడవినవచ్చుగీడు ॥ ౪౩ । చ ॥ విడుమిఁకనైన యిట్టియవివేకముమామకబుద్ధిపద్ధతిన్ । నడువుముసీకుఁగావలసెనాహరికాస్తుభమై నఁదెచ్చెదన్ । గడుసరియచ్చకూళపలుగాకులవీడుము చేయుసీఁదుగా।నడచినవృ ద్ధకాముఁడవునాయనుజన్ముఁడ విట్లుసేయుదే ॥ ౪౪ ॥ తే ॥ అక్కయీరీతినయ ముప్రియంబుగలుగ । నానతిచ్చినసద్బుద్ధియాదరించెఁ । జాలదినములనుండియు మైలపడిన । బడుగుగావునవాఁడన్నపానకాంక్ష ॥ ౪౫ ॥ సీ ॥ రాజాలయమున కురాకపోకలుసేయు మాసినచదువులుమరలఁజమువు । నిన్నాళ్లనెచ్చెలులెదురైన తలవంచు కులవధూరత్నంబుఁగుస్తరించు । నాచార్యజనము ప్రత్యహముసంభా

---

ష్టాములేనివాఁడవా॥ ౪౦ ॥ అవగాఢతన్= అతిశయమును. నిర్భరశ్రీ=నిండినసంపద॥ ౪౧ ॥ మన్నీలు=రాజులు. కోలంబు=ఆట. దుశ్శీలాగారము=చెడ్డనడతకు ఉనికిపట్టు. వారయోషావతము =బోగముపడుచులగుంపు. ఇస్సీ=ఛీ ॥ ౪౨ ॥ నయగారములు=మోసపు మెత్తదనములు. పిలు పిచ్చ=మిక్కిలినీచము. పీఁకవన్నియలు=పైపైమెఱుఁగులు. పెలుచఁదనము=కఠినత్వము. ప్రేల డము=పలవరించుట. వలకారిబాగులు=వలపించునట్టియలంకారములు. కేరడంబులు=పరిహాస వంచించు. బాసపోసనములు=పొసఁగింపుమాటలు. తడవినన్=తలఁచినను॥ ౪౩ ॥ గడుసరి= కఠినుఁడైన. అచ్చకూళపలుగాకులన్=అచ్చపుఁగ్రూరత్వముగలదుష్టులను॥ ౪౪ ॥ బడుగు=చిక్కి నవాఁడు ॥ ౪౫ ॥ మాసిన=మఱచిన. కుస్తరించున్=ఊఆడించు. సంభావించున్ = గౌరవిం చును. ఉపహారము=కానుక. కుతపవేళ=పగలు రెండున్నరజామునకు పిమ్మటికాలము. పసిన్—

వించునర్చావళికినుపహారమిచ్చి । నర్చించుకుతపవేళాగతాతిథికోటిఁబసినేఁడుదర్శిం చుఁజైరుపచ్చఁ । దండ్రియుద్గమనీయంబు తానెయిదుకు । నత్తికాభర్తతోసవ్వన ల్పసరణి । గ్రామకార్యంబుదీర్చనంగడికివచ్చి । తేనెపూసినకత్తిధాత్రీసురుండు ॥ ౪౬ ॥ వ ॥ అతండొక్కనాడు ॥ ౪౭ ॥ సీ ॥ గోమేధికోపలాంకురమానితంబులు పుష్య రాగచ్ఛటాపుంఖితములు । వైడూర్యసంధానవర్ణనీయంబులుహరినీలకీలనాభ్యంచి తములు । కురువిందసందర్భగురుతరంబులు చతుర్విధవజ్రదళ సమావేల్లితములు । మహనీయతరహరిన్మణిపరీతంబులు సకలుషస్థూలమౌక్తికయుతములు । పద్మరాగ పరీరంభభాస్వరములు । దంతవిద్రుమకృతసముద్గకభృతములు । మాతృభూషలున త్తికామండనములు । నిజయువతిదాల్చుసొమ్ములన్నియుహరించి ॥ ౪౮ ॥ క ॥ ఒ కనాటిరాత్రిపడుపడు । కనుఁజెప్పకయిల్లువెడలిగాఢతరతమోనికరమతనదగుతో డుగ । నొకరుఁడుఁబేరడవితోవనూడనిఁబాడెన్ ॥ ౪౯ ॥ సీ ॥ శోకించువృద్ధభూ సురుఁడాత్మపితృదత్తదర్భముద్రికకుఁజిత్తంబుగలఁగ। నత్త గారిచ్చినహరిసుదర్శనపుఁ బేరునకుమ్రైదువవనటఁబొందుఁ।గ్రొత్తగాఁజేయించుకొన్నముక్కఱకునై యడలు దుర్వారమైయాఁడుఁబిడ్డ । జామాతవెతఁబొందువ్యామోహియైనవగ్రహకర్ణవేష్ట నభ్రంశమునకు । నెంతదుర్బుద్ధియెంతదుర్భ్రాంతియహహ । సర్వధనములునద్దు రాచారశీలుఁ । డూఁచముట్టుగనిలుదోఁచియుఱికెచనుట। యెఱుఁగరోగాకయెవ్వరె యెఱుకగలదె ॥ ౫౦ ॥ ఉ ॥ మోవఁదరంబుగానిధనమున్బెనుమోపుగవాఁడమర్చి యే । తోవయుఁగానిపేరడవిఁదూఱిహుటాహుటినొక్కరుండులోఁ। జావునకంగ వించిపెలుచంజనుచుండఁగనొక్కనాటిసంధ్యావసరంబునందొకపురాంతికఘోరవ నాంతరస్థలిన్॥ ౫౧ ॥ మ ॥ కరుణాదూరులుచోరులంధతమసాకారుల్ పరార్థాపహృతి।

---

పసులమందను. ఏదున్=కాపాడును. ఉద్గమనీయము=ధోవతి. అత్తికాభర్తతోన్=తోడఁబుట్టిన దాని పెనిమిటితో. అంగడికిన్=రచ్చకు ॥ ౪౬ ॥ ఉపల=ఱాయి. అంకురము=మొలక—పొడి. మానితంబు=గౌరవింపఁబడినది. ఛటా=సమూహము. పుంఖితము=పొదుఁగఁబడినది. సంధాన =కూర్పుచేత. కీలన=చెక్కడము. అభ్యంచితములు=మిక్కిలియొప్పినవి. కురువిందము= ఒకవిధమైన కెంపు. సందర్భము=కూర్పు. సమావేల్లితములు=చక్కఁగామెఱయునది. హరిన్మణి పరీతంబులు=పచ్చలచేతఁబొదుగఁబడినవి. అకలుష=దోషములేని. పరీరంభ=పొదుఁగుడుచేత. భాస్వరములు=ప్రకాశించునవి. సముద్గకభృతములు=బరణులందుంచఁబడినవి. అత్తికామండన ములు=అక్కసొమ్ములు ॥ ౪౮ ॥ గాఢతరతమోనికరము=మిక్కిలిచిక్కనయినచీఁకటియొక్క స మూహమే. ఊడనిఁబాడెన్=పాఱిపోయెను ॥ ౪౯ ॥ పేరునకున్=హారమునకు. వనట=దుఃఖము. జామాత=అల్లుఁడు. వెత=వ్యథ—దుఃఖము. కర్ణవేష్టనము=చెవిపోఁగు. ఊఁచముట్టుగన్= కొంచమయిన మిగులులేకుండ ॥ ౫౦ ॥ హుటాహుటిన్ =మిక్కిలివేగముగ. అంగవించి=సా హసించి ॥ ౫౧ ॥ అంధతమసాకారులు=కటికచీఁకటివంటియాకారముగలవారు. పరార్థాపహృతి త్వరితాంతఃకరణులు=ఒకరిసొత్తును అపహరించుటయందుఁ వడిగల మనస్సుగలవారు. దరాసదులు=

త్వరితాంతఃకరణుల్ దురాసములువిశ్వద్రోహులుద్వ్యాహులై । తెరువాటుకు వ
డిఁగ్రమ్మియొమ్మగలసందీప్తాశుగశ్రేణి నేసిరిధాత్రీసురసూనుఁగార్ముకరవాశ్లిష్టాశ
లై యీసునన్ ॥ ౫౨ ॥ క ॥ కాయంబునఁ బెదపెదపలు । గాయంబులుచేసెఁగా
కడువాఁడిమిమై । నాయమ్ములమ్మహీసురు । నాయమ్ములుదాఁకవయ్యె నాయుర్మర్మ
మన్ ॥ ౫౩ ॥ క ॥ ఒకనెత్తురుబొట్టునకూ । రకయసురులువేవ్రొడియుక్రమమున
దొంగల్ । బకనిభులాపతితునిదోఁ । చికొని రయంబడరఁజనిరి చెట్టుకొకరు
డై ॥ ౫౪ ॥ క ॥ కాఁపుకొడుకొక్కరుండా । కాపురుషుం దెచ్చెనింటికడకనుకం
పా । టోపోద్దీపితబుద్ధిఁద । దాపద్వినివారణక్రియాభిముఖుండై ॥ ౫౫ ॥ సీ ॥ ని
తృపరిత్యాగవర్ధితకిల్బిషమువోవ నెత్తుకై వడిఁబ్రేళ్ల నెత్తురొత్తి । కూర్కు ప్రాణము
ల మేల్కొలుపుచాడ్పునగంట్ల శాకినీకాండంబుసణిపిచూచి । సమయంబుగాదనిశవ
నుదూతలఁదోఁయుజాడమైనాటుశస్త్రములు పెఱికి । పతయాళువగుబొందిపడకుం
డుటకుఁగండ్రవురులిచ్చు గతిఁజాలఁబొత్తులునిచి । వట్టికూడును వేసిల్లు పెట్టియొట్టి । గఱ
గువిద్యంబులిప్పించివలఁతిమైన । వెజ్జునేచరించియరయించెవిప్రసుతుని । కంటవత్తిడు
కొని సైరికప్రభుండు ॥ ౫౬ ॥ క ॥ నిరనిలసంచారస్థల । మరయికను స్నేహపూ
మాయుస్థితియూ । యిరుదెఱఁగు బలిమినర్దశఁ । బూరయకదీపమ్ముపగిది భూసు
రుఁడెసఁగెన్ ॥ ౫౭ ॥ ఉ ॥ తానప్రసంగముల్ దిగిచితత్సరణిన్ దనపెంపు పెద్దగా
బూనివచించునక్క పటపూరుషునిక్క మనమ్మెనెమ్మదిన్ । జానపదాగ్రగామితన
జాతియునాతియుఁగూడి దేవునిం । గానిజదేశికోత్తమునిఁగాఁబరమాప్తునిఁగాఁదలం
చుచున్ ॥ ౫౮ ॥ క ॥ తలలోపలనాలుకపూ । సలలోదారంబు పాలఁజల్లినసీరుంబ లెవెలి

---

అసాధ్యులు. ఒక్కుమ్మడిన్=ఒక్కసారిగా. అగలన్=పగులఁగా. సందీప్తాశుగశ్రేణిన్=మిక్కిలి వెలిఁగెడిబాణములపఙ్క్తులను. కార్ముకరవాశ్లిష్టాశులు=ధనుస్సుయొక్కధ్వనితోఁగూడినదిక్కులుగల వారు. దిక్కులందు ప్రతిధ్వనిపుట్టునట్టుగా వింటిని ధ్వనింపఁజేసినవారు. ఈసునన్=కోపముతో ॥ ౫౨ ॥ కాయము=దేహము. ఆయమ్ములు=ఆబాణములు; మర్మస్థానములు ॥ ౫౩ ॥ ఒడియుక్రమమునన్=పొంచికమ్ముకొనెడివిధమున ॥ ౫౪ ॥ కాపురుషున్=నీచుని. అనుకంపాటోపోద్దీపితబుద్ధిన్=దయాతిశయముచేత వెలుఁగునట్టిబుద్ధితో. ఆపద్వినివారణక్రియ=ఆపదను తొలఁగించునట్టివ్యాపారము ॥ ౫౫ ॥ వర్ధితకిల్బిషము=వృద్ధినొందింపఁబడినపాపము. కూర్కు=నిద్రించు. గంట్లన్=గాయములందు. శాకినీకాండంబున్=వత్తులసమూహమును. సణిపి=చొప్పించి. పతయాళువు=పడునట్టిస్వభావముగలది. బొంది=దేహము. గండ్రవురులు=ఊఁతకోలలు. పొత్తులు=పొత్తిగుడ్డలు. ఒట్టి=కారము. వెజ్జున్=వైద్యుని. ఎచరించి=ఎచ్చరించి—ఎచ్చరికచేసి. కంటవత్తిడుకొని—ఏమఱక. సైరికప్రభుండు=కాఁపువారు ॥ ౫౬ ॥ నిరనిల=గాలిలేని. అరయిక=విచారణ. సుస్నేహపూరము=(మొదటియందలి) మంచిచమురుయొక్క సమృద్ధి. దుర్దశన్=చావును. పొరయక=పొందక. ఎసఁగెన్=అతిశయించెను ॥ ౫౭ ॥ పెంపు=పెంచుట. జానపదాగ్రగామి=పల్లెపట్టులయందుండువారిలో ముఖ్యుఁడు—కాఁపువాఁడు. జాతి=కులమువారు=చుట్టములు. నాతి=పెం

మెఱుఁగకమనసులు । గలసియభేదమునఁ గాఁపుర మొనర్తుఁడుండెన్ ॥ ౫౯ ॥ క॥ కలదా శూద్రవసతిశశి। కలదానన జాలునొకవికారపుఁ గోడల్ ।చలదాలోలకటాక్షా ౦।చల దామనిబద్ధతరుణజనఖంజనమై ॥ ౬౦ ॥ ఉ॥ ఇంటికినడ్డమాఁక యొకయంతయులేకచరిం చువానిచే । నంటినఁ గందు గెందళుకు లంగమునం గలవానిమిక్కిలిం । గంటికినిం చువానిఁ దెలికన్నులవానిఁ బిసాళిఁ బాఁపనిం । బంటదిగోరు చారుకుచపంజరకీరము గా రవింపఁగన్ ॥ ౬౧ ॥ సీ॥ పలువికారంబులఁ గలగల్పుఁ జూపులరాకపోకలబయల్ పాఱఁ జేయుఁ। దమకంబు గమకంబు దత్తఱంబునుహత్తి మనసు సాఁగినపజ్జఁ జోనపుఁ గోర్కి । కుదురు పాలిండ్లపైఁ గొంగు జాఱఁగఁ గొప్పువీడ నూరకనవ్వు వెత్తినవ్వు । నే రాలిపట్టి బిట్టొత్తి చెక్కిలినొవ్వఁ గఱచి వాఁడేచ్చినఁ గౌఁగిలించు । దండ సకెమెడఁ బుం జాలదండఁ బెట్టుఁ । దిట్టు మెట్టెలు బిగువంచుఁ దెగి కళాదు । వనితచిన్నారిపొన్నారి వయసువాని । విప్రనందనుఁ గన్నంత వెకలియగుచు ॥ ౬౨ ॥ క॥ దుర్గలితాతనువి లసన । నిర్లజ్జాస్వాంత కాంత నేరుపు మెఱయన్ । జెర్లాటమాడు మోహము । లే ర్లయివర్తిల్లనమ్మహీసురుతోడన్ ॥ ౬౩ ॥ తే॥ దృష్టిపాతంబునోడివిమైదెరలఁబ ట్టు । ఫాలపట్టికగనుపట్టబాలచేల । నిఱియఁదలఁ గట్టి యొకమూలనొఱగు నేల । గ్రు డ్లనీరుట్టఁ బఱచిన కొంగుమీఁద ॥ ౬౪ ॥ ఉ॥ తేలెడు కన్నుదోయి వడదేఱెడు ముద్దుమొ గంబు సారెఁ గై । వ్రాలెడు గొప్పకొప్పువసివాడెడు నన్నువకౌను కాఁకలం । దూలె డు లేఁత మేను నయి తొట్రిలు నమ్మగనాలినాలి బా । గాలఘువర్తనుండరసియంగజబా ధితగాఁ దలంచుచున్ ॥ ౬౫ ॥ క॥ ఎవ్వనికివలచెనో కోయీ । జవ్వనియనిరవ్వపొ ఱుసరసోక్తులు లే । నవ్వులు ముడిచిన పువ్వుల । రువ్వులుఁ దనయందెస మధిరూఢము

---

ల్గాదు. దేశికోత్తమునిఁ గాన్ = గురుశ్రేష్ఠునిఁ గా ॥ ౫౮ ॥ ౫౯ ॥ వసతిన్ = ఇంటియందు. శశికల=చంద్రకళ. చలదా⋯ఖంజన =చలించుచున్నవియు అంతటతిరుగుచుండునవియునైన క డకంటి చూపులనెడి యురులచేత కట్టఁబడినయౌవన పురుషులనెడి కాటుక పిట్టలుగలది ॥ ౬౦ ॥ ఆఁక= నిర్బంధము. కందు= వర్ణహీనమగు. తళుకులు= తళతళకాంతులు. ఇంచు= ఇంపగు. పిసాళి=వంచకుఁడైన. కీరమున్=చిలుకను ॥ ౬౧ ॥ కలగల్పు= ఏకమత్యము. తమకంబు గమ కంబు=మోహముయొక్క ఆధిక్యము. హత్తి=పొంది. పజ్జన్= ప్రక్కను. పాలిండ్లు=స్తనము లు. ఏరాలిఁబట్టి=తోడికోడలిబిడ్డను. బిట్టు=మిక్కిలి. దండసకెమెడన్ =దగ్గఱనుండెడిచెలిక త్తెయొక్కమెడను. పుంజాలదండ=మెడను ధరించెడి యొకవిధమయిన యాభరణము. తెగి=తెగఁ బడి. కళాదున్=అగసాలెవానిని. చిన్నారిపొన్నారి=మనోజ్ఞము. వెకలి=ఆసక్తురాలు ॥ ౬౨ ॥ దుర్గలితాతనువిలసననిర్లజ్జాస్వాంత=దుష్టమయిన యొయ్యారముతోడిమన్మథోద్రేకముచేత లజ్జలే నిమనసుగలది. చెర్లాటము = పరిహాసము ॥ ౬౩ ॥ గ్రుడ్లన్ = కనుగ్రుడ్లయందు. ఉట్టన్= కాఱఁగా ॥ ౬౪ ॥ వడ=తాపము (లేక) బడలిక. వసివాడు=మిక్కిలివాడు. అన్నువకౌను= సూక్ష్మమయిన నడుము. కాఁక=తాపము. నాలి=కుత్సితము. లఘువర్తనుఁడు = నీచప్రవర్తన ముగలవాఁడు ॥ ౬౫ ॥ రవ్వ=అల్లరి. రువ్వు=విసరుపాటు. సమధిరూఢములు=చక్కఁగా ఎక్కి

లగుటన్ ॥ ౬౬॥ మ॥ బళిరా తేరకుఁ దేరఁ దక్కె నిటులీ బంగారుకుండంచుఁ జం । కలు
దాటించుచుఁ గెంపుమోవి దోఁడుకం గాఁ గుబ్బపాలిండ్లు బి । ట్టలమంగాఁ ముఖగంధపా
రణము సేయంగాఁ గటీసీమను । త్పలపత్త్రాళి ఘటింపఁగాఁ దివురు మిత్త్రద్రోహి హీ
మోహాంధతన్ ॥ ౬౭ ॥ సీ ॥ తలఁపుండ్లు గడిగించి తనుఁ బ్రతికించెఁ గా యడవిఁ జోరా
హతుండైనఁ దెచ్చి । కన్నబిడ్డల కన్న గారవంబునఁ జనవిచ్చెఁ గా నిచ్చలు నింటిలోన ।
గ్రాసవాసక్లేశకశ్మలత్వ మడంచి యనురక్తిఁ బెనిచెఁ గా యనుదినంబు । గురువు గా
వేల్పు గాఁ గూర్చు చుట్టంబు గా భావించి కొలిచెఁ గా భక్తియుక్తి । నెవ్వఁ డా రెడ్డి యిం
టికి నెగ్గు చాలఁ । జేయు గుడి నుండి గుడి తాళ్లు దీయు కరణిఁ । గపటనటనానటుఁడు త్రా
టఁ గట్టుబోయ । కాయజామేయసాయకాఘాతభీతి ॥ ౬౮ ॥ చ ॥ కరఁగిన డెంద
ముల్ విడుపు గాన నికోర్కులు పారవశ్యమున్ । బొరసిన నిట్టచూపులు గుముర్కొనుము
త్పులకాంకురావళుల్ । చిరిఁగిన సిగ్గులుం గలిగి చీఁకటి వేఁకటి రేలఁ జాలవా । విరిఁ దవి
రాకుఁ బోఁడి యునలీకవిశిష్టుఁడు దుష్టచేష్టలన్ ॥ ౬౯ ॥ మఱిఁ బాపమనక ప్రాణ ।
చ్యుతికరమగు తెగువకుఁ దఁడు చొరఁబడె నరకే । సతి కో దోషో మరణే । సతి కిం భయమ
న్నచదువు చదువంబోలున్ ॥ ౭౦ ॥ ఉ ॥ అద్దమరేయి దాఁక పొలమారసి మారశిలీము
ఖాహతిన్ । నిద్దురఁ గాచియున్నను గనిన్ జగనీలిపిసాళిజంతయ । మ్ముద్దియ సేవ సేయ
దోఁక ముచ్చట యాడదు మూఁగఁ బోలెనే । సుద్దియు లేక కన్మొగిచి చూచు మనోగతిఁ
దోఁచు చెల్వునిన్ ॥ ౭౧ ॥ సీ ॥ పొన్నాకు పై తేనె సన్నచంద్రిక మోవి మాధుర్య మన
క వేమాఱుఁ బొగడి । యామని బుగబుగలంగ చంపకదామగంధం బనక పెక్కుగతుల నె
న్ని । పడనున్న పండ్లసంపద పెంపు పాలిండ్ల బీరంబనక సారెసారెఁ దలఁచి । తెలియ నభ్రి
చ్ఛాయ వలమాన కచభరప్రకటనంబనక మాటికిని మెచ్చి । దినదినంబును గసికాటు చెన

---

నవి ॥ ౬౬ ॥ తోడుకంగాన్ = గ్రహింప. అలమంగాన్ = ఆక్రమింపను—పట్టను. తివురున్ = యత్నించును ॥ ౬౭ ॥ చనవు = స్వాతంత్ర్యము. గ్రాసవాసక్లేశకశ్మలత్వము = అన్నవస్త్రములకై కష్టపడుటయనెడి మైలను. కూర్చు = ప్రియమైన. కాయజామేయసాయకాఘాతభీతిన్ = మన్మథునివైన మేరలేని బాణముల దెబ్బలవలని భయముచేత ॥ ౬౮ ॥ డెందములు = మనసులు. పారవశ్యము = చొక్కు. నిట్టచూపులు = చలింపనిచూపులు. కుత్పులకాంకురావళులు = సంతోషమువలని గగ్గురుమొలకలపఙ్క్తులు. చిరిఁగిన = చినిఁగిన—పోయిన. చీఁకటి వేఁకటి రేలన్ = చీఁకటిగల రాత్రులందు. వావిరిన్ = వాలాయముగ. అలీకవిశిష్టుఁడు = కపటమైన యోగ్యతకలవాఁడు ॥ ౬౯ ॥ ప్రాణచ్యుతికరము = ప్రాణముపోవునట్లు చేయునది. నరకే సతి = నరకమగుచుండఁగా. కో దోషః = ఏమిదోషము. మరణే సతి = చావుఅగుచుండఁగా. కిం భయమ్ = ఏమిభయము ॥ ౭౦ ॥ అద్దమరేయి = అర్ధరాత్రము. జగనీలిపిసాళిజంత = మిక్కిలిమాయచేష్టలను వ్యాపింపఁజేసెడిధూర్తురాలు. చెల్వునిన్ = విటుని ॥ ౭౧ ॥ చంద్రికమోవి = ఎఱ్ఱఁదనముగలయధరము. ఆమని = వసంతఋతువు. బీరంబు = బిగువు. అభ్రిచ్ఛాయ = మబ్బునీడ. వలమానకచభరప్రకటనంబు = వట్రువగాఁ జుట్టఁబడుచున్న కొప్పయొక్క ప్రసిద్ధి. కసికాటు = తగిలీతగులకకఱచుట—కొంచెపుఅనుభవము. చెనకు = తాఁ

కువలన । డప్పిదీ యనితమకంబు దెప్పరంబుఁ। బాపసమకట్టి జారుఁడపాయుఁడసతి। నె
త్తుకొనిపోవ నిందందు నెడరు వేచె॥ ౨౨॥ క॥ ఆతతిఁ దన్నగరీపతి। జాతరసాటించెఁ
బశువిసరమనితరసా। ధ్యాతతవాతామయని। ర్ఘాతాహతిఁ దూలగాలిగంగలకె
ల్లన్ ॥ ౨౩ ॥ సీ॥ గోర్వచ్చ చమురంటుకొని రిమ స్తకములఁ జలకమాడిరి నిశామిళిత
వార్ధి। కట్టిరిచిఱుతచౌకములఁ గ్రొంబుట్టముల్ కాటుకదీర్చిరి కన్నుఁగవల। దిద్దిరి సిం
దూరతిలకంబు బటువుగా నిక్కఁగొప్పులవిరుల్ గ్రుక్కిరర్థి। నింబప్రవాళమాల్యంబు
లువై చిరిచిట్టిపొట్టి ధరించిరిట్టునట్టు। తరుణధావనధగధగద్దశనమణుల। హత్తుకొ
లిపిరి లేఁతపిడ్యములడాలు। పర్వదినములఁ బామరప్రమదలుదిత। నియమసంభా
వనారంభనిభృతబుద్ధి॥ ౨౪ ॥ క॥ ఎడ్డెతనపుఁగయిసేఁతల। రడ్డులు నడచిరి పుర
స్సరద్భార్యముగా। గుడ్డంబుచక్కఁగట్టం। బడ్డమహాశక్తిదివ్యభవనంబునకున్ ॥ ౨౫ ॥
వ॥ అమ్మహోత్సవం బజప్రధానంబగుట విబుధసభయుంబోలియు మహాసురో
దారంబును, తమోవికృతివిధేయంబగుట విధుబింబంబునుంబోలియుఁ దారావియో
గముదితంబును, బహుళధ్వనిపరీతంబగుట సత్కవిత్వంబునుంబోలియు నసాధువ
ర్ణసంబాధబంధురంబయ్యె నయ్యెడ ॥ ౨౬ ॥ సీ॥ అంభోధరముక్రిందనసియాడునై
రావతియుఁబోలె సిడిఁ బ్రేలెఁ దెఱవయొకర్తు। చెందమ్మికొలనరంజిల్లునంచయుఁబోలె

---

కుట. తమకంబు దెప్పరంబు=మోహాతిశయమును. అసతిన్—అంకులాఁడియగు నాకాఁపుదానిని. ఎ
డరు=సందు. వేచెన్=కనుపెట్టెను ॥ ౨౨॥ అనితర..హతిన్=అనితరసాధ్య=ఇతరముచేత సాధింప
రాని. ఆతత=విశేషమయిన. వాతామయ=గాలికుంటు తెవులనెడి. నిర్ఘాతాహతిన్=పిడుగుదెబ్బ
చేత. గాలిగంగలకున్=పిశాచరూపిణులైన క్షుద్రస్త్రీదేవతలకు ॥ ౨౩ ॥ నిశామిళిత=పసువుకలసిన. బ
టువుగాన్=వట్రువగా. నింబప్రవాళమాల్యంబులు=వేఁపచిగురుదండలను. చిట్టిపొట్టి=చిన్నచిన్న
సొమ్ములను. తరుణధావనధగధగద్దశనమణులన్=సమయమునందుఁదోముకోఁబడిన దగదగప్రకా
శించెడి రత్నములవంటి పండ్లయందు. హత్తుకొలిపిరి=కూర్చిరి. డాలు=కాంతి. పామరప్రమదలు=గ్రా
మ్యస్త్రీలు. నిభృత=దిద్దఁబడిన ॥ ౨౪ ॥ ఎడ్డెతనపుఁగయిసేఁతలన్=మోటుతనపు అలంకారముల
తో. పురస్సరద్భార్యముగాన్=ముందు నడచుచున్న భార్యలుకలుగునట్టుగా. గుడ్డంబు చక్కన్=
చేని వెంబడి ॥ ౨౫॥ అజప్రధానంబు=మేఁకపోతులు ముఖ్యముగాఁగలది; బ్రహ్మముఖ్యముగాఁగల
ది. విబుధసభ=దేవసభ. మహాసురోదారంబు=అధికమైన కల్లుచేత హెచ్చినది; గొప్పయసురులచేత
దొడ్డది. తమోవికృతివిధేయంబు=తమోగుణవికారమునకుడునికి పట్టయినది; చీఁకటి వికార
ముచేత లోఁకువైనది. విధుబింబము=చంద్రబింబము. తారావియోగముదితంబు=కంటిగ్రుడ్లయెడఁబా
టుచేత సంతోషించినది—అనఁగా కన్నులు తేలవేయుటచేత సంతోషించినది; తారయెడఁబా
టుచేత సంతోషించినది. బహుళధ్వనిపరీతంబు = అధికధ్వనిచేత ఆవరింపఁబడినది. సత్కవిత్వ
ము=మంచికవిత్వము. అసాధువర్ణసంబాధబంధురంబు=నీచజాతులగు జనుల యొరపిడిచేత ఒప్పిదమై
నది; తప్పు అక్షరముల నింపుచేత ఒప్పిదమయినది ॥ ౨౬ ॥ అంభోధరము=మబ్బు. ఐరావతి=మె
ఱుపు. సిడిన్=సిడిమ్రానియందు. చెందమ్మి=ఎఱ్ఱదామర. నిప్పులేటన్=నిప్పుల యేటియందు. తొలు

నిప్పు లేటఁ జరించె నెలఁతయొఱ్ఱు । తొలుసంజ యెండ వత్తిలు నంచ యనుబోలె నీఁగ
బందిరిగుండ మింతియొఱ్ఱు । జలనీలిపై నెక్కు కలువ మొగ్గయుఁ బోలె ననఁటాకున ర్తిం
చెనతివయొఱ్ఱు । కాంతయొక్కర్తు మూఁపునఁ గండలిచ్చె । మారు గాలిచ్చె నొక సుధా
మధురవాణి । లలనయొకర్తు నోరి తాళంబులిచ్చె । శక్తిజాతర సద్భక్తి శక్తులెసఁ
గ ॥ ౭౭ ॥ క ॥ బత్తులు ననువాకత్తుల । మొత్తిరి పశుసమజముండములు చండము
లౌ । నెత్తురుధారలు ఘోరవి । పత్తిమిరనవారుణప్రభలు ప్రబలంగన్ ॥ ౭౮ ॥ తే ॥
పెలుచఁగలు చొక్కు చెలువలతలకు నెక్కు । తోనదిక్కులతల కెక్కుఁ దోడఁ గెఁదమము ।
దేవిగుడిలోన నొక్కొక్క దివియ వోఁప । దోన నొక్కొక్క చుక్కయుఁ దోఁచె మిం
ట ॥ ౭౯ ॥ క ॥ ఎడరగుట దెలిసి పాఱుం । బోడువఁడు గొనిచని మొమాఱు భూమికి
నటసం । దడి బొమ్మఁడు పెండ్లాడెడు । వడువునఁ గసుగాఁపుఁబూపవయసుమిటా
రిన్ ॥ ౮౦ ॥ తే ॥ కాఁపుఁగోడలు కంచంత కాఁపురంబుఁ । బాలవంటికులంబుఁ గా
ద్పుటిచియుటికె । మగని నటు వెట్టి రెండవమగని వెంట । నువిదలకు బుద్ధి పెడతలనుండుఁ
గాదె ॥ ౮౧ ॥ ఉ ॥ ఆకుమలుంగు పిందెయయి యంతిపురంబును బోలె నన్నరా ।
కాకుముదప్రియాస్య భయగాఢతరత్వర నేఁగనిలో । నాఁకలి దప్పియున్ రవికరార్తి
యు నెన్నదు మన్మథాస్త్రకీ । లాకులతప్త చిత్తులకు లక్ష్యమె తక్కిన నొప్పు లెవ్వి
యున్ ॥ ౮౨ ॥ సీ ॥ కఠినకంఠీరవాక్షత నఖక్షత జరత్కరి శిరశ్శుక్తిశార్కరిలతలము ।
లాశాంతజంతుకంఠాసృగుగ్రవ్యాఘ్రముఖఘుహాభాంకారముఖరితంబు । లశ్వద్విప

---

సంజ=ప్రాతఃకాలము. ఈఁగెన్ = చొచ్చెను. పందిరిగుండము= పందిటిలోనినిప్పులగుండము
ను. జలనీలి=పాఁచి. అనఁటాకున ర్తించెన్=అరఁటియాకువేసి దానిపై నాట్యముచేసెను ॥ ౭౭ ॥
బత్తులు=భక్తులు. ననువాకత్తులన్ = సన్నపైన వాదరగలకత్తులచేత. పశుసమజముండములు=ప
సులగుంపుల తలలు. చండములు=భయంకరములు. ఘోరవిపత్తిమిరనవారుణ ప్రభలు=భయం
కరమయిన యాపత్కాలమునందలి క్రొత్తవియగు ఎఱ్ఱనికాంతులు. ప్రబలంగన్ = అతిశయించఁ
గా ॥ ౭౮ ॥ పెలుచన్=అధికముగా. తమము=చీఁకటి ॥ ౭౯ ॥ పాఱుంబోడువఁడు=దుష్ట
బ్రాహ్మణుఁడు. కొని= తీసికొని. బొమ్మఁడు = బ్రాహ్మణుఁడు. కసుగాఁపుఁబూపవయసుమిటా
రిన్ = పసిదియు పూవువలె మనోజ్ఞమయిన వయసుగలదియు నైన కాఁపువడుచును ॥ ౮౦ ॥
కాడ్పుటిచి=చేటిది. ఉటికెన్=పాటిపోయెను. పెడతలన్=వెనుకటితలయందు ॥ ౮౧ ॥ రాకా
కుముదప్రియాస్య=నిండుపున్నమనాటిచంద్రునివంటి ముఖముగలది. భయగాఢతరత్వరన్=భయ
ముచేతమిక్కిలి హెచ్చయినత్వరచేత. రవికరార్తి=ఎండవలనిబాధ. మన్మథాస్త్రకీలాకులతప్తచిత్త
లకున్=మన్మథునిబాణములవలని మంటలచేత కలఁతపడితపించునట్టిమనసుగలవారికి ॥ ౮౨ ॥ కఠి
న...తలములు—కఠిన=కఠోరములైన. కంఠీరవ= సింహములయొక్క. అక్షత= మొక్కపోని.
నఖ=గోళ్లచేనైన. క్షత=గాయములుగల. జరత్కరి= ముసలియేనుఁగులయొక్క. శిరః= తలల
యందలి. శుక్తి=ముత్తెపుఁజిప్పలచేత. శార్కరిల=గులకగలవియైన. తలములు=ప్రదేశములును.
ఆశాంత...ముఖరితంబులు— ఆశాంత=దిక్కులకొనలయందలి. జంతు=జంతువులయొక్క. కం
ఠ=మెడలవలని. అసృక్=నెత్తుటిచేత. ఉగ్ర=భయంకరములైన. వ్యాఘ్ర=పెద్దపులులయొక్క.

ద్విషాణాగ్రనిగ్రహావహత్ప్రస్తరప్రసవసౌరభమయంబు । లజ్ఞాతరవికరవ్యాపార
భూరుహచ్ఛాయానపాయాతిశైత్యఖనులు । గహనఘంటాపథంబులుగడచినడచి
యొక్కపక్కణమీక్షించియాయడిల్లి । యవరవర్ణస్నుషయుబ్రాహ్మణాధముండు ।
బోయకులమునఁగలసిరిపొలుపుదక్కి ॥ ౮౩ ॥ తే ॥ ఎన్నిజన్మంబులేనియుఁజన్నపి
పిదపఁ । గానిప్రాపింపరానిధరానిలింప । జాతిగడెలోననప్పాపజాతితొఱఁగి ।
కల్లుపెల్లానివేఁటాడుగరుసునొరసి ॥ ౮౪ ॥ క ॥ స్వఘ్రాణానిలసౌరభ । మాఘ్రా
ణింపఁగమదాకులాఖేటరతిన్ । వ్యాఘ్రాదికభయదాటవి । శీఘ్రగతిన్ మెలఁగునస
తిచెలువ్రఁడుఁదానున్ ॥ ౮౫ ॥ మ ॥ గతిమధ్యస్తనకుంతలస్తబకవీక్షాగర్వదుర్వార
యా । సతిచేమానమెఱయనమర్త్యానీకనిస్సారంబుప్రాణంబుదా । ల్చుతగుల్ గా
దనిరోసియావృషలివాలుందూపుఁగ్రొమ్మంటకా । హుతియైబర్హిమృగేంద్రకుంభిచ
మరీయూథంబు నేణంబులన్ ॥ ౮౬ ॥ సీ ॥ జళుకులువాఱలెస్సగదంచివెదురువియ్య
మునుబున్నవ్వలవలెనలఁతిలోవి । వార్చిడించినక్రొత్తవంటకంబతిమాత్రధాతశరావ
పాత్రమునఁజాల । వడ్డించిపలువన్నెవన్యామిషంబులుచుట్టువాఱఁగనుంచిచొక్కట
ముగఁ । గాఁచినగురునెయ్యిచేచాఁచఁజాలినంతయుఁగుమ్మరించితత్క్రమూర। మొ
కయలాబుశలాటుఖండోదరమునఁ । బూన్చియటుడించితానునుబొత్తుగలసి । సామి

---

ముఖగుహా=నోళ్లనలన వెడలెడి. భాంకార=భాం అనెడిధ్వనులచేత. ముఖరితంబులు=మ్రోఁగు
నవి—ప్రతిధ్వనులిచ్చునవి. అశ్వద్విష...మయంబులు—అశ్వద్విషత్=కారెనుబోతులయొక్క. వి
షాణ=కొమ్ములయొక్క. అగ్ర=మొనలచేత. నిగ్రహ=భేదింపఁబడుటచేత. వహత్=వహించు
చున్న. ప్రస్తరప్రసవ=ఱాతిపువ్వులయొక్క. సౌరభమయంబులు=పరిమళవికారములుగలవి.
అజ్ఞాత...ఖనులు—అజ్ఞాత=తెలియబడని. రవికర=సూర్యకిరణములయొక్క. వ్యాపార=వ్యా
పారముగల. భూరుహ=వృక్షములయొక్క. ఛాయా=నీడలచేత. అనపాయ=అపాయములేని.
అతిశైత్య=మిక్కిలి చల్లఁదనమునకు. ఖనులు=గనులు—స్థానములు. గహనఘంటాపథంబులు=
అడవుల పెద్దబాటలు. కడచి=దాఁటి. పక్కణము=బోయపల్లె. అవరవర్ణస్నుష=శూద్రునికో
డలు. పొలుపు=ఒప్పిదము ॥ ౮౩ ॥ ప్రాపింపన్=పొందను. ధరానిలింపజాతిన్=బ్రాహ్మణకు
లమును. పాపజాతి=దుర్జనుఁడు. తొఱఁగి=విడిచి. గరుసు=మేర ॥ ౮౪ ॥ మదాకులాఖేటర
తిన్ = మత్తుచేఁకలఁతనొందినవారలైన వేఁటాడుటయందలి యాసక్తిచేత ॥ ౮౫ ॥ గతి...దు
ర్వార—గతి=నడక. మధ్య=నడుము. స్తన=చనులు. కుంతలస్తబక=కొప్పు. వీక్షా=చూపు. గర్వ=
వీనివలనిగర్వముచేత. దుర్వార=నిలుపరానిది. తాల్చుతగులు=ధరించుటయందలియాసక్తి. కా
మ=తగదు. వృషలి=శూద్రస్త్రీ. వాలుందూపుఁగ్రొమ్మంటకున్=అతిశయించినబాణములవలని
క్రొత్తమంటకు. బర్హి=నెమలి. కుంభి=ఏనుఁగు. ఏణంబులు=జింకలు ॥ ౮౬ ॥ జళుకులు=
పొట్టు. అలఁతిలోవిన్=చిన్నవంటకుండయందు. అతిమాత్రధాతశరావపాత్రమునన్=మిక్కిలి
చక్కగాఁగడుగఁబడినమూకుటియందు. వన్యామిషంబులు=అడవిమృగములమాంసములు. చొక్క
టముగన్=స్వచ్ఛముగ. గురునెయ్యి=గవయమృగముయొక్క నెయ్యి. అలాబుశలాటుఖండోదర
మునన్=వెట్టిసొరకాయ చిప్పలో. సామిదష్టాన్నకబళములు=సగము కఱచిన అన్నపుముద్దలు.

దష్టాన్నకబళముల్ సామికొసఁగు । నగుచుఁజవులెచ్చరించుచునిగురుఁబోఁడి॥ ౮౭
శా॥ కాఁపుంగెంజికురాకుఁబోఁడిపరలోకంబంతప్రాపింపుడున్ । వ్యాపాదంబు
నాతఁడొందుగడరూపాజీవరాజాననం । దాపింఛచ్ఛదగుచ్ఛసచ్ఛవిమదాంధన్ బ
ధురశ్రోణివీ । ణాపాణింధమపాణినొక్కప్లవకన్యంగూడిక్రీడింపఁగన్ ॥ ౮౮ ॥ వ
అపవిత్రంబగు పుత్రలాభంబు దత్కళత్రంబునందు సంభవించె నిట్లానష్టపూర్వద్వి
జన్ముండుకష్టమార్గంబున నెలఁసి నెలతయుందానును బ్రాలుమాలి మృణాళనాళపే
శలంబగుఫణాధరపరివృఢ ఫణాఫలకతలి మతలంబుననంటసిలంబడ నెడనెడం బెక్కు
పాతకంబులుపార్జించుచు వర్తించి వర్తించియొక్కనాఁడొక్కరుండునుం గురుక
కుమారయుగళంబుఁ గుపితశరభసభంబగుదాని గళగళాయమాన గళనిగళనియమి
తంబుగఁ గేలఁగీలించి యొంటిపాటున వేఁటపైఁగలతివుట నూటాడుచు సమీపాట
మధ్యంబుఁజొచ్చి యాస్ఫోటించి పిక్కచెదరక దిక్కులుపరిభ్రమించి యుదభ్రమఁ
విభ్రమ భూయిష్ఠంబులగు మృగంబులం దెగఁజూచి యేచి కన్నిచ్చకువచ్చు పెక్కు
నంజుడులు చేవడించక కావడించి ప్రొద్దస్తమించు నంతకు నిజ నిశాంతంబునకు
బఱతెంచునప్పుడు॥౮౯॥ మాలిని॥ కుపితశమనచక్షుః క్రూరదుర్వారకీలా । స్థపుటి
తమగువహ్నిన్దద్దివాకీర్తియిల్ల్రమ । గ్గిపడియెమధుపానక్షీబజాయాతనూజా।
పరిజనయుతంబై దైవదుర్భావదృష్టిన్॥౯౦॥ చ॥ తనగృహమిట్లుపత్యపశుదారధనా
దులతోడఁబ్రుగ్గఁగాఁ । గని వెఱఁగందికందికనుఁగ్రంతలమంతలఁబోసినట్లుపో । రన
గడుబాష్పపూరములుగ్రమ్మఁగ నేడ్చుచు మూర్ఛవోయియ । ల్లనఁ దెలిసెన్ వినిందిత

---

సామికిన్ = ప్రియునికి ॥ ౮౭ ॥ వ్యాపాదంబునన్=ద్రోహచింతచేత—వంచనచేత. రూపాజీ
వరాజాననన్= భోగముదానిని. తాపింఛచ్ఛదగుచ్ఛసచ్ఛవిన్= చీఁకటిమ్రానియాకుగుత్తులను
క్క మంచికాంతివంటి దేహకాంతి గలదానిని— కటికినలుపైన దేహకాంతిగలదానిని. బంధురశ్రో
ణిన్=ఒప్పిదమయినపిఱుఁదులుగలదానిని. వీణాపాణింధమపాణిన్=వీణావాద్యముచేఁగలదా
నిని. ప్లవకన్యన్=మాలపడుచును॥ ౮౮॥ ఎలసి=కూడి. పేశలంబు=ఒప్పిదమైనది. ఫణాధర...
తలంబునన్=ఫణాధరపరివృఢ=శ్రేష్ఠమైనగొప్పపాముయొక్క. ఫణాఫలక= పలకవంటిపడగయ
నెడి. తలిమతలంబునన్=పానుపుమీఁదిప్రదేశమునందు. అంటసిలంబడన్ = అంటుసట్లుపడు
టకు. ఉపార్జించుచున్=సంపాదించుచు. కుపిత = కోపించిన. గళనిగళ = మెడగొలుసులచేత.
తివుటన్=ప్రానికచేత. ఆస్ఫోటించి=చప్పట్లుచఱిచి. పిక్కచెదరక—ఏబాధయునులేక. అదభ్రవి
భ్రమభూయిష్ఠంబులు=మిక్కుటమయిన త్రిప్పటచేనిండు కొన్నవి — మిక్కిలి త్రిప్పటచేత అలసి
నవి. తెగఁజూచి=చంపి. ఏచి=అతిశయించి. చేవ = బలము. కావడించి=కావడిగట్టి. నిశాం
తంబునకున్=ఇంటికి ॥ ౮౯ ॥ కుపిత...స్థపుటితము—కుపిత=కోపించిన. శమన=యమునిదైన.
చక్షుః=కన్నులవలని. క్రూర=క్రూరమయిన. దుర్వార=నివారింపఁగూడని. కీలా=మంటలచేత.
స్థపుటితము=ఆక్రమింపఁబడినది. తద్దివాకీర్తియిల్లు = ఆచండాలునియిల్లు. ప్రుగ్గి=కాలి. మధు
పాన...పరిజనయుతంబు=కల్లుత్రాగుటచేతమత్తుగొన్న పెండ్లాము బిడ్డలుపని వాండ్రువీరితోఁడఁ
గూడినది. దైవదుర్భావదృష్టిన్ = దైవముయొక్క చెడ్డతనపు చూపుచేతను ॥ ౯౦ ॥ కంది=

కులవ్యవహర్తమనోబలంబునన్ ॥ ౯౧ ॥ క ॥ ఇలఁ జడికిలఁబడి పలుమఱు । దలద్రో ర్చుచు వికృతమగు వదనమున లాలా । జలములు తీఁగెలు సాఁగఁగఁ । బలుకున తండాలి గుఱిచి పరిచిత రక్తిన్ ॥ ౯౨ ॥ ఉ ॥ ఎల్లరు నెల్ల చోధనములిచ్చి నృపాగ్రతులఁ గొంద్రు గాని యో । పల్లవపాణి యేఁ బరమపావనవంశము నిచ్చికొంటి నీ । నల్లని రూపు నిక్కమనినన్ ధ్రువంబది గాక నేఁడు వి । ద్యుల్లతికాధికాభినయ ధూర్వహమాట యెఱుంగ నెంతయున్ ॥ ౯౩ ॥ ఉ ॥ సన్నపుసిబ్బెముల్ గలుగు చన్నులఁ బయ్యెద గొంగువాలఁగాఁ । గెన్నెరవీణె మోపి శ్రుతిగీల్కొనసారెలు చక్కనొత్తియు । ద్యన్నఖర ప్రఘాణములఁ దంత్రులు మీటుచు నాలపించు నీ । తిన్నని యెల్గు నా చెవులఁ దేనియలొల్కఁ జవుల్ దలంచెదన్ ॥ ౯౪ ॥ ఉ ॥ ఈ కడ జాతినాతికి మహీమహిదేవుఁడు చిక్కెనంచు నన్నా కకుఁబోకకున్ జనపరంపర కెంపగు చూడ్కిఁ జూచియం । బూకృత మాచరించుటకు బుద్ధిఁ దలంకకలంకముక్తచం । ద్రాకృతిఁ బొల్చు నీ ముఖమునం దమృతస్థితి గాంచి మించుటన్ ॥ ౯౫ ॥ ఉ ॥ పుత్రులు లేరె యెవ్వరికి భూమిమదన్వయవర్ధనుల్ భువ । త్పుత్రుల వంటివారు మును పుట్టరు గాక తదాస్యకాంతిత । ద్గాత్రవివృద్ధి తద్భుజయుగస్ఫురణంబు తదుక్తిలక్ష్మి త। న్నేత్రసరోజపత్రరమణీయత చూపఱఁ జొక్కఁజేయవే ॥ ౯౬ ॥ క ॥ అని తనయాలిని దనయా । లిని గని మఱి కాని కుడువ వలెఁ గూడు జలం । బును ద్రావవలె ననుచు నన । శనమున నతఁ డేఁగెఁ జొచ్చె జనరహితమహిన్ ॥ ౯౭ ॥ క ॥ కాఁగల పుణ్యుఁడు దుఃఖపు । బ్రేఁగు వహించుట నెపో లెవిషమాటవిలోఁ । దూఁగుచుఁ దూలుచు నీరము । లీఁగుచుఁ దలవాంచి యూరక యేగుచు నుండెన్ ॥ ౯౮ ॥ తే ॥ నీచమగు మేనుపాఱునంగ వైచు కరణిఁ । బడిసరోరుహనేత్రు నపారకరుణ । నధమలోకంబు విడిచి యయ్యమరపథముఁ । జూచుటకుఁ బోలెఁ దనుతానె లేచు నతఁడు ॥ ౯౯ ॥ వ ॥ ఇట్లనుద్దిష్టప్రయోజనుండై బహుయోజనంబులు నిర్భోజనుండు నిరంబుభజనుండునై యా కుజనుండు పెక్కుదినంబు లాక్రాంత మహాగహనవిహరణుండై యచ్చోట నిశాటపతి

---

తపించి. వినిందితకుల వ్యవహర్త = మిక్కిలి నిందింపఁబడిన కులవ్యవహారముగలవాఁడు ॥ ౯౧ ॥ తలద్రోర్చుచున్ = తలవేలవేయుచు. లాలాజలములు = జొల్లునీళ్లు ॥ ౯౨ ॥ ధ్రువంబు = శాశ్వతము. విద్యుల్లతికాధికాభినయధూర్వహము = మెఱుపుతీఁగకంటె హెచ్చయిన అభినయభారమును వహించినది — మెఱుపుతళుక్కునంతలోపలనే నశించినది. ఇంతయున్ = కొంచెమైనను ॥ ౯౩ ॥ సిబ్బెములు = పొడలు. కీల్కొనన్ = కూడఁగా. సారెలు = వీణెమెట్లు. ఉద్యన్నఖరప్రఘాణములన్ = ఎత్తఁబడిన గోటికొనలచేత. ఆలపించు = ఆలాపనచేయు ॥ ౯౪ ॥ అంబూకృతము = ఉమియుట. అమృతస్థితిన్ = అమృతముయొక్క యునికిని ॥ ౯౫ ॥ సరోజపత్రరమణీయత = తామరరేకులమనోజ్ఞత. చూపఱన్ = చూచువారిని ॥ ౯౬ ॥ అనశనమునన్ = అన్నము లేమిచేత ॥ ౯౭ ॥ ప్రేఁగు = భారము. ఈరములీఁగుచున్ = పొదలుదూఱుచు. ఊరక = ఊరక ॥ ౯౮ ॥ ౯౯ ॥ అనుద్దిష్టప్రయోజనుండు = ఉద్దేశింపని ప్రయోజనముకలవాఁడు. నిర్భోజనుఁడు = భోజనము లేనివాఁడు. నిరంబుభజనుఁడు = నీళ్లు త్రాగనివాఁడు. నిశాటపతి = రాక్షసరాజు. విఘటన = భేదించుటయందు.

వక్షఃకవాటపుటవిఘటనపటుచటులఘటనఖరముఖరత్నాభరణాయమానత్రిభువన భరణుండగు నృసింహుం డుపసంహృతవైకుంఠనగరనివాసుండై విజయంచేసియుం డునప్పుణ్యప్రదేశంబుం బ్రవేశించి ॥ ౧౦౦ ॥ ఉ ॥ చేరువచేరువై కడుఁబచేళిమమైత సుడాయుపూర్వసం । సారతపఃఫలంబునభజద్వృజినావలినాశకృన్నృకం। ఠీరవ దేవనిత్యసదనీకృతసంగమతీర్థరాజవా । ర్ధారలనాడితత్పరమధామపతిన్ బలుపా ఱుఁజూచుచున్ ॥ ౧౦౧ ॥ సీ ॥ ఒకయింతతెప్పవేయక చూచుఁజెఱవారితలగొట్టి కొనిదుఃఖజలధిమునుఁగు । బిలముతెఱపుమంచుఁబృథివిలోఁజొరఁబాఱుసమధికస్తం భోద్భవముగమించు । తిరియువాఁడనుబోలె దెసలకుఁజయిచాఁచుఁదొరఁగునస్రాం బుధిఁదొప్పదోఁగు । హాహాయితే యని యఱచు భాగ్యగుణించి బహువిధాసక్తవి భ్రాంతిఁబొందుఁ। జేరఁగారానిదర్శనస్థితివహించు। బాడబస్ఫూర్తిలోఁగొన్నపగిది నుండు । దానవారాతికాఁబూనితదవతార । దశకమునుమున్నె తాల్చెనాధరణిసు రుఁడు ॥ ౧౦౨ ॥ క॥ ఉడుగనిపస్తులఁజెవులను । గడియలువడమేనువడఁకఁగాలము గడవం। బడమిఁబుడమి వేలుపువడి। చెడిపుడమింబడియెవిగతజీవుఁడునయ్యెన్ ॥ ౧౦౩ ॥ ఉ॥ ఈవిధమయినయయ్యధముహీనపుమేనపుడె కెఱఁగాకఘూ । కావలిదావకీలల గునాల్కలుముంగలమొల్కలెత్తదం । తావళజాలనీలమగుదండధరానుచరాగ్రణీ బలం । బావలఁద్రోవలాఁచివెసయాతనపుందనువాఁగిరేగఁగన్ ॥ ౧౦౪ ॥ సీ ॥ ల లనాధరోష్ఠలాలాజలాన్వితముగఁ గ్రోలెమద్యము పేరికులమునెల్ల । వావివర్తనలతా వావంతదలఁపకకన్నిచ్చవడరేఁచెఁగామవికృతి । జనులుప్రువ్వఁగఁదిట్టసడికోర్చియా జించెఁ బశ్యతోహరవృత్తిఁబసిఁడిసొరిగు । కన్నపెట్టియుఁద్రోవగాచికొట్టియుఁజం పెలెక్కకుమిగులుభూలేఖవరుల । మఱియునీరీతిక్రూరులమైత్రి వడసె । నితరపా తకములుచేసెనెన్నియేని । వీనిఁబోదువుఁడుకట్టుఁడుప్రవేయుఁడనుచు । జమునిదూతలు

---

పటు=సమర్థమైన. భరణుండు=భరించువాఁడు. సంహృత=నిలుపఁబడిన. విజయంచేసి=వేంచేసి ౧౦౦ । పచేళిమము=పక్వము. భజద్వృజినావలి=చేసినపాపపఙ్క్తి. నాశకృత్=నాశముచేయుచున్న. నృకంఠీరవదేవ=నృసింహదేవునికి. నిత్యసదనీకృత=శాశ్వతమయినయిల్లుగాఁజేయఁబడిన. వార్ధారలన్=నీటిదారలయందు. ఆడి=స్నానముచేసి. తత్పరమధామపతిన్=ఆపరమపదనాయకునికి గమించున్=గమనించును—తలఁచును. తిరియు=తిరిపమెత్తు. తొరఁగు=కాఱు. అస్రము=కన్నీరు, నెత్తురు. తొప్పఁదోఁగున్=మిక్కిలిమునుఁగును. విభ్రాంతి=భ్రమ; మత్తు. దర్శనస్థితి=చూపుయొక్కయునికి; మతముయొక్కయునికి. బాడబస్ఫూర్తిన్=బడబాగ్నియొక్కతోఁపికను; గుణముయొక్కతోఁపికను ॥౧౦౨॥ గడియలువడన్=అడుచుకొనఁగా ॥ ౧౦౩ ॥ దావకీలలు=కార్చిచ్చుమంటలు. ముంగలన్=ముందుగా. ఆఁచి=ఆఁగించి. యాతనపుందనువు=యాతనాదేహము॥౧౦౪॥ లాలాజలాన్వితముగన్=జొల్లునీటితోఁగూడ. కన్నిచ్చ=కంటియిచ్ఛ. ప్రువ్వఁగన్=ప్రుచ్చునట్లు. సడికిన్=నిందకు. పశ్యతోహర=చూచుచుండఁగా దొంగిలించువాఁడైన. పసిఁడి=బంగారు కన్నపెట్టి=కన్నమువేసి. భూలేఖవరులన్=బ్రాహ్మణశ్రేష్ఠులను. జడిసి=భయప

బాధింపజడిసియుతఁడు ॥ ౧౦౫ ॥ క ॥ ఆక్రోశంబానరించెది। శాక్రామన్నాదముగవి
శంకటగతిమూ। త్వక్రియమగునా మొఱవిని। సక్రోధాక్రమణనిపుణసంభ్రమమడరన్ ॥
౧౦౬ ॥ మ ॥ అమరద్రోహివిరోధి మున్నచటరత్నార్థంబుగానిడ్డచ। క్రమువిక్రాం
తివహించి భాస్కరసహస్రక్రూరమైవచ్చియ । య్యమహాతావళిహావళిందెరలవి
పాక్షిన్నబంధప్రతా । నము ఖండించెనఖండితారశిఖ సన్నాహంబుదిగ్గాహిగన్ ॥
౧౦౭ ॥ క ॥ శీకులును గాందిశీకులు । నైకాలానుగులుగునుకనవుడరుదెంచెన్। శ్రీ
కాముకపారిషదా । నీకములుసుదర్శనాదినీరజములతోన్ ॥ ౧౦౮ ॥ క ॥ అరుదెం
చిజముపురికిఁజను । తెరువునమరలించి తెల్లదీవి తెరువునన్। హరిభృత్యులునడపించిరి।
గరుడాంచితయానమునవిగమశర్మాఖ్యున్ ॥ ౧౦౯ ॥ సీ ॥ ఉత్తాలఫణిభుగ్గరుత్తాల
వృంతానిలాశాంతఘర్మాంబువయ్యె మేను । ప్రత్యగ్రముక్తాతపత్రీభవచ్ఛేషవారితా
తపమయ్యెఁజారువపాళి। సూత్రవతీశదోర్వేత్రదత్తావకాశామరంబయ్యెఁగటాక్షవి
హృతి । భృగుభరద్వాజప్రభృతికృతస్వస్తివాగ్భరముఖరములయ్యెఁబార్శ్వతలము।
లరుణకిరణసహస్రాభ్రభుభ్రగంబు। నఘవిమానంబుపై నెక్కి నిగమశర్మ। తీంద్రఁబుం
డ్రేక్షుకోదండుతండ్రిఁబోలి । పరమధామంబునకుఁబోవుపథమునందు ॥ ౧౧౦ ॥ సీ ॥
ఆజానుదీర్ఘంబులైహరిన్మణిమయ స్తంభంబులకుఁగులస్వామలగుచు । దివ్యగంధ
ములనుద్రేకించివిద్యుదంకురరేఖలకుజోడుకోడెలగుచు। దలచుట్టుదిరిగిరాఁగలిగిపాం
డురపద్మపత్రంబులకుబాణబంధులగుచు । సకలంబువెలిఁగింపఁజాలిబాలార్క బిం

---

డి ॥ ౧౦౫ ॥ ఆక్రోశము—మొఱ. దిశాక్రామన్నాదముగన్=దిక్కులనాక్రమించుచున్న ధ్వని
కలుగునట్లుగా. విశంకట=మిక్కుటమయిన. అడరన్=అతిశయింపఁగా ॥ ౧౦౬ ॥ ఇడ్డన్=ఉం
చిన. విక్రాంతి=విక్రమము. క్రూరము=భయంకరము. హావళి=ఉపద్రవము. తెరలన్=తొలఁ
గునట్లు. ప్రతానము=సమూహమును. అఖండితారశిఖన్=ఖండముగాని అంచు మొనచేత.
దిగ్గాహిగన్=దిక్కులనుబట్టినది ॥ ౧౦౭ ॥ శీకులును=హింసకలవారును. కాందిశీకులును=భయ
పడి దిక్కులనుజూచ్చి పరుగెత్తినవారును. కాలానుగులు=యముననను సరించినవారు—యమునికిం
కరులు. గునుకన్=మెల్లమెల్లన పాఱిపోఁగా. శ్రీకాముకపారిషదానీకములు=శ్రీవిష్ణుదేవుని పా
ర్శ్వవర్తులయినదూతల సమూహములు. సుదర్శనాది నీరజములతోన్=సుదర్శన చక్రములతోను
శంఖములతోను ॥ ౧౦౮ ॥ తెరువునన్=మార్గమునుండి ॥ ౧౦౯ ॥ ఉత్తాల...బువు—ఉత్తాల=
ఉన్నతమయిన. ఫణిభుక్=గరుత్మంతునిదైన. గరుత్=ఱెక్కలనెడి. తాలవృంత=విసనకఱ్ఱలవలని.
అనిల=గాలిచేత. ఆశాంత=అంతటనుశమించిన. ఘర్మాంబువు=చెమటనీరుగలది. ప్రత్యగ్ర...
ఆతపము= ప్రత్యగ్ర=క్రొత్తదైన. ముక్తాతపత్రీభవత్=ముత్యాలగొడుగుగానగుచున్న. శేష=
ఆదిశేషునివలన. వారిత=నివారింపఁబడిన. ఆతపము=ఎండగలది. సూత్ర...అమరంబు—సూత్ర
వతీశ=విష్వక్సేనునియొక్క. దోః=చేతులయందలి. వేత్ర=ప్రేముచేత. దత్త=ఇయ్యఁబడిన. అవకా
శ=ఎడముతోడి. అమరంబు=దేవతలుగలది. కటాక్షవిహృతి=కడకంటిచూపుయొక్కవిహారము.
స్వస్తివాగ్భరముఖరములు=మేలు అనుమాటలయతిశయముచేత మ్రోఁగునవి. తలములు=ప్రదేశ
ములు. అభ్రగము=ఆకాశమునందుఁబోవునది. తీంద్రన్=తేజస్సుచేత. పుండ్రేక్షుకోదండుతం
డ్రి=విష్ణువు ॥ ౧౧౦ ॥ హరిన్మణి=పచ్చ. ఉద్రేకించి=అతిశయించి. జోడుకోడెలు=సమానయు

బములకుననుబింబపఙ్క్తులగుచు । నాల్గుచేతులుగాంచననళినమాలి । కలువెడఁదక
న్నులాస్యప్రభలుచెలంగ । గుముదుఁడను పేరఁబరమేశుఁగొలిచినిలిచి । యున్నవాఁ
డాతఁడిప్పుడు నోమునీంద్ర ॥ ౧౧౧ ॥ తే॥ పుండరీకుండుశంఖకర్ణుండుసవ్యాము । సుం
దుకుముదాక్షుఁడునువిజయుండుజయుఁడు । సర్వనేత్రుండునను పార్శ్వచరులలోన
హరికిఁగుముదుండుమాననీయతవహించు ॥ ౧౧౨ ॥ క ॥ అమృతమయసూత్రిబుధ
హిత । విమలవిభోద్భాసిమసృణవిలసనశుభల । క్ష్మమహితవక్షుఁడువిధుఁడట ।
కుముదానందప్రదానకుశలుఁడుగాఁడే ॥ ౧౧౩ ॥ శా ॥ ఏవంభూతమహాప్రభావ
నిధిలోకేశుంజితక్లేశుమం । దావిర్భావహనైకమాత్రదళితోద్యద్దైత్యగర్వాంధకా
రావేశుస్ నరకేసరిన్ గొలిచినిత్యప్రీతినున్నారువా । ర్దేవీవల్లభముఖ్యనిర్జరులుతత్క్షే
త్రాధిరాజంబునన్ ॥ ౧౧౪ ॥ క ॥ ఆనెలవుననర్ధనిశల । వీనులకుందోఁచునేచివి
ధినందనవై । మానికనాయకకృతఘం । టానాదమునృహరిబిగువునగవుంబోలెన్ ॥
౧౧౫ ॥ క ॥ ఆక్షేత్రంబుననృహరికి । దక్షిణదిశ నేవసంతుతత్పరమతిని । యతు
లతోనీప్రమథా । ధ్యక్షులతోనీనగేశ్వరాత్మజతోడన్ ॥౧౧౬॥ క॥ మాతృవధము
పితృవధమును। భ్రాతృవధముగురువధంబు ప్రకటించియుయో। ధాతృసుతయిగిసుర
పుర। నేతృతఁదెలివొందు నెట్టినిచుఁడునచటన్ ॥ ౧౧౭ క॥ కావుననరులకుఁ దత్క్షేత్రావా
స మొనర్పనైహికాముష్మికముల్ । చేవలఁతులగుచుఁదలకొను । నావుడునామృడు
గుటించినారముఁడనియెన్ ॥ ౧౧౮ ॥ క ॥ దేవభవత్ప్రపనరస్వగ । దేవమహాక్షే
త్రమహిమదెలిసితినస్మ । ద్భావముప్రమోదమేదుర । భావమునైకొనియెఁ జనియె
భ్రిమమన్ తమమున్ ॥ ౧౧౯ ॥ క ॥ దైవముతీర్థముక్షేత్రము । నావాచంయములు
గుహుఁడునడిగినమీరల్ । భావించితెలుపుతత్త్వము । నావీనులఁజొనుపుమనుచునను

---

లు. పాండుర=తెల్లని. అనుబింబపఙ్క్తులు=అనుసరించినబింబములవరుసలు ॥ ౧౧౧ ॥ ౧౧౨॥
బుధహిత...వక్షుఁడు—బుధ=పెద్దలకు; దేవతలకు. హిత=మేలైన. విమల=నిర్మలమయిన. విభా
=విశేషకాంతిచేత. ఉద్భాసి=ప్రకాశించునట్టి. మసృణ = మెఱుఁగులుదేఱునట్టి. విలసన=ప్ర
కాశముగల. లక్ష్మ=చిహ్నముచేత. మహిత=పూజ్యమయిన. వక్షుఁడు=ఱొమ్ముగలవాఁడు. విధుఁ
డు=చంద్రుఁడు; విష్ణువు. కుముదానందప్రదానకుశలుఁడు=కలువలకుసంతోషమునిచ్చుటయం
దు నేర్పరి; కుముదునికి సంతోషమునిచ్చుటయందు నేర్పరి ॥ ౧౧౩ ॥ ఏవంభూత=ఇటువంటిదైన.
జితక్లేశున్ = జయింపఁబడినదుఃఖములుగలవానిని. మందా...వేశున్—మంద= కొంచెముగా.
ఆవిర్భావ= పుట్టుచున్న. హన = నవ్వు. ఏకమాత్ర = ఒకటిచేతనే. దళిత = భేదింపఁబడిన.
ఉద్యత్=నిక్కుచున్న. దైత్య=రాక్షసులయొక్క. గర్వ=అహంకారమనెడి. అంధకార=చీఁకటి
యొక్క. ఆవేశున్= ఒళ్లెఱుఁగమిగలవానిని. నరకేసరిన్=నరసింహుని ॥ ౧౧౪ ॥ అర్ధనిశలన్
=సగమురాత్రులందు. ఏచి= అతిశయించి. విధినందన=నారదుఁడా. వైమానికనాయక=ఇంద్రు
నిదైన ॥ ౧౧౫ ॥ తత్పరమతిన్=ఆసక్తమయినబుద్ధితో ॥ ౧౧౬ ॥ నేతృతన్=ప్రభుత్వముచేత॥
౧౧౭ ॥ చేవలఁతులు=హస్తగతములు. తలకొనున్= కలుగును=లభించును. మృడున్ = శివుని॥
౧౧౮ ॥ నరస్వగదేవ=నృసింహదేవుని. మేదుర=అతిశయించిన ॥ ౧౧౯ ॥ వాచంయములు=

బురవైరీ ॥ ౧౨౦ ॥ తే ॥ అనుఁడు నుడురాజమకుటుఁడిట్లనునృసింహ। తీర్థమునకు ఖిదేళిమదిక్రొసందు। సిద్ధమానవవినుతప్రసిద్ధి వెలయు। నాద్యమైఘర్మవీ రామహా స్రవంతి ॥ ౧౨౧ ॥ తే ॥ తీర్థసార్థావతంసమ త్తీర్థమఖిమ, తార్థదశ్రీలఁజంద్రభాగాఖ్యనందు। నందుఁదపమాచరించిమునీంద్రుఁడొందె। సమరతతిలోనరుంద్రభోగాతిశయము ॥ ౧౨౨ ॥ ఉ ॥ తైర్థికులర్థిఁగోల్వఁదగుదానికియోజనమాత్రభూస్థలిన్। దీర్ఘపదాస్పదంబఖిల దివ్యనుతవ్యవహారయోగ్యమి। స్తార్థసమర్థనక్షమము నైతమ మున్‌విరియించుఁ బాతకా। నర్థము పౌండరీకమనునర్థము దూషితరోషభూషణా॥ ౧౨౩ ॥ శా ॥ సత్రంబులకున్ క్షపాధిపతికిన్ నాకున్ ద్రియామాచరా। ధ్యత్యద్వేషికి భానుపుత్రికి మరుత్కల్లోలినీవేణికిన్। బక్షిశ్రేణికిఁ బక్షివల్లభునకున్ భాసిల్లుదానన్ సమ। స్తక్షేత్రంబులలోనసూనమగు నేతత్క్షేత్రమీక్షింపఁగన్ ॥ ౧౨౪ ॥ క ॥ ఇదమిత్థమ్మనియేనును। మదిమితిసేయంగనేర మానీశ్వరత। ద్విదితప్రభావమోపిన। విధమునవినిసింతునీకువినుదృఢబుద్ధిన్ ॥ ౧౨౫ ॥ తే ॥ జమునిచెలియలు నిర్జరశైవలినియు। బెరసిమెఱసిననడుచక్కఁబేరుగ్రుచ్చి। ఋషులు తెల్పినతీర్థములెల్లఁబొంద। రీకషోడశకళఁబోలలేకజడియు ॥ ౧౨౬ ॥ సీ ॥ పాతకవ్రాతభూజాతజాతానలం బాశ్రితాభీష్టపాకావసరము। విషధిరాట్పర్యంకవిహరణస్థానంబునిఖిలపుణ్యక్షేత్రముఖముకురము। నమదస్మదాదినానామరున్నాథంబువర్ణితాఖిలపుణ్యవైజననము। దైత్యభిన్నగరయాత్రావరస్థానంబువాఙ్మానసామేయవైభవంబు। వంకువామదేవవాల్మీకివరతంతు। గర్గగాధిపుత్రగౌతమాత్రి। జహ్నుజామదగ్నిజాబాలిజైమిని। ప్రియకరంబుపౌండరీకమనఘ ॥ ౧౨౭ ॥ మహాస్రగ్ధర ॥ కననీగోత్రాలుబిడ్డన్ గగనకుసుమమున్ గల్గనీరాయిమాటల్। వినసీముక్కుందువెండిన్ విపులఁబొడమునీచింతవాపాండురంగా। వనిఁబౌనఃపున్యజన్యవ్యవహృతిఁగనవేవంకదు

మునలు. మనుపు=రక్షింపుము ॥ ౧౨౦ ॥ ఉడురాజమకుటుఁడు=శివుఁడు. ఖిదేళిమ=ఇతరమయిన—ఎరుకపడిన. స్రవంతి=ఏఱు ॥ ౧౨౧ ॥ తీర్థసార్థావతంసము=తీర్థసమూహములలో శ్రేష్ఠము. అభిమతార్థదశ్రీలన్=కోరికలనిచ్చుటయందలికలిమలచేత. అందున్=పొందును. రుంద్ర=విశేషమయిన ॥ ౧౨౨ ॥ తైర్థికులు=తీర్థయాత్రచేయువారు. సమర్థనక్షమము=తగురీతిని సెఱవేర్పఁజాలినది. అనర్థము=కీడు. దూషితరోషభూషణా=దూషింపఁబడినకోపముగలవారికిఅలంకారమైనవాఁడా కోపముననణఁచినవారినేలువాఁడా ॥ ౧౨౩ ॥ క్షప=రాత్రి. త్రియామాచరాధ్యత్యద్వేషికిన్=విష్ణువునకు. భానుపుత్రికిన్=యమునానదికి. మరుత్కల్లోలినీవేణికిన్=గంగాప్రవాహమునకును. అసూనము=తక్కువకానిది— ఎచ్చు ॥ ౧౨౪ ॥ ఇదమిత్థమ్=ఇదియిట్లు ॥ ౧౨౫ ॥ శైవలిని=ఏఱు. బెరసి=కూడి. పేరుగ్రుచ్చి=పేరుచెప్పి. జడియున్=తొలఁగును ॥ ౧౨౬ ॥ భూజాతజాతానలంబు=కారుచిచ్చు. పాకావసరము=వంటకాలము. విషధిరాట్పర్యంక=సముద్రరాజుపడకగాఁగల విష్ణునికి. ముకురము=అద్దము. అస్మదాది=నేను మొదలుగాఁగల. మరున్నాథంబు=దేవతాప్రభువులుగలది. వైజననము=ప్రసవించుకాలము. దైత్యభిత్=విష్ణునిదైన. వాఙ్మానసామేయవైభవంబు=వాక్కుచేతను మనసుచేతను మితియేర్పఱుపరానివిభవముగలది ॥ ౧౨౭ ॥ వెండిన్=మరల. విపులన్=భూమియందు. పొడమనీ=పుట్టనిమ్ము. పౌనఃపున్యజన్యవ్యవహృతిన్=మరల

ష్పంకశంకల్ । వనరాశిఁ జొచ్చునేర్లైవడివడియడఁగుఁ వారిజభూగ్రీణసూతీ॥ ౧౨౮ ॥ తే॥ క్షితిఁగురుక్షేత్రముఖమహాక్షేత్రతతలము । లందుఁజేయననశ్వరంబగు చునిగుడుఁదురితతతిఁగిట్టినిజశక్తిఁదనుము గాన। మేటియా క్షేత్ర మొకపరిపాటి గాదు॥ ౧౨౯ ॥ క॥ దానస్నాననిధనవాః । పానాదులఁజేయనెట్టిఫలములు పెఱచో। నానవిసకలముఁజేకుఱు । మానవులకునందునిమిషమాత్రమునందుఁ ॥ ౧౩౦ ॥ శా॥ భర్మస్తేయముబ్రహ్మహత్యయునురాపానంబగమ్యారహః । కర్మంబుఁ గృహదాహధేనువధవాక్పారుష్యముల్ మున్నుగా । దుర్మార్గుల్పచరించుదుష్కృతతతుల్ దూలుఁ మృగేంద్రధ్వనిఁ । మార్మోముల్ వడులేటిమూఁకలనఁదన్నామంబువాక్రుచ్చినఁ ॥ ౧౩౧ ॥ సీ॥ ఉరసిజాదృతవీణసరసిజాసనురాణిపూర్వకోటిగమహాద్భుతచరిత్ర । గజవైరివాహదుర్గాదేవిపశ్చిమకోటిగలస్తకక్రోడసీమ । భువననాయకిగాఁ గఁబొగడొందియోజనార్థమువిస్తృతియుఁదదర్థంబునిడుపు। గలిగినతత్క్షేత్రకార్ముకంబుధరించి జగదేకధన్వి శ్రీశార్ఙ్గపాణి । తీర్థశరములుదొడివియుదీర్ణకలుష । విషమలక్ష్యపరంపరల్ విఱుగనేయుఁ । గానసదియశరణ్యమైదీనుమిగులు । నైహికాముష్మికాకాంతులగునరులకు॥ ౧౩౨ ॥ తే॥ ఆత్మనామవసచ్చతురక్షరముల । యందుఁబురుషార్థములునాల్గుననఁగి పెనఁగి । తలలుముదిరినదురితదంతావళములఁ । బౌండరీకంబుహరిలీలఁజెండివైచు ॥ ౧౩౩ ॥ శా॥ ఆక్షేత్రంబుననుండునట్టినడుమఁ యక్షకేళీ రతుం । డక్షోభ్యుం డజరుం డనాదినిధనుండక్షామరక్షామయుం । వీక్షామాత్రకృతాఖిలుండు నవశక్తీశుండు కృష్ణుండు ప్ర । త్యక్షుండై యసుడుఁ మరుస్మని

---

మరలపుట్టుటయనువ్యవహారముచేత. కనవు=పొందవు. ఏవంకఁ=ఏతట్టును. దుష్పంకశంకలు=చెడ్డపాపములనెడి సందేహములు. వడివడి=వేగముచెడి. వారిజభూగ్రీణసూతి=బ్రహ్మకుమారుఁడా ॥ ౧౨౮ ॥ అనశ్వరంబు=నశింపని స్వభావముగలది. నిగుడు=అతిశయించు. పరిపాటి=పర్యాయము ॥ ౧౨౯ ॥ నిధనవాఃపానాదులఁ=చచ్చుట నీళ్లుత్రాగుట మొదలగువానిచేతఁ. చేకుఱుఁ=కలుగును ॥ ౧౩౦ ॥ భర్మస్తేయము=బంగారుదొంగిలించుట. అగమ్యారహఃకర్మంబు=పొందరానిదానితోఁగలయుటని. గృహదాహ=ఇల్లుకాల్చుట. పచరించు=జరపు=చేయు. తూలుఁ—నశించును. లేటిమూఁకలు=జింకలగుంపులు ॥ ౧౩౧ ॥ ఉరసిజాదృతవీణా=స్తనములచేత ఆదరింపఁబడిన వీణగలది. కోటిగ=కొనయందు పొందినది. లస్తకక్రోడసీమఁ=వింటినడుమైన లోపలిప్రదేశమునందు. కార్ముకంబు=విల్లు. ధన్వి=విలుకాఁడు. శరములు=జలములనెడి బాణములు. తొడివి=తొడిగి—సంధించి. ఉదీర్ణ=గొప్పవైన. విషమ=సమముకాని. లక్ష్యపరంపరలు=గుఱిలబారులను. దీను=బాగు=మనోజ్ఞత. ఆకాంతులు=కోరువారు ॥ ౧౩౨ ॥ వసత్=ఉన్న. అనఁగిపెనఁగి=కలసిమెలసియుండి. దురిత=పాపములనెడి. హరిలీలఁ=సింహమువిధమున. చెండి=నఱకి ॥ ౧౩౩ ॥ అక్షకేళీరతుండు=జూదమునందాసక్తుఁడు. అక్షోభ్యుండు=కలఁపరానివాఁడు. అజరుండు=ముదిమిలేనివాఁడు. అనాదినిధనుండు=పుట్టుచావులులేనివాఁడు. అక్షామ=కఱవులేని. వీక్షామాత్రకృతాఖిలుండు=చూపుమాత్రముచేతనే చేయఁబడినసమస్తమునుగలవాఁడు. ఎల్లలోకములనుచూపుచేతనే కలుగఁజేయువాఁడు. నవశక్తి—ఈశుండు—తొమ్మండ్రుశక్తులకు భర్త. మరుస్మని—దేవము

యుమాప్రాణేశుతో నిట్లనున్॥ ౧౩౪॥ క॥ అద్భుతమయ్యెడు నిఖిలజ। గద్భరితుఁడు
యోగిహృదయగమ్యుం డచ్యు। తుద్భవ మొందుటకు కథ। సద్భద్రా నొడువుదు ప్రసన్న
తననుడున్ ॥ ౧౩౫ ॥ ఉ॥ ఆపురవైరి పల్కఁగ కలహాశిఁ గుశేశయపాత్ర సమ్మునన్।
ద్వాపర ముజ్జగిల్లుతఱి దాంతుఁడు శాంతుఁడు హృద్విపక్షశి। క్షాపటుశక్తి విష్ణుపదసం
భృతభక్తియునై జనించెని। ష్ఠాపుఁడు పుండరీకుఁ డను బ్రాహ్మణుఁ డొక్కరుఁ డక్కజం
బుగన్॥ ౧౩౬॥ సీ॥ పాతకంబుల పంచబంగాళముగఁ జేయుఁ గనుఁగొన్నమాత్ర మో
క్షంబు నొసఁగు। ముమ్మణ్ణు పుష్కరంబునకు నల్మణ్ణు పంపకని దియనఁ దగుఁ బ్రకటమ
హిమ। బిందుసరఃప్రతిబింబమై పస్విస్వర్గద్వారమునకంటెఁ గరము మేటి। యగుఁ జంద్ర
భాగమహాపుష్కరిణీతటంబునఁ జాతఖర్జూరపనసజంబు। కాంచనయుతంబు నృత్య
చ్ఛిఖండికూజ। దిష్టపరపుష్టగాయదళీంద్రజుష్ట। ము లసకల్హారపవననమ్రాగ్రదళము। వై
నయాశ్రమ మమరించియుండ నతఁడు ॥ ౧౩౭ ॥ సీ ॥ నిండుమనంబున నుండు నారా
యణుం డెఱిఁగించెనో నీట వఱలు నునికి। నొసలిలో పలి చక్కనెసఁగు చంద్రుఁడు దిద్దె
నో మింట వ్రేలెడు దీమసంబు। మూలాలవాలస్థలీ లేలిహానంబు గొలిపెనో పవనంబు
క్రోలు నేర్పు। కమలంబు లిరుమూడు గఱపెనో నూర్ధ్వావలోకనంబున కాత్మ లోఁగ
నిధృతి। యనఁగ దత్తత్క్రియలయందు నలఁత లేక। భూరికైవల్యసామ్రాజ్యభోగ
కాంక్ష। బాఢనిష్ఠానురక్తిఁ దపం బొనర్చు। కుదిసి ముల్లోకములు నుగగ్గోలుపడఁగ ॥
౧౩౮॥ తే॥ భక్తిసంయుక్తియను పోఁతపాల నొయ్యఁ। జెట్టుకట్టుచు మునిశాఖి నిట్టచూ
ప। నిజమనోమార్గసంవసన్నీలవర్ణ। కైతవంబున లోఁ జేగగలయనూరె॥ ౧౩౯॥
తే॥ పుండరీకాక్షుఁ డగుట నో పుండరీక। నేత్రభృంగంబు తనలోన నెలవుకొనఁగ।
క్షితిసురేంద్రుండు తపమిట్లు చేయుచున్న। కాలమున నేగె ధరవిష్ణుఁ గనుఁగొనంగ॥

---

ని=నారదుఁడు॥ ౧౩౪ ॥ హృదయగమ్యుండు=మనస్సులందుఁ బొందఁదగినవాఁడు. సద్భద్రా=మంచిమేలుగలవాఁడా ॥ ౧౩౫ ॥ కలహాశిన్=నారదునిగూర్చి. కుశేశయపాత్ర= తామరకుమసుమఁడా, ఉజ్జగిల్లుతఱిన్=తొలఁగునట్టిసమయమునందు—ముగియునప్పుడు. హృద్విపక్షశిక్షాపటుశక్తి=తనలోని శత్రువులగు కామక్రోధాదులను శిక్షించుట (అణఁచుట) యందు దృఢమయిన శక్తిగలవాఁడు. సంభృతభక్తి=పూర్ణమయిన భక్తిగలవాఁడు. అక్కజంబుగన్=ఆశ్చర్యముగా॥ ౧౩౬॥ పంచబంగాళముగన్=శూన్యముగా. ముమ్మణ్ణు=మూఁడంతలు. నృత్యచ్ఛిఖండి = ఆడుచున్న నెమళ్లుగలది. కూజదిష్ట వరపుష్టగాయ దళీంద్రజుష్టము = కూయుచున్న యిష్టములైన కోవెలలచేతను. పాడుచున్న గండుతుమ్మెదలచేతను సేవింపఁబడినది. అలసకల్హారపవన నమ్రాగ్రదళము=మెల్లనిసౌగంధికములమీఁది గాలిచేత వంగిన మీఁది ఆకులుగలది ॥ ౧౩౭ ॥ వఱలు= ఉండు. చక్కన్=ప్రదేశమునందు. దిద్దెనో=నేర్పెనో. దీమసంబు=ఉపాయము. మూలాలవాలస్థలీలేలిహానంబు=వేళ్లతోడి పాదునందుండెడి పాము. కొలిపెనో =సరిపఱిచెనో—బోధించెనో. క్రోలు=త్రాగు. ఇరుమూఁడు=ఆఱు. లోఁగని=తగ్గని. బాఢ=దృఢమయిన. కుదిసి=అణఁగి. గగ్గోలుపడఁగన్=కలఁతనొందఁగా ॥ ౧౩౮ ॥ ఒయ్యన్=తిన్నఁగా. చెట్టుకట్టుచున్=చెట్టుగా నేర్పడుచు. మునిశాఖి=మునియనెడి వృక్షము. నిట్ట=నిక్కను. సంవసత్=ఉన్న. నీలవర్ణకైతవంబునన్= విష్ణుదేవునిమిషచేత. చేగ=చేవ ॥ ౧౩౯ ॥ నెలవుకొనఁగన్=ఉనికిచేయఁగా. ధర=భూమి ॥ ౧౪౦ ॥ అలఁత

ర్ణంబులై కానన । క్రోణుల్ వోలె దలిర్చు నిచ్చలు సుధాకూపారపారస్థలుల్ ॥ ౧౪౬॥
క॥ తరుణప్రవాళశోణో । దరతలమై శంఖచక్రధరమై వరపు । ష్కరపుష్కలమై
హరికర । సరసీరుహమనఁగఁ గలశజలనిధి చెలఁగున్ ॥ ౧౪౭ ॥ తే॥ నూత్నవీచుల
సముపోఢరత్నపుష్ప । నికరనిబిరీసమగు నీరు నించి తెచ్చి । యబ్ధి వేలాసమాఖ్యాగతా
తురాప । లార్థులకు నర్థిఁ బాదార్ఘ్యమాచరించు ॥ ౧౪౮॥ తే॥ వార్ధి నావర్తగర్త
ప్రవర్తులగుచు । సుదరరత్నాంశువులు గ్రమ్మ త్రిదశులమర । తరులు నలకంగఁ దన్మా
లతలము లమృత । సేకమున వెండి చిగిరించు చిగురులనఁగ ॥ ౧౪౯ ॥ వ॥ ఇట్లు గణి
తగుణాభిరామంబగు నమ్మీనధామంబు సంగ్రామాభీరుండగు శూరుండునుంబోలె బె
నువాలుగంటులం గను పట్టి కుశలభట విముక్తంబగు విశిఖంబునుంబోలె నెల్లకందువల
నుమీటి పాటలస్ఫురితంబై జరఠవిలోచనంబునుంబోలె నీరుపాపలంబొదువుట గలిగి
పేదవడిన పుడమివేలుపుంబోలె బలియింటివాకిట నడంగి వీరభద్రగదా విదారితంబగు
పూషారుక్కవదనగహ్వరంబునుంబోలెఁ బలువరుస బిగి దెరల నొరలి మతంగకులకన్య
కయుంబోలెఁ బలుకం దగు నిలుకడ దాల్చి విభావరీవిరామసమయంబునుంబోలె వెల్ల
దీవియలమించుటకు గుఱియై మఱియు నొక్కొక్కచోటఁ గుముదోదర విశదంబులు
నొక్కొక్కయెడ నీలోత్పలమాలికామేచకంబులు నొక్కొక్కకడ శుకచంచూపు
టపాటలంబులు నొక్కొక్కచక్కి శుక్తిశబరోదరంబులు నరుణోపల పట్టంబులం
బొట్టవెంచుచు నిట్టలంబుగ మిట్టించు వేలానిలసముద్భూతనూతనశీకరనికరంబులవల
న నలినభవాండంబునకుఁ గర్పూరకరండభావంబు నుత్పాదించుచు నుత్తాలకాలస్కం

---

నవి. తలిర్చున్=చిగిరించును. నిచ్చలు=ఎల్లప్పుడు. పారస్థలులు=గట్టుప్రదేశములు ॥ ౧౪౬ ॥ శో
ణోదరమై=ఎఱ్ఱనిలోపలిభాగముగలదై. వరపుష్కరపుష్కలమై = మంచిజలముచేత సమృద్ధమై.
కలశజలనిధి=పాలసముద్రము. చెలఁగున్=ప్రకాశించును ॥ ౧౪౭ ॥ నూత్నవీచులన్=క్రొత్తల
యిన యలలయందు. సముపోఢరత్న=మంచిపండుపోఁకవంటిరత్నములనెడి. నిబిరీసము=నిండిన
ది. ఆతుర=శ్రమనొందిన ॥ ౧౪౮ ॥ ఆవర్తగర్త= సుళ్లనెడి బొక్కలయందు. అంశువులు=మె
ఱుఁగులు. అమృతసేకమునన్=అమృతముతోతడుపుటచేత ॥ ౧౪౯ ॥ మీనధామంబు=సముద్రము.
అభీరుండు=భయపడనివాఁడు. వాలుఁగంటులన్=కత్తిగాయములచేత; చేఁపలసంబంధములచేత.
కుశల=సమర్థుఁడైన. విశిఖంబు=బాణము. కందువలన్= జాడలచేతను; సంకేతస్థలములచేతను.
పాటలస్ఫురితంబు=పండఁబాఱుటను తోఁపించునది. జరఠ= ముసలివాని. నీరుపాపలంబొదువుట
=నీటిమనుష్యులను పొదువుట; జలము కంటిపాపలపైకమ్ముట. బలి=బలవంతుఁడు; బలిచక్రవర్తి.
పలువరుసబిగి తెరలన్=పండ్లవరుస బిగువు వదలఁగా; అనేకములైన వరుసలుగల బిగువుతోడి యలల
చేత. ఒరలి=ధ్వనించి. పలుకన్=నిందింప; చెప్ప. విభావరీ=రాత్రి. వెల్లదీవియలమించుటకున్=తె
ల్లఁబాఱిన దీపములచే తమించుటకు; శ్వేతద్వీపమును ఆక్రమింపఁజేయుటకు. విశదంబులు=తెలుపు
లు. మేచకంబులు=చామనిచాయలు. పాటలంబులు=ఇంచుక యెఱుపులు. చక్కిన్=చోటు. శబ
రోదరంబులు=చేఁపకడుపులు; నీటిలోపలిభాగములు. ఇట్టలంబుగన్=అధికముగ. మిట్టించు=మీఁది
కెగయు. కరండభావంబు=బరణివిధమును. ఉత్తాల...మంబులు=పొడవైన చీఁకటిమ్రానియాకులమాఁ

ధపలాశకులాసితద్యుతికూలంకషంబులగు బాలశైవాలవల్లీమతల్లికలనల్లిబిల్లిగొ
నుసల్లోలప్రవాళశాఖాశిఖలవలననుదవాసక్లేశంబుననుద్ధురకుడి చి వెలుపటికెంబుటమె
గయుచు నుద్దామధూమధోరణీవ్యాజంబునం దలలుపీడ సీడాడంబోడచూపు నిబిడ
బడబానలకీలాకలాపంబులశంకనంకురితంబు సేయుచు సలిలకరటిచటులతరరదనశి
ఖరవిఘటితగర్భగిరిగైరికసంక్రమణారుణంబులగుమృదుసముదితతరంగకిశోరంబుల
చేత పిహితావకాశంబై లక్ష్మీనారాయణశరీరారూఢవిసృమరఘుసృణరజోరంజి
తంబును తదీయవిలుంఠనావిర్భూతవ్రీడాపీడనంబునగుతలిమతలంబు విలసనంబువశీక
రించుచు సాత్త్వికక్రియవిధువిజృంభణముదితంబును పంటకారుపగిదిం బ్రసన్నశరీరం
బునుసత్యలోకంబునాకృతిం గమలభూయిష్ఠంబును విలాసినీకరంబుకరణి వివిధమణి
కిరణపుంజరంజితోర్మికంబును పరబ్రహ్మంబువిధంబున సహార్యపదంబునై యొదవు
నారవకడలి పుడమిముద్దియకుం దద్దయుం బ్రియంబు పుట్టించె నిట్టులంగున॥ ౧౫౦ ॥
ఉ॥ ఎన్నఁగనింతరత్నచయమింతగభీరిమయింతచానసం। పన్నతయింతశుద్ధియని
బ్రహ్మయునోరు మెదల్ప లేనియ। త్యున్నతిగన్న పెన్నడలి నుత్థితమై వెలిదీవి చెన్నగుల॥
వెన్నెలయేటిలోనఁ బ్రభవించినక్రప్పుగొండకై వడిన్ ॥ ౧౫౧ ॥ శా ॥ ధూతాతం
కపహేతపంకము బుధస్తుత్యంబు నిత్యంబు వి। ఖ్యాతం బాతపశీతవాత సహసాం
ద్రానందయోగీంద్రసం। కేతం బాతతభూతి భూతిలక లక్ష్మీకారి తోరంబునై।

---

చినల్లని కాంతిచేత నట్టునొరయుచున్నది. బాలశైవాలవల్లీమతల్లికలన్ = ప్రశస్తములైన లేఁతపాఁచితీ
గలతో. అల్లిబిల్లిగొను = పెనఁగొను. ఉల్లోలప్రవాళశాఖాశిఖలవలనన్ = పెద్దయలలోని పగడపుఁ
దీఁగలకొనలవలన. ఉదవాసక్లేశంబునన్ = నీళ్లయందుండుటవలని శ్రమచేత. ఉద్ధురకుడిచి = ఊపిరిత్రి
ప్పలేక శ్రమపడి. పుటమెగయుచున్ = దాఁటుచు. ధోరణీ = వరుస. ఈడాడన్ = ఇక్కడనక్కడ.
అంకురితము = మొలచినది. సలిలకరటి = నీరేనుఁగులయొక్క. చటులతర = మిక్కిలివాఁడులైన.
రదనశిఖర = దంతములకొనలచేత. విఘటిత = భేదింపఁబడిన. సంక్రమణ = చేరికచేత. మృదు =
తిన్నని. సముదిత = పుట్టిన. తరంగకిశోరంబులచేతన్ = చిన్నయలలచేత. పిహిత = కప్పఁబడిన.
ఆరూఢ = ఎక్కిన — పూయఁబడిన. విసృమరఘుసృణరజోరంజితంబు = ప్రసరించునట్టి కుంకుమ
పువ్వురేణువులచేత ఎఱ్ఱనాఱినది. విలుంఠనావిర్భూత = పొరలికవలనఁబుట్టిన. తలిమతలంబు = పఱ
పు మీఁదిచోటు. వశీకరించు = వశముచేయు. విధు = చంద్రునియొక్క; విష్ణువుయొక్క. విజృంభ
ణముదితంబు = విజృంభణముచేత సంతోషించునది. పంటకారు = శరత్కాలము. ప్రసన్నశరీరము
= తేటపాఱిన దేహముగలది. కమలభూయిష్ఠంబు = బ్రహ్మచేఁ బ్రియమయినది; కమలములచేత
అతిశయించినది. కిరణ = కాంతులచేత. ఊర్మికము = ఉంగరములుగలది; అలలుగలది. అహార్యప
దంబు = అచలస్థానముగలది; కొండలకు స్థానమయినది ॥ ౧౫౦ ॥ గభీరిమ = గాంభీర్యము.
శుద్ధి = పరిశుద్ధత. పెన్నడలిన్ = పెద్దసముద్రమునందు. ఉత్థితము = మీఁదికి లేచినది. కప్రము = కర్పూ
రము ॥ ౧౫౧ ॥ ధూతాతంకము = తొలఁగింపఁబడిన భయముగలది. అపేతపంకము = పోయిన
పాపములుగలది. సహ = సహించునట్టి. సాంద్ర = అధికమైన. సంకేతంబు = గుఱుతుగలది. ఆతత
భూతి = విశేషసంపదగలది. భూతిలకలక్ష్మీకారి = భూమికి బొట్టుకలిమిని జేయునది. తోరంబు =
గొప్పది. దీపితంబు = ప్రకాశించునది. జగత్సేవ్యైకభవోన్నతిన్ = లోకములచేత సేవింపఁదగిన

శ్వేతద్వీపము దీపితంబగు జగత్సేవ్యైకభవ్యోన్నతిన్ ॥ ౧౫౨ ॥ ఆ॥ వఱలుఁగుబ్బ
లికిని మైదూర్యశృంగంబు। మొలచినట్లుమిన్నుమోచియున్న । తెల్లదీవియందుదీపిం
చువైకుంఠ । పురముకనకవప్రపరివృతంబు ॥ ౧౫౩ ॥ ఉ॥ సారసువర్ణనీరమయ
సాలవిశాలము నీలవర్ణసం । చారచమత్క్రియాచరణశాలియునైపురిచెన్నగున్
మహో । మేరువుకౌఁగిటంబోలుపుమిఱిమహాట్టకూటసంచర । ద్వారణరా
జమై సొబగుదాల్చినరోహణశైలమోయనన్ ॥ ౧౫౪ ॥ సీ॥ త్రైవిక్రమాంఘ్రి
ముఖతవిఱిపిడినపద్మజాండఖండము లీలనలరుఁగోట। పలుమాఱుగమతాధిపతిపూని
డించుమందరములభాతిసౌధములు వెలయు । నిజవిహారార్థంబునృహరిమైహరిచేయు
వసతులోయనఁగేళివనములెసఁగు। శాంబరీమత్స్యసంచారోచితాపరశరధులక్రియ
పద్మసరసులమరు । నఖిలభువనాంతరాళపురాధిదేవ । తావితానంబుతత్సేవకై
చరించు । సరణిఁజూపట్టుదురుశరత్సమయపూర్ణ। రాజవదనలువైకుంఠరాజధానీ॥
౧౫౫ ॥ సీ ॥ జలధివీచీవాత్యఁజలిదాఁకెఁగాయని యక్కునఁదందయలమిచాల
మి । ప్రామట్టియాకొత్తిరాయిడిఁబొందెఁగా యనిసన్నపొత్తులనునిచియునిచి। వా
పోయివాపోయివసివాడియాఁకట బెగడెఁగాయనియుగ్గువెట్టిపెట్టి । పెనుజీఁకటు
లగ్రమ్మపెన్బైటవసియించి వెఱచెఁగాయనిపుల్లవిఱిచివిఱిచి । మంచిలక్షణముల
పుట్టువచ్చువాఁడు । నేత్రనుఁలువిప్పనట్టియీనేత్రుఁగందు । వఱలనేతెంచెనెవ్వారి
వాఁడోయనుచు। విలయహరిఁదెచ్చిపెనుతురవ్వీటిసతులు ॥ ౧౫౬ ॥ వ ॥ మఱియు
నప్పురంబు పలుదెరలుతిరిగివచ్చుట నాఖేటస్థలంబును నర్తనప్రదేశంబునుం బోలె
లెస్సవారింగలిగిగజగ్రహణసంవిధానంబును,సుజనునింబోలెపెక్కుపట్టులంగనుపట్టి
కురువిందమందిరంబును,కశ్యపమునీశ్వరుంబోలెహరికిగిరిగుహాయును,మాధవునకును
పవనవిశేషంబును, చక్రికి శ్రీఖండతరుకోటరంబును నైయడరంబుడమినిడువాలుగంటి

---

ముఖ్యమును మేలైనదియునగు గౌరవముచేత ॥ ౧౫౨ ॥ వఱలుఁగుబ్బలికిన్ = హిమవత్పర్వత
మునకు. మోచి=అంటి. కనకవప్రపరివృతంబు = బంగారు కోటచేతఁజుట్టఁబడినది ॥ ౧౫౩ ॥
సాల=ప్రాకారముచేత. నీలవర్ణ=విష్ణుదేవుని. కూట=శిఖరములందు. సొబగు=అందము. రోహ
ణశైలము=రత్నపర్వతము ॥ ౧౫౪ ॥ త్రైవిక్రమ= త్రివిక్రమదేవునిదైన. లీలన్=విధమున. భా
తిన్=విధమున. వసతులు=ఉనికిపట్లు. శాంబరీమత్స్య = మాయచేపకు—విష్ణువు అవతారమ
యిన చేపకు. శరధులక్రియన్=సముద్రములవలె. పద్మసరసులు=తామరకొలఁకులు. శరత్సమ
యపూర్ణరాజవదనలు=శరత్కాలపునిండుచంద్రునిఁబోలిన మొగములుగలవారు—స్త్రీలు ॥ ౧౫౫ ॥
వీచీవాత్యన్=అలలనుండి సుడిగాలిచేత. అక్కునన్=ఱొమ్మునందు. అలమి=చేర్చి. రాయిడి=
ఒరపిడి. పొత్తులన్=పొత్తిగుడ్డలమీఁద. వాపోయి=ఏడ్చి. వసివాడి=మిక్కిలివాఁడి. పుల్లవిఱిచి
=పుల్లలు విఱిచిమంత్రించి. నేత్రుఁగందు=నెత్తురుముద్దవంటిలేఁతబిడ్డ ॥ ౧౫౬ ॥ తెర=తెరచీర;
మృగములనుపట్టెడి సాధనవిశేషము. ఆఖేటస్థలంబు=వేఁటాడుచోటు. నర్తన = ఆటాడునట్టి.
లెస్స వారిన్=మంచిపల్లమును; మంచిజలమును. సంవిధానంబు = కబళము; మంచియాజ్ఞగలది.
పట్టులన్=చోట్లయందు. హరి=సింహము; విష్ణువు. మాధవుఁడు=వసంతుఁడు; విష్ణువు. చక్రి=
పాము; విష్ణువు. శ్రీఖండతరువు=గంధపుమ్రాను. కోటరము=తొఱ్ఱ. నిడువాలుగంటి= [illegible]

తడవుమెచ్చుచుంజొచ్చివియచ్చరసంబాధబంధురంబునిసర్గశృంగారతరంగితంబునగు రాజమార్గంబునఁజనిచనిముందట నేత్రసన్నిహితజగత్త్రియంబునుం బోలె బహువిధజనాకీర్ణంబై యుదీర్ణవైభవంబునవర్ణింపందగి బృందారక ద్విరదంబుచందంబునవలభిదారూఢోపరిభాగంబును జాంగలక్షేత్రంబు వైచిత్రియవనికామహితంబునునాటకసంధానంబుకై వడి శుద్ధమిత్ర విష్కంభసంభృతంబును దధీచి శరీరంబుకరణిసురభిగోముఖావిద్ధంబునై యొప్పుగూఢపదతల్పు దివ్యభవనంబుదఱిసి విరసజనహృదయంబులందగులువడనిబ్రహ్మవిద్యయుంబోలె నజిహ్వప్రకారంబున సప్తకక్ష్యాంతరంబులతిక్రమించి ముందట ॥ ౧౫౬ ॥ సీ ॥ నవసుధా పరిఖాంబునివహముబ్బెడుచోట మెఱుఁగుఁబుత్తడికోటమించుచోట। నిగిడియీఁగుల కెంపు నెలకట్టుగలచోటఁగల్వకావిరికారుక్రమ్ముచోట।నలరునుమ్మెనలకట్టావులూరెడుచోటఁగెలఁకులకొలఁకులుదొలఁకుచోట। గంధర్వగాంధర్వగంధమింపగుచోట గరుడకేతనములుగ్రాలుచోటఁ।బరమయోగివరేణ్యనిర్భరసమాధి। సౌఖ్యసంపదనిరపాయసంప్రదాయ। సిద్ధిదులకించుచోటనశేషభువన। వివిధధర్మంబులావిర్భవించుచోట ॥ ౧౫౭ ॥ క ॥ బహుయోజనవిస్తీర్ణము। బహునారీజనయుతంబుబహువిధమహిమా। వహమునగునొక్కకేళీ గృహమునన్నానందకోరకితమానసుఁడై ॥ ౧౫౮ ॥ మ ॥ కలదోఃకంకణఝంకృతంబులమరుత్కన్యల్ సుధాబిందుపిచ్ఛిలనీహారమయూఖబింబసదృశస్విన్నాననశ్రేణిఁవ। ర్తిలనొయ్యొయ్యనమూఁపనూఁగుఫణభృత్ప్రేంఖోళికల్ లచ్చినిట్టలవుంజన్గవఁబోలుమున్నొరగుముండాచేసియుల్లాసినై ॥ ౧౬౦ ॥ క॥దీపించువానిఁ

---

సుమనోజ్ఞముసైన కన్నులుగలది— స్త్రీ. వియచ్చరసంబాధబంధురంబు= దేవతలచే ఇఱుకటమై యొప్పినది. నిసర్గ=స్వభావముచేఁగలిగిన. ఉదీర్ణ = మిక్కుటమైన. ద్విరదంబు=ఏనుఁగు. వలభిదారూఢోపరిభాగంబు=ఇంద్రుఁడెక్కినమీఁదిభాగముగలది; ముంజూరు పట్టెమీఁదపొందినమీఁదిభాగముగలది. జాంగలక్షేత్రంబువైచిత్రిన్ = మెట్టపొలములవిధమున. యవనికామహితంబు= ఓమముచేత పూజ్యమయినది; తెరచీరచేతదొడ్డది. విష్కంభసంభృతంబు=విష్కంభమనెడియంగముచేత చక్కగాభరింపఁబడినది; గడెమ్రానిచేఁజక్కగాభరింపఁబడినది. సురభిగోముఖావిద్ధంబు=మనోజ్ఞమయినవజ్రాయుధపుమొనచేతొలుపఁబడినది;మంచివాసనద్రవ్యములచే అలుకఁబడినది. గూఢపదతల్పు= శేషశాయియైనవిష్ణునియొక్క. తఱిసి=సమీపించి. అజిహ్వ ప్రకారంబునన్=నాలుకలేనిదానివలె; కప్పవిధమున. సప్తకక్ష్యాంతరంబులు= ఏడుతొట్టికళ్లు ॥ ౧౫౬ ॥ నవసుధా=క్రొత్తయమృతపు. పరిఖాంబునివహము=అగడ్తనీటిసమూహము. పుత్తడి=బంగారు. ఈఁగులకెంపు=చింతామణి. నెలకట్టు=రాతికట్టడపునేల. కావిరి=నలుపు. కట్టావులు=మిక్కిలిశ్వాసములు. తొలఁకు=తొనుకు. గాంధర్వగంధము=పాటవలనివాసన. గ్రాలు= ప్రకాశించు. నిర్భర=హెచ్చైన. తులకించు=ప్రకాశించు. ఆవిర్భవించు=పుట్టు ॥ ౧౫౭ ॥ కోరకిత=మొలకలెత్తుచున్న ॥ ౧౫౮ ॥ కలదోఃకంకణ=అవ్యక్తమధురములైనచేతికడియములయొక్క. మరుత్కన్యలు=దేవతాస్త్రీలు. పిచ్ఛిల=పేరిన. స్విన్న=చెమటపట్టిన. ఒయ్యొయ్యనన్=మెల్లమెల్లఁగా ఫణభృత్ప్రేంఖోళికల్=పాము ఉయ్యాలయందు—శేషశయ్యయందు. నిట్టలవుంజన్గవన్=ఎచ్చైన స్తనములజంటను మున్నొరగు=ముందఱియొరగుదిఁడు. ముండాచేసి= ముందఱితట్టానించుకొని ॥ ౧౬౦ ॥ [illegible]పాత=చూపుయొక్క పాటుచేత. అవద్ధ్వాంతప్రవాహుఁడు=ఆపదలనెడి

త్రిభువన। దీపకుఁడగువానిఁ జంద్రదినకరమయవి। లోపాతదళితనిజభ। క్తాపధ్వాంతప్రవాహుఁడనఁదగువానిన్ ॥ ౧౬౧ ॥ తే ॥ నగవునురువులు మణిపూరనలినహంసి। కుంతలగ్రాహములు నేత్రకుముదరుచియుఁ। గలుగుతనుకాంతి కాళిందిఁ గన్నతరుణ। తరణియనుబోనియురమురత్నంబువాని ॥ ౧౬౨ ॥ తే ॥ పుండరీకతపోజాతభువనపీఠ। విన్నపము సేయు నజునంసవీథిఁ గేలు। సాచి హేమాద్రికంధరాసక్తమేఘ। మాలికం బెగుగగనంబుఁ బోలువాని ॥ ౧౬౩ ॥ తే ॥ లలితలక్ష్మీనఖాంకురలాలనమునఁ। గ్రమకల్హారదళగంధగౌరవమున। నతులనైపథ్యరత్నచంద్రాతపమున। నొప్పుమీఱి నను సేసకొప్పువాని ॥ ౧౬౪ ॥ తే ॥ ఊరుయుగళంబుమీఁదఁ జెల్వారు నడిమి। తానవంబు నెపంబున దనుజసదన। నిర్మితస్తంభసంభవనిజపురాణ। పురుషహరిలీలఁ దెలిపెడుపొలుపువాని ॥ ౧౬౫ ॥ తే ॥ అభినవాయాతుఁ దనపుత్త్రు నజునిఁ గాంచి। సంతసంబున నాభివేశంతజలజ। మబ్బి వెలిగ్రాయుపుప్పొడి యొఱపు నెఱపు। హాళఁదిపుట్టంబు కటిసీమ నమరువాని ॥ ౧౬౬ ॥ తే ॥ అడుగునడుగులఁ బొడముచిహ్నంపుమీల। మేనిచిప్పలువోలె నానానిలింప। కనకకోటీరహీరాగ్రఘర్షణమున। మెఱుఁగువచ్చిననఖపఙ్క్తి మించువాని ॥ ౧౬౭ ॥ తే ॥ ఆద్యుఁ బ్రణవస్వరూపు వేదాంతవేద్యు। మోక్షవిద్యోపదేష్టనిర్ముక్తజనను। విష్ణుఁ బ్రభవిష్ణు నిత్యవర్ధిష్ణుఁ గాంచి। మ్రొక్కి నారిజనోచితంబుగ ధరిత్రి ॥ ౧౬౮ ॥ క ॥ మ్రొక్కి వినుతించెఁ దనమది। నెక్కొను నెగులెల్ల నేల నెలఁతుక కన్నీ। రొక్కొక్కబొట్టు మెఱుఁగుం। జెక్కులదిగజాఱఁ గోరఁ జిమ్ముచు హరికిన్ ॥ ౧౬౯ ॥ క ॥ బలుఱేఁగునొప్పి నిమ్మై। నిలవలికిన పలుకు కతన హృదయముగలఁగెన్। నలినోదరునకు విలయా। నిలయాతాయాతచలితనీరధివోలెన్ ॥ ౧౭౦ ॥ వ ॥ ఇవ్విధంబున నమ్మధుమథనుండు వసుంధరమీఁదం గల కనికరంబునం దరంగితంబగు నంతరంగంబు తదభిరక్షణంబున కభిముఖంబుగావించి యటమున్న యకాండ ప్రళ

---

చీఁకట్లవ్యాపనముగలవాఁడు ॥ ౧౬౧ ॥ గ్రాహములు=మొసళ్లు. తరుణతరణి=క్రొత్తసూర్యుఁడు ॥ ౧౬౨ ॥ అజునంసవీథిన్=బ్రహ్మయొక్క మూఁపు ప్రదేశమునందు. కంధరాసక్త మేఘమాలికము=మెడయందంటినమబ్బుచాలు గలది ॥ ౧౬౩ ॥ నైపథ్య=అలంకారమువలని. చంద్రాతపమునన్=వెన్నెలచేత. సేసకొప్పు=కొండెసిగ ॥ ౧౬౪ ॥ తానవంబు=సూక్ష్మత్వము. పురాణపురుషహరి=పురాతనుఁడైననృసింహుఁడు ॥ ౧౬౫ ॥ అభినవాయాతున్=క్రొత్తగావచ్చినవానిని. నాభివేశంతజలజము=బొడ్డుపడియయందలి తామర. వెలిగ్రాయు=బయటనుమియు. ఒఱపు=అందము. హాళఁదిపుట్టంబు=పసుపువన్నెవస్త్రము ॥ ౧౬౬ ॥ హీర=వజ్రమణులయొక్క. ఘర్షణమునన్=ఒరపిడిచేత ॥ ౧౬౭ ॥ ఉపదేష్ట=ఉపదేశించువాఁడు ॥ ౧౬౮ ॥ నెక్కొను=పాదుకొను. నెగులు=దుఃఖము ॥ ౧౬౯ ॥ బలుఱేఁగునొప్పి=అధికభారమనెడివ్యాధిచేత. నలినోదరునకున్=విష్ణుదేవునికి. యాతాయాతచలితము=పోకరాకచేత చలించినది ॥ ౧౭౦ ॥ మధుమథనుండు=విష్ణువు. తదభిరక్షణంబునకున్=దానిసంరక్షణమునకు. అటమున్న=అంతకుముందే. అకాండప్రళయంబు=కాలముగాని కాలమున నగుప్రళయము. తపోదహనంబు=తపస్సువలని యగ్ని. దురవగాహంబు=ఆకళింపుచేసికొన శక్యముగానిది. త్రిభువనదాహదోహలంబు=మూడు

యంబగు పుండరీకుతపోదహనంబు దురవగాహంబును ద్రిభువనదాహదోహళంబు నగుననివిన్నపంబుచేసి డాసియున్నవిరించింగించిత్స్మితహాసితాననుండై కనుంగొనుచు॥ ౧౭౧ ॥ సీ॥ శాంబరీకచ్ఛపేశ్వరకంఠసందీప్త తాపింఛవల్లీమతల్లియనఁగ । బ వనపారణపతిస్ఫాటికస్తంభ జంభద్విషన్మణిసాలభంజియనఁగ । సవనవరాహ దంష్ట్రాఖనిత్రప్రోత కనకాతుఘనకాలఖండమనఁగ । గకుబంతకరివరస్కంధసింధు ద్వీప హంసారికాసితహంసియనఁగ । భూరిభూభృచ్ఛిఖోద్యన్మయూరియనఁగ । నృగుభగీరథభరతాదినృపభుజాగ్ర । ఘటితకాలాగరుస్థాసకంబనంగ । దగువసుంధరఁగృపఁబలుకు దైత్యభేది ॥ ౧౭౨ ॥ శా॥ ఓయంభోరుహపత్రనేత్రమదినీయుద్వేగముఁ మానుదై । తేయప్రాయ నృపాన్వవాయముల మర్దింతుఁ భవద్భారముఁ । బాయంద్రోయుదుఁ జేయుదుఁ సుఖులగా మద్భక్తియుక్తాత్ములఁ । మాయామానుషమూర్తినై పొడమి నానావిక్రమక్రీడలఁ ॥ ౧౭౩ ॥ సీ॥ క్రూరాసిధారావిదారితద్విపకుంభకూటముక్తాశుక్తిగోస్తనములఁ । బటుగదాపాతనిర్భగ్న సైంధవశిరస్స్రవదస్రకుంకుమస్థాసకముల । శరలూనరథకేతుసౌవర్ణకింకిణీకుసుమగుచ్ఛచ్ఛటాగుంభనముల । ముసలమర్దితపదాతిసహస్ర భూషానవీనరజఃపటీవేల్లనముల । విజయలక్ష్మికినైపథ్యవిభవమొసఁగి । చటులరోషకషాయితాశయవిరోధి । యూథమథనక్రియాహేతు యుద్ధకేళిఁ । జేలి నీకిత్తునానందమోలతాంగి ॥ ౧౭౪ ॥ వ॥ మత్కృతంబులు మదీయరచితంబులు నగు నగణితాహవక్రీడనంబుల సక్రోధవిరోధివధంబొనరించి తదీయకంఠనాళ కరాళ రుధిరధారాసారంబుల నీకుం దాపో

---

లోకములను గాల్చుటకు సమర్థమయినది. డాసి=సమీపించి ॥ ౧౭౧ ॥ శాంబరీకచ్ఛపేశ్వర=మాయతాఁబేటిరాజుయొక్క. తాపింఛవల్లి=చీఁకటిమ్రానిరెమ్మ. పవనపారణపతి=సర్పరాజు. జంభద్విషన్మణి=ఇంద్రనీలము. సాలభంజి=పుత్తడిబొమ్మ. సవనవరాహ=యజ్ఞవరాహముయొక్క. ఖనిత్రిక=గుద్దలిచేత. ప్రోత=గ్రుచ్చఁబడిన. కాలఖండము=కడుపులోనియవయవవిశేషము. కకుబంతకరి=దిగ్గజము. సింధుద్వీప=ఏటినడిదిబ్బయందలి. అసితహంసి=నల్లనిఆఁడుహంస. భూరిభూభృచ్ఛిఖోద్యన్మయూరి=విస్తారమయినకొండలనెడి శిఖలుపుట్టుచున్న ఆఁడునెమలి. కాలాగరుస్థాసకము=నల్లయగరుతోఁజేరినకుంకుమపువ్వుమొదలగువానిపూఁత ॥ ౧౭౨ ॥ ఉద్వేగముఁ=మనోవ్యథను. దైతేయప్రాయ = రాక్షసులనుబోలిన. అన్వవాయములఁ = వంశములను॥ ౧౭౩ ॥ అసి=కత్తి. కూట=శిఖరములందలి. ముక్తాశుక్తి=ముత్తెపుఁజిప్పలచేతనైన. గోస్తనములఁ=నలువదిపూసలహారములచేతను. పాత=పాటువలన. నిర్భగ్న=మిక్కిలిభంగము నొందిన. సైంధవశిరస్స్రవదస్రకుంకుమస్థాసకములఁ=గుఱ్ఱములతలలయందుండి కాఱుచున్న నెత్తురనెడికుంకుమపువ్వుతోడి పరిమళచందనపుపూఁతలచేతను. శరలూన=బాణములచేతనఱకఁబడిన. సౌవర్ణ=బంగారుమయములైన. గుంభనములఁ = కూర్పులచేతను. నవీనరజఃపటీవేల్లనములఁ=క్రొత్తధూళియనెడి జాలరులచేతను. నైపథ్యవిభవము=అలంకారవైభవమును. చటుల=చలించెడి. రోషకషాయిత=కోపమునరక్తచందనపుపూఁతగాఁజేయఁబడిన. ఆశయ=మనసుగల (లేక) స్థానమయిన ॥ ౧౭౪ ॥ క్రీడనంబులు=ఆటలు. సక్రోధ = కోపముతోఁగూడిన. కంఠనాళ=గొంతుక్రోవులందలి. ఆసారంబులఁ=ఎడతెగనిధారలుగలవానలచేత. ఆపాదించెదను=కలిగించె

పశమంబొనాపాదించెనం బాపకారినిరసనంబు నాకునవశ్యకృత్యంబగుట నెఱుంగవే యుత్తరంబగుభవద్వారంబు తొలంగించుటయుకాదు సముత్పాదిత త్రిభువనోపప్లవంబగు పుండరీకతపోదహన విహారంబు వారించు తలంపునున్నయది యిన్నలువ యిప్పుడిటమున్న తన్నిమిత్తంబని పనివిన్నవాఁడు ఎన్నికదినంబులనిన్నియుశుభోదర్కంబులయ్యెడునని పుడమిపడఁతియడలుడిపి సగౌరవంబుగా వీడుకొలిపిపరమపురుషుండంతర్ధానంబునొందె. శతానందుండును సానందంబుగయథాస్థానంబునకుంజనియెనిట్లు ॥ ౧౭౫ ॥ ఆ ॥ పుండరీకుతపముభూదేవిభారంబు। ఫలమునందఁజేయఁదొలఁగఁద్రోయఁ। గోరిమర్త్యుఁడయ్యెశౌరిపరార్థమై। పురుషవరులువిక్కృతిపొరయుటొప్పు ॥ ౧౭౬ ॥ సీ ॥ వసుమతీభార నిర్వాపణోద్యుక్తుండువర్ధితయాదవాన్వయపయోధి । దేవకీవసుదేవశేవధినందమందిరరసాలావాసపరభృతంబు । పూతనాప్రాణసంఘాతవాతూలాహిశకటాంగవిఘటనచటులబుద్ధి । సమదతృణావర్తసంవర్తసమవర్తి పాలితార్జున పాదపద్వయుండు । వత్సహృత్సాయకంబభివ్యధితబకుఁడు । మర్దితాఘుండుకాళియమానభేది । నిష్ఠురానలపారణానైష్ఠికుండు । కృష్ణుఁడాశ్రితలోకవర్ధిష్ణుఁడలరు ॥ ౧౭౭ ॥ సీ ॥ కనుగట్టిగాంగేయగర్భుఁడాఁగురుమూఁతలాడించెవత్సాపహరణవేళ । నాలమందలఁబోవశైలమెత్తెడి పూనిఁగేలిమైకందుకక్రీడసలిపెఁ । బాటించెఁగంబాల యాటరాసక్రీడనాభీరభీరుమధ్యాంకపాళి । వెలయించెయక్షౌక్షువిహారణంబలకాధిరాజుకింకరశిరోరత్నరాజిఁ। దన్నబిల్లాడెనంగుష్ఠదళితసర్ప । తనుసుదర్శననామవిద్యాధరేంద్ర । కరినజఠరచ్ఛలమున నగ్రజుఁడుదాను । నందసూనుండుబృందావనంబునందు ॥ ౧౭౮ ॥ వ ॥ ఇవ్విధంబునసమ్మధుకైటభవిరోధిమాయామానుష విగ్రహంబునంగీకరించియు నమానుషంబులగువిక్రమవిశేషంబులం బ్రవర్తించుచుండె నంతనటమున్నయవ్వెన్నునకు మనఃప్రీణనంబుగావింపందలంచివిగించినిఖిలభువనమోహనియగునొక్కశక్తిఁబుట్టించుట

డను. పాపకారినిరసనంబు=పాపముచేయువారిని చంపుట. ఉత్తరంబు= అధికము. సముత్పాదిత=కలుగఁజేయఁబడిన. ఉపప్లవంబు=ఉపద్రవముగలది. నలువ=బ్రహ్మ. ఇటుమున్న=ఇంతకుముందె. పనివిన్నవాఁడు=వచ్చినాఁడు. శుభోదర్కంబులు=శుభమురాఁగలకాలములు. అడలు=దుఃఖము. ఉడిపి=మాన్పి. వీడుకొలిపి=పంపి. అంతర్ధానంబుఁ= కనఁబడకపోవుటను. శతానందుఁడు= బ్రహ్మ ॥ ౧౭౫ ॥ విక్కృతి=వికారమును. పొరయుట=పొందుట ॥ ౧౭౬ ॥ నిర్వాపణ=నశింపఁజేయుటయందు. శేవధి=నిధి. రసాల= తియ్యమామిడిచెట్టునందు. పరభృతంబు=కోకిలము. వాతూల=గాలికి. అహి=పాము. సంవర్త=నాశమునకు. సమవర్తి=యముఁడు. వత్సహృత్సాయకంబు=వత్సాసురుని హృదయమునకు బాణము. అభివ్యధిత= బాధనొందింపఁబడిన. మర్దితాఘుఁడు=మర్దింపఁబడినఅఘాసురుఁడుగలవాఁడు. నిష్ఠురానలపారణానైష్ఠికుండు=క్రూరమయినదవానలమును భక్షించునట్టినిష్ఠగలవాఁడు ॥ ౧౭౭ ॥ గాంగేయగర్భుఁ=బ్రహ్మను. అభీరభీరు=గోపికాస్త్రీలయొక్క. అంకపాళిఁ=కౌఁగిలింతయందు. యక్షౌక్షువిహారణంబు=కుబేరాక్షుఁడు అను ఆట. అంగుష్ఠదళితసర్పతను = బొటనవ్రేలితోఁబోఁగొట్టఁబడినపాము దేహముగల॥ ౧౭౮ ॥ అమానుషంబులు=మనుష్యవిషయములుకానివి. వెన్నునకుఁ=విష్ణునకు. ప్రీణనంబు=

యునమ్మత్తకాశినితదాదేశంబుననందుమఱందియగు శతగోపుండనుగోపాలకుంగూరిమిపుత్త్రియై పెరుగుచుండెనంత దంతావళమరాళ శిఖావళగమనంబులగమకంబు దమకుందొడవగుచు నిగుడునడవడుల బెడంగారిబంగారంపుమెట్టె కెందమ్ములకు నెత్తురుంబొత్తుచుట్టంబులనంజూపట్టు చిగురుటడుగులును, దారలగౌరవంబును మత్తియంబుల క్రొందళుకును చంద్రమండలంబునఖండలావణ్యంబును సేవగించు చరణనఖముకురంబులును, మకరధ్వజ శరధిశాలి గర్భగోపుచ్ఛకాహళా సందర్భంబుల సౌభాగ్యంబునావరించు చిఱుతొడలును, వలుదతనంబులు సలపందనంబులు నిద్దంపుఁదనంబులు తద్దయుంగలిగికరికరాకారంబులై కరభనిభంబులై కనకకదళీ మృదులంబులునైన పెందొడలును, కరటిశిరః కఠినంబును రథాంగరమాధురంధరంబును పులినఘనంబునునగు జఘనంబును, ఆవర్తవర్తులంబును నితాంతపున్నాగలతాంతకాంతంబును నతిగభీరంబునగు నాభిసరోవరంబును, అసితబలేశయ బాలికంబునకు నేలికయై చలిచీమచాలునకుం బోలికయై శైవాలవల్లికిందల్లియై చెలువారు నూగారును, ఆగడపలంగడవనై చివీచీరేఖలంబోద్రోచికుసుమనారాచు కేళాకూళింగలజాళువాసోబనంబులఁ బ్రతిఘటించుత్రివళీ విభాగంబులును, కమలకోరక కనకకలశ కరికుంభ ప్రముఖంబులగునుపమాద్రవ్యంబుల క్రొవ్వడంచి పచారించిపిక్కటిల్లి పెరిగి నిక్కికక్కసించి కవజక్కవలఁ బెక్కువలలంబెట్టుచుఁ జూపట్టుదోర్మూలకూలంకషంబులగుకుచలి కుచంబులును, ప్లక్షపల్లవవల్లభంబును చపేటపుట పరిస్ఫుటంబును నగు వేదీమధ్యనిభమధ్యంబును, ఫణిఫణాఫలక భాసురంబులును తాంబూలీదళ

---

తృప్తిని. భువనమోహిని= లోకమును మోహింపఁజేయునది. మత్తకాశిని = ఉత్తమస్త్రీ. తదాదేశంబునన్ = అయనదైనయాజ్ఞచేత. శిఖావళి=నెమలి. గమకము= మనోజ్ఞత. తొడవు=ఆభరణము. బెడగారి=అందగించి. కెందమ్ములకున్=ఎఱ్ఱతామరలకు. చూపట్టు=తోఁచు. లావణ్యంబు= కాంతి. సేవగించు=రోయు. ముకురంబులు = అద్దములు. మకరధ్వజశరధి= మన్మథునియమ్ములపొది. శాలిగర్భ= వరిపొట్ట. గోపుచ్ఛ = ఆవుతోఁక. కాహళి=తుతార. సందర్భంబుల= కూర్పులయొక్క. సౌందర్యంబున్= చక్కఁదనమును. వలుదతనంబులు=లావుఁదనములు. సలపందనంబులు= రానురానులావుతగ్గియుండుటలు. నిద్దంపుఁదనంబులు= నునుపుఁదనములు. కరభనిభంబులు=చిటికెనవ్రేలి మొదటనుండిమణికట్టుదాఁకనుండు అరచేతిలోపలి పార్శ్వభాగమును బోలినవి. మృదులంబులు=మెత్తనివి. రథాంగరమాధురంధరంబు= చక్రసంపద్భారమును వహించినది. జఘనంబు=మడికట్టు. ఆవర్తవర్తులంబు=సుడివంటిగుండ్రఁదనముకలది. పున్నాగలతాంతకాంతంబు=పొన్నపువ్వువంటిమనోజ్ఞతగలది. గభీరంబు= లోఁతుగలది. అసితబిలేశయబాలకంబునకున్=నల్లత్రాచుపిల్లకు. చెలువారు=అందగించు. ఆగడపలన్= దొంతిమబ్బులను. వీచీరేఖలన్=అలలచాళ్లను. కేళాకూళిన్=క్రీడాసరస్సునందు. జాళువాసోబనంబులన్=బంగారుమెట్లను. ప్రతిఘటించు=ఎదిరించు. త్రివళీ= కడుపుమీఁదిమూడుముడుఁతలయొక్క. కమలకోరక=తామరమొగ్గ. ఉపమాద్రవ్యంబుల=సరిపోల్చువస్తువుల. పచారించి = వ్యాపించి. పిక్కటిల్లి= కదిసి. కక్కసించి=బాధించి. దోర్మూలకూలంకషంబులు= చంకలపార్శ్వములనొరయునవి. లికుచంబులు=గజనిమ్మపండ్లు. ప్లక్షపల్లవ=జువ్విచిగురులకు. వల్లభంబును=ప్రియమునైనదియు. చపేట

తరుణంబులును నై నిగనిగని పసిండితగడుం దెగడు కరమూలంబులును, కందర్పకళల చెన్నునం బూవుటెత్తులయొత్తున సోగతీఁగల బాగున బుజగలిగిన భుజంబులును, కలువ ఱేకుల చెలువున జోకమీరు వాలారు కొనగోరులును, పవడంపుఁ జివురుల పగిది గలర క్తాంగుళి ప్రవాళంబులు నుంగలిగి నెత్తురుట్టిపడు కరతలంబులును, కంబుబిబ్బోకావహంబును క్రముకతరుకమనీయంబును కోమలాంశుమత్ఫలాముకుళ మోహనంబునగు కంధరాభోగంబును, సమ్మిశ్రవటఫలద్వయశోభాద్వైతనిబిడంబగు చిబుకంబును, చక్కెరలధిక్కరించి తేనెలం బోనాడి చెఱకురసంబుల నిరసించి మధురిమ నమరు నధర బంధుజీవ ప్రసూనంబును, మొల్లలనుల్లసంబాడి యాణిముత్తియంబుల నుత్తరించి సుధాబిందువులఁ బలువగుసల సరసంబాడు పలువరుసయు, సంధ్యారాగరంజితంబగు కళారాజరేఖ పొత్తువడయు నుత్తరోష్ఠపుటంబును, పరిస్ఫుటనాసికాసుగంధనిశ్వాసధారాధోరణీ నిశితమార్గంబునుం బోనియయ్యోష్ఠబింబఫలంబుమీఁది నిమ్నభావంబును, సూనసాయకుదోనివిల్లును పల్లవ కరవాలులాంగలాయుధంబును సామివికసిత చంపకకోరకంబును నువ్వుఁబువ్వును నవ్వుచు నివ్వటిల్లు నుల్లషిత నాసికాశిఖరంబును, సితమయూఖరేఖా సఖంబగు నొసలును, నింబకిసలయంబుల కపసయంబొందించుచు ముక్కును నరంటిముక్క మొదలియాకుటెక్కుల నెక్కసక్కెంబు సేయుచుఁ గాయజు సింగిణుల వంగడంబగు నెలవంక కన్నుబొమల కొమలును

---

పుట=చాఁచిన వ్రేళ్లుగల అఱచేతిలోపలిభాగమువలె. పరిస్ఫుటంబు= ప్రకాశించునది. వేదీమధ్య=యజ్ఞవేదికనడిమిభాగముతోడ. ఫణాఫలక= పలకవంటిపడగవలె. తాంబూలీదళ= తమలపాకులయొక్క. పసిండి=బంగారు. తెగడు=తిరస్కరించు. కరమూలంబులు=చంకలు. పూవుటెత్తుల=పువ్వులసరముల. ఎత్తునన్= విధమున. సోగ=నిడుపైన. బుజ= వట్రువతనము. జోక=అందము. వాలారు = వాఁడులైన. ప్రవాళంబులు = చిగుళ్లు. కంబుబిబ్బోకావహంబు = శంఖమునకు అందమును కలిగించునదియు. క్రముకతరుకమనీయంబు=పోఁకమ్రాని మనోహరత్వముగలది. కోమలాంశుమత్ఫలాముకుళమోహనము = మృదువైనయరఁటి మొగ్గవలె మోహమును బుట్టించునది. కంధరాభోగంబు= మెడయొక్క వైశాల్యము. చిబుకము= గడ్డము. పోనాడి=నిందించి. నిరసించి= తిరస్కరించి. మధురిమన్ = తియ్యఁదనముచేత. బంధుజీవప్రసూనంబు = మంకెన పువ్వు. ఉల్లసంబాడి = పరిహసించి. ఆణి = గుండ్రఁదనముగల. ఉత్తరించి = దాఁటి = మీఱి. పలు వగుసలన్ = బహువిధములయిన చావ మామ మొదలగు వగుసల చేత. రంజితంబు= ఎఱ్ఱనైనది. కళారాజరేఖ = కళామాత్రమైన చంద్రరేఖ. పొత్తు = స్నేహము. ఉత్తరోష్ఠపుటంబు = పైపెదవి. సుగంధనిశ్వాసధారాధోరణీనిశితమార్గంబు = మంచివాసనతోడి యూర్పుల ప్రసరణముయొక్క అడ్డములేనిచుఱుకుగలదారి. పోని=వంటి. బింబఫలంబు=దొండపండు. నిమ్నభావంబు=పల్లము. దోనివిల్లు=అల్పధనుస్సు. పల్లవకరవాలు=మన్మథునియొక్క. సామి=సగము. చంపకకోరకంబు=సంపెఁగమొగ్గ. ఉల్లషిత=మీఁదికినిక్కిన. నాసికాశిఖరంబు=ముక్కుకొన. సఖము=మిత్రము. ఎక్కసక్కెంబు= పరిహాసము. వంగడంబు=వంశము. తారసంబు=తలపు. మిటు=అతిశయము. ఒఱపు=అందము. కోవు=విధము. విసూత్రితంబులు=సూత్రములేనివి. పత

చకోరంబుల ప్రకారంబును జేరలతీరును సారసంబుల దారసంబును మీలమేలును మెఱుపులమెఱపును మరుతూపుల కోపును నుత్పలంబులయొప్పును కైరవంబులగౌరవంబును నేణనేత్రంబుల వైచిత్రియు విసూత్రితంబులుగావించి మించుశ్రవణపుటకూప పతయాళువులగువిలోలవిలోచనంబులును, దర్పణంబులదర్పంబును సరోజంబులయోజయు సుధాకలశంబుల విలసనంబును నంబురుహబింబంబులమదంబునుం బోష్కించి యశేషకళాకలాపపాణింధమ స్వర భాస్వరంబగు వదనవలయంబును, శ్రీకారంబులజోకయుఁదొమ్మిదింటి లెక్కల యొమ్మికయు మోదుగు విరులసిరులు నుబోసరించి వాసివడయు శ్రుతిశష్కులికలును, నిష్కళంకంబులై నిబిడంబులై నిద్దంబులై నీరంధ్రంబులై నీలంపు గుంపులసొంపు లామతించుమంచి నెఱికురులునుంగలిగి వలరాజునెత్తపలకతళుకునం గనుపట్టువీఁపున నేపారి యాపారి జాతామోదమేదురవిలాసంబులభాసిల్లి వెండియు ॥ ౧౭౯ ॥ ఆ ॥ వివిధయువతికోటి వేమఱుసృజియించి । యవ్వధూటిఁజేయ నజుఁడుతలఁచి । కేలుదోయిగడుగ వ్రేళుల తుదనంటు । జలకణంబులే మొసతినఖాళి ॥ ౧౮౦ ॥ తే ॥ అంబుజాననపెందొడలరఁటులగుట । దానఁగలిగిన లావణ్యసూనభరము । వలనిపైఁదేకులొక్కరెండు వ్రాలి బోరగిలఁబడినరీతి మీఁగాళులలరుసతికి ॥ ౧౮౧ ॥ క ॥ మదిరాక్షిజంఘలంగజు। గదల గనుహింపఁ గావుకాహళులైన । న్నదుకువడకగీపెట్టక । పదనుదివిసిరాగిఁజేటిపలుకకయున్నె ॥ ౧౮౨ ॥ తే ॥ కరికరంబులుత్వగ్దోషకల్మషంబు । నపనయింపంగసతియూరులైపొడమియుఁ । బుష్కరంబులతగులంబుఁ బూనెచరణ । దంభమునఁ బూర్వవాసన తలఁగుటెట్లు ॥ ౧౮౩ ॥ తే ॥ బిసరుహాననకటిసీమపృథివియగుట। నిక్కమటుగాకయు న్నఁబై నెలవు కొనునె। కాంచియునుమధ్య మాయయుఁగ్రమనాభి।లక్ష్మియునుద్వారవతియు సలక్షణముగ॥ ౧౮౪ ॥ తే ॥ సకియనాభియమునసుండిజవ్వనంపు । బాలకృష్ణుండువెడలింప బయలుపడిన । కాళియఫణీంద్రుఁడే మొరోమాళిమధ్య । విష్ణుపదమున నణఁగిన విధముగలిగె ॥ ౧౮౫ ॥ ఉ ॥ మానవతీల

---

యాళువులు=పడునట్టి స్వభావముగలవి. విలోల=మిక్కిలిచలించెడి. ఓజ=విధము. విలసనము=ప్రకాశము. పాణింధమ=ఊఁదుతిత్తి. అంబురుహబింబంబుల=చంద్రబింబముల. జోక=విధము. ఒమ్మిక=ఇమిడిక. పోసరించి=బలిసి. శ్రుతిశష్కులికలు=చెవులనెడిచక్కిలములు. నిబిడంబులు=నెండుకొన్నవి. నిద్దంబులు=మెఱుఁగుగలవి. నీరంధ్రంబులు=సందులేనివి. సొంపులు=అందములు. ఆమతించు=పూజించునట్టి. నెఱి=వంకరగల. వలరాజునెత్తపలకతళుకునన్=మన్మథుని సొగటాలాడుపలకయొక్క ప్రకాశముచేత. ఏపారి=అతిశయించి. ఆమోదమేదుర=పరిమళాతిశయముయొక్క. భాసిల్లి=ప్రకాశించి ॥ ౧౭౯ ॥ ౧౮౦ ॥ సూనభరము=పూఁగుత్తి ॥ ౧౮౧ ॥ ౧౮౨ ॥ త్వగ్దోష కల్మషంబున్=తోలువలనిదోషమయినమురికిని. పుష్కరంబుల=తామరల; తొండపుఁగొనల. తగులంబున్=ఆసక్తిని—సంబంధమును. దంభమునన్=నెపముచేత. తలఁగుట=తొలఁగించుట ॥ ౧౮౩ ॥ కాంచి=మొలనూలు; ఒకపట్టణము. మాయ=ఇంద్రజాలము—లేమి; ఒకపట్టణము. ద్వారవతి=ద్వారములుకలది; ఒకపట్టణము ॥ ౧౮౪ ॥ రోమాళి=నూఁగా

లామతనుమధ్యమమర్ గజవైరికులిక్రాంత। ద్యానమరున్మదావళము యశాపనపుంబొ
దక్కిల్లిదూఱఁగాఁ। గానఁగవచ్చు కుంభములు గావ్రగదాకుచకుంభయుగ్మకంబొ
నటులైనవల్లభన ఖాంకుశరేఖలుగల్గిమీటగున్ ॥ ౧౮౬ ॥ తే ॥ వళులులావణ్యవా
రిధివలననిగుడు। వీచిలతికలు కాఁబోలు వెలఁదికేలు। విపులకంకణ మంగుళీవిద్రు
మంబు। మత్స్యరేఖాంకితమునగు మహిమకలిమి ॥ ౧౮౭ ॥ తే ॥ ముదితకరభూ
లములమొప్పుగ్రుచ్చిలించి। యీాకయుండిననొక్కనాళీకభవుఁడు। ఫణిగణంబు
లఁదవ్వఁగపద్మరాగ। యోగమునతాలు మోపించుచున్నవాఁడు ॥ ౧౮౮ ॥ ఆ ॥
కంబుపాణితనకుఁగాంతుఁడుగాఁగల్గు। టెఱిఁగికంఠకంబునింతిదాల్చె। నొక్కయొ
ప్పుగాదెయుత్తమసతులకుఁ। బతులువ్రానినట్టివ్రతముదాల్ప ॥ ౧౮౯ ॥ సోమబిం
బాస్యదశన వాసోమతల్లి। యొప్పచంద్రిక నెఱడాలుగుప్పళించి। జిలుఁగుఁబలుచ
నివాసోవిశేషములకుఁ। జెన్నొసఁగుఁగాదె యొటువంటికన్నెకలిమి ॥ ౧౯౦ ॥ తే ॥
అలరుఁదేనియనానిచి మొలకగట్టి। శర్కరాబీజములుసుధాశాదభూమి। భావజుఁ
డువిత్తమొలచినపైరుపేర। వెడవిలాసంబుప్రాఁబోఁడిపెదవివదవి ॥ ౧౯౧ ॥ తే ॥
దాడిమీాబీజరాజికెందళుకుమొల్ల। మొగ్గలపిసాళ మునుముత్యములసుపాణి। త
మ్మిపువ్వింటఁగోలువున్ననెమ్మివడయు। దంతురాలకసుస్నిగ్ధదంతపఙ్క్తి ॥ ౧౯౨ ॥ తే ॥
క్షీరకంఠంబులని బ్రహ్మవారుపముల। గెంటసంబాడునడగల్గుకోసలయోష్ఠి। సుస్వర
ములెక్కగనుకోటుసూపినిత్య। పల్లవగ్రాహిపాండిత్యపరభృతములు ॥ ౧౯౩ ॥ క ॥
వదనారవిందదళమున। మృదుగతిజనుమందహాస మిషచంద్రికల। స్ఫ్యదదంతావళి
గనునకు। నుదధిశయనదృక్చకోరయుగహర్షదముల్ ॥ ౧౯౪ ॥ తే ॥ యువమనో
జాంగలక్షేత్రముత్తరించి। గరుసువడదున్నుఁదన లాంగలికుహాలము। కామినీమ
ణీముక్కుటుగాకయున్న। నాసికాభగణపుఁగట్టునాటునోటు ॥ ౧౯౫ ॥ క ॥ బి
సగుహరజమునఁబైకం। డుసిమినడగిదగవెలుంగునుడు రాజుకియర్। బిసరుహపాణి

---

ఱు. విష్ణుపదమునన్=విష్ణునిపాదమునందు; ఆకాశమునఁదు ॥ ౧౮౫ ॥ ఉలికి = భయపడి. మరున్మదావళము=దేవతలయేనుఁగు ॥ ౧౮౬ ॥ కంకణము= నీటిబొట్టు; ముంజేతికడియము. విద్రుమంబు= చిగురు; పగడము. మత్స్యరేఖ=చేఁపరేఖ; చేఁపలచాలు ॥ ౧౮౭ ॥ ౧౮౮ ॥ కంబుపాణి= విష్ణువు ॥ ౧౮౯ ॥ దశనవాసోమతల్లి= మేలిమైనపెదవి. చంద్రిక= వెన్నెల; కుసుంబావర్ణము. గుప్పళించి= వ్యాపింపఁజేసి. జిలుఁగు= సూక్ష్మమైన. వాసోవిశేషములకున్= వస్త్రవిశేషములకు. కన్నెకలిమి= నూతనసంపద ॥ ౧౯౦ ॥ శాదభూమి=అదునునేల. వెద=విత్తనాలుజల్లిగమునందు దిగవిడుచుట ॥ ౧౯౧ ॥ కెందళుకు= ఎఱ్ఱనిమెఱుపు. పిసాళము = విశాసము. సుపాణి=స్వచ్ఛమయిన మెఱుఁగునీరు. దంతురాలక=నొక్కులపొడివెంద్రుకలుగలది ॥ ౧౯౨ ॥ గెంటసము=పరిహాసము. ఓటు=ఓటమి=అపజయము. పల్లవగ్రాహి= చిగుళ్లనుగ్రహించునది; విటులనుగ్రహించునది. పాండిత్య=నేర్పుగల. పరభృతములు= కోకిలములు ॥ ౧౯౩ ॥ ౧౯౪ ॥ జాంగలక్షేత్రము=బీటిపొలము. గరుసు=మేర—మెత్తని. నాటునోటు=నాటునా ॥ ౧౯౫ ॥ రజమునన్=పుప్పొడిచేత. ఉసిమినన్=తో మిళడిగి వేఁడఁగా. జృంభించున్=విజృంభించును ॥ ౧౯౬ ॥

ముఖాంబుజ । మెసహాయుధ సౌధకుంభ మెజృంభించుఁ ॥ ౧౯౮ ॥ క ॥ అవ్వతొ ర్మిలులితరా । జీవములకుమరుపతాకజీవంబులకుఁ । జీవంజీవంబులకా । జీవంబులుచెలువకన్నుసిరుల మెఱుంగుల్ ॥ ౧౯౭ ॥ తే ॥ వాసుదేవాదినవశక్తివైభవంబు రుక్మిణీసత్యభామలరూపరేఖ । యిదియెవహియించుననల్పయిడినపదునా । క్రొంటిలెక్కనఁగనుబొమ్మలువిదకమరు ॥ ౧౯౮ ॥ చ ॥ పడఁతిముఖాంశునిష్కములభాసురవర్ణ లలాటపత్రకం । బిడిబెఱిఁగలీలఁగైకొనిరె నిందుఁడునద్దముసాక్షిగాఁగనె । న్నఁడొజలజాతమప్పుజతనంబుగఁ దీర్పనిబల్మినొక్కొ పే । రడుసునసీట నెంతనిల నాఁగినదూఁగిన నోర్చుచుండుటల్ ॥ ౧౯౯॥ తే ॥ సితకరశ్రీఁబరరోరుహశ్రీనిజేయు । కాంత మొగమనిశ్రుతిపుటీకైతవమున । నలువవ్రాసినశ్రీకారములయుగంబు । వర్ణనాతీతరుచిమించుకర్ణయుగళి॥ ౨౦౦ ॥ సీ ॥ ముఖమంబురుహమని ముమ్మారంబుగనప్పళించు తేనియదిండిలెంకలనగ।నాననచంద్రునియంకకర్దమ మొకకడకొసరించినపొడవనంగ । నధరసుధాపూరితాస్య హేమకలశి మూసిననీలంపుమూకుడనఁగ । వదనపద్మనిధిపైవ్రాలినయువమనోమోహాంధకారసమూహమనఁగఁ । గఱకుఁదనముఁజాలఁ దఱచుఁదనంబును । నెఱులసిరులుగలిగివిరులపేరి । కీర్తిబుగులుకొనఁగఁగిసలయాధరగొప్పకొప్పుకప్పుమీఱియొప్పుటొప్పు॥ ౨౦౧॥ క॥ వలరాజుకేలివాలుం । బలకయుబలెనలరువేణిపాణింధమమై । లలితాంగివెన్నుపట్టియ । ధళధళమనుకుందనంపుఁదగడుందెగడుఁ ॥ ౨౦౨ ॥ శా ॥ ఈధారన్ భువనైకమోహనకళాహేలావిలాసంబులన్। రాధాకన్యకధన్యకాంతిఁదనరారన్ దద్వశాశారతిన్ । గోధుగ్బాలకదివ్యమూర్తియగుశ్రీగోవిందుఁ డంభోజినీ । మాధుర్యంబునకగ్గలించునళిసమ్రాడాకృతింగైకొనున్ ॥౨౦౩ ॥ క ॥ ఆరాధామాధవులకుఁ। గోరికలవొల్యన్య హృదయకోటరములనం । కూరితములయ్యె దినముఖ । వారిజగర్భములనుబ్బు వాసనలకియన్ ॥ ౨౦౪ ॥ శా ॥ చాణక్యప్రథితప్రభావసుషమా

లులిత = చలింపఁజేయఁబడిన. మరుపతాకజీవంబులకున్ = మత్స్యములకును. జీవంజీవంబులకున్=చకోరములకును ॥ ౧౯౭ ॥ నవశక్తులు—ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి, సత్వశక్తి, రజశ్శక్తి, తమశ్శక్తి ॥౧౯౮॥నిష్కములు=వరహాలు. పత్రకంబు=పత్రము. ఆఁగినన్=అడ్డగించినను. తూఁగినన్= ఊఁగినను॥ ౧౯౯॥ ౨౦౦ ॥ ముమ్మారంబునన్=అధికముగ. అప్పళించు=కప్పునట్టి. తేనియదిండిలెంకలు=తుమ్మెదబంట్లు. ఓసరించిన=తొలఁగించిన. పొడవు=ఆకృతి. హేమకలశి = బంగారుకలశము. విరులపేరికీర్తి=పువ్వులనైజకీర్తి. బుగులుకొనఁగన్=వ్యాపింపఁగా । ౨౦౧ ॥ వాలున్=కత్తియు. పలకయున్= కేడెమును. పాణింధమమై=చీఁకటియై. తెగడున్=తిరస్కరించును॥ ౨౦౨॥ ఈధారన్=ఈవిధమున. హేలా=ఒయ్యారముగల. గోధుగ్బాలకదివ్యమూర్తి=గొల్లపిల్లకాయయొక్క అప్రాకృతమయిన యాకారము గలవాఁడు. అంభోజినీ= తామరయొక్క. అగ్గలించు=ఉత్సహించు. అళిసమ్రాట్=తుమ్మెదరాజుయొక్క ॥ ౨౦౩ ॥ కోటరములన్=తొఱ్ఱలయందు. అంకూరితములు= మొలకలెత్తినవి. దినముఖ=ప్రాతఃకాలమునందు ॥ ౨౦౪ ॥ ప్రథిత = ప్రసిద్ధమయిన. సుషమా=సర్వ

సర్వస్వపుష్పాస్త్రశ్రీ! వాణీనిత్యనివాసనేత్రముఖసేవాసావధానాఖిల! క్షోణీనాథచమూపనందనభుజాకోదండలంకారియ! క్షీణోదర్క జితార్క సూనృతలతాశృంగారచైత్రాగమా ॥ ౨౦౫ ॥

క ॥ సకలాస్థానసరోవర! నికరమరాళాయమాననిజకీర్తివిభా! ముకురప్రతిఫలితదయా! సుకృతవితరణప్రతాపశుభముఖ్యగుణా॥ ౨౦౬ ॥

మాలిని ॥ వితరణరణదక్షా వేదవేద్యాసపక్షా! చతురమతివిశేషాపారసంగీతపోషా! క్రతుభుగధిపభోగా కావ్యదత్తానురాగా! ప్రతిభయభుజగర్వాభక్తికాభ్యాసశర్వా ॥ ౨౦౭ ॥ ... ... ... ... ... ... *

గద్యము ॥ ఇది శ్రీ పరమపదనాథనిరవధికకృపాపరిపాకపరిచితసరస
కవితాసనాథ రామకృష్ణకవినాథప్రణీతంబైన పాండురంగ
మాహాత్మ్యంబను పరమభాగవతచరిత్రంబునందుఁ
దృతీయాశ్వాసము.

---

స్వ=మనోజ్ఞతయొక్క సమస్తమును గల. భుజాకోదండలంకారి=చేత విల్లుపట్టుటయందు శ్రీరాముఁడా. అక్షీణోదర్క=తక్కువకాని భవిష్యత్ఫలములు గలవాఁడా. జితార్క=(తేజస్సుచేత) జయింపఁబడిన సూర్యుఁడు గలవాఁడా. చైత్రాగమా=వసంతుఁడా ॥ ౨౦౫ ॥ ౨౦౬ ॥ సపక్ష=సమానపక్షము గలవాఁడా. క్రతుభుగధిప=దేవేంద్రునియొక్క. ప్రతిభయ=శత్రువులకు వెఱపును గలుగఁజేసెడి. భక్తికాభ్యాసశర్వా=సేవకాభ్యాసమునందు శివుఁడా. ౨౦౭. ]



# పాండురంగమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.

క ॥ శ్రీమద్యతిసువర్ణరేఖా । విద్యోతితసదననికషవిద్వదనీక । ప్రద్యోతనసన్నుతగుణశత। వేద్యా రామానుజేంద్ర వేదాద్రీశా ॥ ౧ ॥ వ ॥ ఆకర్ణింపుమా నిలింపనదీకిరీటుండు హాటక గర్భసంభవునితో నిట్లనియె. అట్లు వినదగిన ప్రవర్ధమానంబగు ననురాగంబు చిగురుఁగొమ్మనుం జేగయై కొనసాగుచు నికింపనికి రాధ మాధవుం దనకు నధినాథుంగాఁ గోరి గోవర్ధనాచల సమీపవర్తియగు ఋణవిమోచనతీర్థంబునందపంబు సేయంగడంగి ॥ ౨ ॥ సీ ॥ ననలక్రొందొడిమయొత్తినఁ గంటగిలు నుస్తకంబెట్టులోర్చెనొకొ కఱకుజడలు । కస్తూరితిలకంబు గాలివాఱిన నేర్చు నోసలెట్లు ననిచెనో భసితమునకు । వజ్రాలనూలు నొర్వని కటీతటి యెట్లు తాల్చెనో పటుదర్భదామకాంచి । జిలుఁగుదువ్వలువింత బెళకినఁ గరుదాల్చు తను వెట్టులోర్చెనో ధాతువస్త్ర । భరణమునకంచు జనములచ్చెరువునొందఁ । గొమ్మ గావించెఁ దపమట్టి క్రూరనిష్ఠ । కడలి కంపించుక్రియ జగంబడలి వణఁకఁ । దత్సమయజాతహేమంతతరుణవాత్య ॥ ౩ ॥ శా ॥ తత్తాదృఙ్మదజృంభమాణతరుణీతారుణ్యసంపద్దశా। ప్రోత్తుంగస్తననిస్తులోష్ణకవచంబుల్ పూనఁగానోఁచుటల్ । చిత్తానందము గల్గుభోగులకు నిస్త్రింశోగ్రసంపాతమై। యుత్తాలంబగు సీతుకందువ కరంబుద్వేగమొందింపఁగన్ ॥ ౪ ॥ తే ॥ చంద్రబింబాస్యకుచశైలజన్మభూమి । గానరాకుంపుఁబోలే నకట కడిఁదిచలికి, నించుకంతయుఁ గంపింప దివముకొనుచు । ముజ్జగంబులుపచరింపమాటలెక్క ॥ ౫ ॥ తే ॥ పారదం

---

[ విద్యోతిత=ప్రకాశింపఁజేయఁబడిన. నికష =సానఱాయియైన. విద్వత్ =విద్వాంసుల యొక్క. అనీక=సమూహముగల. ప్రద్యోతన= సూర్యుఁడా—విద్వాంసులయొక్కయుక్తిచేత స్పష్ట చేతసానపెట్టఁబడిన సూర్యునివలెఁ బ్రకాశించువాఁడా. నుతగుణశతవేద్యా=పొగడఁబడినయ నేకసద్గుణములచేతఁ దెలియఁదగినవాఁడా ॥ ౧ ॥ నిలింపనదీకిరీటుండు = శివుఁడు. హాటకగర్భ సంభవునితోన్=నారదునితో. చేగ=చేవ. తనికి=ప్రకాశించి. సమీపవర్తి=దాపుననుండునది॥ ౨॥ ననలక్రొందొడిమయొత్తినన్=పువ్వులక్రొత్తతొడిమయొత్తుకొనినను. కంటగిలు=నొచ్చుకొను. ఏర్చు=మండు. ననిచెనో=అనురాగమునొందెనో. నూలు=మొలనూలు. దర్భదామకాంచి= దర్భత్రాటిమొలనూలు. జిలుగుఁదువ్వలువ= సన్ననికట్టుకోక. ఇంత బెళకినన్ = కొంచెము బరసికొన్నను. గరుదాల్చు=గగుర్పాటునొందు. ధాతువస్త్రభరణమునకున్ = కాషాయకోకకట్టుకొనుటకు. కొమ్మ=స్త్రీ—రాధ. అడలి=శోకించి. తరుణవాత్యన్=చక్కగాసుడిసివీచునట్టిగాలిచేత॥ ౩ ॥ తాదృఙ్మదజృంభమాణ = దానివంటిమదముచేత విజృంభించుచున్న. ప్రోత్తుంగ = మిక్కిలి యున్నతములైన. భోగులకున్=భోగపురుషులకు; సర్పములకు. నిస్త్రింశోగ్రసంపాత = కత్తియొక్క భయంకరమైనపాటు. ఉత్తాలము= అధికము. సీతుకందువ = చలికాలము. ఉద్వేగము= భయమును ॥ ౪ ॥ కడిఁది=అసాధ్యమయిన. ఇవముకొనుచున్= చలిగొనుచు ॥ ౫ ॥ పారదంబు

బునఁదోఁచినపసిఁడితీఁగ । పగిదిరాజిల్లెరాధచంపకసువర్ణ । వర్ణమగుమేనుకుముదధవళతుషార । పటలకంచుకవేల్లనఘటనకలిమి ॥ ౬ ॥ తే ॥ నవ్యకాలాగరూద్వర్తనములసతుల । చన్నుఁగొండలనష్టాగ్నిసంభవించె । మతిసమగ్రసలుధూమానుమానకలన । నగ్నిసాధింతు రచలంబులందు నెప్పుడు ॥ ౭ ॥ తే ॥ సురలుకళలెల్లఁ గ్రోలినసోముతనువు । కప్పురముగుప్పరించినఁగనకక్రోలిపువ్వుఁదేనియచనినయుంభోరుహంబా । యనఁగమంచింక్రిబహ్మాండమగ లెఁజలిని ॥ ౮ ॥ క ॥ అగలుంగుంకుమపువ్వును । దొంగరుంజేలలును సీతుఁద్రోవంగలవే । పొగలేనిముర్మురంబులు । మగువలపాలిండ్లుఁభోగ మహనీయంబుల్ ॥ ౯ ॥ క ॥ పైనిగుడుమంచుతువ్వర । వానలచేఁదడిసికమలవనలక్ష్మీహారి । ధ్యానసిమీలితలోచన । యానలరాధావధూటికనుగలమయ్యెన్ ॥ ౧౦ ॥ తే ॥ కాలుఁగాలునుగేలునుగేలుమోవి । మోవియునుదార్చిభోగిసమూహమమరె । నూహసేయంగభోగిసమూహమునకుఁ । బొసఁగమసకంపుఁబెనఁకువలెసఁగుఁగాదె ॥ ౧౧ ॥ క ॥ శ్యామలకాలాగురునవ । ధూమమువొదకుసుఖమొనర్పఁదోరపుఁగన్నుల్ । వేమొగుచుకరణిస్రోధ । స్తోమముమరెఁగప్పఁబడినసోరణగండ్లన్ ॥ ౧౨ ॥ క ॥ అంతవసంతముజితహే । మంతముదీపించిమత్తమధుకరకలభాక్రాంతమురుపుష్పరసవే । శంతముసకలద్రుములంబిసాళముచెలఁగన్ ॥ ౧౩ ॥ ఉ ॥ కెంజిగురాకుడాలు దులకించినధాతుపటంబుచాయఁజే । యంజదురెక్కఁపుప్పొడులనంటినతేఁటులుభూతిభృజ్జటా । పుంజముఁబోలఁగావిపిన భూములలోమధులక్ష్మిపొల్చెనీ । లాంజనవర్ణుఁగోరితపమాట్లొనరించుమృగాక్షికైవడిన్ ॥ ౧౪ ॥ క॥ ఆవిర్భవించెనీల। గ్రీవాలికకేలికీలకేవలసఖమై । పూవులకారుడివోవం । గావేస

నన్ = పాదరసమునందు. కుముద ధవళ = తెల్లగలువ తెలుపుగల. తుషారపటల = మంచుసమూహమనెడి. కంచుక = కవచముయొక్క. వేల్లన = చుట్టుకొనుటతోడ. ఘటన = కూడిక. కలిమిన్ = కలుగుటచేత ॥ ౬ ॥ ఉద్వర్తనము = నలఁగు ॥ ౭ ॥ క్రోలి = త్రాగి. అగలెన్ = ఛేదిల్లెను ॥ ౮ ॥ అగలు = అగరు. చేలలు = వస్త్రములు. సీతు = చలిని. ముర్మురంబులు = కుమ్ములు. పాలిండ్లు = స్తనములు ॥ ౯ ॥ అనుగలము = అనుకూలము ॥ ౧౦ ॥ మసకంపుఁబెనఁకువలు = సంభోగమునందలియిచ్చపెనఁగులాడుటలు ॥ ౧౧ ॥ శ్యామల = చామనిచాయగల. తోరపు = విశాలములయిన. సోరణగండ్లన్ = కిటికీలచేత ॥ ౧౨ ॥ జితహేమంతము = గెలువఁబడినహేమంత ఋతువుగలది. మత్తమధుకరకలభాక్రాంతము = మత్తుగొన్న కొదమతుమ్మెదలచేత ఆక్రమింపఁబడినది. ఉరుపుష్పరసవేశంతము = అధికమయిన పూఁదేనెపడియలుగలది. సకలద్రుములన్ = అన్నివృక్షములందును. పిసాళము = వికాసము. చెలఁగన్ = అతిశయింపఁగా. దీపించెన్ = ప్రకాశించెను ॥ ౧౩ ॥ డాలు = కాంతి. తులకించిన ధాతుపటంబు చాయన్ = ప్రకాశించిన కావికోకచాయను. చదురెక్కు = బురదలు దేఱునట్టి. భూతిభృజ్జటాపుంజమున్ = భస్మమును ధరించుచున్న జడలసమూహమును. మధులక్ష్మి = వసంత ఋతుసంపద. నీలాంజనవర్ణున్ = నల్లకాటుకవన్నెగలవానిని—కృష్ణుని ॥ ౧౪ ॥ ఆవిర్భవించెన్ = పుట్టెను. నీలగ్రీవాలికకేలికీలకేవలసఖము = శివునినొసటియగ్నిజ్వాలకుముఖ్యమిత్రము. పూవులకారు = వసంతఋతువు. ఉడివోవంగన్ = ఉడిగిపోఁగా. వేసవి = గ్రీష్మఋతువు.

జిల్లెమఱియు। జలధరోదయవిప్రప్రసాదలబ్ధి॥ ౨౨॥ తే॥ ప్రబలుపతగంబులనింద్రగోప ములుజంబు। ఫలములునుబొల్చెఁబిచ్చుకపట్టులందు। వనధినీరానఁజెరలఁసస్యములవె ల్లి। నంబుదంబులువెలిగాసెనలుగకనఁగ॥ ౨౩॥ తే॥ మోవిచెలువంబుగేదంగిపూ వుఱేకు। సోయగమునూఁపుకన్నులసొబగుఁజికుర। బర్హిబర్హప్రభయుఁజూపిప్రతిఘ టించె। నంబుధరకాలసౌభాగ్యమంబుజాక్షి॥ ౨౪॥ క॥ సలిలంపువృద్ధజలధరములు పూనినయూఁతకోలమొత్తములక్రియన్। దొలువానకాళులెసఁగెన్। గలహంసకు లంబులెల్లఁగలఁగంబడఁగన్॥ ౨౫॥ శా॥ అద్రిగ్రావములుర్విరాలబలఘోషాడం బరంబుల్ వియో। గిద్రోహంబొనరింపవారినిధికెంగేలంటఁగావాహినుల్। భద్రే భప్రతిమానమూర్తియగుచున్ పాథోధరశ్రేణికుం। భద్రోణంబులుగుమ్మరించె వి మలాంభఃపూరధారావళిన్॥ ౨౬॥ క॥ పాపటతెరువునడిగి నా। సాస్ఫుటముక్తాఫ లప్రవారంబైరా। ధాపృథువక్షోరుహముల। పైపైప్రథమోదబిందుపటలమునిగి డెన్॥ ౨౭॥ సీ॥ పెరిగిసూచీముఖాభేద్యంబులగు సంధశార ధారాచ్ఛటల్ గాలుకొ నినఁగర్ణజ్వరాపాదకంబులై దంభోళిగంభీరరవములుగడలుకొనిన। మజ్జంబులము చ్చముడుఁగింపఁగాఁజాలునీఁదగాడుపులుబిట్టెమురుకొనిన। దుర్గమకర్దమస్తోమసంఛ న్నభూముల సోనవానలుముంచుకొనినఁ। జెదరకఅకాలఁగన్నుపచ్చినవిధాన। నాథ సంకేతములకేగునడికిరేలు। కాయసంభవబాధాసహాయమగుచు। సైవ్వారిణీకోటని

---

=వంశముయొక్కవృద్ధి; వెదుళ్లవృద్ధి. లబ్ధిన్ = పొందుటచేత ॥ ౨౨ ॥ పొల్చెన్ = ఒప్పెను. అనన్=త్రాఁగఁగా. తెరలు = బయలువెడలు. అలుగక=జీర్ణింపక ॥ ౨౩ ॥ మోవి=అధరము; పికానొకపండు. గేదంగిపూవుఱేకు= పచ్చమొగలిపూఱేకు; మొగలిఱేకనెడి యాభరణము. సోయగము= అందము. ఊఁపుగన్నులసొబగు = చలింపఁజేయునట్టికన్నులయొక్క యందము; చలింపఁజేయఁబడునట్టి నెమలిపురికన్నులయొక్కయందము. బర్హిబర్హప్రభ = నెమలితుంచెయొ క్కప్రకాశము; దర్భపోచలయొక్కప్రకాశము. ప్రతిఘటించెన్ = ఎదిరించెను. అంబుధరకా లసౌభాగ్యము=వర్షాకాలముయొక్కమనోజ్ఞత్వము ॥ ౨౪ ॥ సలిలంపు = నీళ్లుగల. ఊఁతకోలన్= ఊనుకొనుకఱ్ఱ. వానకాళులు=వానచినుకులధారలు ॥ ౨౫ ॥ గ్రావములు=రాతిగుండ్లు. వియో గి=విరహి; తనవారినెడబాసినవాఁడు. ద్రోహంబు=చెఱుపును. కెంగేలు=ఎఱ్ఱడాలుగలచేయి. వాహినులు=నదులు. పాథోధర=మేఘములయొక్క. కుంభద్రోణంబులు = కుండలుతూములు నుగా. అంభః=నీళ్లయొక్క ॥ ౨౬ ॥ ౨౭ ॥ సూచీముఖాభేద్యంబులు=సూదిమొనచేతను భేదిం పరానివి. ఛటలు=సమూహములు. కాలుకొనినన్=నిండుకొనఁగా. ఆపాదకంబులు=కలుగఁ జేయునవి. దంభోళిగంభీరరవములు= వజ్రాయుధముయొక్క వెలితిలేనిధ్వనులు. ముచ్చముడుఁగిం పఁగాన్=మిక్కిలి ముడుఁగుకొనునట్లుచేయను. ఈఁదగాడుపులు = శీతవాయువులు. బిట్టు= శీఘ్రముగ. దుర్గమ=అణఁపరాని. కర్దమ=బురదయొక్క. సంఛన్న= చక్కగాఁగప్పఁబడిన. సోనవానలు=ముసరువానలు. నాథసంకేతములకున్=ప్రియులయేర్పాటుతావులకు. నడికిరేలు= అర్ధరాత్రములందు. కాయసంభవ=మన్మథునియొక్క. సైవ్వారిణీకోటి= అంకటాఁద్రసమూహ

ర్భయుస్వైరధాటి॥ ౨౮॥ క॥ త్రిదశగురుప్రతిమానులు। నిదిపగలిది రాత్రియనుచు నే
ఱుపఱుపలే। రుదళితహరినీలమణి। చ్ఛదనీలము మొగులు సూర్యచంద్రుల మ్రింగన్॥
౨౯॥ క॥ తరణిలయానంతరమునఁ। గరమమరుదిగంతములను ఖద్యోతంబుల్। మరల
గఁ దైజసస్పృష్టికిఁ। బరమాణుచయంబుగూడఁ బఱచు చందమునన్॥ ౩౦॥ సీ॥ ఇంద్రచా
పంబు గాదిది చాళితలమున సవరించు బర్హిపింఛంబు గాని। భిదుర ఘోషంబు గాదిది
పాంచజన్యసంజాతగంభీర ఘోషంబు గాని। యాశ్రయించిన బలాకావళి గాదిది హా
రిముక్తాహారయష్టి గాని। యదికోల మెఱుఁగు గాదుదిరి బంగారంపుఁ బసిమిగ్రమ్మెడు
పచ్చపట్టు గాని। వృష్టి గాదిది కరుణాంబువృష్టి గాని। నీలమేఘంబు గాదిది నీలవర్ణుఁ।
డౌరనా మ్రోలఁ బ్రత్యక్షమయ్యె ననుచు। హర్షపులకితతనువయ్యె నవ్వధూటి॥ ౩౧॥
వ॥ ఇట్లనవరతధ్యానధారాప్రవాహమగ్నహృదయయగు నాగగనావలగ్నకు నిఖి
లజగద్వలయంబును విష్ణుమయంబై తోఁచె నంతభక్తవత్సలుండగు శ్రీవత్సవత్సుం
డు॥ ౩౨॥ సీ॥ అరచంద్రులోని చిహ్నాంశంబునుం బోలె నుదుటఁ గస్తూరిబొట్టు పదను
కొనఁగ। గగనంబునందలి ఖరమరీచియుఁ బోలె నురమునఁ గౌస్తుభం బొఱపుమీఱ। సు
రభూజశాఖలఁ జుట్టు తీఁగెలుఁ బోలెఁ గేలఁ బచ్చలకడియాలు మెఱయఁ। గౌదమునసం
పెఁగ మొగ్గతుదఁ బొల్చు విరివోలె నునుకుఱుసముం గఱముత్యమమర। నీలగిరిగప్పు వెన్నె
లనిగ్గుఁ బోలె। నవకమగు మేన హరిచందనంబు వొదువ। వివిధమణిభూషణప్రభల్ వె
లయఁ ఫలిత। కల్పతరులీల రాధయగ్రమున నిలిచి॥ ౩౩॥ ఉ॥ శ్రీదనరన్ గృపారసము
చిల్కఁ దపోనలజాయమానహృ। త్ఖేదము మాన్పించి తన కేలను గేల్దమలించి నిర్భరా।
హ్లాదమెలర్ప నయ్యువతి నర్థశరీరము నట్లు ప్రోచెన। య్యాదవరాజవంశమణియ

---

టు. స్వైర=యథేచ్ఛమయిన ॥ ౨౮॥ ప్రతిమానులు=సమానులు. మొగులు=మేఘము॥ ౨౯॥ తరణిలయానంతరమునన్=ప్రొద్దుగ్రుంకిన పిమ్మట. ఖద్యోతంబులు=మిడుఁగుఱుఁబురుగులు. తైజస=తేజస్సుగలవానియొక్క ॥ ౩౦॥ బర్హిపింఛము=నెమలిపురి. భిదురఘోషంబు=పిడుగుచప్పుడు. బలాకావళి=కొంగలచాలు. హారి=మనోజ్ఞమయిన. యష్టి=సరము. కోలమెఱుఁగు=వంకరలేని మెఱుపు. ఉదిరి=అపరంజి. మ్రోలన్=ఎదుటను. హర్షపులకితతనువు=సంతోషముచేత గగుర్పాటునొందిన దేహముగలది ॥ ౩౧॥ అనవరతధ్యానధారాప్రవాహమగ్నహృదయ=ఎడతెగని ధ్యానము చేయుధోరణియనెడి ప్రవాహమునందు మునిఁగిన మనసుగలది — ఎడతెగక ధ్యానము చేయునది. గగనావలగ్నకున్ = ఆకాశమువంటి నడుముగల దానికి — రాధకు. జగద్వలయము=వలయాకారమయిన లోకము. శ్రీవత్సవత్సుండు= శ్రీవత్సమనుమచ్చ ఱొమ్మునందుఁగల కృష్ణమూర్తి ॥ ౩౨॥ పదనుకొనఁగన్=చెమ్మగిల్లఁగా. ఖరమరీచి=సూర్యుఁడు. ఒఱపు=అందము. సురభూజ=కల్పవృక్షముయొక్క. కౌదమ=లేఁతదైన. విరి=పుష్పు. ముంగఱ=ముక్కఱ. నిగ్గు=తేటయినకాంతి. నవకము = మృదువైనది. హరిచందనంబు= పచ్చగందము. అగ్రమునన్= ఎదుట॥ ౩౩॥ చిల్కన్=ప్రసరింపఁగా. జాయమాన=పుట్టుచున్న. ఖేదము= శ్రమము. తమలించు=

క్రిజ నేలినశాలిపోలికన్॥ ౩౪॥ క॥ రాధాసంగమముదితుని । మాధవుఁగని యోటు వడినహొడిఁ గ్రొఁదెరలెశం । పాధరముతనదువర్ణము। బాధితమగు నేని వెలుకఁబాఱు ఘనుండున్॥ ౩౫॥ క॥ నీలాంజనవర్ణుఁడు రా । ధాలీలావతిననఁగి పెనఁగి తనరెడుకర ణిన్। గాలము శరత్సమాగమ। హేలాసౌభాగ్యమహిమ నేపువహించెన్॥ ౩౬॥ సీ॥ కలఁకనీరెంతయు గతకల్మషముఁ జేసెఁ గతకాఫలము రీతిఁ గలశసూతి । పాపటదీర్చె భూభాగంబు నాస్యానశాదంబు శకటౌఘచక్రధార। శిఖితాండవము కళాసికఁ జేసి సడలించెఁ గఱకుటీఁకలపేరి కాసెబిగువు। ఉడిగించె జడివానలుదయించె వెండియుఁ గరిఘటామదవృష్టి కైతవమున। తెల్లుశోభిల్లె మంకెనలుల్లసిల్లెఁ। గాలకంధరవాహంబు గజ్జురేఁగె। ముదితశతగోపకన్యకావదనతులిత। లలితరుచిఁబొల్చె రాకాకళాధరుం డు॥ ౩౭॥ క॥ చనుమొలకలుగల కన్యా। జనములఁ బురుడించెఁ బద్మసరసీరేఖల్। నన విలుతుమిట్టకోలలు। వనరుహముకుళములుగానవచ్చుటకతనన్॥ ౩౮॥ క॥ అల రాధి కాధరాధర। దళములయదుభర్తనినుచు దంతక్షతరేఖ। ఖలుఁబోలె గ్రొత్తమంకెన। యలరులపైఁ దేఁటులమరెనాసమయమునన్॥ ౩౯॥ తే॥ పాంచజన్యంబు రాధికా చంచలాక్షి। కంధరము నోడి యెచట నోఁ క్రాఁగిపోవఁ। దద్గతధ్వనితద్భర్త దాయ యనియొ। చేరె వృషభంబు కంఠకుటీరవాటి॥ ౪౦॥ తే॥ పుండరీకుని రక్షింప భూమి భార। మణఁప నవనీతలంబున నవతరిలిన। యల్లునిగుఱించివచ్చు దుగ్ధాబ్ధియనఁగఁ। జం ద్రికాపాండుజలధరచ్ఛాయవొదలె॥ ౪౧॥ సీ॥ కలుగకుండిన నేమి కడిమి పున్నాగల తావి ననిచినమరువ మెంతటికి నోప। దొదవకుండిన నేమి మదకేకినటనంబు చాలదె యంచలసంభ్రమంబు। మెఱవకుండిన నేమి మెఱుఁగులపొలప మేతన్మాత్రము లె శాలి ధళధళములు। సుడియకుండిన నేమి సోనవాఁగలపెల్లు గజదానవృష్టికిఁ గడమ కలదె। కా

---

కదలించి. ఎలర్పన్ = అతిశయింపఁగా. ప్రోచెన్ = పోషించెను॥ ౩౪॥ సంగమ = చేరిక చేత. ముదితునిన్ = సంతోషించినవానిని. ఓటువడిన = జయింపఁబడిన. తెరలెన్ = చలించెను. శంపాధరము = మేఘము. వెలుకఁబాఱున్ = వెలవెలఁబోవును. ఘనుండు = గొప్పవాఁడు; మేఘుఁడును॥ ౩౫॥ అనఁగిపెనఁగి = కలసిమెలసి. తనరెడు = అతిశయించెడు. శరత్సమాగమ = శరత్కాలము రాకయొక్క. హేలా = విలాసముయొక్క. ఏపు = ఆధిక్యమును॥ ౩౬॥ కతకాఫలము = చిల్లగింజ. కలశసూతి = అగస్త్యుఁడు. భూభాగంబునాస్యానశాదంబు = భూప్రదేశముయొక్క ముఖభాగమునందలి బురదను. శిఖి = నెమలి. కళాసికఁ జేసి = నాట్యక్రియావిశేషముచేత. కరిఘటా = ఏనుఁగుగుంపులయొక్క. కైతవము = నెపము. కాలకంధరవాహంబు గజ్జురేఁగెన్ = వృషభముయొక్క మదము అతిశయించెను. కళాధరుండు = చంద్రుఁడు॥ ౩౭॥ ననవిలుతుమిట్టకోలలు = మన్మథుని వైసకఱకు బాణములు. వనరుహముకుళములు = తామరమొగ్గలు॥ ౩౮॥ ౩౯॥ కంధర = మెడ. క్రాఁగి = తపించి. దాయ = శత్రువు. కుటీరవాటిన్ = గుడిసెచాలునందు॥ ౪౦॥ అవతరిలిన = పుట్టిన॥ ౪౧॥ ననిచిన = చిగిరించిన. పొలపము = ప్రకాశము. శాలి = వరిపైరుయొక్క. సోన = ముసురు. కడమ = తక్కువ. కారుకాలానన్ = వర్షఋతువునందు. ఉరిలి = వదలి. ఓసరిలినన్ = తొలఁగఁ

రుకాలానఁగలిగినగౌరవంబు । చొకమై తోఁచెశరదృతుసౌష్ఠవమున । నురివితొల్లిటి యధికారియొసరిలిన । వెనుకయధికారియవికావెవిభవకళలు ॥ ౪౨॥ ఉ॥ పాఁడియుఁ బంటయుంగలిగి పంకవిహీన మనోహరాంబువుల్ । వేఁడిననెల్లచోటఁ బ్రభవింపఁగ భానుఁడు శీతభానుఁడుఙ్ । గాఁడినమేఘకాళిమవికారము దూరముసేయ నెంత యుఙ్ । నాఁడెముచూపె శారదదినంబులునిర్మలవార్త్తికాకృతిఙ్ ॥ ౪౩॥ సీ॥ రత్నగట్టి రిమహీరమణులశ్వములకు ధూర్తనీరాజనపూర్వకముగ । ఫలకగ్రహణముఁ జౌపద ములగరిమంబుఁ బరఁగెబాలకులకుగురువులిండ్ల । దుమికిచిచ్చఱతోరణములుదూఁటిన వారుమాఱరైరిక్ష్వతాంతతోరణములు । భుజియించెఁ బ్రజభుజాభోజనంబులుసిగ బంటిగాఁదొలిక్రొత్తవంటకముల । నఖిలదిగ్జయకాంక్షఁబుష్పాయుధుండు । వెలిగు డారంబులోవచ్చివిడిదిచేసె । మురళిమ్రోయించెఁద్రిభువనీమోహనముగ । రాధ కింపుగనాదినారాయణుండు ॥ ౪౪ ॥ వ ॥ ఇట్లునిజజలనిమజ్జజ్జంతుజాలంబులకు ఋ ణత్రయవిమోచన హేతువగునా ఋణవిమోచన తీర్థంబునందపంబుచేసి రాధకృ తార్థయమ్యెనయ్యాదవకిశోరంబును కృశోదరీసహాయుండై మాయాశబలితుండగు జీవపురుషుని పరుసునవివిధభోగపరాయణుండై పరఁగుచుండెనయ్యెడఁబుండరీకుని ప్రకారంబాకర్ణింపుము॥ ౪౫॥ క॥ ఉపమింపఁగరానితప । స్తపమునఁగడువాఁడిమీరు ధరణీసుమన । స్తపనుఁడుకమలవికాసం । బెపుడునునుడివోనితావినింపువహింపఙ్॥ ౪౬॥ క॥ ఆద్యశివాధిష్ఠితమై । యుద్యజ్జ్యోతిర్విలాసయుతమైస్వశిరః । పద్మోద్భవమై కడునన । వద్యమునౌదశశతారవనజమునందుఙ్ ॥ ౪౭॥ చ॥ జొటజొటధారగావడి యుచుంగడలెత్తుసుధారసంబుగ్రుం । గుటకుటనప్పటప్పటికిఁగ్రోలుచునాలుగురెంపు మూలలఙ్। గుటిలతదాల్చుభోగినిగఁగర్పొడమించుచుదక్షిణశ్రవ । స్తటపిసరత్పయో దనినదంబునఁజొక్కుచుమబ్బుగ్రక్కుచుఙ్ ॥ ౪౮॥ ఉ ॥ విచ్చినకమ్మదమ్ములకువిందు

---

గా॥ ౪౨॥ పంకవిహీనమనోహరాంబువులు=బురదలేనితేటనైనమనోహరజలములు. వేఁడినఙ్= కోరినను. శీతభానుఁడు=చంద్రుఁడు. కాళిమ= నల్లఁదనముయొక్క. శారద=శరత్కాలమునం దలి ॥ ౪౩ ॥ నీరాజన=ఆరతులు. ఫలకగ్రహణము= పలకపట్టించుట. చౌపదములు= చిందులు త్రొక్కుటలయొక్క. చిచ్చఱతోరణములు=నిప్పుగుండములచాళ్లు. సిగబంటిగాఙ్=తలమునుఁగ. వంటకములు=అన్నములు. మురళి= పిల్లనగ్రోవి ॥ ౪౪ ॥ నిజజలనిమజ్జజ్జంతుజాలంబులకుఙ్= తననీటియందుమునిఁగిన ప్రాణిసమూహములకు. ఋణత్రయవిమోచనహేతువు=దేవఋణముఋ షిఋణముపితృఋణమునను మూఁడువిధములయినఋణములనుతీర్చుకొనుటకుకారణము. అయ్యాద వకిశోరంబు=ఆయదువంశస్థుఁడైనపిల్లకాయ—కృష్ణుఁడు. మాయాశబలితుఁడు=మాయచేతపలు రూపములఁగనఁబడినవాఁడు. పరుసునఙ్=విధమున॥ ౪౫॥ ఉపమింపఁగఙ్=సరిపోల్ప. తపస్తపము నఙ్=తపస్సనెడివేసంగియందు. ధరణీసుమనస్తపనుఁడు=బ్రాహ్మణుఁడనెడిసూర్యుఁడు. ఉడివోని =మాసని॥ ౪౬॥ ఉద్యత్=వెలుఁగుచున్న. స్వశిరఃపద్మోద్భవము=తనశిరోమార్గమునందుఁబుట్టినది. దశశతారవనజము=సహస్రారకమలము॥ ౪౭॥ కడలెత్తు=అలలుకొట్టు॥ ౪౮ ॥ పీలినైస్టైము=

లు పెట్టు వెడందకన్నులున్ । బచ్చనిపట్టుఁ బేరురముఁ ద్రాఁకినమచ్చయుఁ జీలినెట్టెముల్ । బచ్చికచాయ యుంజిరుతపాయముగిల్లు వెలుంగునిచ్చలో । రచ్చయొనర్ప నందఱపరాకునఁ దేలుచు వేడ్కఁ దేలుచున్ ॥ ౪౯ ॥ చ॥ గురుజనభక్తియుం గపటగోపకుమారపదాబ్జసక్తియున్ । దరలఁగఁ బాపభూరుహవితానములీనముగాఁ జెలంగు భా । స్వరతరయోగసీధువున సౌఖ్యము నొందుచుఁ జిద్బిసాంకురా । హరణమొనర్చి భూమిసురహంసము చాలఁ బ్రశంసనొందఁగన్ ॥ ౫౦ ॥ సీ॥ తన మొగంబులు ప్రాంతమినుకుమానికములగములుద్భవిల్లెడు గనులుగాఁగ । దనకమండలువారి దనుజారిపాదార్ఘ్యమలవరించుట మాటచెలము గాఁగ । దనమది నెద్దివోఁచిననది యొక్కొక్క రూపాంతరంబునఁ బ్రోదివడయఁ । దనకట్టునజినరత్నము సృష్టిదీక్షకై కప్పినయది పోలెఁగప్పదేర । వీచువీవనచేఁ బూని వెనుకఁ దనకుఁ । జిలుతచను దోయి యొరగుగాఁ జేసి పలుకుఁ । జెలువ గొలువంగఁ దొలుకారుకలఁకపులుఁగు । మావు రాహుత్తు నిలిచె బ్రహ్మ యునిమోలి ॥ ౫౧ ॥ చ॥ నిలిచి నిలింపలోకతటినీతటనీరజహేమనీరజో । జ్జ్వలబిసనాళఖాదనము వంకనపొంకము మీరు క్రొవ్వునన్ । గళముగదల్ప లేని తురగంబు పటాలి సక్రినక్రమతా । కలితశరీరు నిందిగిచి కౌఁగిటఁ జేరిచెఁ బుండరీకునిన్ ॥ ౫౨ ॥ ఉ॥ చేరిచి సేమమే సితకుశేశయలోచనగోచరాత్మ నీ । వారికి నీకు నన్నవిని వారిరుహాసనుఁ బల్కె నమ్మహా । దారుఁడ మేయభద్రసముదాయ నిదానము నీవు వచ్చుటన్ । సారసగర్భ యింతఁగొనసాగుఁ జుమీ కుశలంబు మాదెసన్ ॥ ౫౩ ॥ క॥ అనిపరమ సనకుని తా । న్నిమిషులర్చించునట్టులర్చించె జగ । జ్జననస్థితిలయకారణ । జననజనిన్ సుజనమిత్రు రజనిరజనీశున్ ॥ ౫౪ ॥ క॥ అర్చించి నిలిచి చేతులు । గూర్చి పురస్థ్సలికిఁ జూచి గోవిందపదాబ్జార్చారసపానవిధుఁడ । నర్చితతదితరుఁడు తీరు రాగ్రణి పల్కెన్ ॥ ౫౫ ॥ సీ॥ విజ్ఞానవంద్యుఁడీ విశ్వనిర్మాతయాత్మారాముఁడీ త్రిలోకాధికారి । భూమిమధ్యజనితనుద్రుండీ మహామతి యజ్ఞాతచర్యుఁడీ ప్రాజ్ఞతముఁడు । సర్వావయవజప్రజాప్రజుఁడీ వే

---

పికిలిపిట్టయీఁకలు చెక్కి సపలసాగ. ఇచ్చలోన్=మనస్సునందు. రచ్చయొనర్పన్=కొలువు చేయఁగా-నసింపఁగా ॥ ౪౯ ॥ తరలఁగన్=చలింపఁగా. భాస్వరతర=మిక్కిలి వెలుఁగునట్టి. చిద్బిసాంకురాహరణము=జ్ఞానము నెడి తామరతూఁడు మోసును భుజించుట ॥ ౫౦ ॥ ప్రాంతమినుకుమానికములగములు = వేదముల నెడి రత్నసమూహములు. ప్రోది=రక్షణము. అజినరత్నము=శ్రేష్ఠమయినచర్మము. ఒరగు=ఆనుకొనెడిదిండు. పలుకుఁజెలువ=సరస్వతి. తొలుకారుకలఁకపులుఁగురాహుత్తు=బ్రహ్మ. (తొలుకారుకలఁకపులుఁగు=వర్షాకాలము కలఁతనొందుపక్షి; హంస. మావు=గుఱ్ఱము. రాహుత్తు=రౌతు) ॥ ౫౧ ॥ నీరజ=రేణువులులేని. బిసనాళఖాదనము వంకన=తామరతీఁగ కాఁడలను తినెడి ప్రక్కనే ॥ ౫౨ ॥ సితకుశేశయలోచనగోచరాత్మ=విష్ణుఁడు విషయమయిన మనసుగలవాఁడా ॥ ౫౩ ॥ జనిన్=పుట్టుకగలవానిని. రజని=రాత్రికి. రజనీశున్=చంద్రుని ॥ ౫౪ ॥ ౫౫ ॥ నిర్మాత=నిర్మించువాఁడు. భూమిమధ్యజనితరుద్రుండు=తనుబొమలనడుమఁ బుట్టినరుద్రుఁడుగ

ల్పసుఖ్యాప్తుఁడ త్రయీమయూలభూతి । దక్షాదికప్రజోద్భవహేతువీవయ్యేకర్మైక
సాక్షియీవె నిర్మలుఁడవు। శాంతుఁడీవందు వాఙ్మనఃకాంతుఁడీవఁడు । ననఁగ వెలుఁగొం
దువీవు నాకతిథివైతి । వేనుతోలు మేనఁ జేసిన దెట్టినో ముని॥ ౫౬॥ మ॥ అరుణావిష్కృ
తిభాస, రోదసియుఁ బద్మామోదమున్ ఘోరహా । కరముల్ వేలుపువిల్ ప్రవర్షణము
నోంకారంబు మంత్రాక్షర । స్ఫురణంబుల్ ప్రకటింపఁగా మొదలనుద్భూతంబులైన
ట్టులీ । శ్వరుఁడే తెంపుటకున్ ద్వదాగమము సోసంసూచకంబయ్యెడున్॥ ౫౭॥ ఉ॥
త్వాప్తులందు సందకము దాలుచు వేల్పు వసించునట్టుల । ర్చాదులనూఁదియుండఁడ
నియాడుమర్లు గుటన్ సమస్తవ । స్త్వాదయ హేతుభూతి వెలుఁగొందెడు మీరిటకిట్లు వ
చ్చుటన్। శ్రీదయితాగమంబు కడుఁ జేరువయౌనని నిశ్చయించితిన్ ॥ ౫౮॥ క॥ నా విని
నను మొగమున నద్దేవజ్యేష్ఠుఁ డనాను దేవ పిలుపుసం । భావించిసజలజలధర । రా
వనిభగభీరకంధరధ్వనిఁ బలుకున్॥ ౫౯॥ చ । ఒసఁగెద నీకు వేఁడు వరమోపరమవ్రత
యొంద్రయేనియున్ । మసలక యన్న నన్న యసమస్థితుఁ డిట్లను నట్టి దేనియున్। బిసరుహ
గర్భముర్భవవిభేదను నైపలఁ ఫుండదీయసం । గసుఖమఖండధర్మపరికర్మముఁగూర్మి
నొసంగు నాకొగిన్॥ ౬౦ ॥ చ॥ అనవుడు నుల్లయిచ్చి కమలాసనుఁ డాశమశాలిఁ బల్కె
నో। మునివర నీవు సేయ తపముల్ జపముల్ ఔరరేఁపనెల్లనే । టనఘ పద గ్రపీఠికిఁ గ
డారపటుండిటవచ్చుమున్నెయా । యనననునేలి నాఁడు చరితార్థుఁడవీవు చతుర్థసంప
దన్ ॥ ౬౧ ॥ క ॥ నీ యీ స్తోత్రమునో ముని। నాయక దేవర్షినరగణప్రార్థితమై। శ్రే
యసవదాస్యమగునని । పోయెంబయోజాతసూతిపోయిననతఁడున్ ॥ ౬౨॥ ఉ॥ ధా
తఁగలంచి మ్రొక్కి యవదాతసరోజనిభాక్షుఁ గాంచినో। ప్రాఁతిపెనంచి యన్నియు
వపల్కులు సత్యములౌకొల్వాక్కథా । ప్రోతము కుంఠముఁ డెందమనుబోఁటికిదక్క
నెవక్కకేమిభ । శ్యాతురతాపహారిననుజారియనావిన మేబుధోత్తములన్ ॥ ౬౩ ॥ సీ॥
అవచూడబర్హిబర్హమున నొండొంటిసిక్కనులంటిచక్కి చిక్కముదలిర్పఁ। బంటకా
ర్వోదమ్మిదంట గెంటసమాడు పెడఁదకన్నులకాంతి వెల్లివిరుడువ। మెఱుఁగుఁ జెక్కుల

---

లవాఁడు. త్రయీ = మూఁడు వేదముల సముదాయము. వాఙ్మనఃకాంతుఁడు = సరస్వతికిప్రియుఁడు॥ ౫౬ ॥ అరుణావిష్కృతి = అరుణోదయము. హో = ఓరా ॥ ౫౭ ॥ దాఁటి = అవలంబించి. శ్రీదయితాగమము = విష్ణుదేవుని రాక॥ ౫౮॥ కంధరధ్వనిన్ = కంఠధ్వనితో ॥ ౫౯ ॥ మసలక = ఆలస్యము చేయక. దుర్భవవిభేదనుఁడైన్ = చెడ్డజన్మములను చెఱుచువాఁడైన విష్ణునిమీఁద ॥ ౬౦ ॥ ఔర రేఁపన్ = ప్రేరేపింపఁగా. కడారపటుండు = గోరోజనవర్ణవస్త్రము గలవాఁడు—విష్ణుఁడు. చరితార్థుఁడవు = కృతార్థుఁడవు. చతుర్థసంపదన్ = మోక్షము కలిమిచేత ॥ ౬౧ ॥ నిశ్శ్రేయసవదాన్యము = మేలునిచ్చునది ॥ ౬౨ ॥ అవదాత = తెల్లని. ప్రాఁతి = ప్రేమ. వాక్కథాప్రోత = మాటలచేతను కథలచేతను కూర్పఁబడినవాఁడగు ॥ ౬౩ ॥ అవచూడ = సిగయందలి. పంటకాఁడు = శరదృతువు. వెలిదమ్మిదంటన్ = శ్రేష్ఠమయిన తెల్లదామరను. గెంటసమాడు = పరిహసించు. వెల్లి

మీఁగ మిట్టించి మొసలివాగడమద్దికాయలతళుకులమర । వక్షస్స్థలమున శ్రీవత్సకౌస్తుభమ్మై జయంతులిందిరతోడివంతువడయ । నిమ్ననాభియుఁ ద్రివళివల్గితజఠరము । కరకలితచిత్రభస్త్రిశంఖములునమర । మన్మనంబున నేఁ బ్రొద్దుమలయుచున్న । ధూర్తబాలుఁడునా ప్రోలఁ గోఁచునాకొ౯ ॥ ౬౪ ॥ క ॥ అనియీగతిమీమాంసా । వనిమానసమృగము ద్రిప్పవైష్ణవరత్నం । బునకు నిజదక్షిణేక్షణ । వనజచ్ఛదమదరెన్ శుభనివహాపిశునంబై ॥ ౬౫ ॥ తే ॥ నాఁడుమఱునాఁడునవ్విప్రనందనుండు । ధాతమాటలచందంబు దానవారి । తనకడకువచ్చు రాములుదలఁచితలఁచి । ముచ్చటలుదేటితేరఁగలమునిఁగిమునిఁగి ॥ ౬౬ ॥ వ ॥ మూఁడవనాఁడు యథాకాలప్రబుద్ధుండై పూర్వాశ్రితసిద్ధాశ్రమంబున బద్ధపద్మాసనాసీనుండై ॥ ౬౭ ॥ క ॥ కరివదనదేవతామిళి । దరుణాభచతుర్దళాఢ్యవాదిమసాంతా । తురయుతమగునాధారాం । బురుహంబునఁగలుగువలపుబుగులుకొనంగ౯ ॥ ౬౮ ॥ క ॥ పూనఁదటిత్ప్రభ షడ్దళ । మైనలువవసింపబాదిలాంతాక్షరసం । ధానస్ఫుటమగుస్వాధి । ష్ఠానాబ్జముసందువెడలెసత్సౌరభముల్ ॥ ౬౯ ॥ క ॥ డాద్యముఫాంతికముసునీ । లద్యుతియుఁబురాణపురుషలాలితముసుధీ । వేద్యమునగుదశపత్రస । ముద్యన్మణిపూరకమున మొలవఁగదావుల్ ॥ ౭౦ ॥ క ॥ శైవముద్వాదశదళరే । ఖావళితకఠంబుకమ్రకనకచ్ఛాయా । శ్రీవహ

---

వోడువ౯=ప్రవహింపఁగా—అతిశయింపఁగా. మిట్టించి=మీఁదికెగిరి. మొసలివాగడమద్దికాయలతళుకులు=మకరకుండలములకాంతులు. వంతు=సామ్యము. నిమ్న=లోఁతైన. త్రివళీ=మూడుముడుఁతలచేత. చిత్రభస్త్రి=నానావర్ణములుగలతిత్తి. మలయు=తిరుగు. ప్రోల౯=ఎదుట ॥ ౬౪ ॥ మీమాంసావని౯=పరబ్రహ్మప్రతిపాదకశాస్త్రమునెడిభూమియందు. దక్షిణేక్షణవనజచ్ఛదము=తామరరేకువంటికుడికన్ను. పిశునంబు=తోఁపించునది ॥ ౬౫ ॥ ౬౬ ॥ ప్రబుద్ధుండు=మేలుకొన్నవాఁడు ॥ ౬౭ ॥ కరి...యుతము=విఘ్నేశ్వరుఁడు దేవతయు ఇంచుకయెఱ్ఱనికాంతియు నాలుగు రేకులును గలదియు వశషసవర్ణములతోఁ గూడినదియును. ఆధారాంబురుహంబు=ఆధారకమలము. వలపు=వాసన. బుగులుకొనంగ౯=నిండుకొనఁగా ॥ ౬౮ ॥ తటిత్ప్రభ౯=మెఱపుయొక్క వెలుఁగువంటివెలుఁగుతో. షడ్దళము=ఆఱు రేకులుగలది. నలువ=బ్రహ్మ. పాదిలాంతాక్షరసంధానస్ఫుటము=బభమయరలవర్ణములకూర్పుచేత ప్రకాశించునది. స్వాధిష్ఠానాబ్జము=స్వాధిష్ఠానకమలము. సత్సౌరభములు=మంచివాసనలు ॥ ౬౯ ॥ డాద్యము=డవర్ణము మొదటిదిగాఁగలది. ఫాంతికము=ఫవర్ణముకడపటిదిగాఁగలది. అనఁగా డఢణతథదధనపఫవర్ణములుగలది. నీలద్యుతి=నల్లనికాంతిగలది. పురాణపురుషలాలితము=విష్ణుదేవతాకముగుటచేమనోజ్ఞమైనది. సుధీవేద్యము=పండితులచేఁ దెలియఁదగినది. దశపత్రసముద్యన్మణిపూరకమున౯=పది రేకులచే వెలుఁగునట్టిమణిపూరకకమలమునందు. మొలవఁగ౯=పుట్టఁగా. తావులు=పరిమళములు ॥ ౭౦ ॥ శైవము=శివుఁడు దేవతగాఁగలది. ద్వాదశదళరేఖావళితకఠంబు=పండ్రెండు రేకులచేత చుట్టఁబడిన కఠవర్ణములాద్యంతములుగాఁగలది— అనఁగా కఖగఘఙచఛజఝఞటఠవర్ణములుగలది. కమ్రకనకచ్ఛాయాశ్రీవహము=ప్రకాశించునట్టిబంగారువన్నెయొక్క కలిమినివహించినది. బంగారువన్నె

ముననానాహత । మై వేళం జెడని గంధమిగురొత్తింపన్ ॥ ౨౧ ॥ పదియాఱు రేకు
లందును । బదియాఱు సారంబులుండఁ బరమజ్యోతి । ప్రదమై సురమునివశతన్ ।
బొదలు విశుద్ధమునఁ బొంకముగఁ బరిమళముల్ ॥ ౨౨॥ క॥ దళయుగమున హాంక్షం
బులు పొలుపొందఁగ జిదంశమగుచు భూరిమణివిభా । వళిఁదగు నాజ్ఞాపురమునఁ । గల
వాసన లేసరేఁగి కడలుకొనంగన్ ॥ ౨౩ ॥ ఉ ॥ ఇంతకునూర్ధ్వమై శిరసునిక్కన్నధో
ముఖమూర్తిఁ బొల్చియ । త్యంతవికాసశాలియయి యాద్యశివాశ్రయమై సహస్రప ।
త్త్రాంతరచిత్సుధారసమహోఝ్ఝరదుర్దినమాచరించు న । ద్దాంతరపుష్పవనంగలుగు తో
రపుఁగంపులు పెంపుమీఱఁగన్ ॥ ౨౪॥ చ ॥ కనదరుణప్రభావిభవగర్వమఖర్వముగా
నొనర్చుచుం । దనువుతళుక్కునన్ మెఱవఁ దత్సరసీరుహపత్త్రపేరిని । చ్చైనవడి నె
క్కనిక్కనిజజిహ్వికఁ జాఁచి లలాటమధ్యసం । జనితసుధామయూఖసుధ సర్వపురంధ్రి
కఁ గ్రోలి సోలఁగన్ ॥ ౨౫॥ క ॥ హృన్మణిసూత్రాకృతియగు । చిన్మూర్తిఁ బురాణపు
రుషు శేషావాసుం । గన్మొగిచి లోని చూచ్చిన । సన్మౌన్యుఁడతండు చూచు సమయము
నందున్ ॥ ౨౬॥ దండకము॥ కడిఁదియసురు ధేనుకున్ ధేనుకుత్క్ష్వేళదంభోళిసంస్తం
భిదోస్తంభసంభూతశౌర్యాగ్నిచేఁ గాల్చి గోలోకముం గాచి గోవర్ధనక్షోణిభృ

---

గలిగి ప్రకాశించునది. అనాహతము = అనాహతకమలము. ఇగురొత్తింపన్ = చిగుర్చునట్లు చేయఁగా — అతిశయింపఁజేయఁగా ॥ ౨౧॥ పదియాఱుసారంబులు = అకారము మొదలుగాఁగల పదియాఱు అచ్చులును. పరమజ్యోతిప్రదము = మేలయిన వెలుఁగునకు చోటు. సురమునివశతన్ = నారదుఁడు అధిదేవతగాఁ గలదియగుటచేత. పొదలు = వర్ధిల్లునట్టి. విశుద్ధమునన్ = విశుద్ధకమలమునందు. పొంకముగన్ = పొందికైనది కాఁగా ॥ ౨౨ ॥ దళయుగమునన్ = రెండు రేకులచేత. హాంక్షంబులు = హాంక్షం అను వర్ణములు. పొలుపొందన్ = పొందుపడఁగా. చిదంశము = జ్ఞానాంశమైనది. భూరిమణివిభావళిన్ = విశేషమయిన మాణిక్యకాంతిపఙ్క్తులచేత. తగు = ఒప్పునట్టి. ఆజ్ఞాపురమునన్ = ఆజ్ఞాచక్రమయిన కమలమునందు. ఏసరేఁగి = మిక్కిలి రేఁగి. కడలుకొనంగన్ = అతిశయింపఁగా ॥ ౨౩ ॥ ఇంతకున్ = ఈ చెప్పఁబడిన వానికన్నిటికి. ఊర్ధ్వమై = మీఁదై. శిరసునిక్కన్ = మూర్ధస్థానమునందు. అత్యంతవికాసశాలి = మేరలేని వికాసముచేత ఒప్పునది. ఆద్య = మొదటివాఁడైన. సహస్ర... దుర్దినము = సహస్రపత్త్ర = వేయి రేకులుగల సహస్రారకమలముయొక్క. అంతర = లోపలి. చిత్ = జ్ఞానరూపమైన. సుధా = అమృతముయొక్క. రస = జలముచేనైన. మహోఝ్ఝర = దొడ్డ సెలయేటివలన. దుర్దినము = మబ్బుకమ్ముటచే సూర్యరశ్మి లేని దినమును. ఆచరించునద్దాంతరపుష్పవనన్ = చేయునట్టి యాదొంతిపుష్పవనందు. తోరపుఁగంపులు = అధికపరిమళములు. పెంపుమీఱఁగన్ = వృద్ధిచేత అతిశయింపఁగా ॥ ౨౪ ॥ అఖర్వము = తక్కువకానిది. మెఱవన్ = వెలుఁగఁగా. జిహ్వికన్ = నాలుకను. సుధామయూఖసుధన్ = చంద్రునియందలి యమృతమును. సర్వపురంధ్రిక = ఉత్తమరాలైన సర్పస్త్రీ ॥ ౨౫ ॥ చిన్మూర్తిన్ = జ్ఞానస్వరూపుని. మొగిచి = మూసి ॥ ౨౬ ॥ కడిఁది = అసాధ్యుఁడైన. ధేనుకక్ష్వేళ = గోవర్ధనపర్వతముచేత. దంభోళిసంస్తంభి = వజ్రాయుధము నిలిపిన. దోస్స్తంభ = స్తంభమువంటి భుజమునందు. సంభూత = పుట్టిన. శౌర్యాగ్నిచేన్ = శూరత్వపు నిప్పుచేత. గ్రా...

త్కందరద్రోణిఁ గ్రీడించు విన్నాణి పెన్నాటకంబైన క్రాల్లిస్నులఁ గల్గుపెందళ్కు లన్నల్గడన్ జిలుకు నెమ్మోము జాబిల్లి శోభిల్లు నుత్ఫుల్లగల్లద్వయిన్ హత్తి మత్తిల్లి నర్తించుచున్ మాకరాకార రేఖాభిరామంబులౌ కుండలంబుల్ సమగ్రప్రభా మండలంబుల్ చలింపన్ నిలింపాశుగాసాకృతిన్ మాసరంబైన మాయూరపింఛంబుతో నైక్యముం బొందు నిక్కంబుచే గొప్పయై కొప్పు గన్పట్టఁ గన్పట్టఁగాఁ గ్రొవ్వెంటన్ మహాఘాలపట్టంబుపై నెట్టుకో, నిగమకమలగంధముల్ సంధిలం జేయు నాసాపుటిన్ బ్రస్ఫుటస్ఫూర్తి వర్తింప దృప్యద్ఘనస్సంపదల్ పెంపుమీరంగ రంగద్రుచిన్ శాక్వరస్కంధబంధుత్వగంధంబు రూపించు మూఁపుల్ పురాయింప నింపారు రేఖాత్రయీమైత్రి నేత్రప్రియంబిచ్చుచున్ గంబుపాకంబునం బంధురంబై వలత్కంధరం బొప్పఁగన్ పైకు నీలంపుఁ గంబంబులం బోలు బల్గేలు లీలావిభూషావళిం జాలభాసిల్లనుల్లోకసౌందర్యధుర్యస్థితిన్ విస్తృతంబౌ నురస్సీమ జీమూతమై హారవర్షోపలశ్రేణి రాణించు మించుం బురాణింపఁగాఁ జేయ నచ్చో నయుచ్ఛాన జానుచ్ఛవిన్ తుచ్ఛముం జేసి కంజాతవాసాంఘ్రి కంజాతలాక్షాంకశంకావహంబైన పంకేజరాగంబిగుర్వంగ, శ్రీచరణయుగళి హాటకంబై కనద్ధాటికోద్యత్తులాకోటులూటాడుచున్ జాటువాచాటతం జాటిము ప్పేటగాఁ జుట్టినన్ దీఁగచుట్టుల్ కటిన్ సంఘటిల్లన్ దటిల్లేఖ లేఖర్షభుం జేరి రంజిల్లు నానుల్లలత్కాంతి గోయష్టియుత్కృష్టమై హెచ్చు గా

---

చి=కాల్చి. గోలోకమున్=గోవులసమూహమును. క్షోణిభృత్=కొండయొక్క. కందరద్రోణి=గుహాప్రదేశమునందు. విన్నాణి=నేర్పరి. పెన్నాటకంబు=మిక్కిలిచలించుటగలది. క్రాలు=ప్రకాశించునట్టి. పెన్దళ్కులన్ = అధికమయినతళతళయను కాంతులను. చిలుకు = వ్యాపింపఁజేయునట్టి. ఉత్ఫుల్లగల్లద్వయిన్=వికాసముగలచెక్కిళ్ల జంటయందు. హత్తి = అంటి. మాకరాకారరేఖాభిరామంబులు = మొసలియాకృతివంటియాకృతిగలరేఖలచేత మనోజ్ఞములయినవి. సమగ్రప్రభామండలంబులు=కొఱఁత లేని వెలుఁగుల సముదాయముగలవి. మాసరంబు = అతిశయించినది. మాయూరపింఛంబు= నెమలియీఁకలకుచ్చు. శాక్వరస్కంధబంధుత్వగంధంబున్ =ఎద్దుమూఁపురమును బోలినిక్కగలగర్వమును. పురాయింపన్ = విజృంభింపఁగా. కంబుపాకంబునన్=శంఖమువిధమున. బంధురంబై = నిమ్నోన్నతములుగలదై. వలత్కంధరంబు=గుండ్రనిమెడ. ఉల్లోక=లోకాతీతమయిన. విస్తృతంబు=విరివియైనది. జీమూతము = మేఘము. హారవర్షోపలశ్రేణి = ముత్యాలపేరులనెడివడగండ్లచాలు. రాణించు=ప్రకాశించునట్టి. మించుట= మెఱపును. పురాణింపఁగాన్=వర్ధిల్ల. ఉచ్ఛాన=దట్టమయిన. జానుచ్ఛవిన్ = మోకాళ్లకాంతిని. కంజాతవాస=లక్ష్మీదేవియొక్క. లాక్షాంక= లత్తుకగుఱుతులనెడి. శంకా=సందేహమును. ఆవహంబు=కలిగించునది. పంకేజరాగంబు=పద్మరాగము— కౌస్తుభమణి. ఇగుర్వంగన్ = చిగిరింపఁగా—ప్రకాశింపఁగా. హాటకంబు=బంగారు. తులాకోటులు=అందెలు. ఊటాడుచున్= కదలాడుచు. చాటు=చాటించు. వాచాటతన్=మాటకారితనమును. కటిన్=మొలను. తటిల్లేఖ=మెఱపుతీఁగ. లేఖర్షభున్=ఇంద్రుని. ఉల్లలత్=తళతళలాడుచున్న. గోయష్టి=ఆవులను తో

నిచ్చకుఁ వచ్చుచుఁ గచ్చకాయల్ కరాధిష్ఠితాజాండషండంబులో నాఁగడుఁ జిత్రభస్త్రింబునఁ నిచ్చినం బోల్పఁగాఁ గల్పకస్వచ్ఛగుచ్ఛంబు సత్యార్థమై నిత్యముం గోత్రగాఁ బూనియున్నాఁడనఁ భవ్యశంఖంబు సవ్యాగ్రహస్తంబునం దిమ్ముగా దివ్యభూషావిశేషార్భటుల్ గ్రమ్మ లేఁదెమ్మెరల్ గ్రమ్మఁగా నమ్రదిక్పాలకమ్రస్తుతుల్ స్వస్థలంబంటఁగా నంటఁగా రాకరాకాసుధాభానుభానూజ్జ్వలజ్జ్వాల కీలాకులప్లోషరీధాక్షదారూఢగాఢత్విడౌఘంబు మోఘంబుగా మేఘవీథిం ధరాధో జగద్ధోరణిఁ దోరణల్ గట్ట, యాదవగ్రామణుండు నాభిసంజాతకంజాతజాతుండఖండాంఘ్రిపీఠీభవద్విశ్వవిశ్వంభరాభాగుఁడాభోగవద్భోగిభోగాసనుండాసవామోదమాధుర్యధుర్యాసురస్త్రీకపోలద్వయీపత్త్రరేఖాపకారక్రియాక్రూరచక్రాంకుఁడోంకారసర్వస్వనిర్వాహనుం డుర్విచే దుర్వహాంగప్రభాగుర్విచే నూషధుల్ గన్నపృథ్వీవ్యథాపృథ్వీశముఖ్యుండు పుండ్రేక్షుకోదండలక్ష్యోభుఁ డంచద్దరస్మేరసారుండుదారుండు దారోత్తముల్ నీలయుఁ బాలయుఁ లక్ష్మియుఁ బద్మలాక్షీశిరోరత్నముఁ భూమియుఁ భామయుఁ బ్రేమఁ గాఁ మించి వెన్నాడఁగా మించి పంచాద్దుఁడయ్యుఁ గడుఁ బ్రోడ కాబోడలుం జూడఁగా లేని పెన్నిక్కు నిక్కంబయా విష్కృతిం జూపి దీపించియుండఁ॥ ౭౭ ॥ క॥ కనుదెఱచి తనదులోనం । గనుదేజము ప్రోలఁగాంచి కమలాసనుఁడా । డినయట్లనిక్కు వమ్యోనే । వినఁగనని దిక్రొత్తయనుచు వెసనుత్థితుఁడై ॥ ౭౮ ॥ సీ॥ చామరధ్వజశంఖచాపప్రముఖచిహ్నాలలిత పదార్పణాలంకృతమహీ । దళితోపరిత్వగుజ్జ్వలదంశుమత్ఫలాస్తం భాభిరామోరుదండ

---

తెలుపట్టి. కరాధిష్ఠిత=చేతియందుంచుకోఁబడిన. షండంబులు=సమూహములు. లేఁదెమ్మెరలు=లేఁతవాయువులు. నమ్ర=వంగిన. కమ్ర=మనోజ్ఞమైన. సుధాభాను=అమృతకిరణుఁడు—చంద్రుఁడు. ఉజ్జ్వలత్=వెలుఁగుచున్న. జ్వాలకీలాకుల=మంటల లేశముచే కలఁతనొందిన. రీధాక్షల్=అవసాన పలుచుచున్న. ఆరూఢ=మీఁదికి ప్రసరించిన. గాఢత్విడౌఘంబు=అధిక కాంతిసమూహము. మోఘంబు=కొట్టుపడినది—వ్యర్థము. అధోజగద్ధోరణిఁ=క్రిందిలోకము విధమున. దోరణల్గట్ట=బారులుదీర. నాభిసంజాతకంజాతుండు=బొడ్డునందుఁబుట్టిన బ్రహ్మగలవాఁడు. పీఠీభవత్=పీఠముగాఁ జేయఁబడిన. విశ్వ=సమస్తమయిన. విశ్వంభరాభాగుఁడు=భూప్రదేశముగలవాఁడు. ఆభోగవత్=పరిపూర్ణత్వమువంటి. భోగిభోగాసనుండు=పాముదేహము పీఠముగాఁ గలవాఁడు. ఆసవ=మద్యముయొక్క. ఆమోద=పరిమళముయొక్క. పత్త్రరేఖా=మకరికాపత్త్రపు రేఖలకు. చక్రాంకుఁడు=చక్రము గుఱుతుగలవాఁడు. దుర్వహాంగప్రభాగుర్వి=వహింపరాని అవయవముల కాంతిచేత గొప్పది. పుండ్రేక్షుకోదండలక్ష్యోభుఁడు=మన్మథులయొక్క లక్ష్మిను బోలినవాఁడు. అంచద్దరస్మేరసారుండు=ఒప్పిదమయిన చిఱునవ్వుయొక్క సత్తగలవాఁడు. దారోత్తములు=ఉత్తమురాండ్రయిన భార్యలు. పద్మలాక్షి=స్త్రీ. వెన్నాడఁగాఁ=వెంటనంటిరాఁగా. బోడలు=ఏకదండిసన్యాసులు. పెన్నిక్కు=దొడ్డతావునందు. ఆవిష్కృతిఁ=అవతరించుటను ॥ ౭౭ ॥ ప్రోలఁ=ఎదుట. ఉత్థితుఁడు=లేచినవాఁడు ॥ ౭౮ ॥ పదార్పణ=అడుగులు పెట్టుటచేత. దళిత=భేదింపఁబడిన—బలువఁబడిన. ఉపరిత్వక్=మీఁది తోలు గ

యుగళు । వరదానముద్రాబ్జధరణభూషితకటిన్యస్త కుంచితసమున్నతభుజాఢ్యు । సింహావలగ్నలక్ష్మీపరిహాసితోదయజగద్గర్భగర్భవృత్తావలగ్ను । జలదసంకాశు నిర్వ్రీడజఘనదేశుఁ గోటికందర్పలావణ్యగుణశరణ్యు । విష్ణు నిజభక్తసన్నిధిస్థుఁ గృష్ణుఁ గాంచి । పఱచె సాక్రోశుఁడగుచు నాబ్రాహ్మణుండు ॥ ౭౯ ॥ చ ॥ పఱచిన నేఁకిసుతుఁడు పక్కుననవ్వినఁ గ్రమ్మఱిల్లినైఁ । దఱచుగ రోమహర్షణ మదంచితభక్తిభరాకులత్వమే । గ్రుఱచుచుఁ గేల్మొగిడ్చి పలుపల్కులతళ్కులసన్నవెన్నెలన్ । బఱపుచుఁ బ్రస్తుతించె మునిబంధవిభంజను భక్తరంజనున్ ॥ ౮౦ ॥ మాలిని ॥ విధిశివసనకాదుల్ వేదముల్ గూడి నిన్నో । మధుమథనయితం డిమ్మాడ్కి వాఁడంచు నెన్నన్ । విధురులయిన చోటన్ నేర్చునే గాఢమోహాం । బుధివడిఁబడుచున్నా బోఁటి నీవాట మెన్నన్ ॥ ౮౧ ॥ తరల ॥ హరిహయోపలభూధరాకృతి నందమొందినయట్టినీ । యురుభృగుస్తుతపాత్రముం గటకోజ్జ్వలంబు నఖాంకుర । త్విషుచిమిత్రము నైన పాదమునందు నింజెనసంగని । త్వరఁదీఁబూనితలంతుఁ దాపనిదాఘవృత్తినివృత్తికిన్ ॥ ౮౨ ॥ భుజంగప్రయాతము ॥ స్ఫురన్నాభిగర్తప్రభూతాంబుజాతో । దరస్ఫోటిలో వేల్పుతాతన్ విధాతన్ । నిరాతంకసర్గైకనిర్ణేతఁ గంటన్ । హరీ తాతకుందాతవై యుంట మెప్పున్ ॥ ౮౩ ॥ స్రగ్విణి ॥ నీవిమై వైన్యభూనేతవై రత్నసంఘాతదివ్యౌషధిగ్రామముల్ భూతహృత్ప్రీతిగన్పట్టవే స్ఫీతహర్షోత్కటన్ । భూతధాత్రీగవిన్ బూతనాఘాతనా ॥ ౮౪ ॥ లయగ్రాహి ॥ ఆగమసముద్ధరణరాగరసలంపటసుధాగమనియామకరసాగ్రిమకారీ । భోగపదవీనిహితభాగవత భూగగనభాగపరిపూర్ణపగభాగవపురగ్రా । త్యాగగుణధు

---

లిన. ఉజ్జ్వలత్=వెలుఁగుచున్న. అంశుమత్ఫలాస్తంభ=అరఁటికంబములవలె. ఊరుదండ=దండాకారములయిన తొడలయొక్క. అబ్జధరణ=కమలమును ధరించుటచేత. కుంచిత=వంపఁబడిన. సమున్నత=మిక్కిలిపొడుపైన. సింహావలగ్నలక్ష్మీపరిహాసి=సింహమునడుముయొక్క యందమును పరిహసించునది. వృత్త=వట్రువైన. జలదసంకాశున్=మేఘమునుబోలినవానిని. నిర్వ్రీడజఘనదేశున్=సిగ్గువిడిచిన మొలగలవానిని—దిగంబరుని. సాక్రోశుఁడు=తిట్టుటతోఁ గూడినవాఁడు ॥ ౭౯ ॥ క్రమ్మఱిల్లి=వెనుకకుతిరిగి. రోమహర్షణము=గగుర్పాటు. భక్తిభరాకులత్వము=భక్త్యతిశయము వలని కలఁతపాటు. తళ్కుల=తళతళలాడుచున్న. పఱపుచున్=వ్యాపింపఁజేయుచు. బంధవిభంజనున్=మోహబంధములను తొలఁచువానిని ॥ ౮౦ ॥ విధురులు=వికలత్వమునొందినవారు. నీవాటము=నీమహిమమును ॥ ౮౧ ॥ హరిహయోపల=ఇంద్రనీలమణుల. భృగు=చఱియ; భృగువనెడిముని. కటక=కొండమీఁది చదురపునేల; కడియము. పాదము=కొండవెంబడి చిన్నకొండ; అడుగు. తాపనిదాఘవృత్తి=తాపత్రయమనెడి వేసంగికాలముయొక్క ప్రవర్తనము ॥ ౮౨ ॥ నాభిగర్తప్రభూత=బొడ్డుబొక్కయందుఁబుట్టిన. నిరాతంక=భయములేని. సర్గ=సృష్టికి. తాత=బ్రహ్మ; తండ్రి ॥ ౮౩ ॥ వైన్యభూనేత=వైన్యుఁడను రాజు—పృథుచక్రవర్తి. దివ్యౌషధిగ్రామములు=ఒప్పిదములైన ఓషధులసమూహములు. స్ఫీత=అధికమైన. ఉత్కటన్=మదించినదానిని. భూతధాత్రీగవిన్=భూమియైన ఆవును ॥ ౮౪ ॥ లంపట=అత్యాసక్తిగల. పదవీ=మార్గమునం

ర్యమునియోగపారగుఁడ హాలాగతసమిద్విజయసౌగతమతార్హా । దోర్యుగకలితకాలక
లుషాగకులిశాంకకొనసాగినకృపన్ మనుపుమయోగిహితవమ్ముగా॥ ౮౫॥ మ॥ కవిధా
మంబులుసిద్ధమంత్రములుచంద్రజ్యోత్స్నికల్ సన్మణి । ప్రవరశ్రేణులుభవ్యభేషజత
తుల్ పాథోధరంబుల్ సుధీ । భవనిస్తారకనీమమిచ్చిజగముల్ బాలించుమర్యాద
నీ । యవతారంబులచేఁతలోకహితచర్యాధుర్యసంచారముల్ ॥ ౮౬॥ ఉ ॥ అంజన
పుంజనవ్యతరమైతగునీతిరుమేనికప్పుక । ర్కింజులుకంగఁజేకుఱుఁ జామీకమలేక్షణ
సూక్ష్మదృక్కులో । కంజభవాదివృద్ధులకుగాఢతరాక్షరలక్ష్మియొందుఁగా । నంజ
నుఁగాదెకప్పుకతనన్ మునుదోఁపనియక్షరస్థితుల్ ॥ ౮౭॥ క॥ కమిచియణురేణుతృణ
కా । ష్ఠములంబరిపూర్ణవృత్తిసమతూరెనునీ । యమితమహామహిమాబ్ధికిఁ । గమల
భవప్రముఖులెన్నఁగాబుద్బుదముల్ ॥ ౮౮ ॥ పృథ్వి॥ జగత్పతిభవత్పదాబ్జయుగభ
క్తిసంయుక్తితో । నగుర్విడువనన్యథాగతియొకింగకెవ్వాఁడునీ । యగణ్యగుణకీ
ర్తనంబధిగమించుటన్ మించెనే । నగాధభవసాగరంబతఁడుదాఁటునొక్కెత్తునన్॥
౮౯॥ క॥ భవదంఘ్రిదూరునకుఁబు । ణ్యావసతిసులభంబెవెలుతునన్యభవంబుల్ । స
వరింపయుష్మదర్చా । ప్రవణమతింజేయుమన్నుఁబరధామపతీ ॥ ౯౦ ॥ క ॥ జయ
విజయపూర్ణపార్శ్వవి । జయ జయకల్పనధురీణ సమదదనుజరా । డ్జయసంర
క్షితభువనా । జయజయసగుణాగుణాత్మజయశార్ఙ్గధరా ॥ ౯౧ ॥ సీ ॥ న
డతునీక్షేత్రంబునకుఁ జెయిదాఁచినర్చింతునీనమ్మినసేవకులను । మ్రొక్కుదునీపాద
ములకు జిహ్వావీథినీనామములువక్కాణింతునెపుడు । నర్పింతునీసేవకైసర్వదేహంబుఁ
జింతింతునీలీలఁజిత్తసరణిఁ । దనివోకనీచక్కఁదనము సంవీక్షింతునీయవధానంబునె
మ్మివిందు । బ్రహ్మరుద్రాదులకుఁగానఁబడనినీవు । నేడునాముంగలనిలిచితినీలవర్ణ ।
వర్ణనాతీతమహాప్రగల్భప్రవృత్త । పుణ్యపరిపాకమేరికిఁబొగడఁగరమె॥ ౯౨॥ శా॥

---

డు. నిక్షిప్త=ఉంచఁబడిన. వపుర గ్రా=దేహముకొనగలవాఁడా. హాలాగత = నాఁగటివలనవ
చ్చిన. సమిద్విజయ= యుద్ధమునందలి గెలుపుగలవాఁడా. సౌగత=బుద్ధునిదైన. కలుషాగకులి
శాంక=పాపములనెడి కొండలకువజ్రాయుధ చిహ్నముగలవాఁడా. మనుపు=రక్షింపుము॥ ౮౫॥
జ్యోత్స్నికలు=వెన్నెలలు. భేషజ= మందులయొక్క. పాథోధరంబులు = మేఘములు. సుధీభవని
స్తారక = విద్వాంసులను జన్మములవలననుండి తరింపఁజేయువాఁడా ॥ ౮౬ ॥ అంజనపుంజ=
కాటుకరాశివలె. నవ్యతరమై=మిక్కిలిశ్లాఘ్యమై. తిరుమేని=మంచిదేహముయొక్క. వృద్ధులకున్
=పెద్దలకు ॥ ౮౭ ॥ కమిచి=గ్రహించి—లోపలనణఁచుకొని. బుద్బుదములు=నీటిబుగ్గలు ॥ ౮౮॥
సంయుక్తి=కూడిక. అధిగమించుటన్=చదువుటచేత. అగాధ =మిక్కిలిలోఁతైన. ఒక్కెత్తు
నన్=ఒక్కపూనికతో ॥ ౮౯ ॥ వసతి=ఉనికిపట్టు. సవరింపన్—పొందను. ప్రవణ=అభిముఖ
మైన. పరధామపతీ=పరమపదమునేలువాఁడా ॥ ౯౦ ॥ ౯౧ ॥ వక్కాణింతున్ = వక్కాణింతు
ను—చెప్పుదును. తనివోక=తృప్తిలేక. అవధానంబు = ఎచ్చరిక—ఎచ్చరికతోఁచేయుప్రసంగము
ను. నెమ్మి—నెమ్మది. ప్రాగ్భవ=పూర్వజన్మమునందలి ॥ ౯౨ ॥ నిత్యసూక్తిసనాథులు=శాశ్వత

నిత్యస్ఫూర్తిసనాథులైరి విధికంఠేకాలముఖ్యుల్ కృత। క్షిత్యానందయనాదిమూర్తివగునీచేఁదత్సనాథత్వసం। పత్త్యావిష్కృతినాకునుంగలుగుఁదత్ప్రాప్తియుండనే కానవే। మృత్యుత్రాసభయంబుఁబాసితినిజుష్మీనీదయాసంపదన్॥ ౯౩॥ మ॥ అని లోకత్రయమోహనుండగురమాప్రాణేశునెమ్మోమునం। దనచూడ్కుల్ నిగుడంగభూమిసురరత్నంబూరకున్నంతనే। మునుగాథాత్మసమన్వితాఖిలమరున్ముఖ్యుల్ తగన్ మ్రొక్కిమో। ద్భుపకేలింపఁగనమ్మునీశ్వరుగుణంబుల్ సారెగీర్తించినన్॥ ౯౪॥ క॥ వినిముగ్ధహాసరుచిరా। ననుఁడైతనచుట్టునున్ననానామరరా। జనికాయముతోఁబలుకున్। దనుజారిమహీసురాస్యసత్త్రేక్షణుఁడై॥ ౯౫॥ సీ॥ దాంతుండుసత్యసంధాధురంధరుఁడుమద్భక్తుండుపితృహితోద్యముఁడునైన। యిద్ధరామరసూతికిప్పితంబొసఁగ నేవచ్చుచోమీరెల్లవారునితని। కర్మిలిసాహాయ్యమాచరించుటకునైయేతెంచినారునాకెవ్వరేని। హితులువారలపనులెల్లనీయవికానపరతాపతప్తులుపరముదేక। ముదితులస్మత్ప్రశంసాభిముఖులునైన। వారునాభక్తులగువారివారియందుఁ। బ్రీతిగలవారినేనుద్ధరింతుఁగాన। వలనవారలకంటెనవశ్యమగుట॥ ౯౬॥ క॥ సద్భక్తసేవచేతన్। మద్భావముతుష్టిగన్నమాడ్కిఁదరుణీలా। ద్యద్భూతప్రతిమార్చల। ముద్భరితముగాదునిక్కముగఁగలపోయన్॥ ౯౭॥ మ॥ వలనాయేటికినాశ్రయించిమనఁగావానీరమున్నీగమున్। దలవేత్త్రోపచరింపనేటికిసమిద్ధానంబుదానంబున। చ్చలమాయేటికినెత్తిఁగొట్టుకొనఁగాసన్న్యాసమున్న్యాసమున్। గలిఁదేఁజాలుమదీయభక్తిరుచిభక్తశ్రేణికశ్రాంతమున్॥ ౯౮॥ తే॥ సర్వధర్మవిహీనప్రచారుఁడైన। నాత్మమద్భక్తిగలదేనియతఁడచూవె। నాకునత్యంతహితుఁడుసుశ్లోకరతుఁడు। నిఖిలధర్మప్రవర్తననిశ్చితుండు॥ ౯౯॥ ఆ॥ అస్మదంకధారియగుభక్తవరుమేను। నాకఁగూర్చినట్లునాకులార। వదలకేవసించువైకుంఠనగరంబు। నందుగొలుపదంతరంగమునకు॥ ౧౦౦॥ క॥ నాయందుభక్తుఁడుండున్। బాయకవేనధివసింతుభక్తునియందున్। మాయిరువురకుంగలుగున్। గాయప్రాణానుకూల్య

---

ర్తైనస్ఫురణతోఁగూడినవారు. విధికంఠేకాలముఖ్యులు=బ్రహ్మశివుఁడుమొదలగువారు. క్షిత్యానంద=భూమినిసంతోషింపఁజేయువాఁడా. తత్సనాథత్వసంపత్త్యావిష్కృతి=ఆకూడుకొన్నతనపుకలిమియొక్కవెలయుట॥ ౯౩॥ ఇంపఁగన్=ఇంపుకాఁగా॥ ౯౪॥ ముగ్ధహాసరుచిరాననుఁడు=మనోజ్ఞమయిన చిఱునవ్వుచే వెలుఁగునట్టి ముఖము గలవాఁడు॥ ౯౫॥ దాంతుఁడు=ఇంద్రియనిగ్రహముగలవాఁడు. ఉద్యముఁడు=ప్రయత్నముగలవాఁడు. అర్మిలిన్=ప్రేమతో. పరముదేకముదితులు=ఇతరులసంతోషము ఒకటిచేతనేసంతోషించినవారు॥ ౯౬॥ తుష్టిన్=సంతోషమును. ముద్భరితము=సంతోషమును పొందినది॥ ౯౭॥ వానీరము=ప్రబ్బలిచెట్టు. సమిద్ధానంబు=సమిధలనిచ్చుట—హోమము. అచ్ఛలము=ఆగ్రహము. న్యాసము=ధనమునుదాఁచపెట్టుట॥ ౯౮॥ సుశ్లోకరతుఁడు=మంచికీర్తియందాసక్తుఁడు. నిశ్చితుఁడు=నిశ్చయింపఁబడినవాఁడు॥ ౯౯॥ అంక=చిహ్నమునకు. నాకులార=దేవతలారా. కొలుపదు=సరిపడదు॥ ౧౦౦॥

కౌశల్యంబుల్ ॥ ౧౦౧॥ ఆ॥ మహితపుణ్యులైనమద్భక్తవరులకుఁ । గానివాఁడునా
కుఁగానివాఁడు । భాగవతులనన్నుభావించియొకటిగాఁ । గన్నవాఁడునన్నుఁగన్న
వాఁడు॥ ౧౦౨॥ క॥ మీయెడమద్భక్తిగుణో । చ్ఛ్రాయముగనుఁగొంటి నేనుసత్యం
బుబహూ । పాయంబులమద్భక్తుని । కైయుటకెఱెంచుటస్వయచ్చరులార॥ ౧౦౩॥
మ ॥ సురకర్మందిహిరణ్యదైత్యసుతువ్యాసుల్ శౌనకుల్ శ్రీపరా । శరురుక్మాంగదు
నంబరీషుసరమా । జానిల్ వసిష్ఠుల్ బురం । దరపుత్రుల్ శుకుదాల్భ్యభీష్ము వెలుఁ
గొందంజేయుమద్భక్తిత । త్పరుఁడీపుణ్యుఁడుపుండరీకుఁడితనిల్ భాపంతు మేలీవులల్॥
౧౦౪॥ ఆ॥ వినుఁడుమీకు నేనిఁగనరానియీహితం । బీతపస్వివరునికిత్తు నేడ । యెద్ది
వేఁడెభక్తుఁడద్దియయొసఁగఁగ । గట్టినాఁడఁగేలఁగంకణంబు॥ ౧౦౫॥ క॥ అనిదేవ
కీకుమారుఁడు । మునివదనముఁజూచిపలుకుమోదాంబుదగ । ర్జనమనఁబ్రసాదసా
గర । జనితధ్వనియనఁగనిగుడుసరసారభటిల్॥౧౦౬॥ ఉ॥నీపితృభక్తినీతపమునీవని
శంబునొనర్చునర్చయు । ద్దీపితహర్షుఁజేసెజగతీసురనందననన్నునీకునా । రూపముభ
క్తిమత్ప్రదసరోహణశైలముచాలదక్కఁగాం । తాపరిపూర్తిగావరమొసంగెదవేఁ
డుమయథారుచిప్రభల్॥ ౧౦౭॥ క॥ భాగ్యమనైయిహపరపరి । భోగ్యార్థమనైయ
గణ్యపుణ్యమనైవై । రాగ్యజ్ఞానోన్నతులగు । యోగ్యతములపాలవాలియుండు
దుఁజుమీ॥ ౧౦౮॥ వ॥ విశేషించినీయెడంబ్రసన్నుండనైయున్నవాఁడనభీష్టవృష్టిఘ
నాఘనంబగుమదీయఘృణాగుణంబునకు భాజనంబవైతివిజగజ్జాలంబునవస్తుజాలం
బునీకుదుర్లభంబులేదని పలుకుయదువల్లభువలనం బ్రబోధితుండై॥ ౧౦౯॥ సీ॥ పుం
డరీకుఁడుపల్కెబుద్బుదాభములైనసిరులునిల్ గామింపఁజేరికల్ప । విటపిఁగుల్మాష
ముల్ వేఁడువెఱ్ఱిగలండెనిఖిలదుర్లభుఁడగునీవునన్నుఁ । గరుణించువరమిత్తుఁగాతు
నీడేఱుతుననియుసిక్కభయమేదియద్భుతార్థ । మర్థింతునిపుడున్నయట్లయన్నన్నామ
చిహ్నచైతన్యమహాక్షేత్రతీర్థ । మధ్యతలముననిలువునామనవిఁజేసి । సకలజనులకు
మోక్షరాజ్యమునొసఁగుచు । నిదియనాకోర్కెజగదేకహితమునిదియ । దీనిమీఱిన

---

౧౦౧ ॥ ౧౦౨ ॥ ఉచ్ఛ్రాయము= ఆధిక్యము ॥ ౧౦౩ ॥ సురకర్మంది= నారదుఁడు. సరమా
జాని= విభీషణుఁడు. పురందరపుత్రుఁడు= అర్జునుఁడు. మేలీవులల్= శ్రేష్ఠమయినదానముల
చేత ॥ ౧౦౪ ॥ ఈహితము=కోరిక ॥ ౧౦౫ ॥ మోదాంబుదగర్జనము=సంతోషరూపమయిన
మేఘముయొక్క యుఱుము. ప్రసాదసాగర= అనుగ్రహమనెడిసముద్రమునందు ॥ ౧౦౬ ॥ రో
హణశైలము=రత్నపర్వతము ॥ ౧౦౭ ॥ పరిభోగ్యార్థము=చక్కగా అనుభవింపఁదగినవస్తువు.
వాలి=అతిశయించి ॥ ౧౦౮ ॥ అభీష్టవృష్టిఘనాఘనంబు=కోరికలను కురియునట్టి వానకాలపు
మబ్బు. ఘృణాగుణంబు=దయాగుణము. భాజనంబు=పాత్రము. ప్రబోధితుఁడు=మేలుకొలుపనొం
దింపఁబడినవాఁడు॥౧౦౯॥కల్పవిటపి=కల్పవృక్షము. కుల్మాషములు=గుగ్గిళ్లు. కలాఁడె=కలఁడా.
ఉన్కి=ఉండుట. ఏది=చెడి. అద్భుతార్థము=వింతయైనవిషయమును. అర్థింతుల్=కోరెదను.
అన్నన్నామచిహ్నచైతన్యమహాక్షేత్రతీర్థమధ్యతలమునల్ = నాపేరిచేగుఱుతిడఁబడినయీగొప్పక్షే

సిరియొల్ల దేవదేవ॥ ౧౧౦॥ వ॥ అని వెండియు నతండు చాపలాతిశయంబునఁ జర్వి
తచర్వణంబుగా నస్వసుపర్వదుష్ప్రాపంబగునీరూపంబు కృపాపరతంత్రంబగుచు
నాకునగపడుటకు భూతవ్రాతంబులు ప్రభూతాద్భుతరసమసృణమానసంబు లగు
చున్నయవి భవదీయంబగు నకారణసుకృతత్వంబునకు నియంతయుంగలఁడె -
యుత్తరంగంబగు సంసారతరంగమాలియనుంగుచుఁ బొనుంగుపడి యనంగీకృతవి
జ్ఞానజ్ఞానవిలాసులై దోసంబులం జేసినకరువులనందగు నలసులకు వెలసులభంబు నధి
కఫలంబునునగుయుష్మద్దర్శనంబు భవభయకర్శనంబు నుపసర్గజలదవర్గస్పర్శనంబు
నపవర్గదర్శననిదర్శనంబునగుఁగాక. ఏతత్క్షేత్రంబునీయాజ్ఞ నశేషక్షేత్రవిశేషోత్తం
సంబగుంగాక. ఈతీర్థంబు నస్మన్నామాంకితసమర్థంబున నుత్తమంబగుంగాతమ
ని ॥ ౧౧౧॥ ఉ॥ ఆనతమౌళియైయిటులు ప్రార్థనసేయుమునీంద్రు శాంబరీమానుష
వేషధారిదయమానమనస్కుఁడతిబిగ్గనవ్వుచున్ । వీనులఁదాఁకుఁగన్గడలవేమఱుచూచు
చుఁబల్కఁజిల్కఁబూఁ । దేనియసోనవెల్లువలఁ దెప్పలఁదేలెడు మేలిపల్కులన్ ॥
౧౧౨॥ సీ॥ అతిదుర్లభంబు వేఁడితిదుర్లభుఁడనైన నేనీకుదక్కుటన్ మునివర్య । త్వత్ప్రి
యార్థముగనీస్థలమున పరివారయుక్తుండనై నిల్చియున్నన్ను । సేవించువారెల్లఁ జి
రపుణ్యవంతులు నిహపరసుఖలాభహృష్టమతులు । కలికాలకల్మషఘోరకూటాటోప
కాకోలకంఠులు గళితభవులు । నవ్యాదరుసర్వదివ్యోత్తమాస్మదాజ్ఞఁ । బూనియీ
క్షేత్రము సుదీర్ఘము సుసమస్త । భువనవర్ణితవిఖ్యాతిఁబొదలుఁగాత । మెల్లపుణ్యార్థ
లములకు నెక్కుడగుచు॥ ౧౧౩ ॥ క॥ త్వన్నామచిహ్నితంబగు । నిన్నేలయొ తెల్ల
దీవిరేసేనుండుటకున్ । మన్నించి భక్తవాంఛా । భ్యున్నతులొసఁగుటయె నాకుయుక్త
వ్రతముల్ ॥౧౧౪॥ సీ॥ వినుధాతృసుతయప్పుడనిమిషులసురారికృపకునచ్చెదు వెంది

---

త్రమునకును తీర్థమునకును నడిమి తావునందు॥ ౧౧౦॥ చర్వితచర్వణంబుగాన్ = నమలిన దానినే నమ
లుటగా—చెప్పిన దానినే చెప్పి. దుష్ప్రాపంబు = పొందరానిది. అద్భుతరసమసృణమానసంబు
లు=ఆశ్చర్యరసముచేత చిక్కనైన మనసుగలవి. నియంత=నియమించువాఁడు. ఉత్తరంగము=
లేచిన అలలుగలది. తరంగమాలి=సముద్రము. పొనుంగుపడి=తేజస్సు చెడి. కరువులు=పోఁతపో
సిడియచ్చులు. అలసులు=మందులు. భవభయకర్శనంబు= జన్మములవలని భయమును కృశింపఁజే
యునది. ఉపసర్గజలదవర్గస్పర్శనంబు=ఆపదలనెడి మేఘసమూహములకు గాలి. అపవర్గదర్శననిదర్శ
నంబు=మోక్షమును జూపుటకుఁ దార్కాణము. అశేషక్షేత్రవిశేషోత్తంసంబు= ఎల్ల విశేషించిన
క్షేత్రములలో నుత్తమము. సమర్థనంబునన్ = నెఱవేర్పుటచేత ॥ ౧౧౧ ॥ శాంబరీమానుషవేష
ధారి = మాయామనుష్యవేషమును ధరించినవాఁడు. దయమాన = దయగలదిగాఁజేయఁబడు
చున్న. బిగ్గ=గట్టిగా. వీనులన్=చెవులను. కన్గడలన్ = కడకన్నులచేత. చిల్కన్=కురియుచు
న్న. సోన=వానవలని. తెప్పలఁదేలెడు=ఈఁదులాడుచున్న॥౧౧౨॥దక్కుటన్=అధీనుఁడనగు
టచేత. హృష్ట= సంతోషించిన. కలికాల... కంఠులు = కలికాలమునందలి పాపములనెడి విషస
మూహముయొక్క విజృంభణమునకు శివులైనవారు. గళితభవులు = తొలఁగిన జన్మములుగలవారు॥
౧౧౩ ॥ చిహ్నితము=గురుతుపెట్టఁబడినది ॥ ౧౧౪ ॥ ధాతృసుత=నారదుఁడా. అపవర్గము=

కేలు మొగిచి । పరమేశయోగసక్తపరతంత్రభావానువర్తిపరబ్రహ్మవరదనిన్ను నరచే
తిమణిఁ జేసియవనివారలకెల్లనపవర్గ మొసఁగునీయయ్యనెల్లు । వోలువిశ్రాణనసాలం
బుయాచకకాంక్షితసూత్రాప్తికారణంబు । నీకెతగునీతనీకెతగునిఖిలగమ్య । పూజవడ
యుంగఁబూజించిపొగడువడయు । ననిమురద్వేషిఁబుండరీకునిఁబొగడుచుఁ । జనిరిసమ్మ
ర్ధముగనిజస్థానములకు ॥ ౧౧౫ ॥ ఆ॥ పొగడిరఖిలమునులుజగములానందించె । నాటపా
టచూపిరమరరమణు । లాదినంబుసుదినమయ్యెదుర్దినమర్యె । విబుధతరులతాంత
వృష్టిగురియ ॥ ౧౧౬ ॥ సీ॥ శిఖపింఛధారియైచేదోయికటినిల్పిహరితీర్థమునఁబశ్చిమా
భిముఖుఁడు । క్షేత్రంబునందుఁబ్రాగ్దిగభిముఖుఁడునై రెండుమూర్తులుదాల్చుచుండున
తని । పదపీఠమైయొప్పఫణిభర్తరమగొల్చుశ్రీయనశ్రీయనరెండుగడలఁ । జామర
హస్తయై ఛందోమయాకృతిఖగలోకనాథుఁడగ్రమున వెలయు । దక్షిణంబుననసనకప్ర
ధానమునులు । దానుభొగడుచుసేవించుఁదమ్మిచూలి । యేనురుద్రులుసేవింతు మెడమ
వలన । వెనుకనుండుదురింద్రాదివిబుధవరులు ॥ ౧౧౭ ॥ వ॥ వత్సాశ్రీవత్సలాంఛను భక్త
వత్సలత్వంబునీవు నెఱింగినయదియకదా వినుమత్తెఱంగున మెఱుంగుటొల్లియ గొల్ల
దొర కరకలితచిత్రభస్త్రజలజశుక్తియు విరచితవినతముక్తియుఁ, గుటిలకోమలవినీ
లకుంతలనికరుండును నపరిమితకరుణాకరుండును, గటితట ఘటితదోస్తంభయు గ
ళుండును జటులనిశాటగళనిగళుండును, మకరకుండలమండితకపోలఫలకుండునుయ
మకులతిలకుండును, క్షుల్లకాశక్యసఖ్యాభిరామవృదులోరుద్వయుండునుసద్వయుం
డును, బుండరీకప్రభృతిమునిజనసేవ్యమానుండును ననూనుండును, అఖండజ్ఞానానం
దైకవిగ్రహుండునువిదళితజగన్నిగ్రహుండునునై పంచాబ్దంబునుపంచశతసహస్రా
తిశాయివిలసనసరసంబును నిచ్చాదిగంబరంబును నైన ప్రాయంబును నవరత్నసా
నుప్రాయంబును, బాహ్యాభ్యంతరికద్వారాష్టకవిస్పష్టంబు నదభ్రంబునభ్రంకషం
బును శరదభ్రశుభ్రంబును నగు మహాప్రాసాదంబునందువాసవవైశ్రవణవైవస్వ

---

మోక్షము. విశ్రాణనసాలంబు=కల్పవృక్షము. యాచకాకాంక్షితసూత్రాప్తికారణంబు=అడిగిన
వారికోరికలనుమాత్రముపొందించుటకుహేతువు. సమ్మర్ధముగన్=సందడిగా ॥౧౧౫॥ దుర్దినము=
చెడ్డదినము; మబ్బుఆవరించుటచేసూర్యరశ్మికానరానిదినము. లతాంతవృష్టి=పూలవాన. ఫణిభర్త=
సర్పరాజు=శేషుఁడు. ఛందోమయాకృతిన్=వేదస్వరూపముతో. తమ్మిచూలి=బ్రహ్మ ॥౧౧౭॥
శ్రీవత్సలాంఛనుభక్తవత్సలత్వంబు=శ్రీవిష్ణుదేవునిభక్తులయందుప్రేమగలిగినతనము. మెఱుంగుటొ
ల్లియ=మెఱయుచున్నవస్త్రము. జలజశుక్తి=శంఖమనెడిముత్తెపుఁజిప్పగలవాఁడు. కుటిల=వం
కరైన. చటులనిశాటగళనిగళుఁడు=క్రూరులైనరాక్షసుల మెడలకు సంకెలయినవాఁడు. మం
డిత=అలంకరింపఁబడిన. కపోలఫలకుఁడు=పలకలవంటి చెక్కిళ్లుగలవాఁడు. క్షుల్లక=నీచులకు.
అద్వయుండు=తనకురెండవదిలేనివాఁడు. అనూనుఁడు=తక్కువలేనివాఁడు. విదళితజగన్నిగ్ర
హుండు=ఖండింపఁబడినలోకముల భయముగలవాఁడు. అతిశాయి=మించిన. సానుప్రాయం
బు=కొండచఱియను పోలినది. విస్పష్టంబు = విడువఁబడినది. అదభ్రంబు = అల్పముకానిది.

త్ప్రముఖమఖభుగలఘుకిరీట మణిగణఘృణిమంజరీపింజరీకృతంబగు శేషపీఠంబున ధిష్ఠించి చరణద్వయాంతరాళోపలాలితగోయష్టి లతామతల్లికయై భువనత్రితయ కామిత కల్పవల్లియునైన తనయాకృతి యవికృతభావంబునం బ్రభవింపఁదత్క్షేత్ర తీర్థమధ్యంబుల నంగీకృతాధ్యాసీనుండై వాసుదేవాదివ్యూహంబులు జ్ఞానక్రియాది శక్తులు వసురుద్రాదిత్యాదిమరుద్విశేషంబులు నశేషనిగమంబులు నఖిలశుద్ధాంతం బులు సమస్తతీర్థసార్థంబులు సకలమంత్ర రహస్యంబులు సర్వగంధర్వ స్వరసార స్యంబులు విశ్వపశ్వాధి కైశ్వర్యంబులు ననశ్వరసంపదలంబాదలి సేవింపఁ బెంపు మెఱసియుండె నని వెండియుఁ గుండలికుండలుండిట్లనియె ॥ ౧౧౮ ॥ క ॥ నారదధృ తహేమరసా । సారచ్ఛురితంబు విష్ణుసదనంబదివే, దీరచితారాత్రి కతతి । భూ రమణీమణికిరీటముంబురుడించుఁ ॥ ౧౧౯ ॥ క ॥ అలతీర్థస్థలిక్షేత్ర । స్థలిలీలావిగ్ర హద్వితయయుతుఁడై భా । సిలుపౌండరీకవల్లభుఁ । దలఁచినఁగనుఁగొన్నఁగరగత ములిహపరముల్ ॥ ౧౨౦ ॥ క ॥ వినఁబడఁడుచెవులఁగన్నుల । గనఁబడఁడత్యుగ్ర నారకవ్యథచేతన్ । బొనుఁగుపడిజడియుమైష్ణవుఁ । డనవధిదురితప్రవర్తియయ్యుఁ గుమారా ॥ ౧౨౧ ॥ చ ॥ ఇరుగడలన్ ద్విరూపములఁ గృష్ణుఁడునైత్యనిరాకరిష్ణుఁ డ । ప్పరుసుననుండనన్నడిమి భాగమునందువసింతురెవ్వరా । నరులుమనుష్యరూప భరణంబునఁ గ్రీడయొనర్చుయక్షకి । న్నరగరుడోరగద్యుచరనాథులుగాఁ గొని ప్రముక్తిఁగాంచదగున్ ॥ ౧౨౨ ॥ ఉ ॥ ఎయ్యదిదివ్యసేవ్యతర మెయ్యదిమానిమనో భిగమ్యమా । నెయ్యదినీవునేనుభజియింపఁగ నింపగునెల్లనాడునా । దయ్యపువెల్లు సుమ్ము సతతస్థితి వెల్గెడుపుండరీకవా । గ్థాయ్యలఁబ్రజ్వరిల్లుచు జగత్త్రియదువఙ్ప్ర

అభ్రంకషంబు= ఆకాశమునొరయునది. ప్రాసాదంబు = నగరు. మఖభుక్=దేవతలయొక్క. అలఘు=దొడ్డవైన. ఘృణిమంజరీ పింజరీకృతంబు=కాంతిసమూహముచేత ఎఱుపుమిగిచినపసుపు వన్నెగలదిగాఁజేయఁబడినది. అధిష్ఠించి=ఆశ్రయించి-చేరి. అంతరాళ=నడుమ. ఉపలాలిత= బుజ్జగింపఁబడిన-నిలుపఁబడిన. గోయష్టి=పెలగోల. లతామతల్లి= శ్రేష్ఠమయినతీఁగ. భువనత్రి తయకామితకల్పవల్లి = మూఁడులోకములవారికోరికలనిచ్చుటకు కల్పవృక్షము. అవికృతభావంబు= వికారములేనితనము. అధ్యాసీనుఁడు=కూర్చున్నవాఁడు. వ్యూహంబులు=స్వరూపరచనలు. నిగ మంబులు=వేదములు. శుద్ధాంతంబులు= ఏకాంతస్థానములు. సార్థంబులు=సమూహములు. సార స్యంబులు=సరసభావములు. విశ్వ=సమస్తమైన. అనశ్వరసంపదలు=చెడనికలుములు. కుండలికుం డలుఁడు=శివుఁడు॥౧౧౮॥ హేమరసాసారచ్ఛురితంబు=బంగారునీటివానకురియునది. ఆరాత్రికత తి=ఆరతులసమూహము. పురుడించున్=పోలును॥౧౧౯॥ కరగతములు=చేతినిబొందినవి-చేతిలో నివి ॥ ౧౨౦ ॥ పొనుఁగుపడి=తేజోహీనుఁడై. జడియు= తొలఁగునట్టి. అనవధిదురితప్రవర్తి= మేరలేని పాపములనుచేసినవాఁడు ॥ ౧౨౧ ॥ నిరాకరిష్ణుఁడు = తిరస్కరించువాఁడు. పరుసు నన్=విధమున. ద్యుచరనాథులు=గంధర్వశ్రేష్ఠులు॥ ౧౨౨॥ సేవ్యతరము=మిక్కిలిసేవింపఁదగి నది. అభిగమ్యము=పొందఁదగినది. దయ్యపువెల్లు=దేవజ్యోతి. వాగ్థాయ్యలన్= వాక్కులనెడి అగ్నిని ప్రజ్వలింపఁజేసెడిబుక్కులచేత. ప్రజ్వరిల్లుచున్=మిక్కిలి వెలుఁగుచు. దుష్కృతదావాద

తదాహదక్షమై ॥ ౧౨౩ ॥ మ ॥ అలసంబుల్ మునిరాట్ప్రణీతములు ప్రాయశ్చిత్త
ముల్ పాతకం। బులనిర్జింపఁగవిష్ణుభక్తియతఁడే బోదానికింబూనఁడా। ములపల్గా
టులు చీరలందుమడిచినంబో నేర్చునే మాంత్రికా । కలితాహిప్రతివీరమంత్రపదరేఖా
శ్లాఘచేతంబలెన్ ॥ ౧౨౪ ॥ సీ ॥ జగదధిష్ఠానంబు సచ్చిదానందాత్మకము నందనం
దనాత్మకముక్షేత్ర । తీర్థస్థితముపృథగ్దీపితంబు నృసింహ రామమత్స్యాదివిగ్రహ
ములెట్టి । యవియనఁదగియుండు నట్టిదయగు దాని హేతికులఘుతమఃస్రోతమతు
లు । గాంచియర్చలయందొకటిగాఁగఁ దలఁచివికత్థనంబొనరించిగరుసులేని । రౌ
రవంబులడిందిపారంబులేక । వనరుదురుగానివిజ్ఞానవంతులైన । వారుశిలగాఁగఁ
దలఁచరెవ్వారుదృష్టి । గోచరబ్రహ్మమనిచూచికొలిచియునికి ॥ ౧౨౫ ॥ శా ॥ ఆ
వాణీరమణుండు ప్రార్థనముసేయన్ దేవకీదేవియం । దావిర్భావమునొంది యేరి
కినలభ్యంబైన శేవన్ జగ । జ్జీవాతుస్థితినుండునిందుదొర విస్మేరాననున్ నిత్యసం ।
సేవందెల్చుజితేంద్రియుండు తమముంజించుం గనుందత్త్వమున్ ॥ ౧౨౬ ॥ తే ॥ భ
క్తిగద్గదరీతివాగ్భరములొలయ । నటనమునఁగూడిగోపికానాథుమ్రోల। నిలిచికీర్తిం
చుపుణ్యుండునలినబంధు । దళనమొనరించితత్త్వపదమునకరుగు ॥ ౧౨౭ ॥ క ॥ హ
రిసోపహారలక్ష్మీ । శ్వరునెవ్వరుచూతురట్టివారలుసకలా । మరపూజ్యులువారందు
నఁ । బొరసినపుణ్యములగణ్యములుగుణజలధీ ॥ ౧౨౮ ॥ క ॥ ఇతిహాసపురాణకథా ।
శ్రుతిస్మృతులునందగోపసుతుకతైదుఁరన్ । సతతముపఠియించుమహా । మతిపరమ
పదంబునందు మతిమన్ముఖ్యా ॥ ౧౨౯ ॥ క ॥ తీర్థముననాడిబ్రహ్మా । భ్యర్థితలీలావ
తారుభక్తాధారున్ । బార్థసఖుఁగొల్వఁగలమో । క్షార్థులకున్ గలవుసచ్చిదానం
దంబుల్ ॥ ౧౩౦ ॥ సీ ॥ భ్రూణహుండును సురాపుఁడుబ్రహ్మఘాతియు గురుతల్ప

---

క్షము=పాపములను గాల్పఁజాలినది ॥ ౧౨౩ ॥ అలసంబులు= మాంద్యముగలవి. పూనన్=సరి
యగుటకు. పల్గాటులు=పంగ్లనాటిన గాయములు ॥ ౧౨౪ ॥ సచ్చిదానందాత్మకము=సత్తుచిత్తు
ఆనందముగలది. నందనందనాత్మకము=కృష్ణుఁడుగలది. పృథగ్దీపితంబు = వేఱుగా వెలుఁగునది.
హేతికులు=ఆయుధములు పూనినవారు. అఘతమఃస్రోతమతులు=పాపముల నెడి చీఁకట్లను భేదిం
చుబుద్ధిగలవారు. వికత్థనము=అబద్ధము. గరుసు=మేర. డింది=అణఁగి. వనరుదురు=దుఃఖింతురు॥
౧౨౫ ॥ శేవన్=విధమున. జగజ్జీవాతుస్థితిన్=లోకమునకు ప్రాణరక్షమైన యునికితో. విస్మేర=
చిఱునవ్వుతోడి. తెల్చు=అర్చించు; మ్రొక్కు ॥ ౧౨౬ ॥ వాగ్భరములు=మాటలయతిశయములు.
నళినబంధుదళనము=సూర్యబింబముయొక్క భేదించుటను. తత్త్వపదమునకున్=పరబ్రహ్మస్థాన
మునకు ॥ ౧౨౭ ॥ సోపహారిన్=కానుకతోఁగూడినవానిని. అందునన్=ఆదర్శనమువలన. పొ
రసిన=పొందిన ॥ ౧౨౮ ॥ మతిమన్ముఖ్యా = బుద్ధిమంతులలో ప్రధానుఁడా ॥ ౧౨౯ ॥ ఆడి=
స్నానముచేసి. అభ్యర్థిత=వేఁడఁబడిన. సచ్చిదానందంబులు=శాశ్వతములయిన జ్ఞానసంతోష
ములు ॥ ౧౩౦॥ భ్రూణహుండు=కడుపులోనిపిండములనుజంపినవాఁడు. గురుతల్పగ= గురుభా

స్థితుండు । కలహాశనుండుతర్కక్రియాకుశలుండు సంగతోన్మాదోత్తమాంగకుండ
నగుసవమేనియునటువంటి మగనితోఁడఁ । గాపురముసేయుసతిదొడ్డగరితయగుచు । క
సిడికోఁతకునోర్చిలోవిసిగికొనక । ధాతమారకతంద్రిసేఁతకువగవక॥ ౧౪౫ ॥ శా
ఆతీవ్రాంశుని వేఁడికోర్చిమనుఛాయాదేవియుంబోలెస । త్పాతివ్రత్యగుణాభిరామ
యగునాభామాలలామంబుసంప్రీతింజేయునసహ్యదర్శనముఁ బిర్వీఁకులంబెట్టుదు
ర్జాతుఁ బేతదయానయుఁ దదుచితాచారంబులన్ నిచ్చలున్ ॥ ౧౪౬ ॥ ఉ ॥ కొన్ని
గోణఁగికొన్నినిసికొన్నితుటారములాడిమానరా । కెన్నికనిన్నినాళ్లకివియున్ననికూటికిఁ
బిచ్చపాటిగా । న్మన్ననుహప్రసాదమనిహర్షరసోల్లసదాననాబ్జయై । యన్నలినాక్షి
భర్తయిడునన్నియయైకొను బ్రుక్కుధాన్యముల్ ॥ ౧౪౭ ॥ సీ ॥ చతురసమ్మార్జ
నాచరణంబుతొలునాటి ప్రాఁచివన్నియత్రోపువడుటగాఁగ । గోమయగోముఖశ్రీముం
గిటఘటించుటలు ముఖమజ్జనకలనగాఁగ । గమనీయపూర్ణకుంభముల ఘ్రాజాక్లృప్తికుచ
లికుచాకల్పరచనగాఁగ । నన్నసంపాదనార్థాగ్నిఁ బుట్టినధూమ పటలిసంస్కార
ధూపంబుగాఁగ । విఘటితకవాటకద్వారవిశదనయన । యర్చితాధరగేహాళికాధరోష్ఠ ।
భాండగోపన యవనికాంబరపరీత । యింతిగృహలక్ష్మినత్యంత కాంతిఁదనరు ॥
౧౪౮ ॥ సీ ॥ ప్రస్తుతంబనిపదార్థములు రాజులవేఁడికొనితెచ్చి గ్రాసమ్మించుకోమటిం
డ్ల । మూసిముల్లడిచిగుమ్మలకొల్చుపైమెత్తు లూడ్చఁడుపస్తైనసుండుఁగాని । మొ
ట్టిచుట్టంబేనియింటికేతేర రెండవసూతకముదెల్పియవలఁజొనుపు । మునుప్రతిశ్రిత
ముచేసినపైఁడిరాకున్న ముచ్చిచ్చునను వేఁగువచ్చుదనుక । వనరుశాకాయలవణా
యవాయటంచుఁ । బెనఁగుధూళిఃపరగృహాదపియనునాస । ముంచియాఁగకుఁగా
టుపాముసకుబలియు । నోసఁగఁడనిభర్తకైపొక్కునువిదమదిని ॥ ౧౪౯ ॥ వ ॥ ఇ
వ్విధంబున నవ్విధుబింబవదన వివిధకుటిలాచార చతురుండగు జీవితేశ్వరు నీశ్వరుం

---

రును మొలపించువాఁడును. సంగతోన్మాదోత్తమాంగకుండు=కూడిన పిచ్చికితలగలవాఁడు. కసిడికోఁతకున్=రాపాడుటకు. చేఁతకున్=పనికి ॥ ౧౪౫ ॥ తీవ్రాంశుని=సూర్యుని. పిర్వీఁకులంబెట్టు=బాధించు. నిచ్చలున్=ఎల్లప్పుడు ॥ ౧౪౬ ॥ తుటారములు=అలక్ష్యపుమాటలు. పిచ్చపాటి=కొంచెపాటి. బ్రుక్క=ప్రాఁతగిలిసారముచెడిన ॥ ౧౪౭ ॥ సమ్మార్జనాచరణము=కసవూడ్చుట. గోముఖశ్రీ=అలుకునట్టియలంకారము. క్లృప్తి=నియతి. ఆకల్పరచన=వస్త్రాద్యలంకారముచేసికొనుట. యవనికాంబరపరీత=తెరచీరచే ఆవరింపఁబడినది ॥ ౧౪౮ ॥ ప్రస్తుతంబు=వివాహాది కార్యము. గుమ్మలకొల్చు=బొట్టలలోనిధాన్యము. రెండవసూతకము=మృతాశౌచము. ప్రతిశ్రితము=పికరియధీనము. పైఁడి=ధనము. వనరున్=దేవురించుచుయాచించును. శాకాయలవణాయవా=కూరకైనను ఉప్పునకైనను. ధూళిఃపరగృహాదపి=పొరిగింటనుండిదుమ్మయినను నానిమ్ము. పొక్కున్=దుఃఖించును ॥ ౧౪౯ ॥ విధుబింబవదన=చంద్రబింబమువంటిమొగము గలది—స్త్రీ. కుటిలాచారచతురుఁడు=వంకరనడతలయందు నేర్పరి. జీవితేశ్వరున్=పెనిమిటిని.

గాఁదలంచుచుఁ దదుపాసనంబు తనకునిహపర సిద్ధిసంసూచకంబుగ నిండుడెందం
బునం గోచరింపంజేయుచుఁ గీర్తితచరిత్రంబునం బ్రవర్తిల్లుచుండునంత ॥ ౧౫౦ ॥
క ॥ అటనొకనాఁడాభూసుర । కుటుంబినీసదనమునకు కుహనావటువున్ । బటువ
గు మైజిగిఁ దెగడున్ । బటువగు నొకవడుగు వచ్చె భుక్త్యాపేక్షన్ ॥ ౧౫౧॥ వ ॥ వచ్చి
న నమ్మచ్చెకంటి గెంటని నెయ్యంబు లియ్యంబగు నంతఃకరణంబున నడలు గడలుకొనన్ గ్రా
మాంతరాసక్తుండగు ప్రాణనాథుండు తనుం బిలిచిన యట్లయినలోనింటి బోనమాని
తొంగిచూచుతఱిం బొడకట్టి బొట్టునకు మేదావి మేదునలవాటునం గందిన యంగు
ళీద్వితయంబు చేటిగుట్టినం బృథగ్వర్ణమూర్తులగు సంవర్తికలుగల జలరుహంబునఁ
బ్రశస్తంబగు హస్తంబెత్తి స్వస్త్యస్తు తేయని యాశీర్వదించుటయుఁ గృతనమస్కార
యైయాసారసామోద మృదుల స్వరంబున నిట్లనియె ॥ ౧౫౨ ॥ సీ ॥ ఎందుండి రాక
యుండె దేరఁగత మేమి గ్రాసార్థిభావంబుగా నవచ్చె । నగునన్న నట్లని మొగసాలనుం
డుఁడాయన యూరలేఁడు యామార్గమునకె । కావింతు నన్నసంస్కారంబు మీరా
రగింతురుగాని వేగిరమెయనుడు । మాణవకుఁడు పలుకు మగువ నేఁ డేన్నాళ్లనుండియు
గుడువఁగూడోడవకునికి । వేఁడియగుదాఁక నోరువవమాఁడుగలిగెఁ । బులిసినది
గలైననన్నంబుపోఁక యంత । మొసఁగి తుత్తార్పు వెసచల్ది మెసవనైన । పాపముడిపించు
కొండుదర్పంబు కలిమి ॥ ౧౫౩ ॥ తే ॥ అనుడు నెలనాగ యిట్లనును ననఘు నీకుఁ । జలిదియే
నెట్టులిడ నేర్తు క్షణములోన । వంటగావింతు భుజియించి వలయు నెడకు । నేగునావిని
సతిఁబలుకుఁ బాఁగవడుగు ॥ ౧౫౪ ॥ తే ॥ త్రోవగమియించుచోటనో పూవుఁబోఁడి ।
మావరవర్ణ సమాచారమైనఁ జెడదు । బ్రాహ్మ్యమీతడ వేటికిఁ బ్రాణరతుఁ । నెఱపు మొ
కయింత మెదుకిన్ని నీళ్లునొసఁగి ॥ ౧౫౫ ॥ తే ॥ వాఙ్మనఃకాయకర్మ ప్రవర్తనముల

---

ఉపాసనము = పరిచర్య. నిండుడెందంబునన్ = కొఱఁతలేనిమనసుతో. కీర్తిత = పొగడఁబడిన॥ ౧౫౦ ॥ కుటుంబిని = ఇల్లాలు. కుహనావటువున్ = కపటబ్రహ్మచారియైన వామనుని. పటువు = మిక్కుటము. మైజిగిన్ = దేహకాంతిచేత. తెగడుంబటువు = తిరస్కరించునట్టి పుట్టుకగలవాఁడు—చక్కఁదనముగలవాఁడు. వడుగు = బ్రహ్మచారి. భుక్త్యాపేక్షన్ = భోజనముచేయనపేక్షతో॥ ౧౫౧ ॥ గెంటని = తొలఁగని. లియ్యంబు = ఐక్యము. అంతఃకరణంబునన్ = మనసుతో. అడలు = భయము. కడలుకొనన్ = అతిశయింపఁగా. బోనమాని = వంటచేయుట మానుకొని. పొడకట్టి = కనఁబడి. మేదావి = ఔపాసనముచేసిన నిప్పుమసి. మేదు = మెదుపునట్టి. అలవాటునన్ = వాడుకచేత. పృథగ్వర్ణమూర్తులు = వర్ణముమాఱిన స్వరూపముగలవి. సంవర్తికలు = క్రొత్తఆకులు. స్వస్త్యస్తుతే = నీకుమేలగుఁగాక. సారసామోద = తామరవాసనవంటి దేహవాసనగలది॥ ౧౫౨ ॥ ఏతేరన్ = రాను. గ్రాసార్థిభావంబు = అన్నముగోరినవానితనము. మొగసాలన్ = ఇంటిముందటిచవికలో. మాణవకుఁడు = పిన్నవాఁడు. ఏన్నాళ్లనుండి = అయిదుదినములనుండి॥ ౧౫౩ ॥ బాఁగవడుగు = ధూర్తుఁడైనబ్రహ్మచారి॥ ౧౫౪ ॥ గమియించుచోటన్ = నడచునప్పుడు. అవరవర్ణసమాచారము = శూద్రునియాచారమువంటి యాచారము. బ్రాహ్మ్యము = బ్రాహ్మణధర్మము॥ ౧౫౫ ॥ అభ్యాగత

వారలచేతికి నందియిచ్చి । వడువునభుజించె వడువిపూర్వాంటకంబు ॥ ౧౩౪ ॥ భుజియించి మఱియుఁ దెమ్మని । గజిబిజి సేయుటయు సతియుఁ గలఁగక వికసన్నిజవదనయగుచు హస్తాంబుజములు మొగిడించి పలికె భూసురసూతిన్ ॥ ౧౩౫ ॥ శా ॥ అన్నం బొండొక లేదు చక్కి యిదె విన్మధ్వశ్రమారూఢతే । నన్నం దెచ్చెద సాధుగుప్తములు నవ్యంబుల్ కజాయంబులిం । దెన్నే నున్నవి క్రొత్త యట్టికలఁ గాదే లేచి వార్వండువే । గన్నిర్మించెదఁ గూడుఁ గూర మఱియుం గైకోలు మేల్భుక్తికిన్ ॥ ౧౩౬ ॥ ఉ ॥ నావిని నాతిఁ బల్కెఁ గుహనావటువో వనితామతల్లియో । పావనశీల తైల పరిపక్వములెన్నియుఁ దెమ్ము కాదనన్ । లేవడి నైన భుక్తి గొని లేవది గంబడదాఁ కలింతయున్ । ధావనమాచరించు కతనన్ దడవున్ నిలఁ బోలదిచ్చటన్ ॥ ౧౩౭ ॥ మహాస్రగ్ధర ॥ అనినన్ వడ్డింపఁ జొచ్చెన్ హరిణనయన నిండారు డెందంబుతో వే । గనభావిప్రాణనాథాగ్రహసహమతితోఁ గమ్మనై కారమైనే । తనవండం బొప్పి చేతం దడవినఁ దుములై తాఱుటల్ లేక సద్యో । జనితంబుల్ వోలెఁ జాలం జవులొదవు సముచ్చండికాపూపపఙ్క్తుల్ ॥ ౧౩౮ ॥ వ ॥ ఇట్లరుణగ్రహణ ప్రవణపురుషోపధికృతంబులు ప్రాణవల్లభసవ్యాగళిరక్షితంబులు తదుపహితగణనావహంబులు నచ్ఛిద్రముద్రాముద్రితంబులునై సజ్జనవితరణంబులగతి మహితభాజననిహితంబులు ననురక్తవధూ హృదయంబులపగిది నతిస్నేహ

---

లోన్ = వాలియందు. ఆలపాలు = ఆవులపాలు. వేళము = శీఘ్రముగ. వడువు = బ్రహ్మచారి. ఇవుర్వాంటకంబు = ఇగురఁబెట్టినయన్నము ॥ ౧౩౪ ॥ గజిబిజి = తొందర. కలఁగక = కలఁతనొందక. వికసత్ = వికాసమునొందుచున్న ॥ ౧౩౫ ॥ ఒండొక = కొంచెమైనను. అధ్వశ్రమారూఢ = త్రోవనడచినబడలికహెచ్చినవాఁడా. సాధుగుప్తములు = బాగుగా దాఁచఁబడినవి. నవ్యములు = క్రొత్తవి. కజాయంబులు = పిండివంటలు. ఎన్నేని = కావలసినన్ని. అట్టికలన్ = అటకలయందు. కాదేని = అవిసరిపడనియెడ. వార్వండు = చేయికడుగుకొనియాచమనముచేయుఁడు. నిర్మించెదన్ = చేసెదను. మఱియున్ = మరల. కైకోలు = అంగీకారము. భుక్తికిన్ = భోజనమునకు ॥ ౧౩౬ ॥ తైలపరిపక్వములు = నూనెతోవండినవి. ఎన్నియున్ = ఎన్నియున్నవో అన్నియును. కాదనన్ = కాదుఅనను. లేవడి = దారిద్ర్యము — తక్కువ. దిగంబడదు = తగ్గదు. ఇంతయున్ = కొంచెమయినను. ధావనమాచరించుకతనన్ = పరుగెత్తుటచేత ॥ ౧౩౭ ॥ నిండారు = నిండిన. భావిప్రాణనాథాగ్రహసహమతితోన్ = ఇమ్మటపెనిమిటికోపమునుఓర్చునట్టిబుద్ధితో. నేతన = నేతితోనే. పొల్చి = ఒప్పి. తుములై = పొడిపై. తాఱుటలు = మఱుఁగుపడుటలు. సద్యోజనితంబులు = అప్పుడుపుట్టినవి ॥ ౧౩౮ ॥ అరుణగ్రహణప్రవణపురుషోపధికృతంబులు = ఎఱుపునుఅనఁగాకోపమునుపొందుటయందు ఆసక్తుఁడయిన పెనిమిటిచేత కపటముగా చేయఁబడినవి. ప్రాణవల్లభసవ్యాగళిరక్షితంబులు = పెనిమిటిచేత లెస్సగాఁగా పాడఁబడినవి. తదుపహితగణనావహంబులు = అతనిచేత పెట్టఁబడినలెక్కను పొందినవి. అచ్ఛిద్రముద్రాముద్రితంబులు = సందులేకవానెనకట్టుచేతముద్రవేయఁబడినవి. వితరణములగతిన్ = దానములవలె. మహితభాజననిహితంబులు = దొడ్డపాత్రమునందుంచఁబడినవి. అనురక్తవధూ = అనురాగముగలస్త్రీలయొ

పిచ్ఛిలంబులు నుపవనంబులయుపమ సురభిష్ఠంబులునైన పిష్ట వికారంబులు నిర్వికారుండై భూసురకుమారుండు నిరవశేషంబుగా నాహరించియు వెండియు నవనతాననంబగు మిథ్యాలజ్జాభినయంబునఁదన బహుభోక్తృత్వంబునపశ్లోక కలుషితంబగు నని విశంకమానమానసుండునుంబోలెఁ గానందగునా పొట్టి నెట్టికసీలదిట్టపడుచు కడుపునిండమి యెఱింగి తరంగితాద్భుతాంత రంగయై యాకురంగనయన యిట్లనివితర్కించు ॥ ౧౭౯ ॥ క ॥ ఇసుమంతగాని లేఁడీ । పసిబాలుఁడుకూడుగూటి ప్రాయమువాఁడి । ట్లెసరిబహుభక్ష్యరాసులు । మెసఁగెడివిసువఁడు ప్రతుష్టి మేకొనఁడుగదే ॥ ౧౮౦ ॥ ఉ ॥ మాయవుబిడ్డ యీనిసువుమానిసిపుట్టువుగాదు దేవతా । నాయకుఁడో చతుర్ముఖుఁడొ నాభవబంధములూడ్వనున్ననా । రాయణమూర్తియో యెఱుఁగరాదొకయించుకయుఙ్బుభుక్షుపైఁ। జేయిదొ యంగఁడప్పములు సెల్లెసమస్తమునంచునివ్వెఱన్ ॥ ౧౮౧ ॥ చ ॥ తలఁచుమనంబులోన వసుధామరయాజక ధర్మపత్నిని । ర్మలకనకావదాతముఁ గరాళతరాలఘుచీలమాలికో । జ్జ్వలముజగత్త్రయాచరణసాక్షిముదక్షిమదంగభాగతా । తిలకిత విభ్రమంబగునుదీర్ణమహాత్త్వముదివ్యతత్త్వమున్ ॥ ౧౮౨ ॥ క ॥ సతియీఁగతిశ్రియమిచ్ఛే । ద్ధుతాశనాత్తనుటయెఱిఁగిహుతవహునఖిలే। ప్సితవితరణగుణలీలా। చతురుంబ్రార్థింపఁదప్పిసాదము కలిమిన్ ॥ ౧౮౩ ॥ సీ ॥ ఒకకొన్ని వడియంబు లొకకొన్ని వరుగులు నొక కొన్ని తెఱఁగులయొలుపుఁబప్పు । లొకకొన్ని ద్రబ్బెడ లొకకొన్ని తాలింపు లొకకొన్ని విధము

క్ర. స్నేహపిచ్ఛిలంబులు=స్నేహము చేత పేరుకొన్నవి; నేయిపేరుకొన్నవి. ఉపమన్ = విధమున. సురభిష్ఠంబులు=మంచిపరిమళముగలవి. పిష్టవికారంబులు= పిండివంటలు. నిరవశేషంబుగాన్= మిగులులేకుండ. ఆహరించి=భక్షించి. అవనతాననంబు = వంచిన మొగముగలది. మిథ్యాలజ్జాభినయంబునన్ = అబద్ధపు సిగ్గునుతోఁపించునట్టి చేష్టచేత. బహుభోక్తృత్వంబు= తిండిపోతుతనము. అపశ్లోకకలుషితంబు = అపకీర్తివలనకలఁతనొందింపఁబడినది— అపకీర్తినొందినది. విశంకమాన=మిక్కిలిసంశయించుచున్న. నెట్టికసీలదిట్టపడుచు = నైష్ఠికశీలుఁడైనధైర్యముగల బాలునియొక్క. తరంగితాద్భుతాంతరంగ = అతిశయించినయాశ్చర్యమునొందినమనసుగలది. వితర్కించున్=తనలోఁదాను ఆలోచించెను ॥ ౧౭౯ ॥ ఇసుమంత=రవంత. ఎసరి= విజృంభించి. ప్రతుష్టి= తృప్తిని. మేకొనఁడు= పొందఁడు ॥ ౧౮౦ ॥ నిసువు=శిశువు. నివ్వెఱన్= నిండినయాశ్చర్యముతో ॥ ౧౮౧ ॥ నిర్మలకనకావదాతము=స్వచ్ఛమయిన బంగారమువంటిదియు, తెల్లనిదియు. కరాళతర=మిక్కిలియున్నతమైన. ముదక్షిమత్=సంతోషించినకన్నులుగల. తిలకితవిభ్రమంబు=బొట్టుగలదిగాఁజేయఁబడినవిలాసముగలది. దివ్యతత్త్వమున్=అప్రాకృతమయినపరబ్రహ్మమును ॥ ౧౮౨ ॥ శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్—హుతాశనాత్ = అగ్నిదేవునివలన. శ్రియమ్=సంపదను. ఇచ్ఛేత్=కోరవలసినది. హుతవహున్= అగ్నిదేవుని. అఖి…తురున్—అఖిల=సకలమైన. ఈప్సిత=కోరికలను. వితరణ= ఇచ్చునట్టి. గుణ= గుణముయొక్క. లీలా= వ్యాపారమునందు. చతురున్=నేర్పుగలవానిని ॥ ౧౮౩ ॥ ద్రబ్బెడలు= ఒకవిధమయిన భక్ష్య

లయొప్పఁజేరు । లొకకొన్ని కలకల్వు లొకకొన్ని బజ్జులు నొకకొన్నిరీతులయూర్పు వగలు । నొకకొన్ని పిగరులు నొకకొన్ని యంబళ్లు నొకకొన్ని వహులపూపోత్కరములు । వివిధఫలకంద మూలంబు లవియుఁగొన్ని । యూరుఁబిండులు నొకకొన్ని యొక్క కొన్ని యూరుఁగాయలు పచ్చళ్లు నొక్కకొన్ని । పెరుగుపాత్రనె నేతులుపెచ్చువెరుగ ॥ ౧౭౪ ॥ చ ॥ అమితములై మహానసమునం దపు డద్భుత మొందుచున్నయ । న్నములసుపక్వగంధములనందములై యటువోవుచోటన । య్యమరతరుప్రసూనతతులంగనపైఁ గురియంగఁబుట్టుగం । ధములిటుడిగ్గుచోటఁదగుఁదద్ద్వితయారచితోపగూహనముల్ ॥ ౧౭౫ ॥ శా ॥ ఆలీలావతి నిత్యసత్యశమశైర్యౌదార్యసంశుద్ధలం । జాలక్ మెచ్చివటుత్వ మందొ అఁగి సాక్షాత్కారముంబొందెను । ద్వేలాలోలకృపాజపాప్రసవకాంత భ్రాంతికృల్లోచనా । ళ్యాళిందాశ్రితరాధికాసురతరాగాంకూరుఁడా శౌరియక్ ॥ ౧౭౬ ॥ సీ ॥ నీలంబు భక్తానుకూలంబు హరిదంతచేలంబు నవనీతచోరమాది । మూలంబు కరుణావిశాలంబు కృతజగజ్జాలంబు శ్రితలతావాలమమర । మేలంబు భవవనోత్కీలంబు తల్పితవ్యాళంబు శిక్యావచూళమమిత । లీలంబుహృతమరుత్సాలంబు శశిసఖఫాలంబువరదానశీలమఖిల । కాలజంఘాల మసురకృత్తక్ష్వేళమతిక । రాళమాపత్పయోదవాతూలమునగు । యదుకులసరోమరాళంబు నతివగాంచి । నతియుసుతియు నొనర్చెనన్నగధరుండు ॥ ౧౭౭ ॥ ఉ ॥ ఆసతిఁబల్కు నీహృదయమారయఁగోరియ యుట్లొనర్చితిక్ । గాసికుశేశయాననలు గగ్గిరయేనియుఁగల్లనిమ్మనీ । చేసినభాగ్యమే సతియుఁ జేయమనీయెదుటక్ ముసిశ్వరా । భ్యాశదురాసదంబగు నుదాకృతియీగతి నుల్లసిల్లుటక్ ॥ ౧౭౮ ॥ క ॥ సుచరిత్ర నేఁడు

---

ములు. బజ్జి=కారముగల. ఊర్పు=పిండిమిరియము. పిగరి=తాలింపువజ్జిక. వహుల=విధముల॥ ౧౭౪ ॥ మహానసము=వంటయిల్లు. ఉపగూహములు=ఆలింగనములు ॥ ౧౭౫ ॥ ఔదార్య=ఇచ్చునట్టిస్వభావము. వటుత్వము=బ్రహ్మచారితనము. సాక్షాత్కారము=ప్రత్యక్షము. ఉద్వేల=మిక్కిలి. ఆలోల=అంతటచలించిన. జపాప్రసవ=దాసనపుఁబువ్వు. భ్రాంతికృత్=భ్రమను చేయుచున్న. అళింద=ముంగిటిని. ఆశ్రిత=ఆశ్రయించిన. అంకూరుఁడు=మొలకలుగలవాఁడు ॥ ౧౭౬ ॥ హరిదంతచేలంబు=దిగంబరము—దిసమొలగలది. ఆలవాలము=పాదిగానైనది. అమరమేలము=దేవతలకూడికకలది. భవవనోత్కీలంబు=జన్మములనెడి వనమును వెల్లిగించునది. తల్పితవ్యాళంబు=పానుపుగాఁజేయఁబడిన పాముగలది. శిక్యావచూళము=(చల్ది) ఉట్టిముతోడిసిగగలది. హృతమరుత్సాలంబు=అపహరింపఁబడిన దేవతలచెట్టు (పారిజాతవృక్షము) గలది. అఖిలకాలజంఘాలము=ఎల్లకాలము నువడిగనడపునది. అశనకృతక్ష్వేళము=అన్నముగాఁజేయఁబడినవిషముగలది. అరికరాళము=పగవారికి భయమును పుట్టించునది. ఆపత్పయోదవాతూలము=ఆపదలనెడిమేఘములకుగాలి. నతి=నమస్కారము ॥ ౧౭౭ ॥ కుశేశయాననలు=తామరలవంటిమొగములుగలవారు=స్త్రీలు. అభ్యాశదురాసదంబు=సమీపమునుపొందఁగూడనిది ॥ ౧౭౮ ॥ పచరణ=కపటనటనము. ఇమ్ములక్=బాగుగా. ద్రోవది=ద్రౌపది ॥ ౧౭౯ ॥

చే॥ తివలిదిభుజియింపఁజాలదృప్తియొదవెడిం । బచరణగాడిమ్ములమును । రుచి యింపమునఁబరివిందుద్రోవదివిందున్ ॥ ౧౮౯ ॥ క ॥ అతిమానుషమసిధారా। వ్రతమగుమనువంటుని ష్పవంటిదిదియనన్।బతిదేవతవైమనునీ। గతిభావారూఢమయ్యెఁగా జగములకున్ ॥ ౧౯౦ ॥ చ ॥ తనుశతకోటులెత్తి బహుధర్మవినిర్మితిఁబేర్మిగాంచినన్ । ననుఁగనలేనిలేఁతలకునాతియభోగ్యముభాగ్యమీవుప్రా । గ్జననమునందొనర్చితివైకానొకయర్చననన్నుఁగూర్చిదా। ననసమకూరెఁజుమ్ముసుజన వ్రజనందితచర్యనీదెసన్ ॥ ౧౯౧ ॥ తే ॥ అతివ తొల్లింటి పుట్టువునందునొక్క । మానివేలిమిజన్నైవై మన్ననాఁడు । నామధుర వేణునాదంబునమదిఁగరఁగి । తొరఁగఁజేసితిసుస్నిగ్ధదుగ్ధరసము ॥ ౧౯౨ ॥ క ॥ ఆపాలనురువుపవన । వ్యాపారముచేతఁదెరలివచ్చినిలిచెలీ । లాపింఛచ్ఛవిభర్త్సిత । తాపింఛమదీయమాళితటిఁగుచలికుచా ॥ ౧౯౩ ॥ క॥ దానఁబయస్సంతానము। దానంబుననన్నుఁదనుపు దానవయతిచం। ద్రాననతత్ఫలమునఁగా । దానికినుదక్కితిన్ ముదముమదిఁబొదలన్ ॥ ౧౯౪ ॥ ఆ ॥ ఒకఁడ కృతసత్క్రియుండనువిప్రుండు । గలఁడు ఘోరకఠినకలుషబుద్ధి । వసుధయెల్లఁదిరుగువసుధానువను పేరి । పట్టణముననుండుఁబుట్టువడుగు ॥ ౧౯౫ ॥ సీ ॥ ధనవంతుఁడయ్యునుద్వాహంబుదొఱఁగి మాతులునాకు పెఱవితంతువులఁదగిలి । కులవంతుఁడయ్యుఁబెద్దలఁబాసివిహరించుఁబాషండషండానుబంధియగుచు । మతిమంతుఁడయ్యునామ్నాయములఁ జెవిఁబెట్టఁడశ్లీలఖేలనవ్యసనమెసఁగి । స్థితిమంతుఁడయ్యు లక్ష్మికిఁగాకత్రిమ్మరుపలుగూడు మరిగి యాఢ్యులభజించి । తలఁచు బ్రహ్మస్వ దేవస్వములకునెగ్గు । కుప్పఁజిచ్చిడిపేలాలుకొలుకఁదివురు । గ్రహణకాలంబులందు మున్గడు జలముల । పెబ్రచెంచడమా బ్రాహ్మణబ్రువుండు ॥ ౧౯౬ ॥ వ ॥ వాఁడొక్కకందువనొక్కవెలయాలికింజిక్కి మహీమండలకుండలంబగు పౌండరీకంబునఁ గొండొక కాలంబుండి యొక్క పెనుఁబండువునఁగన్నులపండువగుమదీయనైవేద్యప్రకల్పనంబు ధూపోత్సవానంతరంబున నెడముఁగాచి చూచి తనవలయుతెఱంగునం జని బహువి

---

మనువు=బ్రదుకు ॥ ౧౯౦ ॥ లేఁతలు=అల్పులు. అభోగ్యము= అనుభవింపఁదగనిది. ప్రాగ్జననము=పూర్వజన్మము ॥ ౧౯౧ ॥ వేలిమిజన్నైవు=హోమధేనువవు. మన్న=బ్రదికిన. సుస్నిగ్ధ=మిక్కిలి చిక్కనైన ॥ ౧౯౨ ॥ లీలాపింఛచ్ఛవి = విలాసరూపమైన నెమలియీఁకయొక్క కాంతిచేత. భర్త్సిత = తిరస్కరింపఁబడిన. తాపింఛ=చీఁకటిమ్రానుగలది ॥ ౧౯౩ ॥ పయస్సంతానము దానంబునన్=పాలసమూహమునిచ్చుటచేత. పొదలన్=వర్ధిల్లఁగా ॥ ౧౯౪ ॥ ౧౯౫ ॥ ఉద్వాహంబు=పెండ్లి. వితంతువులన్= విధవలను. షండ=నపుంసకులతోడి. అనుబంధి= సంబంధముగలవాఁడు. అశ్లీలఖేలన=అసభ్యపు మాటలాడుటయందు. స్థితి=ఉనికి—కలిమి. ఆఢ్యులన్=ధనవంతులను. కుప్పన్=వెంటదిబ్బయందు. తివురున్=యత్నించును. మున్గఁడు=స్నానముచేయఁడు. పెబ్రచెంచడము=చెడ్డదేగ — చెడ్డదేగవలె ప్రాణిహింసచేయువాఁడు. బ్రాహ్మణబ్రువుండు=నీచబ్రాహ్మణుఁడు ॥ ౧౯౬ ॥ కందువన్=సమయమునందు. పెనుఁబండువునన్=

ధంబగు కాలంబుమని ముదిసి తనువువిడిచి యత్యుత్తమంబగు ధరామరవంశంబునం బుట్టి పుట్టిన నాటనుండియుఁ జదువుచదువ్రనన చదురుండై నిండు ప్రాయంబునని న్నుంజెట్టవట్టించి యిట్లున్నవాఁడు వినుము ॥ ౧౯౭ ॥ తే ॥ తరుణి మద్భుక్తదర్శ నోత్సవసుకృతము । పాపవహ్నికిసలిలమై భద్రమొసఁగెఁ । గాకలేకున్న నితఁడు ప్రాగ్జనినొనర్చు । కల్మషములకునిష్కృతిగలదెయెందు ॥ ౧౯౮ ॥ వ ॥ అశ్వత్థంబుగ సోపహారంబగు మదీయరూపంబు నాకస్మికంబుగఁగనుఁగొనిభస్మ సాత్కృతదుష్కృత నీరసయవసరాశియై భూసుర కేసరికిశోరంబై వాసివడసియు నతండుకట్టిఁడి యగుటకుఁ గారణంబువినుము ॥ ౧౯౯ ॥ క ॥ నీభావశుద్ధియారయ । శోభనచారిత్ర యేనుజువ్వెయతనికిన్ । లోభక్రోధములమనః । క్షోభముగావించి బాలిశుండనిపింతున్ ॥ ౨౦౦ ॥ క ॥ పతికొట్టినఁబతిదిట్టినఁ । బతినిర్దయుఁడగుచు నెట్టిపాటు పఱచినన్ । మతినన్యథాత్వ మొందరు । పతిదేవతలతివనీకుఁ బ్రతియగు వారల్ ॥ ౨౦౧ ॥ తే ॥ నిష్ఠురత్వంబుతొలఁగించి నేటనుండి। నీకునను కూలుఁడయ్యెడునీవిభుండు । మత్పదద్వయభక్తిసమగ్రుతైన । సుతుల నేవురఁగాంచెదూర్జితవిభూతి॥౨౦౨॥ తే ॥ వెండిఁబైఁడిద్రవ్వితండంబుగా మేలి। కూడుఁబాఁడియింటఁగొలఁదిమీర। నోము లెల్లనోఁచినూతేండ్లుబ్రదికిని । భర్తతోడఁబరమపదముగనుము ॥ ౨౦౩॥ ఉ॥ మన్ననచేసినాఁడు మురమర్దనుఁడంచునహంకరింపకో । కిన్నరకంఠియిట్లయినఁగీడొదవున్ వినుతొంటికన్నన । స్మన్నిహితాంతరంగవయి సత్యసమార్జవ శుద్ధిలక్ష్మికిన్। వన్నెయపెట్టుమీమహితవర్తనకీర్తులు నిర్వహించుచున్ ॥ ౨౦౪ ॥ క ॥ తృష్ణారహితులు మత్పద । నిష్ణాతులు నిత్యసత్య నిరతులు నగుశ్రీ । వైష్ణవులఁగాంచిననుఁగా । విష్ణుపదవలగ్నగారవించికొలువుమీ ॥ ౧౦౫ ॥ క ॥ అనివరమిచ్చిమహీసుర । వనితన్ మన్నించి భక్తవత్సలుఁడరిగెం। దన నెలవునకుసుధారస । మునఁగుముదినిఁ జేర్చియరుగుపూర్ణేందుఁడనన్ ॥ ౨౦౬ ॥ తే ॥ అటసుశీలమగఁడు నరుదెంచియొకకొన్ని । దివసములకుదొరలఁదిరియవాస । గోసితనకులంబువాసియుఁవన్నెయుఁ । చలఁచు

---

గొప్పయుత్పత్తమునందు. చదురుఁడు=చదురుఁడు=నేర్పరి ॥ ౧౯౭ ॥ ప్రాగ్జనిన్= పూర్వజన్మమునందు. కల్మషము=పాపము. నిష్కృతి= ప్రాయశ్చిత్తము ॥ ౧౯౮ ॥ సోపహారంబు=నైవేద్యముతోఁగూడినది. భస్మసాత్కృత=బూడిదయైన. నీరసయవసరాశి=ఎండినగడ్డిప్రోగు. భూసురకేసరికిశోరంబు=బ్రాహ్మణశ్రేష్ఠునిబిడ్డ. వాసి=ఘనత. కట్టిఁడి = కట్టుతప్పినవాఁడు—అక్రమమైననడవడిగలవాఁడు ॥ ౧౯౯ ॥ బాలిశుండు= మూర్ఖుఁడు ॥ ౨౦౦ ॥ ౨౦౧ ॥ ఊర్జిత=ఎన్నఁడునుజెడని ॥ ౨౦౨ ॥ ద్రవ్వితండంబు=అపరిమితము ॥ ౨౦౩ ॥ తొంటికన్నన్= మునుపటికంటెను. అస్మన్నిహితాంతరంగవు = నాయందుంచఁబడినమనసుగలదానవు. సమార్జవ=మంచిఋజుభావముయొక్క ॥ ౨౦౪ ॥ నిష్ణాతులు =నిష్ఠగలవారు. విష్ణుపదవలగ్న=ఆకాశమువంటినడుముగలదానా—సూక్ష్మమైననడుముగలదానా ॥ ౨౦౫ ॥ కుముదినిన్= కలువతీఁగను. పూర్ణేందుఁడు=నిండుచంద్రుఁడు ॥ ౨౦౬ ॥ తిరియు=యాచించు, కోసి=నఱకి—విడిచి ॥ ౨౦౭ ॥

కొనుచుఁ జెలివి మొలకలెత్త ॥ ౨౦౭ ॥ తే ॥ అతనిఁ దమసొమ్ము చేసి మనన్నఁగియు
న్న । మోహముఖులైన జ్ఞాతులమూలఁ ద్రోచి । సంహృతాసురులైన నిర్జరులకరణి ।
మదవివేకాదివర్గ మభ్యుదయమయ్యె ॥ ౨౦౮ ॥ క ॥ కోపంబునాఁగి మిక్కిలి । పాప
మునకులోఁగి బుద్ధిపశ్చాత్తాపా । టోపశిఖిఁ గ్రాఁగి కరుణా । ద్వీపవతీలహరిఁ దోఁగి
విప్రుఁడు మఱియున్ ॥ ౨౦౯ ॥ సీ ॥ కాలీచపడనిండ్లకడ కేగి వనరుచుండెడువాఁడు
వైరాగ్యనిష్ఠుఁడయ్యెఁ । గయ్యాలక్రచ్చయి కాలుద్రవ్వుచు సదా మండువాఁడతిశాం
తిమహితుఁడయ్యెఁ । గసరి యెంగిలిచేతఁ గాకివేయనివాఁడు సతతాన్నదానప్రశస్తుఁ
డయ్యె । బ్రహ్మకల్పముదాఁక బ్రతుకఁ గాసఁ గడకట్టువాఁ డస్థిరముగ విశ్వముఁ దలంచెఁ । బా
టిగాఁగొనకాపద్మభవుని నైన । నీరసము సేయువాఁడు వినీతుఁడయ్యె । నారులలచ్చి
కిముచ్చిరియుడుకువాఁడు । సత్వసముఁడయ్యె విష్ణుప్రసాదమహిమ ॥ ౨౧౦ ॥ ఉ ॥ పా
శముమీరు పెద్దపెదపాశములై బలితంపుఁ గాఁగులన్ । మూలుగుచున్న ప్రాఁబసిఁడి
షుంచి ధనార్థులకిచ్చు విష్ణుదే । వాలయసుప్రతిష్ఠలకునై యొసఁగున్ సతి కేలనించునా ।
నాలఘుకర్మనిర్మితికి నగ్రకులేంద్రుఁ డనుగ్రహంబునన్ ॥ ౨౧౧ ॥ క ॥ ఆయాలుమగ
లు విష్ణుప । రాయణులై పెక్కుగతుల వ్రతములు తఱితోఁ । జేయుచునుండఁగ నటని ।
శ్రేయసపదమైన పౌండరీకక్షోణిన్ ॥ ౨౧౨ ॥ మ ॥ యమరాడ్ధాతశిఖావతంసము
చిరప్రాణంబు దూరప్రియా । గమశంసిస్ఫుటకాకలీకలన మేకప్రక్రియాపాతదీక్ష
ము శీతర్తుబలీయ మొక్కబలిభుగ్రాజంబు రాజిల్లు శ్రీ । రమణాగారపురోద్ధరోత్థ
చలపత్రస్థూలశాఖాశిఖన్ ॥ ౨౧౩ ॥ శా ॥ తాత ల్తండ్రులు మామ లల్లురును ము

---

ఆఁగి = ఆక్రమించి. మోహముఖులు = మోహుఁడు మొదలగువారు—మోహము మదము మొదల
గునవి. జ్ఞాతులన్ = దాయాదులను—తనలోని శత్రువులను. సంహృతాసురులు = చంపఁబడిన రాక్ష
సులుగలవారు. అభ్యుదయమయ్యెన్ = పుష్టినొందెను ॥ ౨౦౮ ॥ ఆఁగి = అణఁచి. లోఁగి = వెనుదీసి.
కరుణాద్వీపవతీలహరిన్ = దయయనెడి నదీప్రవాహమునందు. తోఁగి = మునిఁగి ॥ ౨౦౯ ॥ ఈచ
పడన్ = చచ్చుకొనిపోఁగా. వనరు = దేవురించు. కయ్యాలక్రచ్చ = జగడగొండి. కాలుద్రవ్వ
చున్ = కలహమునకు యత్నించుచు. మండువాఁడు = కోపవికారమును జూపునట్టివాఁడు. కసరి =
కోపించి. కడకట్టు = నిర్ణయించు. పాటిగాన్ = లక్ష్యముగా. ముచ్చిరి = దుఃఖపడి. ఉడుకు = త
పించు ॥ ౨౧౦ ॥ పాశము = మేర; కట్టు. బలితంపుఁగాఁగులన్ = మిక్కిలి పెద్దవైన బానలయందు.
మూలుగుచున్న = స్థిరముగాక దలకయున్న. ప్రాఁబసిఁడి = బహుదినములనాటి ధనము. నిర్మితికిన్
= చేయుటకు ॥ ౨౧౧ ॥ నిశ్రేయసపదము = మోక్షస్థానము ॥ ౨౧౨ ॥ చిరప్రాణము = బహుకాల
ము బ్రదికియుండునది. దూర...శంసి—దూర = దూరమునందలి. ప్రియ = ఇష్టవస్తువుయొక్క. ఆగ
మ = రాకను. శంసి = కోరునది. స్ఫుటకాకలీకలనము = స్ఫుట = స్పష్టముగా వినఁబడెడి. కాకలీ = స
న్ననికంఠస్వరముతోడ. కలనము = కూడినది. ఏకప్రక్రియాపాతదీక్షము = ఒకవిధమైన పాటు
నందలిదీక్ష (నియమము) గలది. బలిభుగ్రాజంబు = శ్రేష్ఠమయిన కాకి. శ్రీరమణా...శిఖన్ = శ్రీవిష్ణు
దేవుని గుడికెదుట మొలచి పెరిగిన రావిచెట్టుయొక్క లావైన కొమ్మకొనయందు ॥ ౨౧౩ ॥ సహ.

త్రాతల్ సహాయుల్ సహ । శ్రోతల్ భ్రాతలు సేవకుల్ హితులు మిత్రుల్ పు
త్రులోలిం దివా । భీతాభీతములై తనుంగొలువఁగాఁ బెన్మ్రాఁకమై వాయస ।
వ్రాతశ్రేష్ఠము గ్రాలు రేలువగలున్ భ్రాంతాగమాంతంబులన్ ॥ ౨౧౪ ॥ చ॥ అది
యొకనాఁడు విట్ఠలగృహాంగణభూబలి పీఠవర్తులౌ । మెదుకులు మేయఁ గన్గొడి య
మేయగతిన్ బలివన్ దదాయత । చ్ఛదభవభూరి మారుతవశంబున సర్వ్యోంధూళి
వోవన । భ్యుదితములయ్యెఁ దానగుడియాడ్చెనఁగల్గునగణ్యపుణ్యముల్ ॥ ౨౧౫ ॥ వ॥
ఇట్లతర్కితోపపన్నంబగు పన్నగశయన సదనసమ్మార్జన సముదిత సుకృతపరిపా
కంబునఁగాకంబు నతిలోకంబయ్యె వినుము ॥ ౨౧౬ ॥ క॥ కలహంస మొకటి
యమకుల । కులహంసముగుడిఁజరించుఁ గుసుమాయుధకీ । ర్తిలతాగుచ్ఛముకైవ
డి । జలరుహసంభవమరాళసంకాశగతిన్ ॥ ౨౧౭ ॥ వ॥ ఇట్లు వర్తించి వర్తించి ॥ ౨౧౮ ॥
మ॥ కుతుకంబింకక కుంకుమద్రవమిళద్గోరోచనాపంకని । ర్మితపత్రాంకకలంకితాం
బుధికుమారీహారివక్షోరుహ । ద్వితయాస్ఫాలనలాలనోచితపయోవిస్ఫారకాసా
రసం । తతి నానీడభవంబు క్రీడసలుపున్ దద్దివ్యధామంబునన్ ॥ ౨౧౯ ॥ సీ॥
మొనరెండుగాఁగఁద్రెవ్విన విద్రుమద్రుకందము నేలుముక్కునఁదనరితనవి । మొగ
విచ్చుపసిఁడి గేదఁగి ఱేకుగమి మించు విశదచ్ఛదములనువిద్రిచివిద్రిచి । నగు మొగంబు
లదాసనపుగ్రొవ్విరులనవ్వు చిగురాకునడుగులఁజిమ్మిచిమ్మి । నిద్దంపుఁబంపు వెన్నెల
గుత్తికడకొత్తి మలయుమైముంపులఁగలఁచికలఁచి । శార్ఙ్గి సౌధప్రఘాణకాసారసార
సారసామోదమేదురవారిఁదేలి । వచ్చియాయంచగుడిలోనఁజొచ్చెనొక్క । నాఁడుప
వలింటిబీఱెండవేఁడిఁదలఁకి ॥ ౨౨౦ ॥ క॥ అదితనదేహంబచ్చట । విదలింపంబతు

---

శ్రోతలు = తనతోడివినికి గలవారు. దివాభీతాభీతములు = గ్రుడ్లగూబలవలని భయములేనివి. భ్రాంతాగమ=రావిచెట్టుయొక్క ॥ ౨౧౪ ॥ బలిపీఠవర్తులు=బలిపీఠమునందుండునవి. అమేయ =కొలఁదిపెట్టరాని. ఛద= ఱెక్కలవలన॥ ౨౧౫॥ అతర్కితోపపన్నంబు=ఊహింపరానివిధము నఁగలిగినది. సమ్మార్జన సముదిత=ఊడ్చుటవలనఁబుట్టిన. అతిలోకంబు=లోకాతీతము॥ ౨౧౬॥ కలహంసము=ఉత్తమజాతిహంస; శ్రేష్ఠుఁడు. సంకాశ=పోలిన॥ ౨౧౭ ॥ ౨౧౮ ॥ ఇంకక= తగ్గక. పత్రాంక=మకరికాపత్రచిహ్నములచేత. కలంకిత= కలఁకముగలదిగాఁజేయఁబడిన. హారి =మనోజ్ఞమైన. ఆస్ఫాలన= చఱచుటలచేత. పయోవిస్ఫార = జలములచేత అతిశయించిన. నీడ భవంబు=పక్షి. తద్దివ్యధామంబునన్ = ఆదేవాలయమునందు. త్రెవ్విన=తెగిన. కందమున్= గడ్డను. మొగవిచ్చు=ముఖభాగము విరియునట్టి. విశద=స్వచ్ఛమైన. విద్రిచి=విదలించి. నిద్దంపు =నునుపైన—తేటయైన. మలయు=విజృంభించు. ముంపులన్= ముంచుటలచేత. ప్రఘాణ=మొగసాలయందలి. సారసామోదమేదురవారిన్ = తామరలవాసనవలన నతిశయించిన జలమునందు. పవలింటి= పగటివేళయందలి. బీఱెండ = మిక్కుటమయినయెండ. తలఁకి=భయపడి ॥ ౨౨౦ ॥ విపుషములచేన్=తుంపరలచేత. చొదుకు=తడి. పొదవెట్టు=కలుగఁజేయునట్టి. రజో

సలిలవిప్రుషములచేఁ । జొడకొదవించుచు గాడ్పులు । పొగవెట్టు రజోవికారములు దూరముగన్ ॥ ౨౨౧ ॥ తే ॥ సలిలఖగమున కేతదాచరణమునన । కలిగె నాకస్మికంబుగఁ గంబుపాణి । గర్భగేహోపలేపసంస్కారసార । సుకృతపరిపాకనిరపాయశోభనంబు ॥ ౨౨౨ ॥ క ॥ శుక ముకటి చంచుజితకిం। శుకమై హరిహయశరాసనసురుచిరవపుర౦ । శుకమై కుసుమాకరకిం। శుకమానందమున నందసుతుఁగుడిఁ జెరుగున్ ॥ ౨౨౩ ॥ చ ॥ అలమి త్రిలోకముల్ గెలుచు నత్తఱి తేరు వహించు దోడి చి । లుకలు దగ దొట్టి ముందరికి లాగకయుండినఁ దానతద్ధురం । బెలమి వహింప మెచ్చి మరుఁడిచ్చు మణీమయమాలికాత్రయిన్ । గళమునఁ దాల్చు చిత్రశుకనాథుఁడు రేఖల పేరనిచ్చలున్ ॥ ౨౨౪ ॥ క ॥ కీరమది యొక్క హరిపురి । చారికఁ జేరి కవసించుఁ జదివింపఁగ మే । పారసియొసఁగ భవనమా । ర్జారాదులవలనఁ దన్ను సంరక్షింపన్ ॥ ౨౨౫ ॥ క ॥ దేవాలయమునఁ గొన్నిని । జావాసమునందుఁ గొన్ని యహములు దగఁ బై । చేవదలక పాటించుచుఁ । బూవుంబలెఁ బువ్వుఁబోఁడిపులుఁగుం బ్రోచున్ ॥ ౨౨౬ ॥ మ ॥ పసపార్చుం దడి యొత్తు నెండసెకఁ గంపం బాఁగి మైదువ్వుచున్ । వసయున్ వెన్నయు మేపు మేపునొసఁగున్ వల్లించు శ్రీరామ నా । మసుధామాధురి సాధురీతి కుచకుంభస్థాయిగాఁ జేయుచున్ । బిసపుష్పప్రియవాస రాగములన్ బింబోష్ఠి రాచిల్కకున్ ॥ ౨౨౭ ॥ తే ॥ కనకమణిపంజరంబుల నునిచియునిచి । చక్కెరయును క్కెరయు సారె బ్రుక్కి క్రుక్కి । యొఱపుఁబలుకులు పలుమాఱుఁ గఱపి కఱపి । కలికి చిలుకలకొలికి రాచిలుకఁ బెనుచు ॥ ౨౨౮ ॥ మ ॥ కలహంసోపమయాన చక్రకుచ ప్రేంఖత్ఖంజరీటాక్షిఁ గో । కిలసాంరస్వర బర్హిబర్హచికురం గీరప్రియాలాపఁ దో । య్యాలిఁ జాలన్ మరిగెన్ శుకంబది మహీయ ప్రేమ గావించుచున్ । బులుఁగుం బొందుననందిపొందినగఁ జొత్తోత్తులన్ హత్తుచున్ ॥ ౨౨౯ ॥ తే ॥ ఆశుకద్విజరాజునకంతఁ గొంత । కాలమరుగంగ నాకనాడుఁ గలిగెబంధ । మోక్షమాకస్మికంబనిస్తుల్త్రికలిమి । యాశుకద్విజరాజున కద్భుతంబె ॥ ౨౩౦ ॥ సీ ॥ జనియించె నొక్కొక్క పచ్చని మొలకయ

---

వికారములు=దుమ్మునొక్క ప్రసరించుటలు ॥ ౨౨౧ ॥ ఉపలేపసంస్కార = అలుకుటవలని. సార=శ్రేష్ఠమైన. నిరపాయ=చెడని. శోభనంబు=శుభము ॥ ౨౨౨ ॥ చంచుజితకింశుకము=ముక్కుచే గెలువఁబడిన మోదుగు మొగ్గగలది. అంశుకము=కాంతులుకలది. కుసుమాకర = వసంతఋతువునందలి ॥ ౨౨౩ ॥ అలమి=ఆక్రమించి. దగ=దాహము=దప్పి. తొట్టి=కలిగి॥ ౨౨౪॥ ౨౨౫ ॥ అహములు=దినములు ॥ ౨౨౬ ॥ పసుపార్చున్=పసుపుపూసి స్నానము చేయించును. సెకన్=తాపముచేత. బిసపుష్పప్రియవాసరాగములన్ = గ్రీష్మఋతు దినములు రాకలయందు ॥ ౨౨౭ ॥ ౨౨౮ ॥ ప్రేంఖత్=ఎగురుచున్న. ఖంజరీటాక్షి= కాటుకపిట్టలవంటికన్నులుగలది. చికుర= ముంగురులుగలది. మహీయ= అధికమయిన. పొత్తోత్తులన్= పొత్తిగుడ్డలచే ఒత్తుటలచేత ॥ ౨౨౯॥ శుకద్విజరాజునకున్=చిలుకపక్షి శ్రేష్ఠమునకు. శుకుఁడనెడి బ్రాహ్మణశ్రేష్ఠునకు ॥ ౨౩౦ ॥ కొమరు=మనోజ్ఞత. పొడకట్టెన్=కనఁబడెను. ఇంద్రశిల=నీలమణుల

సుబుద్ధి గ్రుచ్చినపచ్చలకొమరువలన । సమహారైనొక్కొ దాడిమఫలోద్భవబీజము
క్తిపద్మరాగసామగ్రివలనఁ । బొడకట్టెనొక్కొ జంబూఫలంబనుమనోభ్రమ మిం
ద్రనీలవిభ్రమమువలనఁ । దోఁతెంచెనొక్కొ మధూకపుష్పములను నాసహుర్మం
జిముత్యములవలన । దాదియటుపెట్టి పసుపాడఁదలఁగిచనుఁడు । బరణిమూఁకట
నెలకొన్నబన్నసరము । గఱచికొనిపోయెఁజిలుక ప్రగల్భవిటుఁడు । బాలికామా
నసముగొనుపగిదినపుడు ॥ ౨౩౧ ॥ క ॥ బారాదిసొమ్ములుండఁగ । హారము నేకొ
నుచుఁజనియె నండజముప్రియం । బారయఫలకాముకులగు । వారలుగుణవత్ప్రస
క్తివదలవిడుతురే ॥ ౨౩౨ క ॥ అధవళకిరణముఖికిన । సాధుశుకాచరణమపుడస
హ్యంబయ్యెన్ । గోధుక్కృశసతికిమనో । బాధకముగుకృష్ణధూర్తబాల్యముఁబో
లెన్ ॥ ౨౩౩ ॥ మ ॥ కటిఁజేలార్ధముచుట్టిచిక్కనదిమేసంజుట్టిపాలిండ్లమీఁ దటసం
ధించుచునార్ద్రదేహలతమాద్యద్వర్షధారావల । త్తతిదాకారముఁజూపఁదోఁచిసికొ
నుచున్ ధమ్మిల్లబంధంబుమున్ । గిటికిన్ సుస్తనివచ్చెగోస్తనహరత్కీరగ్రహవ్యగ్ర
యై ॥ ౨౩౪ ॥ తే ॥ వర్షధారావశేషాన్వవాయయుక్తి । వాయువశమునఁదెరలు
మువ్వన్నెవిల్లు । వేడ్క వెన్నాడుశశివోలె వెలఁదిచాపలమునసరమాహరించుశుకము
దవులుచు ॥ ౨౩౫ ॥ మ ॥ గుహమాతృస్ఫటికాత్మ సూత్రముసితేక్షుచ్ఛేదగుచ్ఛచ్ఛ
టా । స్పృహఁ జైకొన్నశుకంబొ యేమఱుతఱిన్ జీరాడుపూవాఁగితో । బహిరు
డ్డీనతనొడ్డినిల్చురతిరాట్పట్టాశ్వమోనాఁగన । న్మహిళావిభ్రమకీరమొప్పుముఖసీ
మాగామిముక్తాళియై ॥ ౨౩౬ ॥ వ ॥ ఈచందంబునఁ గందర్పస్యందనంబువినిందితుం

---

రొుక్క. తోఁతెంచెను=తోఁచెను. హుర్మంజి=ఒకానొకదేశము. తలఁగి=తొలఁగి. మూఁకటన్=మూఁతయందు. నెలకొన్న=ఉన్న. బన్నసరము= రత్నములహారము. ప్రగల్భ= నేర్పరియైన॥ ౨౩౧॥ బారాది=అనేకములైన ॥ ౨౩౨ ॥ ధవళకిరణముఖి=చంద్రునివంటి మొగముగలది. అసాధు=చెడ్డ. ఆచరణము=పని. గోధుక్కృశసతికిన్=గోపికాస్త్రీకి ॥ ౨౩౩ ॥ కటిన్= నడుమునందు. చేలార్ధము=సగముకోక. ఆర్ద్రదేహలత=తడిసినతీఁగవంటిదేహము. మాద్యద్వర్షధారావలత్తతిదాకారమున్ = దట్టమయినవానచినుకులచేత చుట్టఁబడినమెఱుపుయొక్క ఆకారమును. ధమ్మిల్లబంధంబు=కొప్పుముడి. ఘుంగిటికిన్=ఇంటిమొగసాలకు. గోస్తన...వ్యగ్ర—గోస్తన=రత్నములహారమును. హరత్=ఎత్తుకొనిపోవుచున్న. కీర=చిలుకను. గ్రహ=పట్టుటయందు. వ్యగ్ర=త్వరగలది ॥ ౨౩౪ ॥ అవశేష=మిగిలిన. అన్వయయుక్తిన్=సమూహముయొక్క కూడికచేత. తెరలు=బయలువెడలు. మువ్వన్నెవిల్లు=ఇంద్రధనుస్సును. వెన్నాడు=వెంబడించు. తవులుచున్=వెంబడించుచు ॥ ౨౩౫ ॥ గుహమాతృ=పార్వతియొక్క. సితేక్షుచ్ఛేదగుచ్ఛచ్ఛటాస్పృహన్=తెల్లచెఱకుతునుకలగుదెలయొక్క సమూహమునందలి యాపేక్షచేత. బహిరుడ్డీనతన్= బయటఎగురునట్టి స్వభావముతో. ఒడ్డి=అడ్డగించి. రతిరాట్పట్టాశ్వము = మన్మథునిపట్టపుగుఱ్ఱము. అమ్మహిళావిభ్రమకీరము= ఆ యాఁడువారివినోదపుఁజిలుక. ముఖసీమాగామిముక్తాళి= ముక్కునందుతగులుకొన్న ముత్యాలసరముగలది ॥ ౨౩౬ ॥ కందర్పస్యందనంబు=చిలుక. వినిందితుం

జన మందమందప్రచారంబును మలిమ్లుచుండన దుర్గమప్రవేశనిపుణంబును నవివేకి
యన శిథిలీకృత స్వపక్షంబును దనుజగృహీతజనకజయున రామానుసరణ సముచి
తంబును నై యున్మత్తుపోలికం జంచుచుంబితలలంతికావ్యాజంబున లాలగ్రక్కుచుఁ
బుష్పవద్బింబంబు పథంబున శరీరప్రభాదంభంబున నంభోధరంబులచేతఁ గప్పంబ
డుచు యోగి బాగున విచ్ఛిన్నచరణశృంఖలాచ్ఛలనంబున పాశచ్ఛేదంబు సేయుచుఁ బ
రవధూపయోధరంబు పగిదిఁబట్టరాక నీతివిదుహృదయంబుగతిదూరదర్శనయోగ్యం
బై కరువలిమురువునం బొడమి యడంగుచుఁ బరబ్రహ్మంబుచాడ్పున నగోచరంబ
య్యును దదీయమాయావిలసితంబునునై సకలంబును నిజప్రతిభాసంబున యాథా
ర్థ్యభూమికనభినయించుచు శశాంకశిలా సౌధవిటంకంబుల నునుకువగొన్నతటిశ
రన్నీరదవశంవదంబగు శునాసీరశిలాశకలంబన మెలంగుచు నంతరిక్ష మహాప్లక్షం
బునకు నక్షౌమచుంచు పుట ప్రవాళఖండ ప్రభాహిండనంబునం దొరలి సఫలవిట
పలక్ష్మీనావహించుచుఁ బ్రమాదవిగళితంబగు నగవిరోధికొలువు వీవనయచ్చరలప
చ్చల కడియంబువడువున నిరాలంబన స్థలంబునం బలుమఱు చక్రచంక్రమణ చమ
త్కారంబుచూపుచు సమీపారామశ్యామల పలాశపటలగర్భంబునందు ముకుంద
విగ్రహంబునందు భక్తిసమగ్రుండగు పురుషశ్రేష్ఠుండునుంబోలె నేర్పుఱుపరాకడిం
దుచు నందందఁ జాలిపులుఁగులు మనుజగంధధురంధరంబగుటకుఁ జగడంబుదిగిచినంగినిసి

---

డు=మిక్కిలినిందింపఁబడినవాఁడు. మలిమ్లుచుండు=దొంగ. దుర్గమ=పోనువల్లపడనితావును. శిథిలీకృత=సడలింపఁబడిన. స్వపక్షంబు=తన ఱెక్కలుగలది; తనవారుగలది. రామానుసరణ=స్త్రీయొక్క అనుసరించుటకు; శ్రీరాముని ననుసరించుటకు. లలంతికా=హారము. లాల=చొంగ. పుష్పవద్బింబంబు=సూర్యచంద్రులమండలము. బాగునన్=విధమున. విచ్ఛిన్నచరణశృంఖలాచ్ఛలనంబునన్ = తెగిన కాలిగొలుసుల కారణముచేత; కట్టివేసిన కాలిగొలుసులు వీడిపోయినందున. పాశచ్ఛేదంబు=త్రాటినిత్రెంచుట; ఆశలను త్రెంచుట. పయోధరము=స్తనము. దూరదర్శనయోగ్యంబు = దూరమునందుండి చూచుటకుఁ దగినది; దీర్ఘాలోచన చేయుటకుఁ దగినది. కరువలిమురువునన్=గాలిరీతిని. పొడమి=పుట్టి. చాడ్పునన్=విధమున. అగోచరము=కానరానిది; ఇంద్రియములకు విషయముకానిది. మాయ=మోసము; ప్రకృతి. ప్రతిభాసము=నీడ; తోఁపిక. భూమిక=వేషము. విటంకంబులన్=మంజూరునందలి గూండ్లయందు. ఉనుకువ=ఉనికి. శరన్నీరదవశంవదంబు=శరత్కాలమేఘము నందణఁగినది. శునాసీరశిలాశకలంబు=ఇంద్రనీలమణిఖండము. ప్లక్షంబునకున్ = జువ్విచెట్టునకు. అక్షౌమచంచుపుటప్రవాళఖండప్రభాహిండనంబునన్= తెల్లఁబాటులేని ముక్కుపుటము అనెడి పగడపుపలుకు కాంతియొక్క వ్యాపనముతోడ. దొరలిన=కలసిన. ఫలవిటపలక్ష్మీన్=పండ్లతోడికొమ్మకలిమిని. విగళితంబు=జాఱినది. నగవిరోధి= ఇంద్రుని. వీవన=విసనకఱ్ఱలుగల. వడువునన్=విధమున. నిరాలంబన=నిలువనాధారములేని. చంక్రమణ=దాఁటునట్టి. శ్యామలపలాశపటలగర్భంబునందున్=నలుపుదేఱుచున్న పచ్చనియాకుల జొంపముయొక్క లోపలిభాగమునందు. డిందుచున్ = అణఁగుచు. అందంద=

విస్ఫుమరతనూరుహదంతుర కపోలాంతరంబును విఘూర్ణనవికృతవీక్షణంబునై తీక్ష్ణంబుమణివలయ వలయితంబగు రతియువతిముం జేతి రీతం జెలువడరు మెడ నిగిడించి మగుడంబడి కాకుప్రకార వికారస్వరంబున వానిని రాకరించుచుం బలుచునప్పలుచుం జిలుకం గరంగినయది వోలె నయ్యన్ను వెన్నాడం బెన్నాటకంబై పోటికత్తియ లుత్తుంగ కుచోత్సంగ సంగతకురంగలాంఛన కళావలోకనంబున ముసముసినగవులు నెఱయ గోరువంక గాన వచ్చెంగాని కీరంబు దూరంబయ్యెం గదే యనిగర్భోక్తివైదర్భిం గూడి యాడుచుం బాడుచు పంజరంబును జిలుకచాలు తెరయ్య నుచేరికచేసి యెలయిం పనలయించుచు నడితెక్క క్రిక్కిఱటించుచు నొక్కయెడం గాలు ద్రొక్కిడిచి ముక్కు నక్కం దహార తరళంబు నొక్కుచుం జిక్కంజిక్క నిక్కనిక్క డనక్కయక్కయని చేటి కానికరంబు బొలసిన పులుంగె తెంగి మెఱుంగు మెఱసి త్రొలంగిన తెఱంగున డా యవచ్చినట్టుల మాయంబగు మాయలేటి పాటిం బోవంబోవ దూరంబగుచునుండు వెండమావుల మాడ్కి దివియనచ్చట నటించి మువ్వలోని రాయిసోయగంబున నొక్కింత వడిపట్టువడుట పచరించి ప్రచురరయంబున ఖచరపురప్రాసాదంబులు మోవంబూంపున నెగసి తిరిగి పెఱ తెరువు నంబఱ తెంచి పాండురంగాయతనంబు మధ్యరంగంబు చొచ్చి యచ్చట నిచ్చం దనయిచ్చనుండు దండియంబు పైప్రవాలనిచ్చట ॥ ౨౩౬ ॥ సీ ॥ మదఘూర్ణ దురుసంకుమదమలీమసకుచ ద్వీపము హాయోద్ధతిం గానుం దీంగను లియు । ఘనసారపుంద్రకగ్లౌబింబనికటఘర్మహిమాంప్తి మోముదామర చలింప । నాసికానూత్న గంధఫలియూరుపుం దావి నధరదంతపదముత్తాళి విరియం । గింకిణీక్వణనశంకితగర్జితస్రస్తకాంచి చంచలగతి యంచ జడియ । బంధనిర్ముక్తశుకసక్తభావయగుచు । నలపరాశరసుతు చందమధిగమించు । మించుననం బోండ్లిచందంబు మేలుకనిన । వాండ్లు తలపోయుగలలోని వార్తయయ్యె ॥ ౨౩౭ ॥ తే ॥ కక్క

---

ఘటీమతి, విస్ఫుమరతనూరుహదంతురకపోలాంతరంబు=ప్రసరించుస్వభావముగల (నిక్కుచున్న, మేనివెంట్రుకలచేత మిట్టపల్లములగునట్టిచెక్కిటిప్రదేశములుగలది. విఘూర్ణన=తిరుగుడుపడుచున్న. చెలువడరు= అందగించు. పలుచు=పలువ=చెక్క. అన్ను=స్త్రీ. వెన్నాడన్= వెంబడింపంగా. పెన్నాటకంబు=పెద్దయాట. ఉత్సంగ=మీందిభాగమునందు. గోరువంక= ఒకపక్షి; నఖక్షతము. గర్భోక్తివైదర్భిన్=అర్థాంతరముతోంచునట్టిమాటలరీతిని. ఎలయింపన్=దగ్గఱకుగప్పింప, తరళంబు=నాయకమణి. పులుంగు=జాడ. పాటిన్=విధమున. తివియన్= తీయ, మువ్వ=పెద్దగజ్జె. సోయగంబునన్=విధమున. పచరించి= నటించి. ప్రచుర=అధికమయిన. మోవన్=తాంకునట్లు. పూంపునన్=పూనికతో. ఆయతన=దేవళము॥ ౨౩౬॥ఘూర్ణత్=తిరుగుడుపడుచున్న. మలీమస=మాపిన. సులియన్=చలింపంగా. పుండ్రక=బొట్టుచేత. గ్లౌబింబ= చంద్రబింబముయొక్క. గంధఫలి=సంపెంగ. దంతపద = పలునొక్కు. స్రస్త = జాఱిన. జడియన్=బెదరంగా. శుకసక్త = చిలుకయందంటిన; శుకునియందంటిన. అధిగమించు = పొందు ॥

సపువంక గోరులఁ ద్రొక్కి త్రొక్కి । కఱకుముక్కునఁ దందడగఱచికఱచి। ఘ్రాసయొ
కటియుఁబోఁగుఁ బొందనీక । చెఱిపెము త్యాలపేరు విచ్చికపుఁబులుఁగు ॥ ౨౩౯ ॥
క ॥ బహువిధరచనోజ్జ్వలమగు। మహిళామణిమణిసరంబుమణులన్నియును। య్యా
హిశయనుసదనశరధికి । నహీనరత్నాకరత్వమును సంధించెన్ ॥ ౨౪౦ ॥ క॥ శుకమున
కొదవెనయత్న । ప్రకటితమణిరంగవల్లి పరికల్పనకో । రకితసుకృతానుకృతిద్వా। ని
కిమెచ్చెన్ బౌండరీకనిలయుండాత్మన్ ॥ ౨౪౧ ॥ క ॥ గిరికానుషక్తబుద్ధిను । పరిచ
రునింబోలునొక్కపన్నగముకనా । డురవడి నెచ్చటనుండియొ । మురమర్దనుదివ్యభ
వనమునకే తెంచెన్ ॥ ౨౪౨ ॥ వ ॥ ఆసమయంబున ॥ ౨౪౩ ॥ క ॥ యమదండచం
డమగుభుజ । గమునకు వెఱచఱచియాఖుకన్యకకమలా। రమణాంఘ్రిఁజేరెగురుభీ ।
తమతికినాముక్తమాల్యదకునెనయగుచున్ ॥ ౨౪౪ ॥ క ॥ హరిపదపీఠస్థితిగల । స
రియనుచిట్టెలుకదాఁగె సంవర్తహతిన్। దెరలివృకండూద్భవుఁడా। తురతఁ దజ్జఠరపే
టిఁదూఱినభాతిన్ ॥ ౨౪౫ ॥ ఆ ॥ వీడిపడిన గాజుపదకంగవెదకంగఁ । బద్మరాగ
మొదవుపగిదినహికి । దొరకె నెలుకదూఱితొలఁగినతఱిరమా । కమనచరణకైతక
ప్రసవము ॥ ౨౪౬ ॥ చ ॥ చరణసరోరుహప్రసవశైవలినీనివసద్బిసాంకురా । హ
రణమనీషఁజేరినబిసాశనశాబమునాఁగబొల్చుసా । గరశయపూజనాచరణకైత
కకోరకమున్ భజించెను । త్కరవరకంకణంబుమిహికాఘృణిరాహువుగప్పునొప్పు
నన్ ॥ ౨౪౭ ॥ తే ॥ మధురమదిరారసామోదమైత్రినలరు । పొలఁతినెమ్మోమువ
లపానుభోగిఁబోలె । హరిపదాబ్జమధూళిమయంబుఁగ్రోలె । జాతిగేదంగితావిభు
జంగభర్త ॥ ౨౪౮ ॥ క ॥ అలరునలరుచిరమత్కం । డలముపయిన్ నిలిపెసవ్యన
ఖరపదముపై । నలరునిజకంటకక్షత । విలసనమునువిటునిమేన వేశ్యయుఁబోలెన్॥
౨౪౯ ॥ సీ ॥ సరసిజాక్షకల్యాణసమయార్హజతులక్ష్మి గలిగించుఁబడనఖాగ్రమునఁద
విలి।తళుకొత్తు మిన్నేటితెలినీటిదెమలునముదురుచెందొవచాలు మొలవఁబెట్టు । సీ
మంతసీమాంతసిందూరరుచిఁజేయు ముక్కిలేవనిచతుశ్శ్రుతిసతులకుఁ। బీఠరూపం

౨౩౮॥ కక్కసపు=కఠినమైన. విచ్చికపు=దుష్టమైన ॥ ౨౩౯॥ శరధికిన్=సముద్రమునకు॥ ౨౪౦॥
కోరకిత= మొలకలెత్తిన ॥ ౨౪౧ ॥ గిరికానుషక్త= చిట్టెలుకయందాసక్తమయిన; గిరికాదేవి
యందాసక్తమైన ॥ ౨౪౨ ॥ ౨౪౩ ॥ చండము=భయంకరము. ఆఖుకన్యక=ఎలుకపిల్లను ॥
౨౪౪ ॥ సరియన్=సందునందు. సంవర్తహతిన్=ప్రళయకాలపుదెబ్బచేత ॥ ౨౪౫ ॥ రమాక
మన=విష్ణుదేవునియొక్క. కైతకప్రసవము=గేదంగిపువ్వు॥ ౨౪౬ ॥ బిసాశనశాబము = హంస
పిల్ల. కోరకమున్ = మొగ్గను. మిహికాఘృణిన్ = మంచువెలుఁగును= చంద్రుని ॥ ౨౪౭॥
మదిర=మద్యము. వలపు=వాసన. ఆను= త్రాగు. మధూళి=మధువు= తేనె. భుజంగభర్త=
పాములరాజు; విటశ్రేష్ఠుఁడు ॥ ౨౪౮ ॥ రుచిర = ప్రకాశించునట్టి ॥ ౨౪౯ ॥ జతులక్ష్మిన్=
జత్తుకకలిమిని. తెమలునన్ = చలనమునందు. చెందొవ = ఎఱ్ఱగలువ. సీమంత సీమాంత=

బునఁబెట్టిన శేషునిఫణరత్నఘృణులకుఁ బ్రాఁకువెట్టు। కైటభాంతకపూజనాకైతకి బ్ర। సవనవామోదపారణాసౌఖ్యముదిత। భుజగరాజస్ఫటాభోగభూరిమణిస మాజరాజత్ప్రభాపుంజమంజిమములు ॥ ౨౫౦ ॥ క ॥ వ్యాపించుతిమిరహారమై। దీపించునిజోత్తమాంగదివ్యమణిరుచిన్। దీపావళిహరికిచ్చుచు। నాపుణ్యఫలానుభవమ్మునయ్యహిగనియెన్ ॥ ౨౫౧ ॥ క ॥ ఆతటినాకకందువన। వాతాశనశయను కేళివనవసుమతినుం। జేతెంచెన్ సరఘాసం। ఘాతముతమ పెరకుఁగడువిఘాతంబగుటన్ ॥ ౨౫౨ ॥ క ॥ కాయద్యుతిజిడ్డుకొనఁగ। నాయీఁగల మొత్తమాశ్రితాఖిలదిశమై। యాయెడఁ దైలతటాక। న్యాయంబొనరించె జలధరాధ్వంబునకున్ ॥ ౨౫౩ ॥ శా ॥ ఆమండోద్భవబీజషండ రుచిసయ్యాటించుచున్ మక్షికా। స్తోమంబాతతపక్షగుచ్ఛమగుచున్ దోతేరగా శ్మశ్రులం। బై మిన్నొప్పుతదంగసంగతిమధువ్యామోహముం జేయుదో। డ్తోమర్త్యాలికిఁ దద్విహారకలిత ద్రుస్కంధవీరుచ్ఛిఖల్ ॥ ౨౫౪ ॥ క ॥ ఆమధుమక్షికలటఁజని। దామోదరమందిరాగ్రతలగతనిర్మా। ల్యామోదామేదురమధు। ప్రేమాకులబుద్ధిమైఁజరింపఁగనంతన్ ॥ ౨౫౫ ॥ అందునొకసరఘ గ్రోలెము। కుందపచార్ఘ్యాంబుబిందుగుంభితసుమనో। మందమకరందశీకర। ముందీర్థస్వార్థముల్ సమున్నతివెలయన్ ॥ ౨౫౬ ॥ క ॥ కలిగెమధుమక్షికమునకుఁ। దలఁపనితలఁపన్మదాదిధార్యముగంగా। జలవలమానముయదుకుల। తిలకాంఘ్రిసరోజదివ్యతీర్థముగ్రోలెన్ ॥ ౨౫౭ ॥ తే ॥ దానసంభవించెఁ జేనియ యీఁగకు। సోమపానరతుల సుకృతఫలము। భాగ్యమొదవె నేని బ్రాపించుతనుఁదాన। పుణ్యలక్ష్మినిధియుఁబోలెఁబురుషు ॥ ౨౫౮ ॥ సీ ॥ జనియించె నేసాధ్వి జాతిస్మరత్వసంపదకల్మి నిజకులాభరణమగుచు। వర్తించె నేపతివ్రత తాటిమీఁదటి తపమైనతనువునఁ

---

పాపటకొనయందలి. ప్రాఁకు= (తీఁగలకుఁబెట్టునట్టి) యల్లుడుకఱ్ఱ. పారణ=ఒకప్రొద్దున్నదినమునకుమఱునాటిభోజనము—ఇక్కడభోజనమనియర్థము. స్ఫటా= పడగయొక్క. ఆభోగ=విశాలప్రదేశమునందలి. రాజత్=ప్రకాశించుచున్న. మంజిమములు=మనోజ్ఞతలు ॥ ౨౫౦ ॥ దీపించు=వెలుఁగునట్టి. ఉత్తమాంగ= తలయందలి. రుచిన్=ప్రకాశముచేత. దీపావళిన్=దీపములవరుసను ॥ ౨౫౧ ॥ కందువన్= సమయమునందు. వాతాశనశయను = శేషశాయియొక్క. సరఘాసంఘాతము=తేనెటీఁగలగుంపు. పెరకున్=తేనెతెట్టెకు ॥ ౨౫౨॥ జిడ్డుకొను=మెఱుఁగుదేఱు. ఆశ్రితాఖిలదిశము = ఆశ్రయింపఁబడినయెల్లదిశలు గలది. జలధరాధ్వము= ఆకాశము॥ ౨౫౩ ॥ ఆమండోద్భవబీజషండరుచిన్=ఆముదాలరాశివిధమును. సయ్యాటించు= పరిహాసించు. తోతేరఁగాన్=తోఁచఁగా. శ్మశ్రులము= గడ్డమీసములుగలది. ద్రుస్కంధవీరుచ్ఛిఖలు= చెట్లమొదళ్లయందలిచిగురుఁగొమ్మలకొనలు ॥ ౨౫౪ ॥ ౨౫౫ ॥ సరఘ= తేనెటీఁగ. గుంభిత= కూర్పఁబడిన॥ ౨౫౬॥ ధార్యము=ధరింపఁదగినది. వలమానము=కదలుచున్నది. గ్రోలెన్=త్రాగెను ॥ ౨౫౭ ॥ ౨౫౮ ॥ జాతిస్మరత్వసంపదకల్మిన్ = పూర్వజన్మజ్ఞానముకలిమికలుగుటచేత.

డాల్మిమిగిలి । నెలకొల్పె వేయపాంసుల మానసమునందుఁ బరమవైష్ణవధర్మపా
టవంబు । మెప్పించె నేసతియప్పౌండరీకతీర్థవిభునిష్టాన్నవిశ్రాణనమున । నాసుశీల
కునకాఁకహంసచిత్ర । శుకభుజంగమసరఘులునురథసులభ । సుముఖసువ్రతసుకృ
తినామకులువరుసఁ । డాల్చిజనియించెశుక్తిముత్యాలువోలె ॥ ౨౫౯ ॥ క ॥ భూ
లేఖకుల్లులకేయే । కాలంబుననెట్టి యెట్టికర్మ మొనర్పం । బోలుందత్తత్కృత్యము ।
లోలింబిత్రృకృత్యములయి గుణోన్నతిఁబెనుపన్ ॥ ౨౬౦ ॥ శా ॥ శాణోత్తేజితర
త్నలక్ష్మి గురుశిఖావతికాశోరాకృతిన్ । రేణుక్షాళనశౌరిమూర్తి కలభశ్రీదోహ
దోదన్నవ । ద్రోణీజప్రభముక్తకంచుక ఫణిస్ఫూర్తిన్ సుధీబాంధవ । శ్రేణీప్రీణ
నకారణోజ్జ్వల కళోత్సేకాఢ్యులై రేవురున్ ॥ ౨౬౧ ॥ చ ॥ ఒకఁడునిరూఢకృష్ణ
రుచియొకఁడు నిర్మలమానసప్రియుం । డొకఁడుప్రయత్నయోగ్యఫలుఁడొకఁడ
నాదృతబంధకంచుకుం । డొకఁడురసానుకూలమతియుక్తుఁడునైవిలసిల్లిరంతవు । త్ర
కులఁటవెట్టివారలకుఁదప్పనెతొల్లిటిజన్మవాసనల్ ॥ ౨౬౨ ॥ ఉ ॥ లౌకికవైదికాచ
రణాలాలసులైహరిభక్తినుత్తమ । శ్లోకులువీరనందగిరిసూనృతలక్ష్మికిఁబట్టుగొమ్మలై ।
యేకడసర్వభూతదయయే తమసొమ్ముగదీనమానస । వ్యాకులతాపనోదనధనా
ఢ్యులనన్విలసిల్లిరేవురున్ ॥ ౨౬౩ ॥ క ॥ అత్త్రోలుగొలమలరులసర । మెత్తినక్రియఁ
జాలుపొంగునెసవికసితమా । నెత్తమ్మికొలనిచెలువునఁ । దత్తత్సౌభాగ్యములను
దాత్తంబయ్యెన్ ॥ ౨౬౪ ॥ ఉ ॥ కేసరిశాబశోభిగృహకర్తయభానుమదంశవిస్ఫు
ర । ద్వాసరలక్ష్మివైభవమువాగిధిలగ్నసమగ్రవేలయు । ల్లాసముదాల్చియొప్పెమ
హీళాతిలకంబుపతిప్రసాదవి । న్యాసముచేతఁ జేకుఱినసందను లేవురు నందమందఁ

---

అపాంసుల=అంకుటాలు కానిది—పతివ్రత. విశ్రాణనమునన్ = ఈవిచేత ॥ ౨౫౯ ॥ భూలేఖకు
లులకున్=బ్రాహ్మకులముగలవారికి ॥ ౨౬౦ ॥ శాణోత్తేజిత = సానయందు మెఱుఁగియ్యఁబడిన.
ముక్తకంచుక=కుబుసము విడిచిన. ప్రీణన=తృప్తినొందించుటకు. ఉత్సేకాఢ్యులు=అతిశయముగ
లవారు ॥ ౨౬౧ ॥ కృష్ణరుచి= నల్లని కాంతిగలవాఁడు; కృష్ణునిఁబోలినవాఁడు. నిర్మలమానసప్రి
యుండు= నిర్మలమయినమానస సరస్సునందుఁబ్రియముగలవాఁడు; నిర్మలమయినమనసుగలవారి
కిఁబ్రియుఁడు. ప్రయత్నయోగ్య ఫలుఁడు = ప్రయత్నమునకుఁ దగిన పండు గలవాఁడు; ప్ర
యత్నమునకుఁదగిన ప్రయోజనముగలవాఁడు. అనాదృతబంధకంచుకుఁడు = ఆదరింపఁబడనికట్టి
యినకుబుసము గలవాఁడు; ఆదరింపఁబడని సంసారబంధమనెడి కవచముగలవాఁడు. రసాను
కూల=రసమునకు అనుకూలమయిన; భూమికి (లోకమునకు) అనుకూలమయిన॥ ౨౬౨ ॥ పట్టు
గొమ్మలు= ఆధారములు. అపనోదన = తొలఁగించుటయనెడి ॥ ౨౬౩ ॥ అత్త్రోలుగొలము=
ఆబ్రాహ్మణవంశము. ఎసన్=అతిశయముతో. చెలువునన్=అందముతో. ఉదాత్తము=హెచ్చిన
ది ॥ ౨౬౪ ॥ కేసరిశాబశోభి=సింహపుపిల్లవలె (స్వచ్ఛముగా) ప్రకాశించునట్టి. భానుమదంశు
విస్ఫురద్వాసరలక్ష్మి=సూర్యప్రకాశముచేత వెలుఁగునట్టిపగటి సంపద. లగ్న=అంటిన. విన్యా

గన్ ॥ ౨౬౫ ॥ తే ॥ అఖిలకల్యాణగుణశీలయాసుశీల । పెట్టెఁ జేసేఁదుగానెల్ల చుట్టములకు । భర్తతోఁగూడముత్తాతపండుదినియు । నెత్తైమున్మన్మగుజ్జులనెండఁ దేసి ॥ ౨౬౬ ॥ ఉ ॥ ఆనలినాయతాక్షి ప్రసవాపగమంబునఁబండఁబాలుచున్ । బ్రాణవిభూపలాలనము పాయకుండఁగొయ్యఁగనిచ్చిమన్మసం । తానమొనర్చుపోయి నిజగర్దైన్యము నాఁగ నతీతవర్షను । ద్యానతరౌషధీప్రవహదంబు సమీపసిరూఢిఁబోలదే ॥ ౨౬౭ ॥
క ॥ సకలాగమజ్ఞయగువి । ప్రకులాంగనయొక్కనాడుపలుకునిజకుమా । రకులఁగని మునుమిదాలస । శుకతుల్యులఁగూర్మియాత్మజులఁబలుక్రియన్ ॥ ౨౬౮ ॥ మ ॥ అనుభూతాఖిలభోగపోషిత సమస్తార్యంకృతానేకకాం । చనముఖ్యోచితదానదృష్టిగతయుష్మత్త్రేమజీవత్పతిన్ । జనతామాన్యనశీతివృద్ధనను నీసంసారదుర్వారబం । ధనసిగ్బంధమునంమఁబాపుటకుయత్నంబింకఁజేయందగున్ ॥ ౨౬౯ ॥ క ॥ సభవజ్జనకంబుగఁజని । ప్రభవజ్జగదండషండపరిపూర్ణతనున్ । శుభదాయిఁబౌండరీక । ప్రభునారాధించికాంతుఁబరమపదంబున్ ॥ ౨౭౦ ॥ క ॥ ఒకబుద్ధివినుండొండొ । డకసకలాగమమతంబుదక్కఁదెలిసిమీ । కకుటిలమతినెఱిఁగింతుజ । నకసనకశుకాదులెఱిఁగిన తెరువుఁదెలియన్ ॥ ౨౭౧ ॥ సీ ॥ అమితభోగాయతనముదేహమనసత్వముగ్రకృత్యములేల యుడిగియుండు । ధాతుమయంబు గాత్రమనుధాత్రీధరంబదియేలరాగంబు నవులఁదోయు । నిచితనానాగుణప్రచురమీతనువనుఫలమేలచిరుఁగకపదిలమొందు । నూర్మిపరంపరాయుతమంగవసువార్ధియేజీవనభ్రాంతియేలయడుగు । నార్జవంబుచాలదతికఠినాశయ । మెపుడుమైలవిడువదెండుఁజివుకుఁ । బటికిడొక్క దీనిఁబాటింపరెప్పాట । లఱయేనియును ముముక్షుజనులు ॥ ౨౭౨ ॥ ఉ ॥ మాయయుజీవుఁడుం బెరసిమైత్రియొకానొకఁడాచరించుచుం । బాయకయాఁడుఁబొటుమగపాటువడన్ వివిధత్వమొందిప । ల్చాయలఁబొంచబౌతకపుఁబైరుదయించితలిర్పప్రమో

---

సము=ఉంచుట. చేకఱిన=కలిగిన ॥ ౨౬౫ ॥ మున్మన్మగుజ్జులన్= మనుమలకు కొడుకులైనబిడ్డలను. ముత్తాతపండుదినియెన్ = ముత్తైపువతనమువలని ఫలమునుఅనుభవించెను. ఎండఁదేసిన్= ఎండఁదేసిన్=అనేకులను ॥ ౨౬౬ ॥ ప్రసవాపగమంబునన్=కానుపులయుడిగిపోవుటచేత; పూవులుడిపోవుటచేత. ప్రోది=రక్షణము. ఆఁగన్= త్రోసివేయఁగా ॥ ౨౬౭ ॥ ౨౬౮ ॥ అనుభూత=అనుభవింపఁబడిన ఆర్యంకృత=యోగ్యముగాఁజేయఁబడిన. ముఖ్య=మొదలగు. దృష్టిగతన్=చూపునుబొందినదానిని. అశీతివృద్ధన్=ఎనుబదియేండ్లముసలిదానిని ॥ ౨౬౯ ॥ సభవజ్జనకంబుగన్=మీతండ్రితోఁగూడ. ప్రభవత్=పుట్టుచున్న ॥ ౨౭౦ ॥ ౨౭౧ ॥ ఆయతనము=ఇల్లు. రాగంబున్= అనురాగమును; ఎఱుపువన్నెను. నిచిత=వ్యాపింపఁజేయఁబడిన. చిరుఁగక=చినుఁగక. ఊర్మి=తరఁగము; అల. జీవనభ్రాంతి = బ్రదుకనందలిభ్రమ; నీటివలనితిరుగుడు ॥ ఆశయము=లోటు ॥ ౨౭౨ ॥ బెరసి= చేరి. కడంగరీయములు= తాలుగడ్డిమేయునట్టియెద్దులు.

డుగా । మేయుఁ జరామయవ్యసనమృత్యునియుక్తకడంగరీయముల్ ॥ ౨౭౩ ॥ శా ॥ అంతర్వాణికుశేశయద్యుమణిఁ బద్మాక్షుఁ గృష్ణున్ మదిన్ నిల్పి దు। ర్దాంతానంతభవాంధకూపతరణప్రార్థిన్ దృఢస్థేమఁ బా । టింతుర్ పెద్దలు తద్ధనమ్మినుయిదాఁటే వానికిన్ జింత యా । కంత్తైనం గడమేనియుంగడమగా దాయంచు నూహించుచున్ ॥ ౨౭౪ ॥ క ॥ తల ముచ్చుట్టులు దిరిగిన । తలపోయఁగ నోరి లోని దయ కడియన్న । ట్లిల నే తెఱఁగు లేఁ దిరిగినఁ । గలుగదు గతివిష్ణుసేవ గావింపకయున్ ॥ ౨౭౫ ॥ మ ॥ పురుషశ్రేష్ఠులు గొందఱాత్మచరితంబుల్ జ్ఞానవైరాగ్యభా । స్వరముల్ గాఃహరించుచున్ గురుకృపాసంఘన్నుతై సాధనాం । తరమంత్రాంతరదేవతాంతరములందరిఁ గాంచి క్రీడోదక । స్ఫురణం బొప్పముకుందలీనతనులై పొందర్పునర్జన్మముల్ ॥ ౨౭౬ ॥ సీ ॥ విషయాంకురము గిల్లివేయని వారికి నినుపకచ్చడమున కేఁత దవ్వు । తెగఁగొని కసటుగడుగని వారికి నిది త్రిషవణంబునకు నెన్నిచాళ్లపట్టు । చింతలన్నియు మ్రోడు సేయని వారికి బోడయాదలలకు నేడ కేడ । యేనుతత్త్వంబులు నెఱుఁగని వారికి నెఱుక తునే యూరికేది తెరువు । తమ మొగంబుఁ జూడు తముఁ జూడు మేనుంగు । మీఁదనున్నవాని మేరమీరి । సున్నమడుగఁ జూచుచున్నారు హరిభక్త । గమ్యధామకాంతుఁ గన్మపరులు ॥ ౨౭౭ ॥ సీ ॥ పరదారపరధనాపహరణవైముఖ్యంబు వశవర్తిగావించువారుదక్క । బరగుణపరమాణుపర్వతకరణంబు వ్రతముగాఁ బాటించువారుదక్క । బరుఁ డైనఁ గొడుకైన నమరియాద చెడ సమత్వమునశిక్ష యొనర్చువారుదక్క । బరమసంపదల నాపద్వేళ సత్యంబు వదలక భాషించువారుదక్క । దూరవఁగుకోరిక్కఁ గోరని వారుదక్క । క్రూరకర్మంబులుడివోవు వారుదక్క । బూరుషార్థపరతఁ గ్రాలు వారుదక్క । దక్కవా రెల్లభవవహ్నిఁ దక్కువారు ॥ ౨౭౮ ॥ క ॥ పలువేల్పుల బడి నడవక । యిలు వేలుపుగా భజింపుఁడీ మీరలు వి । ట్ఠలశిక్యగదధిరసగం । ధిలకేశుం బౌండరీకతీర్థాధీశున్ ॥ ౨౭౯ ॥ ఉ ॥ మస్తకిరీటహాటకసమంచితకుంభయుతంబు పీవరో । రస్తటిరత్నదీప్తిరుచిరంబు రమాసమసాలభంజికా । శస్తము నైన శార్ఙ్గిఁ దన సౌధము నెక్కి సుఖించు బుద్ధికిన్ । నిస్తులభక్తి గౌరవము నిచ్చెఁ దయైచననిచ్చు మీఁదికిన్ ॥ ౨౮౦ ॥ క ॥ మీరును గృహస్థధర్మము । మేరకుఁ దలమీఱ చనక

---

౨౭౩ ॥ అంతర్వాణికుశేశయద్యుమణిన్ = విద్వాంసులనెడి తామరలకు సూర్యుని. స్థేమన్ = బలమును. కడమ = తక్కువ ॥ ౨౭౪ ॥ ముచ్చుట్టులు = మూడుచుట్లు ॥ ౨౭౫ ॥ భాస్వరములు = వెలుఁగునవి. తర్కించి = విచారించి. లీన = ఐక్యమైన ॥ ౨౭౬ ॥ కసటు = మురికి. త్రిషవణంబు = త్రికాలస్నానము. బోడయాదల = బోడితల. తెరువు = మార్గము. గమ్య = పొందఁదగిన ॥ ౨౭౭ ॥ ఉడివోవు = ఉడుగు. క్రాలు = ప్రకాశించు ॥ ౨౭౮ ॥ బడిన్ = మార్గమున. శిక్యగ = ఉట్టిని బొందిన. గంధిల = వాసనకొట్టుచున్న ॥ ౨౭౯ ॥ మస్త = తల. పీవర = బలిసిన. ఉరస్తట = ఱొమ్ముప్రదేశమునందలి. శస్తము = శ్లాఘ్యము ॥ ౨౮౦ ॥ మేరకున్ = మర్యాదకు. తుఃమీఱి =

మిత్రామాత్యు । దారహితదారదారక । వారకములతోడఁ దీర్థవాసపరులరై ॥ ౧౮౧ ॥ క ॥ కోమలతులసీపల్లవ । దామాంచితవత్సలక్ష్మ ధాముం బయోద । శ్యాముం బదద్వయనుతసు । త్రాముఁ గమనపౌండరీకధాముం గొలువుండీ॥ ౧౮౨॥ క ॥ అను చుండ నరకనిభ మగు । ననిమిషయానంబుఁ దెచ్చి హరిపార్శ్వచరుల్ । కొని చని రిసభర్తృకముగ । ఘనశీలసుశీలవిష్ణుగాథాలోలన్ ॥ ౧౮౩ ॥ తే ॥ ఆవునవనీసురుం డు వాయసమునంచ । రాజకీరంబు హాంసరసఘుయునిట్లు । ముక్తికేగినకథవిను భక్తతతికి । బవ్వతాగ్రశిలాబ్జసంభవము భవము ॥ ౧౮౪ ॥ వ ॥ అని వెండియు నిందుధరుండు శతానందనందనతో నిట్లనియె ॥ ౧౮౫॥ సీ ॥ నీలమోకాలాభ్రజాలమో బాలశైవాలమో యాసిద్ధవధూనికాంతి । కెంపులో పవడంపుగుంపులో యీ రెండసొంపులో యీ మేటిజోగి జడలు । హారమో హారిసీహారమో భూరికర్పూరమో యీ యాదిపురుషు నగవు । మెఱుపులో వజ్రంపుటొఱపులో శశిరేఖ తళుకులో యీ వటూత్తముని కోల । లనఁగ శార్ఙ్గికి నాదిక్కునందు నిలిచి । ప్రేతభూతనిశాచరపీడలడఁచి । క్షేత్రరక్షణదక్షుఁడై క్షేత్రపాలుఁ । డుండు విభునాజ్ఞ తలమోచి యోమునీంద్ర ॥ ౧౮౬॥ క ॥ శిక్యావచూడు నాజ్ఞా । వాక్యార్థము సేయుభోగివలయు ప్రభావా । ధిక్యంబు మీఱ నేరికి । శక్యమెతత్క్షేత్రమునఁ బ్రచారమొనర్పన్ ॥ ౧౮౭ ॥ చ ॥ చెడుగులవిష్ణుభక్తి నిరసించు దురాత్ముల మోక్షలక్ష్మి చే । పడుటకుఁ గాని హీనులఁ బ్రభావతిరస్కృతలోకపాలుఁడా । బుడిబుడితాల్పుఁ డందు నొకబూఁటయు నుండఁగ నీక తోలి చీపో । నడుచుఁ గలంచు డెందముల నారట పెట్టు మహోగ్రమూర్తియై ॥ ౧౮౮ ॥ ఉ ॥ పువ్వనుబూఁతపుట్టమును భూషయు దివ్యములై చెలంగ లే । జవ్వను లర్థిఁ గొల్వ నొకచక్కని ఖేచరుఁ డొక్కనాఁడు మున్ । నవ్వనమాలిహాటకమయావసథోపరివీథిఁ బ్రిమ్మరున్ । గ్రొవ్వెసఁగ స్వమానరుచి కోకనదప్రియరోచి మెచ్చఁగన్ ॥ ౧౮౯ ॥ ఉ ॥ పధితయావనోద్ధతమతి నెద్దియు మీఱెఱుఁగంగ లేక విద్యాధరుఁ డాతఁ డాత్మరుచి నాక

అతిక్రమించి. ఉదార=తిన్నఁదనముగల. దారకవారకములతోన్ = పిల్లకాయల సమూహములతో ॥ ౧౮౧ ॥ వత్సలక్ష్మ=శ్రీవత్సమనెడి చిహ్నమునకు ॥ ౧౮౨ ॥ అనిమిషయానము=విమానము. సభర్తృకముగన్ = పెనిమిటితోఁ గూడుకొనునట్లుగా. విష్ణుగాథాలోలన్ = విష్ణునికథలయందాసక్తురాలైనదానిని ॥ ౧౮౩ ॥ ౧౮౪ ॥ శతానంద=బ్రహ్మయొక్క ॥ ౧౮౫ ॥ బాలశైవాలము=లేఁతపాఁచి. ఈ రెండ=కొంచెపు ఎండ. జోగి=యోగి. హారము= ముత్యాలసరము. హారి=మనోజ్ఞమై. వజ్రంపుటొఱపులో= రవలవెలుఁగులో. తళుకులో = ముదురుఁదనములో. మోచి=వహించి ॥ ౧౮౬ ॥ శిక్యావచూడు= చిక్కము సిగయందుఁగలవానియొక్క. ప్రచారము=సంచారము॥ ౧౮౭ ॥ నిరసించు=తిరస్కరించు. బుడిబుడితాల్పుడు=బాలచంద్రునిధరించినవాఁడు— క్షేత్రపాలుఁడు॥ ౧౮౮ ॥ ఖేచరుఁడు=విద్యాధరుఁడు. వనమాలి=విష్ణుదేవునియొక్క. అవసథోపరివీథిన్ =ఆలయముమీఁదిమార్గమున. ఎసఁగన్ = అతిశయింపఁగా. కోకనదప్రియరోచి=వెన్నెల వెలుఁగువంటి వెలుఁగు॥ ౧౮౯ ॥ ఏధిత=పెరిగిన. యావనోద్ధమతిన్ =ప్రాయమువల

సముఁ గనకప్రసూనరా । జీధరణాభిరామముగఁ జేయుచుఁ ద్రిమ్మరఁ జేత్రిపాలుఁడు । తోత్కటక్రోధరసోగ్రమూర్తియయి కో యనియార్చి నభంబుఁ జూచుచున్ ॥ ౨౬౦ ॥ సీ ॥ కనువిచ్చి చూచుటగాక దిగ్గన లేచె నమితసమాధిస్థిరమునికులము । గ్రుడ్డులఁ బోదువు మక్కువలు వకుటగాక పొదలాడెఁ జెట్లసేఁబులుఁగుమూఁక । పులుమేయు తమకంబు దోలఁగుటగాక విహ్వలబుద్ధినై యుదాఁటె హరిణకులము । ప్రజ గేలఁ గర్ణరంధ్రములు మూయుటగాక పవిశంకనరనుతిప్రవణమయ్యెఁ । బద్మనాభగృహా పరిభాగసంచారిష్ణు ఖేచరదర్శనోద్రిక్తహృదయ । కాలభైరవభైరవోద్వేలకంఠ । కుహరనిష్ఠ్యూతరోషనిర్ఘోషనిహ్యృతి ॥ ౨౬౧ ॥ ఉ ॥ మానసికోపమిట్లు మదివల్లడిగొల్పఁగ మింటికిన్ మహా । శ్యేనముపోలె బిట్టెగసి యెక్కుడునుక్కున నుగ్రవిగ్రహుం । పైనెఱితగ్గ నగ్గగనయాయివిమానముఁ ద్రొక్కి భగ్నముం । గానొనరించుచుం ద్రిదశగాయకనాయకుఁడుద్వ్యగ్రూలుడున్ ॥ ౨౬౨ ॥ ఉ ॥ కోలుమసంగి మోఁగి బలుగోఱుదీటుచు గ్రుడ్లు ద్రిప్పుచున్ । క్ష్వేళలొనర్చుచున్ మొగము జేవురుమద్దవిధంబునన్ మహా । భీలముగాఁగ వ్యాళవిభుఁ జెన్నులుఁ గెడ్చినమాడ్కి నీడ్చెన । బ్బాలిశుఁ గాలభైరవుఁడు నైకుబుసంబొకపోరువెత్తఁగన్ ॥ ౨౬౩ ॥ క ॥ ఈవడువునఁ బులిదోఁడికిన । యావుపసిగ నుసులువోక కాసన్నండో । నావిద్యాధరు భైరవ । దేవా వృతుగాఁ జివాసుసేవ్రఁడు పల్కెన్ ॥ ౨౬౪ ॥ శా ॥ నాగాకల్పయ హాపురేసిలు విమానభ్రష్టుఁడనై నేలపైని గంధర్వుఁడు కూలిదర్పము డివోయెన్ జంపఁగాఁగాదు గాఢాగఃకర్మరుఁడేని యున్ జడువుఁ వాఁడై యుండ నర్హిన్ మహా । భాగుల్ చంపమిసివెలుఁగుదువు కోపం బాఁపు మీప్పటనన్ ॥ ౨౬౫ ॥ క ॥ అనిశ్రీపతియానతి నిచ్చినమందలవిడిచె నతని సిద్ధవిభుఁడు వాఁ । డునుగులగులలై లావఁగ । లినమై విదలించుకొనుచు లేచెఁ గిదుకుచున్ ॥ ౨౬౬ ॥ ఉ ॥ లేచి యతండు గాంచెఁ గదళీమృదులోరుయు

---

నఁజొట్టిన. ఉత్కటక్రోధరసోగ్రమూర్తి= మిక్కుటమయిన కోపరసముచేత భయంకరమైనరూపముగలవాఁడు ॥ ౨౬౦ ॥ పొదలాడెన్=వర్ధిల్లెను–అతిశయించెను. పులు=గడ్డి. పవిశంకన్=పిడుగు అనుభయముచేత. ప్రవణము= ఆసక్తము. ఉద్రిక్త=రేఁగిన. భైరవ=భయంకరమైన. ఉద్వేల=అతిశయించిన. నిష్ఠ్యూత=వెడలింపఁబడిన. నిర్ఘోష=ధ్వనియొక్క ॥ ౨౬౧ ॥ మల్లడిగొల్పఁగన్=కలఁతనొందింపఁగా. బిట్టు=శీఘ్రముగా. ఉక్కునన్=బలముతో. ఉగ్రవిగ్రహుండు=భయంకరమయిన యాకృతిగలవాఁడు. నెఱి=అందము ॥ ౨౬౨ ॥ కోలుమసంగి=మిక్కిలివిజృంభించి. క్ష్వేళలు=సింహనాదములు. జేవురు=ఎఱుపుయొక్క. మహాభీలము=అతిభయంకరము. అబ్బాలిశున్=ఆమూర్ఖుని. పోరువ=పొర ॥ ౨౬౩ ॥ తొడికిన=పట్టిన. ఆవుపసిగన్=గోవుకాఁగా. ఉసులు=ప్రాణము ॥ ౨౬౪ ॥ నాగాకల్ప = పాములుసొమ్ములుగాఁగల భైరవుఁడా. పురే=బళీ. ఉడివోయెన్=ఉడిగిపోయెను. గాఢాగఃకర్మఠుఁడు = ఎచ్చైనతప్పుపనిచేసినవాఁడు. మహాభాగులు=దొడ్డవారు ॥ ౨౬౫ ॥ మందల=మనుదల–జీవముతో. లావు=బలము. అగలినన్=పెల్లగిలఁగా–నశింపఁగా. కిదుకుచున్= బాధచేమూలుఁగుచు ॥ ౨౬౬ ॥ మేచక మే

గుఁ హాసన్ముఖుఁ । మేచకమేఘమూర్తి దినమిత్రసమానసమరత్నభూషితుఁ । లో
చనధిక్కృతాంబుజదళుఁ శతకోటిసుధాకరాగ్నిరు । గ్విచిపరంపరోపమనవీనత
ను ప్రభయాదవప్రభుఁ ॥ ౨౯౭ ॥ వ ॥ ఇట్లుసచ్చిదానందకందళంబగునచ్చిందం
బుడాల్పు ననల్పాద్భుతరసనిర్మగ్నుండై కనుంగొనుచు నవతీర్ణగగ్వవిద్యాధరుం
డై యవ్విద్యాధరుండిట్లనివితర్కించు ॥ ౨౯౮ ॥ శా ॥ ఈపుంగ్రామణియెవ్వఁడో
కో హరియిట్లొప్పెం దెసం దేహమే । లాపద్మాక్షుఁడెయంచులోఁదెలిసి యోల
క్ష్మీశయేఁదివ్వన్నివా । సోపర్యభ్రచరద్విమానగుఁడనైయుండుండియిష్టాక్రియ।
తో పోదగ్రుఁడుగూల్పఁగోవ్వాఁగికఁ గొంటిఁసురేశుఁ నినుఁ ॥ ౨౯౯ ॥ క ॥
నిర్మదులకుఁదోఁచినక్రియ । దుర్మదులకుఁదోఁపవీవెదుటననుచుమనో । మూర్ముర వా
పిఁబడిమనుజ । ధర్మభటుఁడుతత్పదద్వితయకృతమతియై ॥ ౩౦౦ ॥ స్రగ్ధర ॥ పా
పోహంపాపకోపప్రవణమతిరహంబాలిశోహంసుధీదు । ష్ప్రాప్రోహందుష్టకష్ట
ప్రకృతిరహరహంపామరాత్మాస్మినానా । రూపద్రోహోపచారార్బుదనిహిత
ధియఁకోధినంమామవత్వ । చ్ఛ్రీపాదాసక్తియుక్తంశివకరయనుచుఁ జిష్ణుఁగృ
ష్ణుఁ నుతించెఁ ॥ ౩౦౧ ॥ వ ॥ అనిమఱియును ॥ ౩౦౨ ॥ చ ॥ యదుకులనాథయి
ప్పుడితఁడాగ్రహవృత్తినొనర్చునిగ్రహం । బిదియుననుగ్రహంబయగునింద్రియరా
జికిబంటుసేయుశ్రీ । పదమునఁణించినీయడుగుమానిసిగాననుఁజేసెఁగాననం । ప
దగలగర్వినిర్మమునిమాడ్కినినుంగనికొల్వఁజాలునే ॥ ౩౦౩ ॥ క ॥ మూఢుఁడననుఁ
బోవుమహా । దీర్ఘకుసికజొరకనామతివెలయుతదయా । గాఢత్వాజ్ఞవిమానా।
రూఢుఁడనై జగములందిరుగువాఁడహరీ ॥ ౩౦౪ ॥ చ ॥ సురసదనంబునందయినఁదో
ణితలంబునయందునైనఁబో । కరనిరయంబునందయినఁగర్మవశంబుననుండునామదిం।
బొరయునుగాతఁగాతర సముద్ధరణోచితకార్యధుర్యత్వ । చ్చరణసరోరుహద్విత
యసంతతసంస్మరణానుషంగముల్ ॥ ౩౦౫ ॥ క ॥ అనివలగొనియాయాదునం । ద
నునిరుపమదివ్యరూపదర్శనమునలోఁ । దనియుచుఁజొక్కుచుమ్రొక్కుచుం । జని
యెఁవిద్యాధరుండు శతధృతితనయా ॥ ౩౦౬ ॥ క ॥ మధుమథనునాజ్ఞనేవం । విధ

ఘ=నీలమేఘమువంటి ॥ ౨౯౭ ॥ కందము=దుంప. చిందంబు దాల్పు=శంఖమును ధరించినవాఁ
డు—కృష్ణుఁడు. నిర్మగ్నుఁడు=మునిఁగినవాఁడు. అవతీర్ణ=దిగిన—పోయిన ॥ ౨౯౮ ॥ పుంగ్రా
మణి=పురుషశ్రేష్ఠుఁడు. అభ్రచరత్ = ఆకాశమునందుఁదిరుగుచున్న ॥ ౨౯౯ ॥ ముర్మురవా
పిఁ=కుమ్ముబావియందు ॥ ౩౦౦ ॥ సుధీదుష్ప్రాపః=విద్వాంసులకుఁబొందరానివాఁడను. అహ
రహమ్=ప్రతిదినము. పామరాత్మాస్మి= మూఢమనసుగలవాఁడనైతిని. మామవ=నన్నురక్షింపు
ము ॥ ౩౦౧ ॥ ౩౦౨ ॥ అడుగుమానిసి=పాదసేవకుఁడు. నిర్మమునిమాడ్కిఁ=మమతలేనివా
నివిధమున ॥ ౩౦౩ ॥ మహాద్రీఘకుఁ=పెద్దలయవమానమునకు ॥ ౩౦౪ ॥ కాతర=భయపడి
నవారియొక్క. అనుషంగములు=ఆసక్తులు ॥ ౩౦౫ ॥ వలగొని=ప్రదక్షిణముచేసి. శతధృతి=
బ్రహ్మయొక్క ॥ ౩౦౬ ॥ ఏవంవిధమహిమఁ = ఈవిధమయిన మహాత్త్వముచేత ॥ ౩౦౭ ॥

మహిమఁదలిర్చు క్షేత్రవిభు భైరవదే । వుధరాధోభువనస్వ ।ర్గ ధామనుతుఁగాంచి
మిదపఁగనఁదగుఁగృష్ణుక్ ॥ ౩౦౭॥

శా ॥ సాహిత్యాపరకాళిదాసహరిపూజాగౌరవవ్యాసగం । గాహల్లో
హలవాగ్విలాసరిపువర్గ త్రాసకృత్ప్రాసకాం । తాహర్షావహదృగ్విలాసశ్రుతిప
ద్యాయోజితాభ్యాసహే। మాహోర్యోపమధైర్యధుర్యపదవిన్యాసావిధేయారసా ॥

క ॥ షడ్దర్శనపారగకవి । రాద్ధాంతానుగ్రహాభిరవ్యసుధాంధ । ద్విడ్దంతిసిం
హామహిత । త్విద్దశశతకిరణహృదయధృతహరిచరణా ॥ ౩౦౯ ॥

మాలిని ॥ వినయనయసముద్రా శిష్ఠితోల్లాసముద్రా । జననుతగుణజాలా
శత్రురాజ్ఞీనజాలా । ధనదనదసమానాధన్యధీభాసమానా । ఘనవపురినరాగా
కావ్యదత్తానురాగా ॥ ౩౧౦ ॥

గద్యము॥ ఇది శ్రీమత్పరమపదనాథనిరవధికకృపాపరిపాకపరిచితస
రసకవితాసనాథరామకృష్ణకవినాథ ప్రణీతంబైన పాండురంగమా
హాత్మ్యంబను పరమభాగవత చరిత్రంబునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీ పాండు రంగ విట్ఠల స్వామి నే నమః.

---

హాల్లోహల=ప్రవాహమువంటి. శ్రుతిపద్యాయోజితాభ్యాస= వేదమార్గమునందుఁగూర్పఁబడినఅ
భ్యాసముగలవాఁడా ॥ ౩౦౮ ॥ షడ్దర్శనపారగ = ఆఱుశాస్త్రములను తుదముట్ట నెఱిఁగినవాఁ
డా. సుధాంధద్విడ్దంతిసింహ = దేవశత్రువులైనరాక్షసులనెడియేనుఁగులకుసింహమైనవాఁడా.
మహితత్విద్దశశతకిరణ= అధికతేజస్సుచేత సూర్యుఁడా ॥ ౩౦౯ ॥ శత్రురాజ్ఞీనజాలా=శత్రు
రాజులనెడిచేఁపలకు వలయైనవాఁడా. ధన్యధీభాసమానా=కృతార్థమయినబుద్ధిచేతప్రకాశించు
చున్నవాఁడా ॥ ౩౧౦॥].



# పాండురంగ మాహాత్మ్యము.

## పంచమాశ్వాసము.

క॥ శ్రీషణ్ముఖజననీమహి । భాషానిభనిజవధూశుభప్రదలీలా । భూషితకల్యాణోజ్జ్వల । వేషారామానుజేంద్ర వేదాద్రీశా॥ ౧॥ వ॥ ఆకర్ణింపుము ॥ ౨ ॥ క॥ అనియాక్రియనానతియి । చ్చినహెచ్చిన సంతసంబుచిత్తముతోడం । జెన్నగునానని మిషమునియి । ట్లనునజ్జగదేకనిధికిఁబ్రాంజలి యగుచున్ ॥ ౩ ॥ తే॥ క్షేత్రమాహాత్మ్యమునుమహాక్షేత్రపాల । దివ్యచరితంబు నందుండు దేవదేవు । గుణకలాపంబుఁబుండరీకునిమహిమయు । వింటిభవబంధములు వీడుకొంటిదేవ ॥ ౪ ॥ తే ॥ ఎన్నిద్వారంబు లయ్యాయియెడవసించు । ద్వారదేవత లెందఱాస్థలమునందుఁ । బ్రబలుక్షేత్రాదిపుణ్య వైభవము పేర । నొండుగలదేనియానతి యిండుమఱియు॥ ౫ ॥ క॥ అనినారదుండుప్రార్థిం । చినఁబద్మదళాయతాక్షుఁ జిత్తాంభోజం । బునన్నివ్వెయతనిఁబలుకన్ । మనసిజమర్దనుఁడుమధుర మధురారభటిన్ ॥ ౬ ॥ క ॥ సుఖమాలికాతరంగిణి । సఖియైభీమరథిఁగూడి చనునెచ్చటన । త్సుఖకరమచ్చోటుచతుర్ముఖముఖనతమాదితీర్థ మనునై వెలయున్ ॥ ౭ ॥ క ॥ పూర్వద్వారంబగునది । దర్వీకరసార్వభౌమ తల్పునగరికిన్ । సర్వసుపర్వార్చితపద । గీర్వనితవసించునచటఁగృష్ణునియాజ్ఞన్॥ ౮ ॥ క ॥ శ్రీమహితముసిద్ధేశ్వర । నామాంకమపంకజలసనాథములక్ష్మీ । కాముకనిహితముఖచరా । లీమాన్యమునైనశంభులింగముతోడన్ ॥ ౯ ॥ క ॥ తగుదక్షిణంపువాకిలి । నగధరునగరునకుభీమనందనపొందుం । దగిలినయదియచ్చోటన । యగమ్యపుష్పావతీమహానదియనఘా ॥ ౧౦ ॥ క ॥ దానస్నానాదిహృతా । జ్ఞానానలదాహమైన సంగమతీర్థం । బానెలవునవిఖ్యాతం । బైనదిసురలుండుదురుశిలాకృతినందున్ ॥ ౧౧ ॥ వ ॥ అదిభవదీయాశ్రమంబగుట నీవెఱుంగుదు వదియునుంగాక ॥ ౧౨ ॥ చ॥ కలఁడొకబోయతన్నికట కాననభూమినతంపువిల్లున । మ్ములధరియించికల్మష సమూహములెత్తినమేనుబోలెఁబే । గలుకవహించెనేని హృదయంబుగలంగుధరాధరస్థలీ । నిలయవసత్కిరీంద్రులకు నిక్కమతక్క—

---

౧ కల్యాణోజ్జ్వల=చొక్కపుబంగారుచేవెలుఁగునట్టి॥ ౧॥ ౨॥ ౩॥ ౪॥ ఎందు=ఇతరము॥ ౫॥ అతనిన్=అతనితో. మధురమధుర = మిక్కిలిమధురమైన॥ ౬॥ ౭॥ దర్వీకరసార్వభౌమతల్పు=విష్ణునియొక్క. గీర్వనిత=సరస్వతి॥ ౮॥ సనాథము=కూడుకొన్నది. లక్ష్మీకాముకనిహితము=విష్ణునిచేతఉంచఁబడినది. ఖచరాలీ=దేవతాసమూహమునకు ॥ ౯ ॥ అగమ్య=పొందశక్యముకానిది॥ ౧౦॥ ౧౧॥ ౧౨॥ నికట=సమీపమునందలి. పేరలుక=అధికకోపము ॥ ౧౩ ॥ ము

మృగంబులోర్చునే॥ ౧౩ ॥ చ ॥ అడవికి వేఁటమైనరిగి యాతఁడొకానొక నాఁడొకింత యుఁ । మెడమలఁగింపలేక తన మేపొడ లొండును రెండునేకమై । పొడమఁగ బీద కన్నునడ బూఁడిదపండునుబోలె బూఁచుపా । రెడునొక దుప్పిఁ గింగవియఁ జేరి భయ జ్వరతప్తచిత్తమై॥ ౧౪ ॥ తే ॥ అచమూరువు యూధంబుఁ ద్రోచిపఱచె । వింటన మ్మేర్చి బోయవెన్వెంటఁ దఱుము । లోలజిహ్వాకరాళవిశాలముఖత । నోలి భీతెందు మృగశాబమోయనఁగ ॥ ౧౫ ॥ ఉ ॥ ఆరురు వీఁగ తింబఱచి యగ్రమహింబడి లేచి వెం డియుఁ । భూరిరయంబున నంజనివ పుర్వ్యథ సంగమతీర్థ తీరవి । స్ఫారలతానికుంజ ములు బల్విడి దూఱు నెడం గిరాతుఁడుఁ । క్రూరశిలీముఖంబు దొడిగుండియ గాఁడఁగ నేసె నేసినఁ ॥ ౧౬ ॥ సీ ॥ ఆశరముఖనిభంబాశరమటు దాఁకఁ బవనాభిహతిఁ దూలు బంధుజీవ । కుంజంబు పువ్వులఁ గూలించువిధమున నవనవక్షతజ బిందువులు దొరఁగ । జేయుచు వివృతాస్యసీమఁ బ్రాణానిల ప్రస్థానపటహాగ్రరవమునంగ । నార్తనాదము గ్రమ్మ నది యేటి తెలినీటి తెమలున నుఱికి దేదీప్యమాన । హాటకవిమానమెక్కి విద్యాధరేంద్రుఁ । డగుచు లావణ్యపుష్పాస్త్రుఁ డగుచుఁ జంద్ర । సాంద్రతను కాంతియగుచునతీంద్రమహిమ । గగనమునకేఁగెఁ దోలు మేను కానఁబడదు ॥ ౧౭ ॥ శా ॥ చిత్తంబద్భుతమందనమ్మృగవధాజీవుండు లోలోనఁ ద । ద్వృత్తంబుఁ బలుమాఱు మెచ్చి నిజమర్త్యవృత్తిఁ విసర్జించుచుఁ । దత్తీర్థాంబువు నాడి క్రోలి విగతాతంకాత్ముఁడై శుద్ధిఁ ద । ల్లోకోత్తరముక్తశరీరుడై కని యెదివ్యుల్ మెచ్చ నుచ్చస్థితిఁ ॥ ౧౮ ॥ క ॥ కావునఁ దత్తీర్థంబున । సేవలనంబరాసులగు విహీనమతులకుఁ । కైవల్యసిద్ధి యగునని । నీవలనతిశుద్ధమతుల నేటికి నెన్నఁ ॥ ౧౯ ॥ సీ ॥ సంధ్యలు మూఁటనిచ్చ నివాళులిచ్చుచు బిరుదాంకమాలికల్ పేరుకొనుచు । లోచూపు దివుటనాలోకించి చొక్కుచుఁ బులకాశ్రుగాద్గద్యములఁ బొరయుచు । శ్రుతులెట్టులట్లసంస్తుతులాచరించు

---

లఁగింపక = త్రిప్ప. బీదకన్ను = భయదృష్టి. బూఁచుపారెడు = బూఁజుపట్టినట్టు కానవచ్చెడు. భయజ్వరతప్తచిత్తము = భయమువలని తాపముచేత తపించినమనసుగలది ॥ ౧౪ ॥ చమూరువు=దుప్పి. త్రోచి=మిరాలి. ఏర్చి=కూర్చి. లోల=చలించెడి. కరాళ = భయంకరమైన. శాబము=పిల్ల ॥ ౧౫ ॥ రురువు=దుప్పి. అగ్ర=ఎగుట. వపుర్వ్యథఁ=దేహబాధచేత. విస్ఫార=మిక్కిలిగొప్పదైన. బల్విడిఁ=అధికవేగముతో. తొడి=తొడిగి ॥ ౧౬ ॥ ఆశరముఖనిభంబు=అగ్నిముఖమును బోలినది. కుంజము=చెట్టు. కూలించు=రాల్చు. నవనవక్షతజ=క్రొత్తక్రొత్తనెత్తురులయొక్క. వివృత=తెఱవఁబడిన. ప్రస్థానపటహ = ప్రయాణకాలమునందలి తప్పెటయొక్క. తెమలునఁ=చలనమునందు-ప్రవాహమునందు. అతీంద్రమహిమఁ=ఇంద్రుని మహిమను మీఱిన మహిమతో ॥ ౧౭ ॥ మృగవధాజీవుండు=బోయవాఁడు. వృత్తంబుఁ=వృత్తిని. ఆడి = స్నానముచేసి. క్రోలి=త్రాగి. గతాతంకాత్ముండు = పోయిన భయముతోడి మనసుగలవాఁడు. కనియెఁ=పొందెను. ఉచ్చ=ఉన్నతమైన॥ ౧౮ ॥ ౧౯॥ నిచ్చ=ఎల్లప్పుడు. నివాళులు= ఆరతులు. దివుటఁ=పూనికతో. గాద్గద్యము=గద్గదభావము = గొంతునుండిమాట వెడలమి. పొరయు=

చు వీనులం దతఁ డాపాతతతి వినుచుఁ । గరతాళగతులఁ జొక్కటమై గానాడుచు నావే
శమూర్ఛలనలంతఁ గనుచు । విష్ణుసేవింతురచట నవ్విబుధవల్ల । భాజనంబులు తత్కృ
పాభాజనంబు । లమ్మహాక్రీడనస్థలి నాచరించె । లంఘనాక్రీడనము దొల్లి లచ్చిమగఁడు॥
౨౦ ॥ మ ॥ వినుమున్ శౌరికి నోడి సంగమ మరుద్విద్వేషి యెచ్చోటికో । చని వెం
డిం జనుదెంచి యచ్చట శిలాసంఛన్న దేహంబుతో । డసిలాగర్భమునందు దాఁగఁగ
నిగాఢక్రోధుఁడై దేవకీ । తనయుండా శిల గ్రొచ్చివైచి మెదిపెన్ దద్దైత్యుఁ జూర్ణం
బుగన్ ॥ ౨౧ ॥ క ॥ పువ్విలుతు తండ్రి యచ్చట । మువ్వంకమురువున మురళి మ్రో
యించె మనం । బువ్విళులూరఁగ శ్రుతులకు । నవ్విధము తదీయపదయుగాంకము దె
లుపన్ ॥ ౨౨ ॥ క ॥ మహినే వంవిధ చిత్రా । వహమగు నద్దక్షిణంపు వాకిట మహి
మల్ । బహుముఖముల వినుతింపఁగ । నహిపతియుం జాలఁ డసిననన్యులవశమే ॥
౨౩ ॥ సీ ॥ తనకటాక్షములు సంతానచింతారత్ననిర్మాణపరమాణునికరమనఁగ ।
దనవిలాసంబు మద్వైరిశంబరనిషూదనపాలితపురఃపతాకయనఁగఁ । దనమనస్సర
సిసంతతచిదానందవైభవమరాళముకుసిరిపట్టనంగఁ । దనప్రసాదంబు భక్తవరేణ్య
దుర్గతితిమిరౌళనోచితచంద్రగోళియనఁగ । వెలయునే దేవియా దేవివిద్రుమద్రు । కద్రు
నిర్నిద్రతనుకాంతిభద్రపరమ । మాయభువనేశ్వరి వసింపమధువిరోధి । ధామమునఁ
గల్గు పశ్చిమద్వారమమరు ॥ ౨౪ ॥ ఉ ॥ పోర్మహిషున్ నిజాంఘ్రిఁ గలబోట్టన ద్రెళ్లు
దమట్టిపట్టిముల్ । పేర్మిఁ దదంగమున్ మెదిపి పెట్టిననెత్తురు బొట్టుఁ బోలె జ్యో । తి
ర్మయవీక్షణంబలిక దేహమునం గల దుర్గ స్వర్గ జన్ । వార్మణధారి నుత్తరపు వాకిట
నిల్పినవాఁడు కాపుగన్ ॥ ౨౫ ॥ క॥ తరణియు భైమియును బరశస్వరమచ్చటఁ గూడి
నిగుడఁ బావనమగుత । త్సరిదంబువునం దాడిన । నరునకు నవ్వారిచరణనఖమున వెడ
లున్ ॥ ౨౬ ॥ క ॥ ఎవ్వఁడు వ్యాధిగ్రస్తుం । డెవ్వఁ డుభయవిహ్వలాత్ముఁ డెవ్వండ
ధముం । డవ్వాఁ డచ్చటి దుర్గం । బువ్వులఁ బూజించి యిష్టభోగములందున్. ॥ ౨౭॥
ఇన్నాలుగు నంతర్ద్వారంబులు. ఇంక బహిర్ద్వారంబుల ప్రకారంబా కర్ణింపుమని గో
కర్ణకుండలుం డాకర్ణనవశంవదాశయుండగు కుశేశయాసనసూతికిట్లని యె॥ ౨౮॥

పాండు. చొక్కటము = స్వచ్ఛము॥ ౨౦॥ మరుద్విద్వేషి = దేవశత్రువు = రాక్షసుఁడు. గ్రొచ్చి =
తొలిచి — పగులఁగొట్టి. మెదిపెన్ = నలఁపెను॥ ౨౧ ॥ ఉవ్విళులూరఁగన్ = తమకపడఁగా॥ ౨౨ ॥
చిత్రావహము = వింతను బుట్టించునది॥ ౨౩ ॥ సంతాన = కల్పవృక్షము. శంబరనిషూదన = మన్మ
థుని చేత. పురఃపతాక = ఎదుటి పెక్కెము. గోళి = గోళము = బింబము. విద్రుమద్రుకద్రునిర్నిద్ర
= పగడపుఁజెట్టు యొక్క గొరోజనపుఁజాయ చేత సోలని॥ ౨౪ ॥ మట్టి = త్రొక్కి. అలికదేశమునన్
= నొసటియందు. వార్మణధారి = కవచసమూహములను ధరించినవాఁడు — విష్ణుఁడు ॥ ౨౫ ॥ ని
గుడన్ = ప్రవహింపఁగా. సరిదంబువునందున్ = ఏటినీటియందు ॥ ౨౬ ॥ ౨౭ ॥ గోకర్ణకుండ
లుండు = పాముల చెవిపోఁగులు గలవాఁడు. ఆకర్ణనవశంవదాశయుండు = వినుటయందాస
క్తమయిన మనసు గలవాఁడు. కుశేశయాసనసూతికిన్ = బ్రహ్మకొడుకునకు ॥ ౨౮ ॥

సీ ॥ కఱవురకఱసునినొకఱరునిఁజికఱఁగఁ ద్రొక్కిభద్రకాళిక యెందుఁ బ్రస్ఫురించు। నిందుండువిధమున నెందు నేవసియింతు నఱలేకకోటీశ్వ రాహ్వయమునఁ । బ్రవహించు నెందునభ్రంకషోర్ములఁ బుణ్యజలయనుజలధి యోషామతల్లి । నత జగ త్త్రితయ శ్రీనారాయణీదేవి వర్తించు నెం దేనివార్తకెక్కి । యట్టియట్టాలతోరణహట్టకుట్టి ॥ మస్ఫురద్గోపురైడూకమణిమయోరు । హర్మ్యరమ్యంబుకరవీరమనుపురంబు । పశ్చిమద్వారమగుజగత్పతినగరికి ॥ ౨౯ ॥ తే ॥ తోణిఁగృష్ణానదీతీరభూర్వలాఖ్య। తీర్థ రాజాధివాసినై తీర్థచరణ । ధామమణిసౌధదక్షిణద్వారమేను । జాగరూకతఁ బాలింతుయోగివర్య ॥ ౩౦ ॥ శా ॥ గర్వోద్రిక్తతరంగ సంఘములవీఁకన్ బుష్కరిణ్యాపగా । వార్వేణుల్ దనయుత్తరంపుదెసఁబర్వంగాగదాపాణినై । సర్వాలంకృతశాలిన్నైవెలయుఁగంసధ్వంసనాగారరా । ట్పూర్వద్వారమునంద్రివిక్రముఁడునై పొంగన్ బయోదచ్ఛవిన్ ॥ ౩౧ ॥ క ॥ కరనఖరదళితరక్షః । పరివృఢవక్షోరుణాంబుపరిచితదీప్తా । త్ర్యురు కేసరదోహదుఁడగు । నరకేసరి యుత్తరంబునగవనిఁగాచున్॥ ౩౨॥ క॥ లోనాలుగు వెలినాలుగు । నైనమహాద్వారభూములపవర్గశ్రీ । నీనఁగనీనగరాద్ధవు । శ్రీనగరగణిత విభూతిఁజెందుమునీంద్రా ॥ ౩౩ ॥ వ ॥ అనిమఱియునకఱటీయ వేల్పుననల్ప గుణప్రకటనపరుండై హరుం డిట్లనియె ॥ ౩౪ ॥ చ ॥ అభిముఖతత్త్వశాలిసుకృతాఢ్యుఁడునౌచతురాస్యమానస । ప్రభవుఁడుశిష్యసంఘములపారముగొల్వఁగఁ దొల్లియొకఱనా । డిభపురనాథుఁ గౌరవకులేశ్వరుధర్మజుఁగానఁబోవభూ । విభుఁడతఁడాతనింజెలిచె వేయువిధంబులసాధుపూజలన్॥ ౩౫॥ క ॥ అహితాహితకారణవి । గ్రహులనుసదను గ్రహప్రగల్భులనగునా । గహనగృహవాసచర్యా । మహితతపోధనులసంగమముపొగడొంచెన్॥ ౩౬॥ ఉ॥ తమ్ములఁదానునప్పుడుపృథాప్రథమాత్మజుఁడంతరంగముల్ । గ్రమ్మినశోకవహ్నిహతిఁగందుచుఁగేలుమొగిడ్చిబ్రహ్మఁచి । త్తమ్మునఁగల్గుసంయమివతంసముఁ బలుకఱఖరాంశుతాపిత । ప్తమ్మగు తేనియంజినుకుతమ్ములఁబోలసబాష్పనేత్రముల్ ॥ ౩౭ ॥క॥ వభీరువనై వేఁడెద । నోభద్రప్రద ప్రసాదమొసఁగుమునాకున్ । మీభావంబునఁబొడమని । యీభువనత్రయమునందునింతయుఁగలదే ॥ ౩౮ ॥ శా ॥ చింతాకంతయువెమని । దీభువనత్రయమునందునింతయుఁగలదే ॥ ౩౮ ॥ శా ॥ చింతాకంతయువె

---

కఱకు=కఠినుఁడైన. అఱ=కొఱఁత. అభ్రంకషోర్ములన్=ఆకాశమునొరయుచున్న యలలచేత. జలధియోష=నది. అట్టాల=బురుజు. హట్ట=అంగడివీధి. కుట్టిమ= ఱాతికట్టడపు నేల. ఏడూక = లోపలమొముకలు పేర్చిపెట్టినగోడ॥ ౨౯॥ తీర్థచరణ= విష్ణుదేవునియొక్క ॥ ౩౦ ॥ వీఁకన్=నిక్కుచేత. వార్వేణులు=నీటిపాయలు. పర్వంగాన్=పాఱఁగా. అగారరాట్= దొడ్డనగరియొక్క. పయోదచ్ఛవిన్=మబ్బుచాయతో॥ ౩౧ ॥ రక్షఃపరివృఢ= హిరణ్యకశిపుని. దోహదుఁడు =ఎరువువేయువాఁడు॥ ౩౨॥ అపవర్గశ్రీన్=మోక్షసంపదను॥ ౩౩॥ ౩౪ ॥ తెలిచెన్=సంతోషపెట్టెను॥ ౩౫॥ ౩౬॥ చినుకు=కార్చునట్టి॥ ౩౭॥ ౩౮॥ సంక్రాంత= పొందిన. అంతర్వ్యాప్తి

నూఱిచియ్యక కురుక్షేత్రంబునం బాపసం । క్రాంతస్వాంతుఁడనై సుహృత్సుతపితృభ్రాతృగురులం జంపియ । త్యంతద్రోహమొనర్చి యుందిరి గదన్ బ్రాణంబుతో మత్సముం । డంతర్వాణివతంస యెవ్వఁడు గలండా హానిఁ దీర్పింపఁగన్ ॥ ౩౯ ॥ క ॥ వంగడమున వెదుకుఁ గోపవు । టింగలమున నేర్చి కనిన యాసిరినిం డా । సంగతిఁ బొగచూరెనుద । ర్భంగుర మాక్తికము దీనఁ బసిమియుఁ గలదే ॥ ౪౦ ॥ మ ॥ అసిధారావధితాత్మబంధుభుజమధ్య స్వైరనిర్యద్వసన్ । మసలై పుట్టిన యమ్మహాదురితమున్ మన్పెట్టియున్ వాజిమే । ధసమిద్ధానలభూతిచే నుసిమియున్ దప్పింపలేనైతి నీ । కసటెప్పాటఁ దొలంగునెట్టు లగుదున్ గల్యాణకల్యోత్సుఁడన్ ॥ ౪౧ ॥ క ॥ కర్మముకర్మాంతరహ్ము । తఱిగ్మతమగు దానిఁ బూనఁగా నమ్మునిరయాం । తర్మజ్జనాభిముఖునీ । దుర్మదుఁబడనీక నిలుపు ద్రుహిణప్రభవా ॥ ౪౨ ॥ క ॥ మావంటివారలకుఁ బా । పావిలదృక్కులకు ధర్మమార్గ యనియస । ద్భావులకు భవాదృశులగు । శ్రీవైష్ణవవరులె దిక్కు చిత్పూర్ణమతీ ॥ ౪౩ ॥ సీ ॥ అని యుధిష్ఠిరుఁ డడుగ సనందనుఁ డాత్మ నలరి యిట్లను నమ్మహాత్ముతోడ । నీ పాలశాంబరీగోపాలుఁడు గలాఁడు పరమవైష్ణవధర్మపరత మెలఁగు । నీ మోముగనుఁగొన్న నిఖిలాఘములుఁ బోవు సెకదాఁకి యడఁగు తూలికలలీల । హరిభక్తియను గంగ కడ్డమే కలుషపుటిసుక చేఁగట్టిన యసదుఁగట్ట । దురితరాశిమునిం గి శ్రీవరుని భటుఁడు । తోయపద్మదళచ్ఛాయఁ బూయఁబడఁడు । రేయుఁబగలు వృథా చింత సేయ నీవు । ప్రాకృతుండవె భూలోకపాలవినుత ॥ ౪౪ ॥ ఉ ॥ కర్తవు గావు హర్తవును గావభిరక్షివి గావు నీవు స । త్కీర్తిధురీణ యింతకును గృష్ణుఁడె మూలము గాన పుణ్యావి । స్ఫూర్తియుఁ బాపవైకృతముఁ బూరుషుఁ బొందునె యస్వతంత్రతన్ । వర్తిలుచుం ద్రెళ్ళినను వచ్చునె పాకగుణాగుణావలుల్ ॥ ౪౫ ॥ క ॥ పరులకతంబున నేనియు । హరినామకమరిడలఁ బ్రభద్రిను గుఖులలకుఁద । స్మిరతస్మరణాచరణ । స్ఫురణాఢ్యులు నిత్యపదవిఁ బొందుట యరుదే ॥ ౪౬ ॥ తే ॥ ధారుణీవల్లభుల కంటెఁ దక్కుచోట । నశ్వమేధంబు నిష్ఫలంబగు విధమున । నర్థవంతంబుగాదు సత్యాకళతుర్రి । సేవకిలఁ బూని సేయు పాచితము శతము ॥ ౪౭ ॥ క ॥ భ్రాతృవధ

---

వతంస=పండితశ్రేష్ఠుఁడా ॥ ౩౯ ॥ వంగడము=వంశము. ఇంగలము=అగ్ని. ఏర్చి=కాల్చి ॥ ౪౦॥ వధిత=చంపఁబడిన. స్వైరనిర్యద్వసన్=యథేచ్ఛముగా కాఱుచున్న ద్రవరూపమైన క్రొవ్వుచేత. మసలై=ముఱికియై. ఉసిమియున్=తోమియు. కసటు=పాపము. కల్య=సంపాదింపఁగోరిన॥ ౪౧॥ నిరయాంతర్మజ్జనాభిముఖున్ = నరకములోపల మునుఁగుటకు అభిముఖుని. ద్రుహిణప్రభవా=బ్రహ్మకొడుకా॥ ౪౨॥ ఆవిల=కలఁగిన. చిత్పూర్ణమతీ=జ్ఞానముచేత నిండుకొన్న బుద్ధిగలవాఁడా॥ ౪౩ ॥ కలాఁడు=కలఁడు. తూలికలలీలన్ = దూదిరేకులవిధమున. అసమ = అల్పమైన. తోయపద్మదళచ్ఛాయన్=నీటిలోని తామరపాకురీతిని॥ ౪౪॥ అభిరక్షివి = కాపాడువాఁడవు॥ ౪౫॥ ౪౬॥ పాచితము=ప్రాయశ్చిత్తము ॥ ౪౭ ॥ ౪౮ ॥ ఉదీర్ణావిష్కృతిన్= మి

పితృవధాదుల । పాతకములు రావు విష్ణుపదభక్తులకున్ । దైతేయసూనులీరువుర । యేతద్వ్యవహారసాక్షులిభపురనాథా ॥ ౪౮ ॥ శా ॥ ఆకంసారిప్రశంసనీయదినుదీక్షావిష్కృతిం దాల్పఁబె । ల్లాకంపించి తొలంగుఁగాక నినుఁడాయన్ నేర్చునే పాతకా । నీకంబుల్ రవిఁగప్పు చీఁకటుల నెందేఁ గంటిమే వింటిమే । క్ష్మాకాంతాధిపలోకసంగ్రహష్ణునీషం జేసితీప్రశ్నముల్ ॥ ౪౯ ॥ క ॥ అటులేనియుఁ జెప్పెదనీ । పాటిపాటితలపోఁతలెల్లఁ బోవనడుపుమా । రటముడుగు నెమ్మనమునా । కరటిగానారించి గట్టిగా వినుమధిపా ॥ ౫౦ ॥ సీ ॥ తలఁపించు నేదేవుతనువునందఖిలాండములు పయోనిధిభంగవిలసనముల । నేదేవు మహిమకు నింతయు దంతీంద్రపదమగ్నతదితరపదసమాన । మే దేవు నిజమాయ నెవ్వాఁడుఁ గడచన నేరఁడు తనమేని నీడపోలె । నేదేవుఁ డింతకు నింతగానై యంతకు నంతగానై గుఱి లేక యతిశయిల్లు । నా జగత్కర్త దుష్టసంహరణబుద్ధి । విట్టలుండనధరనుద్భవించె క్షేత్ర । పాలుఁడును బుండరీకుండు బలసి కొలువ । నుండు శీఘ్రంబునకు నేగు ముదయకాంత ॥ ౫౧ ॥ క ॥ ఏగి మహానదివారిం । దోఁగి హరిం గొలువు నిఖిలదురితశ్రేణుల్ । కాఁగిన యినుపామిషమని । మూఁగికొనినమక్షికాసమూహంబులగున్ ॥ ౫౨ ॥ తే ॥ బ్రాహ్మణునిఁ దల్లిఁ దండ్రిని భ్రాత దాత । గురుజనంబుల హింసించి క్రూరుఁడైన । శీధుపానాభిరతుఁడు దుశ్శీలుఁడైన । పాండురంగాధిపతిఁ గాంచి పరమునొందు ॥ ౫౩ ॥ క ॥ నావిని ధౌమ్యాదిమహీ । దైవతములుఁ దమ్ముగమియుఁ దనుఁ గొలువఁగ శౌ । కావహమతి భవదగ్రజు । దీవనగొని చనియె నయ్యుధిష్ఠిరుఁ డెలమిన్ ॥ ౫౪ ॥ ఉ ॥ ఆకుముదాప్తవంశవిభుఁ డంతఁ గనుంగొనియెన్ వసుంధరా । నాకము నాకుపాకశుకనాసశుకాదికసన్మునిస్తుత । శ్లోకము శోకకర్దమవిశోషణకోకహితప్రభాసము । త్సేకముఁ దాపవహ్నిజలశీకరసేకముఁ బౌండరీకమున్ ॥ ౫౫ ॥ లయగ్రాహి ॥ కంబుపునరాళచికురంబులుఁ గటీకృతకరాంబురుహయుగ్మ మళికాంబకము నగ్న । త్వంబుఁ బసిరొప్పు వెదురుం బెరుగునుడ్డపొడలుం బదములం బలుకుచుం బొదలుముఁవ్వల్ । జంబుఫలజిద్రుచిభరంబు మకరాకృతిఁ గరంబను రుగుండలములుం బరఁగఁ బంచా । బ్దంబుఁ దలిర్చు నిసువుం బతిభజించె ద్రిజగంబులకు

క్ష్వేలివెల్లువిగా. పెల్లాకంపించి=అత్యంతము వణఁకి॥ ౪౯ ॥ పాటిపాటితలపోఁతలు=కొంచెపు ఆలోచనలు. పోవనడుపుము=పోఁగొట్టుము ॥ ౫౦॥ విలసనములన్=ప్రకాశముచేత. మగ్న=అణఁగిన. కడచనన్=మీఱను. గుఱి=మేర. ఉదయకాంతున్=గౌరవాభిలాషచేత॥ ౫౧॥ తోఁగి=స్నానముచేసి. ఆమిషము=మాంసము. మూఁగికొనిన=చుట్టుకొన్న. శీధు=చెఱకుపాలచేసిన సారాయిని॥ ౫౨॥ తమ్ముగమి=తమ్ములసమూహము॥ ౫౩॥ కుముదాప్త=చంద్రుని. నాకుపాక = వాల్మీకి. శ్లోకము=శ్లాఘ్యము. విశోషణ=ఎండించునట్టి. కోకహితప్రభా= సూర్యప్రకాశముచేత. సముత్సేకము=హెచ్చినది. సేకము=తడుపుటగలది॥ ౫౫॥ కంబుపు = శంఖము. చికురంబులు = తలవెండ్రుకలు. నగ్నత్వంబు=దిగంబరత్వము. పసిన్ = ఆవులమందను. రొప్పు=తోలునట్టి. ఉడ్డ=నాలుగు. పొదరంబు—ప్రకాశాతిశయము. నిసువున్=శిశువును. రోహ

రోహణనగంబగునగణ్యున్ ॥ ౫౬ ॥ క ॥ పుష్కరిణిఁ దీర్థమాడియుఁ । బుష్కరదళనయనుమూర్తిఁ బూజించియు నా । విష్కృతశుభోన్నతియునతి । నిష్కల్మషమతియునయ్యె నృపతిమునిపతీ ॥ ౫౭ ॥ క ॥ దానంబునఁ బితృగురుసఖి । దానంబున నైన కీడుదలఁగి హరికృపా । దానంబునం జెఁగురుపతి । దానంబునరుద్భవంబు దానికిఁ గలదే ॥ ౫౮ ॥ తే ॥ ఆయతీంద్రుండు ఋత్విజుండయ్యె వేది । యయ్యె శ్రీపౌండరీకమహాస్థలంబు । పాపపశువులవిశసించిభక్తిచరువు । పాండురంగాగ్నిలో వేల్చె పాండవునకు ॥ ౫౯ ॥ వ ॥ ఇవ్విధంబున నవ్విధువంశవతంసంబు కంసమర్దనసాక్షాత్కారదర్శనంబు నాపాదించుటఁ గృతార్థుండై పౌండరీకవాస్తవ్యులగు పుండరీకాదివిద్వత్పుండరీకంబుల నొండొండఁ గీర్తించుచుం బ్రవర్తించి కతిపయదివసప్రచారుండై యచ్చటనుండి నిజానుజద్విజసనాథంబుగా గజపురంబునకుం జనుదెంచి సుఖంబుండె నట్లగుటం జేసి ॥ ౬౦ ॥ క ॥ అదియె మహాఫలమని తన । హృదయంబునఁ బౌండరీకమెవ్వఁడెఱుఁగఁడా । మెదుక చనునిదియు ముక్తి । ప్రదమని పెరతీర్థమునకుం బహునిగమనిధీ ॥ ౬౧ ॥ క ॥ వాలినదప్పి వియజ్ఝర । కూలంబున నుయ్యెద్రవ్వకు మతిగలిగినన్ । శ్రీలలనావిభుఁడుండని । నేలయు క్షేత్రమనియాఱుగనీచుఁడుగలుగన్ ॥ ౬౨ ॥ చ ॥ మసనమునందునైనఁ బురమార్గమునంబడినైననింటనైన । నసకలగర్హితస్థలమునం బ్లవగేహమునందునైననా । కసమున నీట నేలపయిఁ గంకటిమీఁదనునైన మానవుం । డసువులఁ బాసి నిష్కలుషుఁడై హరిదానగునమ్మహాస్థలిన్ ॥ ౬౩ ॥ క ॥ విను పతితుఁడైనఁ గానీ । చనితత్క్షేత్రంబునందుఁ జానోపివ్వున । గ్జననంబు గనఁడు గావున । జనులకునాస్థలమునందుఁ జనుఁదన పూర్వన్ ॥ ౬౪ ॥ ఉ ॥ అద్రిభృదుత్తరాశశతహస్తమితావనినున్నవాఁడు బో । ధిద్రుమమూర్తినైన్నృహరితీర్థనివాసులఁ గాచుపూనిరా । నో । భద్రవిచారయా భువనభర్తకునుత్తరభాగమూఁదియ । త్యుగ్రసుఖోన్నతిన్ వెలయుఁగుండలతీర్థముతీర్థరాజమై ॥ ౬౫ ॥ క ॥ విందుఁదనతోడుగుమణిమయ । కుం

---

ణనగంబు=రత్నపర్వతము ॥ ౫౬ ॥ పుష్కరదళ=తామరఱేకులవంటి. ఆవిష్కృత=ప్రసిద్ధమయిన ॥ ౫౭ ॥ దానంబునన్ = ఈవిచేత; నఱకుటచేత. ఉద్భవంబు=జన్మము. దానికిన్ = దానమిచ్చువానికి ॥ ౫౮ ॥ విశసించి=నఱకి. చరువు=హోమమునందు వేల్చుటకై వండినయన్నము ॥ ౫౯ ॥ వతంసంబు=సిగను ధరించెడిపువ్వుచెండు—శ్రేష్ఠుఁడు. సాక్షాత్కార=ప్రత్యక్షమైన. వాస్తవ్యులు= వాసముచేయువారు. పుండరీకంబులన్ = శ్రేష్ఠులను. ప్రవర్తించి = ఉండి. ప్రచారుండు=మెలఁగువాఁడు ॥ ౬౦ ॥ మెదుక=తెలివిమాలినవాఁడు ॥ ౬౧ ॥ వియజ్ఝరకూలంబునన్ = ఆకాశగంగగట్టునందు ॥ ౬౨ ॥ మసనము = శ్మశానము. గర్హిత = నిందింపఁబడిన. ప్లవగేహము= మాలయిల్లు. కంకటి = మంచము. అసువులన్ = ప్రాణములను. నిష్కలుషుఁడు=పాపములేనివాఁడు. ॥ ౬౩ ॥ ౬౪ ॥ అద్రిభృదుత్తరాశన్ = విట్ఠలదేవునికి ఉత్తరపుదిక్కునందు. బోధిద్రుమమూర్తి= రావిచెట్టురూపముగలవాఁడు. ఊఁది = అవలంబించి ॥ ౬౫ ॥ ౬౬ ॥ వేలు

డలయుగమచట దాఁ జెఁగొండగోడుగుగా । నుండునతఁడనఁగఁ దగ్గుణ । కుండలపరిపూర్ణకర్ణకుహరుఁడనగుచున్ ॥ ౧౬ ॥ సీ॥ ఆకుండలాఖ్యతీర్థాంబుధారలనాడినరకేసరిభజించునరుఁడు రాజ । సూయఫలంబొందుఁ జూవెయా వేలుపుఁ బేలికఁ జుట్టిరానేనుచేతు । లవెడల్పు నేలవాలాయంబుగాఁగ సవ్యాఢ్యియల్కి భుజించుచున్న జనుల। చేతఁ బూజలుగొను పూతనాభూతనారీహర్తబహుజనశ్రేణులందు । వారుముక్తలుధరజీవవంతులయ్యె । వారిపితరులుతృప్తులై వఱలువారు । వారుచరియించుచున్నయుర్వరయతెల్ల । దీవివారలపలుకులు దేవకథలు ॥ ౧౭॥ తే॥ ఆన్నృకేసరిభజియింతురమరకన్య । లెన్నఁబెకకుఁద్రుపారతులిచ్చియిచ్చి । వారిఁగొల్వకగర్వించువారుక్షేత్ర । మండలమునసుఖస్థితినుండలేరు॥ ౧౮॥ ఉ॥ ఆనరసింహుమౌళిమృతుమైకులకోటిసమన్వితంబుగా । మానవులూర్ధ్వలోకసుఖమగ్నతఁ జొక్కుదురెల్లకాలమున్ । దానికిగ్ర్వాసైనయయుతప్రియపుత్రుఁడె సాక్షియచ్చటన్ । గానితెఱంగులన్ మెలఁగుకష్టమతుల్ నిరయైకసంగతుల్ ॥ ౧౯॥ ఉ॥ పంకజపత్రనేత్రునకుఁ బశ్చిమదిక్కుననుండునానమ । త్పంకమహాసనాద్యమరపాలమలోలముపద్మతీర్థమో । పంకవిగూరకేలఁగలపద్మమునచ్చటదాఁచినాఁడు చ । క్రాంకుఁడుముర్త్రిదంష్ట్రమనుజాశననాశనహేతుకంబుగన్॥ ౨౦॥ క॥ ఆతీర్థతనువునకుల । త్రీమ్మతరుణీవల్లభుఁడు జీవముఁ వృజినో । పేతుఁడు ననవధిసవనో । చ్ఛ్రితఫలంబందునందు బొందివిడిచినన్ ॥ ౨౧॥ ఉ॥ పాపదురాపరూపమగుపద్మసమాహ్వయతీర్థమాళిని । రేపురుషుండుగ్రోలునొకయించుకయెన్నఁడు నేనివానికిన్ । చాపములభ్రపుష్పములుబంధనముల్ శశశాబశృంగముల్ । తాపవికారముల్ మరుజలంబులుపుట్టువులశ్మతైలముల్ ॥ ౨౨॥ క॥ ఒకఁడుసుశర్మాఖ్యుఁడుఘూ । తుకుఁడుగలఁడు కల్లుద్రాగుఁడునుముధరామ । ర్త్యకులులకఅదలఁచుంగురు । నకుఁగనకముదొంగిలుదినదినము నజపుత్రా॥ ౨౩॥ క॥ ఆవృషలీపతియావ । జ్జీవంబుగనంతనంతఁ జేసిననానాం । హోవిసరంబులుపటుమున । గోవలువడవ్రాసిచిత్రగుప్తుఁడు దాఁచెన్॥ ౨౪॥ శా॥ ఆనీచుండొకనాడువాఁడిమిఁ జతుర్వ్యాధ్యాన్వితుండై చనుం । గానం దెర్వులుగట్టియేగుప్రజలంగట్టిండియైదోఁచినీ । రానన్ రోయుచునుండిదప్పిగొని మధ్యాహ్నాతపాపాతజ।

---

పుఁటేలిక = దేవతలరాజు. భూతనారీహర్త = పిశాచస్త్రీని జంపినవాఁడు॥ ౧౭ ॥ ౧౮ ॥ క్రమోలన్ = ఎదుట. నిరయైకసంగతులు = నరకమునుఒకటినే పొందువారు॥ ౧౯ ॥ ౨౦ ॥ వృజినోపేతుఁడును = పాపములతోఁ గూడుకొన్నవాఁడును. అనవధి = మేరలేని. బొంది = దేహము ॥ ౨౧ ॥ దురాప = పొందశక్యముగాని. శాబ = పిల్ల. మరు = నీళ్లులేనిచోటి. అశ్మతైలములు = రాతిలోని నూనెలు ॥ ౨౨ ॥ అఘ = ద్రోహము ॥ ౨౩ ॥ వృషలీపతి = శూద్రదానిమగఁడు. నానాంహోవిసరంబులు = అనేకములైన పాపసమూహములు. కోవలు = దొంతులు ॥ ౨౪ ॥ ఆపాతజగ్లానిన్ = అంతటను పడుటవలనఁ బుట్టిన బాధవలని బడలికచేత. కాసరము = ఎనుఁబోతు.

గ్లానిం దత్సమయార్తకాసరముఁ బోలం జూచి యాదికుం డనన్॥ ౭౫॥ తే॥ అంతఁ గొం
తకాలమునకు గంగన మృత్యుగో । చరత నున్న యా సుశర్మ కడకు । లిఖితతత్కృతాఘలిపి
దైన పటము వి । ప్పించి చిత్రగుప్తుఁ డెంచి చూచి॥ ౭౬॥ క॥ దురితశతకోటులంద ।
ఱొకటయినను గానలేక కంపవిస్మృతిభం । గురతాయుతుఁ డై జముకడ । కరిగి తగం
బలుకు నతఁడు ప్రాంజలి యగుచున్ ॥ ౭౭ ॥ ఉ ॥ దక్కఁగ వ్రాసితి న్మును పటమ్మున
యందు సుశర్మ పాపముల్ । లెక్క యెఱుంగరాదు లవలేశము దానికి నట్టి వ్రాఁత యం
దక్కజ మిప్పు డొక్కటియు నక్షరరూపము లేదు దేవ నే । డక్కడితంబు గట్టియుడి నట్టు
లయున్నది కప్పు దేఱుచున్॥ ౭౮॥ తే॥ హృతలతాంతమైన యారామమును బోలె । వి
గతతారమైన విన్నుఁ బోలె । గళితవర్ణ మగుటఁ గళితంబు దీనికి । మీ రెఱుంగవలయుఁ
గారణంబు॥ ౭౯॥ క॥ అని పలుకఁ నమ్మహామతిఁ । గని జముఁ డిట్లని యె నీవు కవిలియ నీ
వ్రా । సిన లిపి యున్నదో లేదో । కనుఁగొను మీ సారి లెస్స గాఁ గణకవరా॥ ౮౦॥ ఆ॥ అ
నుడు నట్ల కాక యని చిత్రగుప్తుండు । దండధరుని యాజ్ఞ వెండి నేఁగి । పటము ప్రతిపుటం
బుఁ బరికించి యందు నీ । క్షించె జక్రపాణి చేతి వ్రాఁత ॥ ౮౧॥ ఉ॥ ఈతఁడు పద్మతీర్థ
మున కేగి యొకానొకనాఁడు తత్పయో । ధౌతనిజాంగుఁ డై చనుకతంబున విప్రవధాది
పాతక । వ్రాతముఁ దొంటి పుట్టువులఁ బ్రాప్తము లైన యఘంబులున్ మరు । ద్ధూతఘ
నాఘనావలులతో సరిగా సరిపోయె నన్నియున్॥ ౮౨॥ క॥ అనునర్థంబులు గల లిపి । గ
నిన నిజముఁ బలుక నతఁడు గానఁబడు నే । మును వ్రాసిన యది యన్యము । కనుపట్టె
డు నే లిఖితము కాని వినఁదగున్॥ ౮౩॥ సీ॥ అని యొప్పు కౌతుకజనకాక్షరశ్రేణి వీక్షిం
చి వచ్చితి విద్వదింద్ర । యిది మీర లెఱిఁగింపుఁ డే నాటసకృదవగాహనంబున మహాకలు
షరాశి । వలనఁ బూరుషుఁ జేరఁదలఁగు పుణ్యాపుఁ దీర్థ మెన్నఁడు గన విన నీ మదుక్త । లిపి
పట్టె నేకవారపయోభిమజ్జనమాత్రచే నణఁచిన మహిమ గలుగు । దివ్యతీర్థంబు నై భువ
మవ్యయప్ర । సాదమేదురమానసౌజ్జ్వల్యకల్య । వచనరచనల వివరింపవలయు నప్ర ।

---

౭౫॥ లిఖితతత్కృతాఘలిపి = వ్రాయఁబడిన వానిచేత జేయఁబడిన పాపముల వ్రాలుగలది ॥ ౭౬॥ భంగురత = వక్రత ॥ ౭౭ ॥ దక్కఁగన్ = అనుభవమునకు తగునట్లు. అక్కజము = వింత. కడితము = మసిపూసి గట్టనచేసిన చదరపు గోనెపట్టతోఁ జేసిన లెక్కపుస్తకము ॥ ౭౮ ॥ హృతలతాంతము = కోయఁబడిన పువ్వులు గలది. విగతతారము = పోయిన నక్షత్రములు గలది. విన్ను = మిన్ను = ఆకాశము. కళితము = కడితము ॥ ౭౯ ॥ కవిలియ = లెక్కపుస్తకము ॥ ౮౦ ॥ వెండిన్ = మఱియును ॥ ౮౧ ॥ తత్పయోధౌతనిజాంగుఁడు = ఆనీళ్లచేత కడుగఁబడిన తన దేహము గలవాఁడు. మరుద్ధూతఘనాఘనావలులతోన్ = గాలిచేత చెదరగొట్టఁబడిన వానకాలపు మేఘపఙ్క్తులతో. సరిపోయెన్ = నశించెను ॥ ౮౨ ॥ ౮౩ ॥ కౌతుకజనక = వేడుక నుపుట్టించునట్టి. సకృదవగాహనంబునన్ = ఒకతూరి స్నానముచేత. ఏకవార = ఒకసారి. పయోభిమజ్జన = నీటియందు మునుఁగుట. అవ్యయ = తగ్గని. మేదుర = అతిశయించిన. ఔజ్జ్వల్యకల్య = ప్రకాశత్వముయొక్క చాతుర్య

పన్న దైత్యలతాదాత్రభానుపుత్ర ॥ ౮౪ ॥ వ ॥ అనిననప్పద్మమిత్ర పుత్త్రుండుచిత్ర
గుప్తునకిట్లనియె ॥ ౮౫ ॥ శా ॥ ప్రాశస్త్యంబువహించుదండకమహారణ్యంబుపుణ్యా
స్థిపం । చాశతోటిపిశాలభూమి ఖలదుష్ప్రాపప్రభావోదయ । శ్రీశుద్ధిల్ గను
దానిగౌతమిగుణోత్సేకంబుకల్మిన్ హృష్టీ । కేశావాసము పౌండరీకనిలయంబీ రెంటి
గెల్చె దమదిన్ ॥ ౮౬ ॥ సీ ॥ అరుణుండుమెలుఁగుటయనిలుండు వీచుటయింద్రుండు
వర్షించుటెలజలములు । మునుఁగకతిరమౌటయును నెసంగునెవిష్ణునాజ్ఞాప్తిచేనెవ్వఁ
డఖిలజగము । బ్రహ్మనైసృజియించుఁ బద్మాక్షుఁడై ప్రోచుమద నారినైత్రుంచుమ
త్పవిభృతుల్ । లోకపాలకుల నేలోకేశుకరుణాకటాక్షంబెయధికృతియందునిలుపు ।
నావిభుండెందునుండు మర్త్యమునఁబుట్టి । భూతకోటినను గ్రహంబునఁ బెనుపుచు ।
నెందుఁగ్రుంకినుశర్మయుఁజెందెముక్తి । దానికెనవచ్చుతీర్థమీధరణిఁగలదె ॥ ౮౭ ॥ వ ॥
అనిపద్మతీర్థంబు తీర్థచరణవిహరణ చరితార్థంబగుదానినానాగుణంబులు నగణితప్ర
భావంబులనికొనియాడి ॥ ౮౮ ॥ క ॥ పెనుగృపసుశర్మఁగనుఁగొని । తనువునిమిరి
యాదరించిదండధరుఁడుచం । ద్రునిలీలఁజల్లనగుచం । దనభూషణవసనమాల్యతర్ప
ణుఁజేసెన్ ॥ ౮౯ ॥ క ॥ ఈగతిఁగృతాంతుకృపగని । సాగిచనియెనతఁడుగగనచర
యానమునన్ । నాగనరయక్షసురపున్నాగానీకములుగొలువనాకంబునకున్ ॥ ౯౦ ॥
మ ॥ అమరాధీశుఁడుగౌరవంబెసఁగఁదన్నర్ధాసనాసీనుఁజే । యమరుద్భోగములెల్లఁ
గాంచిధరయందగ్రాన్వయోద్భూతుఁడై । కమలావల్లభుఁబౌండరీకపతిసాక్షాద్బ్ర
హ్మముంగొల్చినిత్యముఁదన్మందిరరాడలంకృతియెచేయఁజాలనేలెన్ ధృతిన్ ॥ ౯౧ ॥
శా ॥ ఆపంచత్వముగాఁగనట్లుహరిగేహక్షోణిసమ్మార్జనం । బాపాదింపఘటిల్లుపు
ణ్యమునఁజంద్రావాసముంజొచ్చిహా । ర్షాపూర్ణస్థితిఁబెక్కుభోగములఁబెక్కబ్దావ
ళుల్ గాంచిధా । త్రీపాలోత్తముఁడైసుకీర్తియననుర్విం బెంపునంబుట్టుచున్ ॥ ౯౨ ॥
క ॥ అతఁడధికభక్తితోనా । యతకీర్తిస్ఫూర్తివర్తినైవెలసిజగ । త్పతినుచితపూజ
నంబులఁబ్రతిఘస్రముదెలచుభక్తపరతంత్రుండై ॥ ౯౩ ॥ ఆ ॥ అతఁడుసన్న్యసించెనఖి
లభోగంబులు । నిండువయసునాడయుండియుండి । నందనందనాంఘ్రినాళీకసేవో
ప । యోగరాగభోగమొకటదక్క ॥ ౯౪ ॥ సీ ॥ నిలువుననొలిపించెవిలువంగడము నెల్ల
శరముల యాయంబుఁబొరయుటుడిపెఁ । దగశబ్దమాత్రపాత్రముచేసె గుణలత

ముగల. అప్రపన్న = శరణాగతులుకాని. దైత్యలతాదాత్ర = రాక్షసులనెడి తీఁగలకు కొడవలివైన వాఁడా ॥ ౮౪ ॥ ౮౫ ॥ ఖలదుష్ప్రాప = దుర్జనులకుపొందరాని ॥ ౮౬ ॥ తిరము = స్థిరము అధికృతి = అధికారము ॥ ౮౭ ॥ తీర్థచరణ = విష్ణునియొక్క ॥ ౮౮ ॥ ౮౯ ॥ పున్నాగ = పురుషశ్రేష్ఠులయొక్క ॥ ౯౦ ॥ మరుద్భోగములు = దేవతలయొక్క భోగములు ॥ ౯౧ ॥ ఆపంచత్వముగాఁగన్ = చచ్చునంతవఱకు ॥ ౯౨ ॥ ఘస్రము = దినము. తెలచున్ = సేవించును ॥ ౯౩ ॥ అంఘ్రినాళీక = పాదకమలముల ॥ ౯౪ ॥ వంగడము = వంశము. ఆయంబు = వచ్చుబడి; మర్మస్థానము.

మాత్రికునఁ గట్టించె మూలబలముఁ । గంచుకివశముగావించె సేనానాథుఁ గట్టించె సహ
చరుఁగటికియెండఁ । బ్రతిపక్షభావసంగతుఁడని హితుఁ జూచె వరకేతనము కీర్తిభరము
డులిపె । ధర్మనిర్మలబుద్ధి సుశర్మఁ గదిసి । కొలువఁగా లేక చనఁ గోపగించి మదనుఁ । డు
రక తనవారలతనికి నోడుమనిరె । పతికిఁ గీడొంటబంట్లపాపంబు గాదె ॥ ౯౫ ॥ క ॥ ఆ
రాజర్షి పదంపడి । క్షీరోదన్యాయమున విచిత్రగతిఁ గల । క్ష్మారమణుఁ గలసి యేకా ।
కారంబున నలరె ముజ్జగంబులు పొగడన్ ॥ ౯౬ ॥ క ॥ వినుమఖిలదురితకులభం । జ
నమజ్జనమమృతనిధివశంబగుటకుఁ గా । వున సర్వజనోపాస్యం । బనూనమ తీర్థరా
జమనుషమమనఘా ॥ ౯౭ ॥ ఉ ॥ భూరిసుఖానుషంగములు పూరుషుఁ బొందవు సోమ
పానకైదార జలోపయోగములు తత్కలనంబసరెక్కనెత్రిన్ । బేరుశిలాకృ
తుల్ జఠరపేటికకత్తెవులేలయెందునె । వ్వారికిఁ బద్మతీర్థపతివారికిఁ జేరినఁ గల్గుసౌఖ్య
ముల్ ॥ ౯౮ ॥ చ ॥ కృతమున నేకదంష్ట్రుఁడయి క్రీడయొనర్చుచుఁ దేత్రితదక్షిత్రికా ।
ద్వితయముచే వెలుంగుచు మదించి త్రిదంష్ట్రలతోడ ద్వాపరం । బుతఁ జరించు నొక్క
దితిపుత్రుఁ దువృత్తుఁడువానిఁ బోలఁడ । ద్భుతజనకప్రతాపమున భూరిబలంబున మా
యపెంపునన్ ॥ ౯౯ ॥ క ॥ ఆహరిహయారిపార్ష్ణి । గ్రాహియన హిరణ్యకశిపు
గాదిలిసుతుఁడై । బాహాబలశిఖిఁ ద్రిజగ । ద్దాహం బొనరించె నేకదంష్ట్రయుఁ డా
నన్ ॥ ౧౦౦ ॥ క ॥ ఆయొంటిపంటి వేలుపు । దాయం బాలియించె నృహరిదంభో
ళికటు । చ్ఛాయలనూయలలూఁపున । ఖాయుధముల వఱడుఁ జీరు వ్యాఘ్రముఁ బో
లెన్ ॥ ౧౦౧ ॥ ఉ ॥ వెండియు రావణాబ్ధిఁ బ్రభవించెఁ ద్రిలోకహలాహలాకృతిన్ ।
మండుచుదంష్ట్రికాయుగమునం బెడఁగై యతికాయనాముమా । తండు ధరించి త్రేతఁ ద
లఁదర్పోఁదదుగ్రనిశాటుఁ బట్టివి । ష్ణుండని రాముఁడై విలయసూర్యకరోగ్రశరాగ్రధా
రలన్ ॥ ౧౦౨ ॥ ఉ ॥ ఆపితబద్ధవైరమతి నంతటఁ బోవక వాఁడు వెండియున్ । ద్వా
పరవేళ నిద్ధరఁ ద్రిదంష్ట్రుఁడునా నుదయించి యాంది । లక్ష్మీపతిఁ బౌండరీకవిభుఁ జేరికనుం
గొని పలుకమిక్కిలిన్ । గోపము పర్వటన్ గొలిమిగూఁడుల యూఁదునఁ గన్నులుబ్బఁ

---

మూలబలమున్ = మూలబలమును. సహచరున్ = స్నేహితుని. కీర్తిభరమున్ = కీర్తియొక్క అతిశ
యమును; అడుసునొక్క బరువును ॥ ౯౫ ॥ ౯౬ ॥ అమృతనిధి = సముద్రము ॥ ౯౭ ॥ అనుషంగ
ములు = చేరికగలవి. కైదార = వరిమళ్లయందలి. తత్కలనన్ = దానిచేరికచేత. జఠరపేటిక
కున్ = కడుపుపెట్టెకు. అత్తెవులు = ఆకలులు = ఆవ్యాధి. వారికిన్ = జలమునకు ॥ ౯౮ ॥
అద్భుతజనక = ఆశ్చర్యమును పుట్టించెడి ॥ ౯౯ ॥ హరిహయారి = ఇంద్రుని పగవాఁడు — రాక్షసుడు.
గాదిలి = ప్రియమైన. శిఖిన్ = అగ్నిచేత ॥ ౧౦౦ ॥ వేలుపుదాయన్ = రాక్షసుని. పాలియించె
న్ = చంపెను. వఱడున్ = నక్కను. చీరు = చీల్చు ॥ ౧౦౧ ॥ రావణాబ్ధిన్ = రావణుఁడ
నెడి సముద్రమునందు. త్రిలోకహాలాహాలాకృతిన్ = మూఁడులోకములకును హాలాహలవిషమువిధ
మున. బెడఁగై = అందమై. తర్పెన్ = నఱకెను. ధారలన్ = వాదరచే ॥ ౧౦౨ ॥ ఆపిత =

గన్ ॥ ౧౦౩ ॥ ఉ ॥ ఎక్కడి కేగుదెంచితి వహీనవిషౌరచికిత్స నీవు నేఁ । జక్కనొనర్చెదన్ బెలుచఁ జంపితి వ్రాంగి నీ ముకుల్ మదీయులన్ । రక్కసులన్ నినుం బొదివి ప్రాణము గొందుఁ గడంగి సాదనై । క్రుక్కఁడియున్నఁ బోవిడువఁ దొల్లిటి త్రుళ్లిఁకఁ జెల్లదిచ్చటన్ ॥ ౧౦౪ ॥ మ ॥ అని సింహంబున కల్గు వక్రక్రియ నిట్లాత్మోపముల్ పల్కియు । ద్దనుజుండంతకదండభీషణగదాదండంబునన్ వ్రేయవం । చనఁ దూలించెదదుగ్రసాధనము గంసధ్వంసితద్ఘోరతా । ఘనవేగంబున భగ్నమయ్యె కటి వేల్లత్తుల్ల కాశిక్యముల్ ॥ ౧౦౫ ॥ శా ॥ అత్యాగ్రక్ష్బధ్వజుం డప్పుడాగ్రహసహవ్యగ్రిస్ఫుఁడై దానవున్ । మొత్తెన్ మొత్తని వీఁకదక్షిణకరాంభోజంబున న్దానన । మ్మత్తుండున్ గడతేఱె నత్తుగులు గ్రమ్మన్ కముకుక్కనన్ వాతఁబెన్ । ముత్తంబుల్ గొని ప్రస్తుతించిరమరుల్ మోదించి దామోదరున్ ॥ ౧౦౬ ॥ క ॥ ఆ వెడపుదిక్కుచిక్కం । బోయతివరకానవచ్చి యున్నదిభగ్నం । బై యిప్పుడు మంత్రవర్గ । శ్రీయుతవక్షస్థలునకుజితదనుజునకున్ ॥ ౧౦౭ ॥ ఉ ॥ ఆకమలేక్షణుండు తనయక్కునఁ దాల్చిన సిద్ధమంత్రముల్ । నాకొసఁగించి సాఁడుమును నాయెడఁ గగ్గినకూర్మి పేర్మి నే । లోకమునందు నెవ్వరికి లోఁబడ నేరదు నాకుకానిత । ద్వ్యాకృతి నావుడుం బలుకుఁ బ్రాంజలియై యతఁడిందుశేఖరున్ ॥ ౧౦౮ ॥ చ ॥ పశుపతి యమ్మఁ బోలిన ప్రసన్నులపైఁ గృపచాలి యున్కిత్వా । దృశులకు నైజమా టవసుదేవతనూభవదత్తమంత్రముల్ । విశదముగాఁగ నాకొసఁగ వేనినుఁ బేఁడెద దానఁ జేసి దుః । ఖశరధి దెవ్వ సీద సనఖండ సుఖస్ఫురణంబు నొందెదన్ ॥ ౧౦౯ ॥ ఉ ॥ నావిని సూలి పల్కె మునినాయక యీమను వెందు గోప్యమై । తావిలసిల్లు నీని దురిత ప్రవణాత్ములకున్ మురారి సే । వావిముఖప్రచారులకు వైష్ణవమార్గము గానిహీనవృం । దోరివఁజరించు సజ్జనవిరోధులకుం దగదింత చెప్పఁగన్ ॥ ౧౧౦ ॥ క ॥ నీవు హరిభక్తియుతుఁడవు । గావున నాకెప్పుడు గూర్తగావున నిమ్మా । నావాసపూర్ణబుద్ధివి । గావున నీకిప్పింతు వినుము కలుషవిదూరా ॥ ౧౧౧ ॥ శ్లో ॥ స్వర్ణాద్యం సత్యనామాద్యం షష్ఠషష్ఠం సపీక్షుకమ్ । షష్ఠం షష్ఠాదిసత్యాంతం సమారంతం విదుర్బుధాః ॥ ౧౧౨ ॥ క ॥ కృష్ణుఁడు ఋషి గాఁగ మహా । విష్ణుఁడు దేవతగఁ బొల్చి వేమాఱు బుత । న్నిష్ణాత

---

పొందఁబడిన ॥ ౧౦౩ ॥ పెలుచన్ = క్రూరముగా. క్రుక్కఁడి = గర్వముడిగి. త్రుళ్లు = గర్వము ॥ ౧౦౪ ॥ ౧౦౫ ॥ అత్యాగ్రక్ష్బధ్వజుఁడు = ఆకృష్ణుఁడు. ఆగ్రహసహవ్యగ్రిస్ఫుఁడు = కోపములో వేగిరపడునట్టి మనసుగలవాఁడు. వీఁకన్ = పూనికతో. కడతేఱెన్ = చచ్చెను. మోదించి = సంతోషించి ॥ ౧౦౬ ॥ భగ్నంబై = భంగమునొందినదై ॥ ౧౦౭ ॥ అక్కునన్ = ఱొమ్మునందు. కూర్మి పేర్మిన్ = స్నేహగౌరవములచేత. తద్వ్యాకృతి = దానివిశేషాకారము ॥ ౧౦౮ ॥ పశుపతి = శివుఁడా. ప్రపన్నులపైన్ = శరణాగతులమీఁద. ఉన్కి = ఉండుట. త్వాదృశులకున్ = మీవంటివారికి. శరధి = సముద్రము. తెవ్వన్ = తెగఁగా-నశింపఁగా ॥ ౧౦౯ ॥ మనువు = మంత్రము. గోప్యము = రహస్యము. దురితప్రవణాత్ములకున్ = పాపమునందాసక్తమయిన మనస్సుగలవారికి. ప్రచారులకున్ = నడవడిగలవారికి ॥ ౧౧౦ ॥ కూర్తు = స్నేహింతువు ॥ ౧౧౧ ॥ ౧౧౨ ॥ పేర్కొను = ఉచ్చ

బుద్ధిఁ జేరఁగాను । వైష్ణవులకు నీమనువు ధ్రువస్థితి యొసఁగుఁగాఁ ॥ ౧౧౩ ॥ ఉ ॥ ఎవ్వఁడు పౌండరీకమున కేఁగి మహానదిఁ దీర్థమాడి తా । నవ్విధు నెల్లఁ దీర్చి కమలాక్షునకుం బ్రణమిల్లి నూఱుమా । ర్లి ప్పరమమంత్ర మర్థిఁ బఠియించు నతం డఖిలాఘపంకముల్ । జవు వ్వసనంగ నంగలఁడు తత్త్వమహత్త్వము సత్వరంబుగన్ ॥ ౧౧౪ ॥ క ॥ విధివంతంబుగ విధుస । న్నిధి నిచ్చలు నేఁ బఠింతు నిఖిలభవతమోవధనిధిఁ ధ్రువగుదీన్ । విధినందన తత్ప్రసాదవిభవాపేక్షన్ ॥ ౧౧౫ ॥ వ ॥ సిద్ధేశ్వరాహ్వయంబున సిద్ధలింగంబై యొండు దేసి నీవుండుదువా దక్షిణద్వారంబున నధిష్ఠించి యీమంత్రంబున ననుష్ఠించు నిష్ఠాగరిష్ఠులకు నిష్టార్థసిద్ధికరతలస్ఫటికఘుటిక యగుటని గమార్థంబు తొల్లి తీర్థయాత్రాచరణనిపుణుండగు నీలాంబరుండు నిఖిలతీర్థంబులను దర్శించుచుఁ బౌండరీకంబు సొత్తెంచి యుత్తుంగతరంగడోలారూఢకలహంసకుల కలకలారావఘుమఘుమితబ్రహ్మాండకుహరక్రోడం బగు భీమరథీనీరంబున గృతస్నానుండై యనూనమహిమాభిరామం బగు నాక్షేత్రంబునం గల విచిత్రంబులు నేత్రప్రీణనంబుగా నాచరించుచు నచ్చోట సాక్షరుండగు పుండరీకాక్షు నీక్షించి వెఱఁగంది తదక్షరలక్షణంబు నెఱుఁగనేరక యారకుండెనుండియు నవ్వే కకుండలుండు చలపకారితనంబున నవ్వర్ణంబులు నిర్ణయింపనుద్యుక్తుండై ॥ ౧౧౬ ॥ మ ॥ కరముల్ మీఁదికి సాఁచి యూరువులు బిగ్గం బట్టి యంతన్ రిపూ । త్కరముం బోవనడల్చి యట్టి తఱిఁ బద్మంబట్లు మోమొప్పఁగాఁ । జరణాంగుష్ఠనఖావలంబనముతోఁ జండాంశుఁ గన్గొంచు భా । స్వరనిష్పందపమాచరించె నొకమాసం బన్నవర్జ్యంబుగన్ ॥ ౧౧౭ ॥ తే ॥ దానఁ బ్రియమంది దానవధ్వంసి యొసఁగెఁ । గూర్మి యన్నకు ధర్మైకనిర్మలునకు । న

మ్మహామంత్ర మాతండు నంతనుండి । యది యజపియింపఁ దొణఁగె గాయత్రి వోలె ॥ ౧౧౮ ॥ క ॥ భూరిగుణరత్నరాశిఁ గు । మారుఁ గనుంగొనఁగఁ దివురు మమకారముతో । నారసి యొసంగె మున్నా । నీరజనాభుండు రుక్మిణికి నీమనువున్ ॥ ౧౧౯ ॥ క ॥ జపియించె నేను దివసము । లుపవాసపురస్సరముగ నుక్మలి నిష్ఠా । నిపుణమతిం బతి చేసిటు । లుపదిష్టంబైన మంత్ర ముత్సుక మొదవన్ ॥ ౧౨౦ ॥ ఉ ॥ నిన్ను మదీయ నేత్రశిఖివేగమునన్ జముఁ గూడఁ జన్న యి । మ్మన్మథుఁ డింపుబింబసుకుమారుఁడు భోజతనూజయందుఁ బు।

---

రించు ॥ ౧౧౩ ॥ తీర్థమాడి= స్నానముచేసి ॥ ౧౧౪ ॥ విధు= విష్ణునియొక్క. నిచ్చలు = ఎల్లప్పుడు. భవతమోవధనిధిన్ = జన్మములనెడి చీఁకటిని నాశము చేయుపనియందు. విధువు= చంద్రుఁడు. విధినందన=నారదుఁడా ॥ ౧౧౫ ॥ స్ఫటికఘుటిక= పటికపుప్రాస. నీలాంబరుండు=బలరాముఁడు. చొత్తెంచి=చొచ్చి. క్రోడంబు = నడిమి భాగముగలది. ప్రీణనంబు= తృప్తి పుట్టించుటను. ఏకకుండలుండు=బలరాముఁడు. చలపకారితనంబునన్= మచ్చరముకలవానితనమున ॥ ౧౧౬ ॥ చండాంశున్=సూర్యుని. వర్జ్యంబు=విడువఁదగినది ॥ ౧౧౭ ॥ ౧౧౮ ॥ తివురు=యత్నించు ॥ ౧౧౯ ॥ ఉక్మలి=స్త్రీ—రుక్మిణి. ఉపదిష్టంబు=ఉపదేశింపఁబడినది. ఉత్సుకము=ఉత్సాహము ॥ ౧౨౦ ॥ జముఁగూడఁజన్న=చచ్చిన. భోజతనూజ=రుక్మిణి. కడింది=అసాధ్యము ॥

క్లైవ్యమధువైరి దెల్పి సకడెంది జపంబు నేపంబునన్ బున | ర్జన్మము నొందెరా గరససంపద పెంపు యువద్వయీమతిన్ ॥ ౧౨౧ ॥ సీ ॥ బలభిదారామసంభవలతాంతశ్రేణిఁ బన్నుము నాకొకఁ చిన్ని తేరు । కాళికెం గేలిచిలుకలరాజుఁ గొని తెచ్చి నావెంటఁ బడివా గెనడుమఁ బనుపు । గగనచర దాత్రిశిగణవర్తి మకరంబు బిరుదు టెక్కెముగ వేగిర మొసర్పు । మద నగోపాలుండు మాతండ్రి చేనాకుఁ జెఱకు చేమ్రిపించుక ఱకుసిల్లు । వనజహితు వేఁడి తమ్మితూపునకుఁ దెమ్ము । దివ్యములఁ గాని సాధింపఁ దీరదీశు । నంబ నీవంచు రుక్మిణిని తుష్టునిట్టుఁ । దిరుగు శైశవచాపలార్దితుఁడు మరుఁడు ॥ ౧౨౨ ॥ చ ॥ పలుచని లేఁత కెంజిగురుబత్తళికం బెకలించి తేనియం । గొలిపిన బాసటంబు గల క్రొవ్విరితూపుల నిత్తు చాపుఁ డే । గెలుపొనఁగూర్చి నా గెలుపు కృష్ణని పట్టవుదేవి రుక్మిణీ । లలనజపించుమంత్రము బలంబున నైన దిగా నెఱుంగుమీ ॥ ౧౨౩ ॥ క ॥ సరసిజభవ రవవాయు । స్ఫురితము లై త్రిపురదహనములు త్రిజగములన్ । బురికొని నీరసయవసాం । కురసఖముగ నేర్చె మున్న కుంఠితశక్తిన్ ॥ ౧౨౪ ॥ సీ ॥ పెనుఁగంప తొడుగులీడ్చిన మొలకసనియ వ్యోగగనంబు తోరాయు కాననములు । కడులావు మానిసి కాళ్ళఁ రాచిన చీమచాల వ్యోఁబశ్వాదిజంతుపఙ్క్తి । బడెగండ్లనొంటి మై బడిన విఘ్నేశవాహముల వ్యోహరిదంతహస్తిపతులు । వనపాలురదుసులోఁ జనగ్గుకుక తాళీఫలాకృతుల వ్యోఁగులాచలములు । మృదుల గోమయపిండ సమ్మిళితకార । వేల్లఫలబీజసమమై పిల్ల ప్రజలు । కమలసంభవవరదానగర్వితాసు । రవరపట్టణనిర్భరాక్రమణవికృతి ॥ ౧౨౫ ॥ క ॥ ఈరీతిఁ గొంత కాలము । క్రూరగతిన్ సోఁకుమూఁక కుడిదలయాళుల్ । గారింపఁగ నేనంతట । వారింపఁగఁ గణఁగితిన్ భువనహితబుద్ధిన్ ॥ ౧౨౬ ॥ చ ॥ అపుడు పినాకమున్ పవిని భాస్త్రములుం గొని యేయఁ బూనితి । త్రిపురములొకట నిటలదృష్టికి లక్ష్యము చేయుచోటమ । ద్వపురుదితంబులై నశ్రమవారికణంబులు దిగ్గజాళియు । ర్విపయిఁగ డున్ వడిన్ దొఱఁగి వెల్లువ చూపి నదీత్వమొందుచున్ ॥ ౧౨౭ ॥ క ॥ మున్నేను మేననలఁదిన । ప్రసన్ననిభ సితంబున నెఁచి శ్రమవారికడున్ । జెన్నెసఁగె మంచుమలసం । చునాౖ

---

౧౨౧ ॥ బలభిత్ = ఇంద్రుని. లతాంతశ్రేణిన్ = పూలసరము చేత. చిన్ని = మనోజ్ఞమైన. పడివాగెన్ = ఎక్కుటకాయత్తము చేయఁబడినయానికితో. చరత్ = తిరుగుచున్న. వర్తి = ఉండెడి. మలిపింపు = తరిమెనపట్టింపుము. తీరదు = సరిపడదు. అర్దితుఁడు = పీడింపఁబడినవాఁడు ॥ ౧౨౨ ॥ బత్తళికము = అమ్ములపొది. బాసటంబు = సహాయము — వాఁడి. క్రొవ్విరి = క్రొత్తపువ్వు ॥ ౧౨౩ ॥ త్రిపురదహనములు = త్రిపురముల నెడియగ్నులు. నీరసయవసాంకురసఖముగన్ = ఎండిన గడ్డిమొలకపోలికగా. ఏర్చెన్ = కాల్చెను ॥ ౧౨౪ ॥ సని = మైరు. బడెగండ్లు = పెద్దకలుగులయందు. విఘ్నేశవాహనములు = పందికొక్కులు. హరిదంతహస్తిపతులు = దిగ్గజములు. తాళీఫలాకృతులు = తాటిపండ్లయాకృతిగలవి. పిండ = ముద్దయందు. వీళ్లు = పట్టణముల ॥ ౧౨౫ ॥ సోఁకుమూఁక కుడిదలయాళులు = రాక్షసులయునికిపట్టులగు పట్టణములు. గారింపఁగన్ = బాధింపఁగా ॥ ౧౨౬ ॥ పవి = వజ్రాయుధమును. వపురుదితంబులు = దేహమునందుఁ బుట్టినవి. శ్రమవారికణంబులు = చెమటబొట్లు ॥ ౧౨౭ ॥ ప్రసన్ని = ఒప్పిదమయిన

చిక్కొని ప్రవహించు సురనది పగిదిన్ ॥ ౧౨౮ ॥ క॥ భీమాహ్వయమున వర్తిలు । నా మేనం బుట్టుటం దినదిగ్నై వెలసెన్ । భూమిన్ భైమి యనందగి । భీమరథీయనంగ మాఱు పేరెసఁగంగన్ ॥ ౧౨౯ ॥ శా ॥ ఆభైమీనది విశ్వమున్ నిజకృపీటాద్రిం బుగావించుచున్ । శ్రీభామావిభుక్షేత్రమండలము డాసెన్ డాసినన్ వీచిరే । ఖాభీలంబగు దాని పెంపు గని మున్నిందుండు ప్రాణుల్ మహో । త్క్షోభోద్విగ్నమనస్కులై పెలుచ నాక్రోశించుచున్ బెంపఱన్ ॥ ౧౩౦ ॥ క ॥ భూరిభయావృతులై చని । భైరవు మదరాగరుచి కృపాపూరితదృ । క్కైరవుఁ బలుకుదురవృతా । హారులు హరిఁ బలుకు క్రియఁ గృతాంజలులగుచున్ ॥ ౧౩౧ ॥ ఉ ॥ మిక్కుటమైన పంకమున మిన్నుల గర్భము గ్రాఁగఁ బొంగినే । డొక్క మహాస్రవంతి యిదె యుత్తరదిక్కున క్షేత్రసీమపై । నిక్కె లయాబ్ధిఁ బోలె సిటనిల్వఁగ నోపము నాగహార మే । మెక్కడికేగువార మిఁక నెద్ది తెఱంగిట సిద్ధనాథుడన్॥ ౧౩౨ ॥ సీ ॥ కాళరాత్రి స్తనాగ్రకృతావకాశస్సయురము వెల్మిడి పూఁతయొప్పవెనువ । శిథిలత్వమొందిన చెంగావిజడముడి నిలుకూడి నెలపువ్వు చెంపనంటఁ । గంకాళమను బుద్ధిఁ గరమున జందెంపుఁ జిలువఁ బట్టినదిజల దరింప । నెచ్చటఁ బ్రభవించెనే తెద్దియని పల్కఁ సరభసోక్తుల జగజ్జంతులలుకఁ । బాణిస్ఫుటశీధుపాత్రంబుఁ బాఱునైచి । కుటుపుపైనున్న కిన్నెరను బుకఁ ద్రోచి । యతిరహఃకేళి నుండియు నరుగుదెంచె । భూరిజయగౌరవుఁడు కాలభైరవుండు ॥ ౧౩౩ ॥ ఆ ॥ అరుగుదెంచి యమ్మహానదిని వీక్షించి । చేతు లెత్తి బెట్టు చిట్టమిడిచి । ఘోరకోపవేగ ధీరోక్తు లులియుంగఁ । బలుకు నిట్లు క్షేత్రపాలకుండు ॥ ౧౩౪ ॥ చ ॥ నిలు నిలు తుంగభంగ మగు నిన్నుఁ గనుంగొని సాధ్వసాతివిహ్వలమతులై రి క్షేత్రతలవాసులు దానికిఁ గోపగించెనన్ । వలమురి తాల్పుఁ డింక నిటవచ్చుట మానుము మచ్చికంటినా । నిలిచి నుతింపు నన్నప్రతినిశ్చితకార్యగతిన్ జగత్పతిన్ ॥ ౧౩౫ ॥ సీ ॥ జగదుద్భవస్థితిక్షయహేతు వెవ్వఁడా దేవాది

---

న. మఱ = కొండ. సంచున్ = విధమును — అందమును ॥ ౧౨౮ ॥ ౧౨౯ ॥ కృపీట = జలము చేత. వీచిరేఖా = అలలవరుసచేత. ఆభీలంబు = భయంకరము. పెంపు = అభివృద్ధిని. మహోత్క్షోభోద్విగ్నమనస్కులు = మిక్కుటమయిన కలఁతచేత వెఱపునొందిన మనస్సులు గలవారు. పెలుచన్ = గట్టిగా. ఆక్రోశించుచున్ = మొఱపెట్టుకొనుచు. బెంపఱన్ = హీనతనొందఁగా ॥ ౧౩౦ ॥ దృక్కైరవున్ = చూపు కలువలుగలవానిని. అమృతాహారులు = దేవతలు ॥ ౧౩౧ ॥ స్రవంతి = ఏఱు. నిక్కె = వ్యాపించెను. నాగహార = సర్పహారములు గలవాఁడా ॥ ౧౩౨ ॥ వెల్మిడి = విబూది. చిలుకు = ముడి. నెలపువ్వు = పువ్వైన చంద్రుఁడు. కంకాళము = కప్పెర. చిలువ = పాము. సరభసోక్తులన్ = త్వరతోఁ డిమాటలచేత. కుటుపు = తొడ. హ్రఃకేళి = ఏకాంతక్రీడయందు ॥ ౧౩౩ ॥ బెట్టు = గట్టిగా. చిట్టమిడిచి = చిటిక వేసి. ఉలియుంగన్ = ధ్వనింపఁగా ॥ ౧౩౪ ॥ తుంగభంగభు = ఉన్నతములైన అలలుగలదానవు. సాధ్వసాతివిహ్వలమతులు = భయముచేత స్వాధీనత తప్పిన బుద్ధులు గలవారు. వలమురితాల్పుడు = శంఖమును ధరించినవాఁడు. కృష్ణుఁడు ॥ ౧౩౫ ॥ గ్రాహానిగ్ర

దేవుండుదిక్కునాకు । గ్రాహనిగ్రహమీఁగి కరిఁగాచె నెవ్వఁడా త్రిభువనాధీశుండు
దిక్కునాకుఁ । దుదిపదంబునొసంగి ధ్రువుఁగాచె నెవ్వఁడా దృఢదయామయమూర్తి ది
క్కునాకు । ద్రౌపదిబన్నంబు దలఁగించె నెవ్వఁడా దీనమందారుండు దిక్కునాకు । నె
వ్వని పదాబ్జమున జనియించు జలము । మజ్జనపుఁడైన శివుఁ డాత్మ మౌళినిలిపె । నమ్మ
హావిష్ణుఁడా కృష్ణుఁ డాగుణాబ్ధి । దేవకీనందనుఁడె యెందు దిక్కునాకు ॥ ౧౩౬ ॥ తే ॥
శరణమవు గమ్ము మద్భయజ్వరము నుడుపు । భగ్నమతినైతి కుర్కురభర్తకతన । నింక
నెయ్యది దిక్కు చక్రాంక నన్నుఁ । బ్రోవు మనిపల్కెఁ గృపఁ బల్కె దేవుఁ డేటి ॥ ౧౩౭ ॥
ఉ ॥ రమ్ము గరమ్ము ద్రోఁచి మధురప్రియభాషిణి నన్నుఁ గన్న నీ । దమ్మ జయుక్ భయ
మ్ము గలదా వలదా తురవృత్తి మున్నియో । గమ్మున నీప్రదేశమునఁ గ్రమ్మిన మజ్జనజన్మ
జాడ్యపా । శమ్ములఁ ద్రెంపు నింపు మని శమ్ము శుభమ్ములు భూతకోటికిక్ ॥ ౧౩౮ ॥
క ॥ ఉన్నతక్షేత్రస్థితిభవ । భస్మాంగజగంగకంటెఁ బావనివగుచుక్ । భస్మీకరింపు లోకా ।
పస్మారప్రాయదురితబాధాశతముల్ ॥ ౧౩౯ ॥ చ ॥ అనిమిషజాతుఁడీకరణి నాన
తియిచ్చినఁ దత్కృపారసం । బను పెనువాన నుబ్బి నక్రియక్ రయమారఁగఁ దత్ప్రదే
శమక్ । ధనువున నారిగానిగిడె దాని శరంబు గరంబు దాఁకినక్ । దునుఁగుఁ జినుంగుఁ బ్రీలుఁ
గఁ బూఁదూలు జగజ్జనజన్మలక్ష్యముల్ ॥ ౧౪౦ ॥ క ॥ ఎందుఁ బ్రవహించె నన్న । న్నం
దనయ తీర్థవిభుఁ నరసింహాఖ్యం । జెంది యదునందనాత్మా । నందమగుక్ బద్మగర్భ
సందనవింశే ॥ ౧౪౧ ॥ క ॥ అదిమొదలుగను సరస్వతి । తుదగాఁగల తీర్థములకు
నొరగ్రైనదుసక్ । బొదలు ఋషివృషభసేవిత । పదుఁడగు హరి మెచ్చు తీర్థపతి మా
నిపతీ ॥ ౧౪౨ ॥ క ॥ సాక్షాత్కరించి పద్మద । ళాక్షుఁడు వేంచేసి యునికి నత్తీర్థకు
లా । ధ్యక్షము సుసారతరళా । లక్షితముక్తావళీలలంతిం బోలుక్ ॥ ౧౪౩ ॥ క ॥
వెన్నుఁడు ప్రత్యక్షుండై । యున్నయెడకు దక్షిణాశ నొకపులినతలం । బున్నది మిన్నది
కడగను । నన్నతిఁ గన్నది శుభంబులొసఁగం బొసఁగక్ ॥ ౧౪౪ ఆ ॥ ముందునంద
గోపుమందయందుఁ జరించు । రూపధన్య యోర్తు గోపకన్య । విష్ణుభుక్తముక్త కృష్ణుఁ
డచ్చటను సిరి । మెఱఁగి యేగుదెంచె నెలుకమించి ॥ ౧౪౫ ॥ క ॥ విప్రవధూచిత
శుచివే । షప్రథితశరీరయయ్యెఁ జక్రస్తనిసా । ఖిప్రాయస్థితవికసిత । దీప్రనిజకపోల

హాయుక్ = మొసలివలనిసర్బంధమును. ఈఁగి = తొలఁగించి. పదంబుక్ = స్థానమును. బన్నం
బు = భంగమును ॥ ౧౩౬ ॥ ఉడుపుము = మాన్పుము. కుర్కురభర్త = కుక్కలరాజు ॥ ౧౩౭ ॥
మజ్జన = మ్రొక్కుచున్నజనులయొక్క ॥ ౧౩౮ ॥ భవభస్మాంగజ = శివునివిభూతిపూంతతోడి
దేహమునందుఁ బుట్టినదానా. అపస్మారప్రాయ = దేహస్మృతిలేమినిబోలిన ॥ ౧౩౯ ॥ నారి = అల్లె
త్రాడు. శరంబు = జలము; బాణము. ప్రీలుక్ = చీలును ॥ ౧౪౦ ॥ ౧౪౧ ॥ ౧౪౨ ॥ ఉనికిక్
= ఉండుటచేత. సుసారతరళాలక్షిత = పచ్చలపతకముచే గుఱుతిడఁబడిన. లలంతిక్ = మెడను వ్రే
లెడిహారమును ॥ ౧౪౩ ॥ ఆశక్ = దిక్కునందు. పులినతలము = ఇసుకదిన్నెప్రదేశము ॥ ౧౪౪ ॥
భుక్తముక్త = అనుభవింపఁబడి విడువఁబడినది ॥ ౧౪౫ ॥ దీప్ర = వెలుఁగునట్టి ॥ ౧౪౬ ॥ కుంతల

యగుచు దేవుని మ్రోలన్ ॥ ౧౪౬ ॥ సీ ॥ జలధరశ్యామకుంతలకలాపమునకుఁ బాటిం
పమి యొనవ ప్రసవకలన । దళితనీలోత్పలదళచంచదక్షుల కాషిలనం బెకాలాంజనం
బు । కుంభికుంభస్థూలకుచమండలికి జ్ఞానముద్రికర మెముత్యములసరంబు । గగన
సోదరవలగ్న ప్రదేశమునకోడ్యాణబంధం బె యొడ్డాణమిడుట । గాంగఁదపమాచ
రించినకరాలువకంటి । యంగలతికని రాకల్పయయ్యెనమరె। శారదారంభవిమలాక
భ్రసరణికరణిఁ। బ్రకృతిమధురంబులకు వేషరచనలేల ॥ ౧౪౭ ॥ శా ॥ లోకేశస్థిత
లోకవాసకృతిసాలోక్యంబునర్చింపల । శ్రీకాంతాంఘ్రియుగంబుఁ జేరుతమిసామీ
ప్యంబుసద్భక్తర । శ్రీకారిందనరూపుగానిలువుటన్ సారూప్యమున్ బుద్ధినా । కౌక
శ్శేఖరుఁగూర్చియునిరాసతిసాయుజ్యంబునొందుందుదిన్ ॥ ౧౪౮ ॥ శా ॥ స్నానా
నుక్రమవాసితాచల ఝరీసాంద్రాంబువుల్ ధ్యానసం । ధానాధీనవపుర్విలోకనని
తాంతప్రీతసారంగసం । తానంబుల్ మృదుపాదపల్లవతలోద్యత్తారకాంతిలాత్సార
స । శ్రీనద్ధాచలతుంగశృంగములుమించెం దత్తపస్సంగముల్ ॥ ౧౪౯ ॥ ఉ ॥ ఆభగ
వంతుఁడంతగరుణార్ద్రమతిన్ సతిమ్రోలనిల్చెన । భ్రాభ్రమదభ్రమబ్భ్రమమనంత
ముశాంతముకాంతివంతము । క్షోభమలోభమప్రతిమశోభనశోభియునైనమేనునా ।
నాభరణంబులంగుసుమితామరభూజమునోజరాజిలన్ ॥ ౧౫౦ ॥ ఉ ॥ ఆశరదిందు
బింబసదృశాననసూనశరాసకోటిసం । కాశురమేశురాగరసకశ్మలగాత్రయుస్రస్త
నేత్రయుక్ । పేశలబంధకైశికయుభీతిముదశ్రునిపాతముఖ్యచే। ష్టాశబలత్వసక్తతను
శంపయునైకనుమ్రింపుదాల్చుచున్ ॥ ౧౫౧ ॥ తే ॥ పృథులవిజ్ఞానరసపూర్ణభృగు
శుకాది । భావనాదీర్ఘికలయందుఁబరిణమించు । జలజదళనేత్రుపాదాంబుజములు
గేల । భీతమృగపోతలోచనబిగియఁబట్టె ॥ ౧౫౨ ॥ క ॥ కరకలితనిజపదాబ్జయు ।
విరళతరత్రపయునైన విధుబింబముఖిన్ । వరసంఛాదితఁజేసెన్ । గరుణాగుణ

---

కలాపమునకున్ = కొప్పునకు. ప్రసవకలన = పువ్వులపొందిక. చంచత్ = ఒప్పిదమైన. వలగ్న = నడుము. ప్రకృతిమధురంబులకున్ = స్వభావముచేత మనోహరములైనవానికి ॥ ౧౪౭ ॥ నాకౌకశ్శేఖరున్ = దేవతాశ్రేష్ఠుని – కృష్ణుని ॥ ౧౪౮ ॥ ఝరీ = సెలయేటియొక్క. సారంగ = తుమ్మెదలయొక్క. నద్ధ = నిక్కిన ॥ ౧౪౯ ॥ అభ్రాభ్రము = మేఘకాంతివంటికాంతిగలది. అదభ్రము = అల్పముకానిది. అబ్భ్రమము = నీటినుడిగలది. అక్షోభము = కలఁతలేనిది. అప్రతిమశోభనశోభి = ఈడులేనిశుభములచేత ప్రకాశించునది. ఓజన్ = విధమున ॥ ౧౫౦ ॥ సూనశరాసన = మన్మథులయొక్క. సంకాశున్ = పోలినవానిని. కశ్మల = మయిలపడిన. స్రస్త = చలించిన. పేశల = అందమైన. కైశిక = కీలుగంటుగలది. ముదశ్రు = ఆనందబాష్పములయొక్క. నిపాత = పాటు. శబలత్వ = చిత్రవర్ణత్వముతోడ. సక్త = కూడిన. శంప = మెఱుపుగలది. మ్రంపు = మాంద్యము ॥ ౧౫౧ ॥ భావనాదీర్ఘికలయందున్ = మనస్సులనెడినడబావులందు. పరిణమించు = సంతోషించు – వికసించు. పోత = పిల్ల ॥ ౧౫౨ ॥ విరళతరత్రప = మిక్కిలియెడమైన సిగ్గుగలది.

హారిశౌరికన్నులనగుచుఁ ॥ ౧౫౩ ॥ సీ ॥ తనుఁజూచి శిథిలబంధశిరోజయగుటనయ్యతి
వకుముక్తకేశాహ్వయంబు । దయచేసితత్ప్రార్థితములైనవరములనొసఁగియప్పసి
గాపుటసరబుద్ధి । చిఱుగుబ్బలానితక్షేత్రరాజమునకునీశానుదిక్కునసిరవుపఱిచె ।
వెన్నుఁడుతనునదిప్రేపల్లెలోరాకతఱిఁగాంచుదొష్ట్యంబుదలఁచినగుచు । దానికరముల
చేఁబీడితంబులైన । పాండురంగేశుశ్రీపాదపల్లవముల । నంగుళీమధ్యతలరేఖలంటి
యుండు । గంగప్రవహించునీటిడొంకలునుబోలె ॥ ౧౫౪ ॥ క ॥ ఆముక్తకేశదర్శ
న । మోమునికులసార్వభౌమయొసఁగునసేక । శ్రీమూర్తిదానఫలమూ । భామినిశ్రీ
మూర్తిగాఁగఁబాటింపఁదగుఁ ॥ ౧౫౫ ॥ తే ॥ అనుడువేలుపుఁదాపసియాసుశీల ।
పుత్రులేచందమునమోక్షమునకుఁజనిరి । ప్రయుతనందనుఁడెవ్వఁడేపగిదినతఁడు । నృ
హరికృపఁగాంచెననఁబలుకనీలగళుఁడు ॥ ౧౫౬ ॥ క ॥ మునివరవినుమత్యద్భుత ।
జనకచరితమైనజననిచెనినపిదపఁద । త్తనయులుమురభిత్పదవ । త్తనయులుఁగురువా
క్యకరణతత్పరబుద్ధిఁ ॥ ౧౫౭ ॥ శా ॥ భైమీతీర్థనివాసురాసకుశలుఁ బద్మేక్షణుఁ
యాదవ । స్వామిఁ సామజవత్సలుంగొలిచియైశ్వర్యంబునంబొల్చివా । రామిఁదఁ
సకళత్రపుత్రముఁగదివ్యమూర్తులైతత్తనూ । గ్రామంబెక్కిరినావుడుఁ మఱియునాబ్ర
హ్మర్షి వల్కెఁ శివుఁ ॥ ౧౫౮ ॥ ఉ ॥ హాళిమనంబునం బెరుగ నాలయిబిడ్డయిబంటుబైద
మై । మూలధనార్జనంబునిలుముంగిలియైగళదప్పుదర్పతఁ । వాలినవారికెట్టులపవర్గ
ముభర్గముకుందుఁడిచ్చెనిం । కేలకలాసమేలజడలేలకమండలువేలదండముఁ ॥ ౧౫౯ ॥
క ॥ వారలటుగాకకారణ । పూరుషులై యట్టిసతికిఁ బుట్టుటనొతుదిఁ । జేరిరిగృహ
స్థులయ్యును । సారసదళనయనుమేనిసాయుజ్యంబుఁ ॥ ౧౬౦ ॥ వ ॥ అనిననాజగదీశ్వ
రుండుసురమునితోవెండియునిట్లనియె ॥ ౧౬౧ ॥ ఉ ॥ హారివిచారసీవనినయట్లపురా
కృతపుణ్యసంపదఁ । వారలకావహిల్లెమునివల్లభదుర్లభమయ్యునయ్యమ । ర్త్యారి
విదారిషేనఁగలయంగలపూనికవారయేలయె । వ్వారుగృహస్థధర్మవశవర్తులువార
లసామ్యముక్తియుఁ ॥ ౧౬౨ ॥ సీ ॥ పరిణతయగునింతిప్రతికూలగాదేనితనయుం
డుతనయాజ్ఞ దాఁటఁడేని । నిజసహోదరులువినతులయిమనరేనికోడలొరుపుదక్కి
గొణఁగదేని । కూఁతురీలువునందుఁగొదవచూపదయేనిబుణమనుపాతకంబెనయదేని ।

---

హారి = మనోహరుఁడు ॥ ౧౫౩ ॥ పసిగాపుటసరబుద్ధి = ధూర్తురాలైనగొల్లపడుచుయొక్క. గుబ్బ
లు = స్తనములను. ఇరవుపఱిచెఁ = నిలిపెను ॥ ౧౫౪ ॥ ౧౫౫ ॥ వేలుపుఁదాపసి = దేవముని
॥ ౧౫౬ ॥ మురభిత్పదవత్తనయులు = కృష్ణునిపాదములవలనరక్షింపఁబడుచున్నకొడుకులుగలవా
రు ॥ ౧౫౭ ॥ రాసకుశలుఁ = రాసక్రీడయందునేర్పుగలవానిని ॥ ౧౫౮ ॥ హాళి = ఆసక్తి. పైద
= పిల్ల. గళదప్పుదర్పతఁ = గొంతానినగర్వముచేత. వాలిన = అతిశయించిన. కలాసము = కృ
ష్ణాజినము ॥ ౧౫౯ ॥ ౧౬౦ ॥ ౧౬౧ ॥ హారివిచార = మనోజ్ఞమయినవిచారణకలవాఁడా. అవ
హిల్లెఁ = కలిగెను. అమర్త్యారివిదారి = కృష్ణునియొక్క. ॥ ౧౬౨ ॥ పరిణత = పెండ్లాడినది. వినత

తేజోగరిమ పరాధీనతఁ జెడదే నిని౦దాంధకారంబు నెఱయదే సి। న్యాయమున నెల్లను
ల నెల్లఁడాయునే నిని। యతిథిసంతర్పణంబింటనమరునే నిని। సముచితాచారము సుగోవసా
గునే నిని। కల దెగృహమేధిధర్మంబుకంటెఁ మేలు॥౧౬౩॥ క॥ ఏనోహరమొకటియుపా।
ఖ్యానము గల దేతదర్థమది యెఱుఁగవినినన్। మౌనివరనిమనంబున। నూనినజడనుడుగున
చునుగ్రుఁడు పలుకున్॥ ౧౬౪॥ తే॥ వింధ్యమున మహాద్రిపోటికి వివిధ తారకములు మొల
పూసలుగఁ బెరుగ మదిఁదలఁచె। నెన్నఁడటమున్న కాశిలోనన్నుఁ గొలిచి। ఘటజమగు
తేజమిం పొందు నుటజమునను॥ ౧౬౫ ॥ వ ॥ అస్తభితపోధన భావవిజృంభితుండగు
నకుంభ సంభవునకు నజస్రశుశ్రూషావికస్వరహృదయంబగు శిష్యసహస్రం
బుగల దందుఁ బ్రియతుండను మునితనయులయుత నియుతులనువారలప్పారికాం
క్షికిం బ్రేమాస్పదులయియుండి రంత నొకకాలంబున నమ్మునిలోక పాకశాస
నుండు నిజాంతర్గతంబున నిట్లని వితర్కించు ॥ ౧౬౬ ॥ శా ॥ ఈనాశిష్యులలోన వీ
రువురున్ హృద్యానవద్యోదయ। జ్ఞానానూనవిచారవాగ్విభవతేజఃక్షాంతిశాంతిప్ర
థా। సానాథ్యంబునఁ గాసిపించెదరు మత్సక్తాశయుల్ వీరిస। న్మానింపం దగుఁ బా
ణిపీడనవిధానశ్రీల వాలాయమున్ ॥ ౧౬౭ ॥ శా ॥ వాసోనిగ్రహమన్నరాకకనియు
నీర్వట్టున్ గణింప ర్తలల్। మా సెంగాయ సరంగముల్ బడలినం బాటింపరిట్లుండనీ।
యాపాయంబుగ నానిశాత్యయముగా నామ్నాయముల్ గ్రోల్చుచో। నాసీనప్రచలా
యితంబయిన లేదాహో పితరింపఁగన్ ॥ ౧౬౮॥ క ॥ వీరలకుఁ దగిన మగువల। ధా
రుణిఁ బోరయంగ లేరధాతృతనయులు। న్నారఁటసకరగ్రహణాలు। గారఁటఁగొని
వత్తువారిఁ గమలజుచేతన్ ॥ ౧౬౯ ॥ వ ॥ అని నిశ్చయించి యాసత్యప్రసూఁడు సత్య
లోకంబునకరిగి ॥ ౧౭౦ ॥ సీ ॥ శశిరేఖ గైకొన్నసౌవర్ణగిరిపోలె మిసమిసఁ జెలంగు

తులు=అణఁకువగలవారు. ఈలువునంమన్ = మంచినడవడియందు. నెల్లనుల నెల్లు=ధనాధిక్య
ము— మేరలేనిధనము ॥ ౧౬౩ ॥ ఏనోహరము=పాపములనుహరించునది. జడను=ఆలస్యము—
సందేహము. ఉగ్రుఁడు=శివుఁడు ॥ ౧౬౪ ॥ ఉటజము= పర్ణశాల ॥ ౧౬౫ ॥ అస్తంభ= నివా
రింపఁగూడని. అజస్ర= ఎడతెగని. వికస్వర = వికసించిన. పారికాంక్షికి= మునికి. మునిలోక
పాకశాసనుండు= మునులసమూహమునకు శ్రేష్ఠుఁడు. అంతర్గతంబునన్= మనసునందు. వితర్కిం
చున్= ఆలోచించెను ॥ ౧౬౬ ॥ హృద్య= మనోహరము. అనవద్య=నింద్యముకానిదియునై.
క్షాంతి=ఓర్పు. శాంతి=తిన్నఁదనము. ప్రథా=ప్రసిద్ధి. సానాథ్యంబునన్=కూడికచేత. మత్సక్తా
శయులు=నాపాదములయందాసక్తమయినమనస్సుగలవారు. పాణిపీడనవిధానశ్రీలన్ = పెండ్లి
చేయుటవలని సంపదలచేత. వాలాయమున్ = అవశ్యము ॥ ౧౬౭ ॥ వాసోనిగ్రహము= వ
స్త్రములేమి. నీర్వట్టు= దప్పి. అపాయంబుగన్= తెల్లవాఱినదిమొదలు ప్రొద్దుగ్రుంకునంతవఱ
కును. ఆనిశాత్యయముగాన్= ప్రొద్దుగ్రుంకినదిమొదలు తెల్లవాఱునంతవఱకును. ఆమ్నాయము
లు= వేదములు. గ్రోల్చుచోన్= వల్లించునపుడును. ప్రచలాయితంబు=కూరుకుపాటు. అహో=
ఔరా! ౧౬౮ ॥ సకరగ్రహణాలు=పెండ్లితోఁగూడినవారు—పెండ్లియయినవారు॥౧౬౯॥౧౭౦॥

గూడి మెఱయువాని । నసురేజ్యుఁ బాటించు హాటకాద్రియుఁ బోలె నెంచ చెంగటనుం
డనలరువాని । శారదాభ్రములంటు భూరిశైలముఁ బోలె చెలువుఁ గ్రైసేఁతల వెలయు
వానిఁ । గకుబిభంబుల మీఁది కాంచనాగముఁ బోలె వెలితమ్మిగద్దియ వెలయువానిఁ ।
బొడవులన్నియుఁ దనయంద పొడమువానిఁ । గడయు నడుమును మొదలు నేర్పడనివాని ।
సచ్చిదానందకందమై హెచ్చువాని । నలువఁ జుళుకితపాథోధి తెలచెనుతుల ॥ ౧౭౧ ॥
క ॥ తెలచిన మొలచిన కృపకుం । గలఁచిన మదితోడ నతనిఁ గమలజుఁ డగ్ర । స్థలినినిలి
పి పలుకులపస । ధళధళలు ముఖప్రఘాణతలములఁ బొలయన్ ॥ ౧౭౨ ॥ సీ ॥ హుం
కారములు లేవె యుపపురందరహాతో త్పాటనంబునకుఁ బాల్పడవుగాక । భ్రూ
భంగములు లేవె యాభీలవింధ్యగర్వ స్తంభనమునకు రావుగాక । చులుకాకృతులు లే
వె జలరాశి నిశ్శేష శోషణక్రీడకుఁ జొరవుగాక । జాఠరాగ్నులు లేవె జటితాపివాతా
పితను దాహమున నెదురొడ్డనవుగాక । నిష్ఠనీమాడ్కి లోకప్రతిష్ఠఁ గాంచి । దుష్టనిగ్ర
హశిష్టసంతుష్టి హేతు । గోషభీషణ రేఖానిరూఢగాథ । లీలఁ గ్రీడించు ప్రోడలు లేరు
గాక ॥ ౧౭౩ ॥ తే ॥ భువనసంభవదుపసర్గనివహశాంతి । త్వన్ముఖంబునఁ జనఁ బె
ద్దతనముతోడ । నిందుధరుఁడన హరియన నేననంగఁ । బొల్చు గంటిమి మిత్రావరుణ
కుమార ॥ ౧౭౪ ॥ సీ ॥ అనియాదరించి యమ్మునివచ్చుటకుఁ బ్రయోజనముఁ దద్విశే
దోక్తిసరణిఁ దెలిసి । యీపద్ధియగుటకు నిది యెంతయని శతా నందుండు మున్నొక్క
నాఁడు నిఖిల । యువతిసృష్టికి నెక్కుఁడవుగాక యని తన యాత్మ నిర్మించి గాయత్రియని
యు । సావిత్రియనియుఁ బ్రశస్తనామములిడ్డ కూఁతుల నొసఁగఁ గైకొని యతండు ।
వారినటఁ దెచ్చి తనకూర్చువారిఁ గూర్చి । యయుతనియుతులకెఱఁగింపనందు నయు
తుఁ । డొల్లఁడయ్యె నిజోద్యోగ మొల్లకున్న । నియుతునకుఁ బెండ్లిసేసెఁ గన్నియలదో
యి ॥ ౧౭౫ ॥ క ॥ తనయాజ్ఞ గూడ శతధృతి । తనయామణిఁ గైకొనని హతనయాశ
యునిన్ । మునుచట్టు వెడల నడిచెను । మునికనలి కఠోరవర్ణముగఁ బలుకొలయన్ ॥

---

సౌవర్ణగిరి = మేరుపర్వతము. మిసుకుఁజేడియన్ = సరస్వతిని. అసురేజ్యున్ = శుక్రుని. చెంగటన్ =
సమీపమునందు. పైసేఁతలన్ = అలంకారముల చేత. కకుబిభంబుల = దిగ్గజముల. వెలి = తెల్ల
ని. గద్దియన్ = సింహాసనమునందు. పొడవులు = రూపములు — ప్రాణులదేహములు. పొడ
ము = పుట్టు. కందము = మూలము. చుళుకితపాథోధి = పుడిసిటఁ బట్టిన సముద్రముగలవాఁడు — అ
గస్త్యుఁడు. తెలచెన్ = సంతోషపెట్టెను ॥ ౧౭౧ ॥ అగ్రస్థలిన్ = ఎదుటిప్రదేశమునందు. ప్రఘా
ణతలములన్ = తలవాకిటిముందరిగదులందు. పొలయన్ = వర్తింపఁగా ॥ ౧౭౨ ॥ భ్రూభంగ
ములు = బొమముళ్లు. స్తంభనమునకున్ = నిలుపుటకు. చులుక = పుడిసిటియొక్క. జటితాపి = బు
ములను తపింపఁజేయువాఁడైన. ప్రోడలు = నేర్పరులు ॥ ౧౭౩ ॥ ఉపసర్గ = ఉత్పాతములయొక్క.
చనన్ = జరఁగఁగా ॥ ౧౭౪ ॥ ఎంత = ఎంతమాత్రము. శతానందుండు = బ్రహ్మ. కూర్చు = ప్రియ
మైన ॥ ౧౭౫ ॥ శతధృతి = బ్రహ్మ. హతనయాశయునిన్ = కొట్టఁబడిననీతికిఁ డునికిపట్టయినవానిని.

౧౭౬ ॥ సీ.॥ కుటిలాలకములు చీఁకటిప్రోఁగులగునైనఁ జిచ్చంద్రికాఢ్యముల్ చిత్తగతులు । మధురోష్ఠములు రాగమహితంబులగునైన భావముల్ వైరాగ్యబంధురములు । గురుకుచంబులుగర్వభరితంబులగునైన హతదుర్వికారంబులాశయంబు । లలవోకనడలుమాంద్యమయంబులగునైన నంతరంగములుబోధాస్పదములు । పొగరుజూపులుచపలంబులగుననైన । నిండుమనములుమిక్కిలినిశ్చలంబు । లపురవిరులకననొప్పనతివలందు । నిలిపెసమబుద్ధిప్రియమూనినియుతమౌని॥౧౭౭॥ క॥ ఈతఁడిటులుండనునుపటి। యాతఁడుహృల్లగ్నగురుకృతానాదరుఁడై । శీతనగసవిధవసుధకు। నేతెంచిమనోగతముననిటులూహించెన్॥ ౧౭౮ ॥ చ ॥ చిలుకలుకమ్మఁదెమ్మెరలుశీతమయూఖుఁడుచేఁటులాదిగాఁ। గలననవిల్తుసాధనని కాయము వేలముపట్టులంగనా। కులముటుగానదానివిడఁగొట్టకతృట్టైకదొట్టిపీతరా । గులమనిపిల్వఁబీఁగెదరుకొందఱుబోడలునానగండలై ॥ ౧౭౯ ॥ క॥ జడలంటచుట్టంగట్టం । గడవసమంటమేనఁగట్టఁగాషాయమ్మఁటే । యుడవులనవయుతపస్వికిఁ । గడుసౌఖ్యమెకోరుసతికిఁ గలయికతగునే ॥ ౧౮౦ ॥ సీ ॥ఊర్వీధరములెక్కియుఱుకనేకుచకుంభయుగమెల్లఁగాకతానుఱుకుమనిన । వాఁడికైదువులపైవ్రాలనేనిడుచూపువాలొల్లఁగాకతాఁబ్రాలుమనిన। మున్నీటసుడివడిమునుఁగనేనతనాభిఁగనన్నొల్లఁగాకతామునుఁగుమనిన । బెడఁగారుకాలాహిఁదొడుకనేనూఁగారుతొడుసొల్లఁగాకతాఁదొడుకుమనినఁ । జెప్పిగురుఁడేమిపనిచినఁజేయలేనె । కావెతనసౌమ్యమామకకాయకష్ట । గతులుమొఱ్ఱోయనంగలింగంబుగట్టు । జంగమననంగసలఁగూర్పఁజనునుగాక ॥ ౧౮౧ ॥ తే॥ నెయ్యుఁడట్టిపనికినియుతుఁడతగుఁగాక । గృహితకంటెవేఱెకీడుగలదె । గురుహితంబునూఁదియుఁదఁబడనేనొప । ననుచుబ్రహ్మచర్యమయుతుఁడొంది ॥ ౧౮౨ ॥ మ ॥ సుముఖాంతఃకరణంబుమత్సరమునౌత్సుక్యంబునుంబాసిధా । తమణిదర్పణదీప్తిఁజెన్నగఁదదంతర్లగ్నమైయాదిత । త్త్వముదీపింపఁదపంబొర్చుజటిలవ్యాఘ్రుంబనాఘ్రాతపు । ష్పముచందంబగుమేననూననియమభ్రాష్ట్రాగ్నిఁదగ్గించుచున్ ॥ ౧౮౩ ॥ క ॥ సర్వా

---

చట్టున్ = శిష్యుని. కనలి=కోపించి. కఠోర=కఠినమైన॥౧౭౬॥ చిచ్చంద్రికాఢ్యములు= జ్ఞానమనెడివెన్నెలలుగలవి. అలవోక= ఒయ్యారమైన. బోధ=తెలివి. పొగరు=వాఁడియైన॥ ౧౭౭॥ హృల్లగ్న = మనసుసందుఁబొందిన. సవిధ=సమీపపు. మనోగతమునన్=మనసునందు॥౧౭౮॥ కమ్మఁదెమ్మెరలు = పరిమళముతోడిచల్లగాలి. ననవిల్తు = మన్మథుని. వేలముపట్టులు = శిబిరస్థానములు. తృట్టు=ఆశ. ఏకదొట్టిన్ = ఎచ్చుగా. నానగండలు=సిగ్గులేనివారు ॥ ౧౭౯ ॥ కడవసము = తోలు—కృష్ణాజినము. నవయు=కృశించు. కలయిక=చేరిక ॥ ౧౮౦॥ బెడఁగారు=అందగించు. తొడుకనే = పట్టనా. తొడుసు=తగులు॥ ౧౮౧॥ నెయ్యుఁడు=మిత్రుఁడు. గృహిత = గృహస్థత్వము ॥౧౮౨॥ ఔత్సుక్యము=తమకము. అంతర్లగ్నము = లోసలనాటినది. జటిలవ్యాఘ్రింబున్ = ఋషిశ్రేష్ఠుని. భ్రాష్ట్రాగ్నిన్ = వేఁపుడుమంగలపునిప్పచేత॥ ౧౮౩ ॥

తిరిక్తవృత్తియగు । నుర్వీసురసార్వభౌమునుగ్రతపమునం । బర్వెభయజ్వరదాహ
మ । ఖర్వోద్ధతినిఖిలభువనగర్భములందున్ ॥ ౧౮౪ ॥ క ॥ మినుమినుకుమినుకుమనియెన్ ।
బెనుమినుకులబరణిధరణిబిట్టూటాడెన్ । వననిధులువిరిసెగురిసెన్ । గనగనగనమను
చునివ్వకలుగుప్పలుగన్ ॥ ౧౮౫ ॥ ఉ ॥ అత్తఱినివ్వద్రొక్కినటులౌదలఁదేల్గా
నినట్టులావయు । న్నెత్తుగఁదాఁవినట్లువిబుధేశుఁడు మాణవకోగ్రనిష్ఠతన్ । జిత్త
మునందపించియతిశీఘ్రగతిన్ క్షితికేగుదెంచెద । ద్వృత్తముమానిపింతునని వృద్ధమ
హీసురవేషధారియై ॥ ౧౮౬ ॥ సీ ॥ జీర్ణైణకృత్తివేష్టితశాస్త్రశబళికావారపేటిక
లొక్కటపటువుప్రానఁ । గంబళకటబ్రుసీకాషాయకరకంబులొక్కటియంతేవాసియు
ద్వహింప । నాల్మికాఫలసారయవసక్తుతండులసూపాదులొక్కటశిష్యుండుమోవ । స
మిదాజ్యపూరకీచకకుచస్రుక్స్రువచయమొక్కటఛాత్రుండు సంగ్రహింపఁ । దలుగు
దామెనఁబెనఁచినగళముతోడ । జంటవెన్నాడుకేళిపుత్రోఁజాలనలసి । నడచుధేనువు
నొకచిన్నవటుగురొప్ప । నయుతునాశ్రమవాటమయ్యతిథిడాసి ॥ ౧౮౭ ॥ క ॥
శిరసువడఁకఁగ బెల్లఁగ । నరసినగృహమేధినియును నడచెదదంగం । బిరవుకొనిప
ట్టుచాలక । జరకొంతవినిర్గమించిచనుదెంచు క్రియన్ ॥ ౧౮౮ ॥ వ ॥ ఇట్లుకుహనా
హితాగ్నియుఁ దైర్థికవేషాభినయనిపుణుండు నగు నాఖండలుండు తపఃప్రభావత
రంగితంబగు తదాశ్రమంబునఁ బటకుటికామండప మధ్యంబున నధ్యాసించి మాధ్యా
హ్నిక క్రియాచరణానంతరంబునం బ్రాణాగ్నిహోత్ర ప్రీణనంబు ననుసంధించి
యతిస్నిగ్ధవర్ణము గ్ధాకృతియుఁ జతురపదవిన్యాస ధన్యాసికయునై కవి కవితయుం
బోలెనున్న హోమధేనువునకుఁబథశ్రమంబునోసరించుచునుచితగతినొక్కించుకత
డవువిశ్రమించి సచ్ఛాత్రుండై మెత్తమెత్తన చని యొండకండక్రొవ్వుదఱుఁగున త్తఱి సరిత్తి

---

అతిరిక్తము = మీఱినది॥ ౧౮౪॥ బెనుమినుకులబరణి = సూర్యుఁడు. విరిసెన్ = పొంగెను॥
౧౮౫॥ తేల్గానినట్టులు = తేలుకుట్టినట్లు. ఉవ్వెత్తుగన్ = మిగులులేకుండ—అధికముగా. మాణ
వక = బ్రహ్మచారియొక్క. వృత్తము = వ్యాపారము॥ ౧౮౬ ॥ జీర్ణైణకృత్తివేష్టిత = పాఁతకృ
ష్ణాజినముచేతచుట్టఁబడిన. శబళికా = నానావిధమయిన. బ్రుసి = యతులయాసనము. కరకం
బు = కమండలువు. అంతేవాసి = శిష్యుఁడు. ఉద్వహింపన్ = మోయఁగా. సక్తు = పిండి. కీచ
కకుచ = వెదురుపోల. స్రుక్స్రువచయము = హోమము వేల్చుకొయ్యగరిటెలసమూహము. ఛా
త్రుండు = శిష్యుఁడు. తలుగు = పలుపు. వెన్నాడు = వెంబడించు. కేళిపుత్రోన్ = దూడతో. వ
టుఁడు = బ్రహ్మచారి. రొప్పన్ = తోలఁగా॥ ౧౮౭॥ గృహమేధిని = ఇల్లాలు. పట్టు = చోటు.
జర = ముసలితనము. వినిర్గమించి = బయలువెడలి॥ ౧౮౮॥ కుహనాహితాగ్ని = కపటగృహస్థుఁ
డు. తైర్థిక = తీర్థయాత్రచేయువాఁడైన. తరంగితము = అతిశయించినది. పటకుటికామండపమ
ధ్యంబునన్ = గుడారపునడిమిప్రదేశమునందు. అధ్యాసించి = కూర్చుండి. ప్రీణనంబు = తృ
ప్తి. ధన్యాసిక = ధన్యత్వముగలది. ఓసరించుచున్ = తొలఁగించుచు॥ ౧౮౯॥ అమృతభుక్ = దే

రంబునకు సాయంసంధ్యాసముపాసనార్థంబు నిర్గమింపనుద్యుక్తుండైయుక్తసమా
ధియగు నయుతునికడకుం జనుటయు నతం డతనికి నాతిథేయంబు ప్రియంబున నాచ
రించి సుఖాసీనుం గావించి యాగమనకారణం బడుగుటయుం గృత్రిమముని ధాత్రీసుర
పుత్రున కిట్లనియె ॥ ౧౮౯ ॥ చ ॥ అమృతభుగాస్పదంబు విశదాప్సరముం గనవపారి
జాతము । క్ష్మామహీజ రాజి రాజిత మనంతఫలాయతనంబు నిత్యర । మ్యము నెగునా
కఁట యాశ్రమము హైమనగోపరిసీమ నుల్లసి । ల్లు మదధివాసమై మదనులోభముఁ గ్రో
ధము మొల్వ దచ్చటన్ ॥ ౧౯౦ ॥ క ॥ శ్రీసఖులు సుగుణరత్నా । వాసులు సమవర్తన
ప్రవర్తులు నయ్యున్ । నాసరివారలు గనిమనఁ । గాసుఖులై యేనొనర్తుఁ గాఁపురమ
చటన్ ॥ ౧౯౧ ॥ తే ॥ అఖిలధర్మంబులందు గార్హస్థ్యమెన్న । నుత్కటంబని తన్ని
ష్ఠవోర్పు గలిగి । జగతిఁ దీర్థాచరణబుద్ధి సంచరింతు । ధ్రువతపోగామియౌ మేను
ధ్రువముగామి ॥ ౧౯౨ ॥ ఉ ॥ కంచిభజించి శేషగిరిఁ గన్గొని యాదిమురంగధాముఁ
గీ । ర్తించి ప్రయాగమాధవు నుతించి గయా ప్రియు శ్రీగదాధరున్ । గాంచి కరిద్విష
న్నగశిఖామణికిన్ బ్రణమిల్లి వార్ధినే । తెంచి సకొయ్యవేల్పుఁ గనిడకుకఁట తీర్థములెల్ల
నాడుచున్ ॥ ౧౯౩ ॥ ఉత్సాహ ॥ వచ్చివచ్చి కల్పకంబు వంటి యొంటివానిఁ గ ।
న్నిచ్చవచ్చు గ్రచ్చకాయ లెంచి యాడువాని మో । విచ్చునచ్చ గంటివాని వింటివెన్న
ముచ్చు న । ప్పచ్చవిల్తుఁ గన్నతండ్రిఁ బాండురంగవిట్ఠలున్ ॥ ౧౯౪ ॥ వ ॥ వినియ
ద్దేవాదిదేవు సేవింపం జనువాఁడనై పైజాడసపరిచ్ఛదంబుగా నేగుదెంచితిని వెవ్వఁడ
వెద్దియభిలషించి భువనభయానకంబగు తపంబాచరించెదు వాచంయమవంశకంఠీర
వంబ యీశరీర సాదంబునకు నాది కారణంబగు నీహృదయంబని యుచ్చరించుటన
వోరుపోకుఁచున్నయది యున్నయట్లనొడువుమనుడు నవ్వడువిట్లనియె ॥ ౧౯౫ ॥ క ॥
ప్రయుతుఁడను మునికుమారుఁడ । నయుతుండను వాఁడనయుతుసగ్రజుఁడఁగత । స్మయ
విస్మయావహతపో । నియతి వెలుఁగు కలశజన్మునికి శిష్యుండన్ ॥ ౧౯౬ ॥ క ॥ కుల
శిఖరినిభుఁ డతనకుం । గలశిష్యులలోన నెల్ల గారవమారం । గలశీసుతుండు కరుణా ।
కలితలదృష్టి బెరయఁగా మముఁ జూచున్ ॥ ౧౯౭ ॥ ఉ ॥ దాతయు దైవముం గురుఁడుఁ
దల్లియుఁ దండ్రియునైయభేద్యవి । ద్యాతిశయంబు రాఁజొనిపి యమ్ముని మున్నొ
కనాఁడు ధాతృసం । జాతలసత్స్మితాస్యజలజాతల జాతలతాంతసాయక । ద్యోత

---

[illegible] విశదాప్సరము = తేటనీళ్ల సరస్సులుగలది; పరిశుద్ధులయిన యప్సరస్త్రీలుగలది. ఆయతనము = ఇల్లు ॥ ౧౯౦ ॥ ౧౯౧ ॥ ఉత్కటము = హెచ్చైనది ॥ ౧౯౨ ॥ ఆదిమున్ = మొదటివానిని. కొయ్యవేల్పున్ = జగన్నాథుని ॥ ౧౯౩ ॥ పచ్చవిల్తున్ = మన్మథుని ॥ ౧౯౪ ॥ సపరిచ్ఛదంబుగాన్ = పరిజనముతోఁ గూడ. సాదంబునకున్ = నాశమునకు. వడువు = వడుగు - బ్రహ్మచారి ॥ ౧౯౫ ॥ గతస్మయ = పోయిన గర్వముగలవాఁడా ॥ ౧౯౬ ॥ గౌరవము = శ్రేష్ఠము. బెరయఁగాన్ = వ్యాపింపఁగా ॥ ౧౯౭ ॥ ధాతృసంజాతలన్ = బ్రహ్మకొమార్తెలను. ద్యోతకన్ = తోఁపించువా

ళనాకరులయిద్దఱుతలోదరులన్ మమ్ముఁజూచియిట్లనున్ ‖ ౧౯౮ ‖ క ‖ మీకనికొనితె
చ్చితినా । శ్రీకాంతనువేఁడియన్నలినసయనలమీ । రోకుజ్జిలారపాణి। స్వీకృతిజ్యేష్ఠా
నుపూర్విఁజేకొనుఁడనుడున్ ‖ ౧౯౯ ‖ క ‖ అవగుణగణశేవధులగు । ధవళాత్ములకీ
వుదలఁచిదారాదరణ । వ్యవహృతికిమాఱుమొగమిడి । యవుగాదనికొన్నిమాటలా
డితివతనిన్ ‖ ౨౦౦ ‖ క ‖ ఆడినఁగూడినకినుకన్ । వీడినజడముడియుఁ బొంగలివెడ
లెడిచూపుల్ । పోఁడిమిగొనుసిట్టూర్పులు । వాడిన డెందమును మేనవడియుఁజెమ
రునై ‖ ౨౦౧ ‖ క ‖ శపియింపఁగఁదలఁచియున । త్తపసియుడిగెఁగవఁదలఁచితా
నెయుడుగుపా। ముపగిదిశిఖివిడినంతనె । విపులామరవిపులకోపవిషముందిరుగున్ ‖
౨౦౨ ‖ క ‖ ననువెడలనడిచినాత । మ్మునికివివాహంబొనర్చెమునికనకవిభా। జన
కతనుద్యుతివిభవల । వనరుహభవమానసోద్భవలనాకవలన్ ‖ ౨౦౩ ‖ క ‖ సలస
లమనుకలశజువె । గ్గలపుంగినుకయను నెసటఁగలవడివడిసా । దలయంటిచూచుకొ
నియే । నిలువెడలితి నాతుణంబయొత్రిసభీతిన్ ‖ ౨౦౪ ‖ తే ‖ విషనిభంబులైనవిష
యాభిలాషంబు । లెల్ల జెల్లఁబెట్టియేనుబ్రహ్మ । చర్యధుర్యవృత్తి సవరించుచున్నాఁ
డ । నుగ్రతపముమోతుమొందుకోరి ‖ ౨౦౫ ‖ క ‖ అనుడుదరహాసరసముసఁ।దన
వదనజరద్వృధుండుతారుణ్యముగై । కొనసమందాందోళనమే।ళసమునశిరమమరమా
యలాఁడిట్లనియెన్ ‖ ౨౦౬ ‖ చ ‖ ప్రయుతుఁడుమత్సఖుండతనిప్రాభవమున్ భవ
మున్ సుధీజన । ప్రియజనకంబులాగుణగరిష్ఠుని జ్యేష్ఠతనూజుఁడౌట మ । న్నయన
యుగంబుహర్షసుధనానైసినుంగనుఁగొన్నసాధుబో । ధయుతభవద్విరుద్ధచరితంబు
శ్రవఃపుటసూచియయ్యెడున్ ‖ ౨౦౭ ‖ మ ‖ కులధర్మంబెడలించిశ్రీగురునకున్ గో
షంబుపుట్టించిమి। త్రులసాభాగ్యనివాసదేశములనీతోఁబుట్టులంబాసిని । శ్చలతన్
వేలెదవుట్టిగట్టుకొని దుస్సాధంబుసుమ్మీస్మర । జ్వలనజ్వాలికసోఁకనీకనిలుపన్ జ్ఞా
నామృతస్యందమున్ ‖ ౨౦౮ ‖ చ ‖ చలనవిహీనవృత్తిసడిసన్నపరాశరుఁడాదిమైన
యు । య్యలయలరాయివంటిహృదయంబులు నీరుగఁజేయుబోయవూ । విలుతున
కెంతదొడ్డపనివెన్నెలబిట్టుకాసినంతలో । పలనకరంగిపొంగు పసిబాలురచిత్తము
మెత్తచేయఁగన్ ‖ ౨౦౯ ‖ మ ‖ లలితాగారవిహారులై మణిమయాలంకారులై

---

రిని ‖ ౧౯౮ ‖ ౧౯౯ ‖ శేవధులు=నిధులు. వ్యవహృతి=వ్యవహారము ‖ ౨౦౦ ‖ చెమరు=చెమట ‖
౨౦౧ ‖ ౨౦౨ ‖ విభాజనక = కాంతినిపుట్టించుచున్న. కవలన్=అమడలను. ౨౦౩ ‖ వెగ్గలపుం
గినుక = అధికకోపము. ఎత్తిన=హెచ్చిన ‖ ౨౦౪ ‖ సవరించుచున్నాఁడన్ = జరుపుచున్నాను ‖
౨౦౫ ‖ జరత్ = ముదిసిన. మంద=మెల్లని. ఆందోళన = ఊఁగించుటతోడి. మేళనమునన్ =
కూడికతో. మాయలాఁడు = మాయకాఁడు ‖ ౨౦౬ ‖ హర్షసుధనానైన్=సంతోషామృతమున
ముభవించెను. శ్రవఃపుట = దొప్పలవంటిచెవులకు. సూచి=సూది ‖ ౨౦౭ ‖ ఎడలించి=తొలఁ
గించి. దుస్సాధంబు=సాధింపరానిది. స్మరజ్వలనజ్వాలిక = మన్మథాగ్నిజ్వాల. స్యందమున్ =

శీలవ । ల్లలనాలాలితులై యమూల్యమృదుచేలద్యోతితాకారులై । కలమాన్నప్రియు
లై సుగంధధరులై కందర్పునింబోనిభూ । తలనాథుల్ జనకాదులొందిరి కదా తత్తా
దృగానందముల్ ॥ ౨౧౦ ॥ మ ॥ కెలలోవార్తలువిప్పిచెప్పెదుక్రియన్ గాధాపురా
ణార్థముల్ । దెలుపన్ నేర్తురుగాని నేరరుసుమీ తీవ్రవ్రతాచారశ । ష్కులులై యుం
డెడుముండధారులు సుముక్తుల్ డాయఁగాఁజింతకా । యలకజ్జాయముతోయమింత
చదరంబాతత్పరిష్వంగముల్ ॥ ౨౧౧ ॥ మ ॥ వరసారస్వతపట్టభద్రులు కవుల్ వర్ణించిన
ట్లెంచియున్ । సరసావంతయుఁగానలేరు తుదయోషావిభ్రమాంభోధికిన్ । విరసాం
తఃకరణుండవై యెటులుగా నిందించెదో యయ్యతి । స్మరసాకారము దార్ఢమన్మథక
ళాసర్వస్వశృంగారమున్ ॥ ౨౧౨ ॥ సీ ॥ కేలారమున నుండి పాలింటికే తేర బహు
ధాన్యములు చేలఁ బండియుండఁగ । నెడనెడఁ బెండ్లిండ్లు వడుగులు వ్రేడమఁగృతార్థులై య
ర్థించు నర్థులలరఁ । బరిచారికాకోటిపనిపాటు పాటింపఁ జుట్టంపు సందడి నెట్టుకొనఁ
గ । గ్రామమెంతయు నిజప్రాభవంబున మనసత్యనిష్ఠకుఁ దన్ను సాక్షిగోర । నిత్యనై
మిత్తికములు నిర్ఛిద్రబుద్ధి । నాచరించుచు హరిభక్తమాత్మభార్య । భక్తి నిడభుక్తిగా
నుచు నిరాముక్తిగాని । నిదురవంటిది జాయి వంటిదియుఁగాదు ॥ ౨౧౩ ॥ క ॥ అనిత
నునీక్రియబోధిం । చినజరఠతపస్విపలుకుచిత్తాభోగం । బునఁ బెనఁగనీక ప్రయుతుని ।
తనయుఁడు తనయుండు బిగివదలకిట్లనియెన్ ॥ ౨౧౪ ॥ ఉ ॥ పుకిటియోవరింజదు
వుపుత్తడి పత్తినపెద్దనైనమీ । రొక్కొకవేళ పాటవము నొందమిఁ జెందినఁ జక్కఁ
బెట్టువా । రకటకటయొక్కటన్ బెడఁకియాడినఁ గీడనవ్వఁడో వుఁబే । రుకుటినవేలు
నికిచననొకఁడువంకలు నొకరిశక్తుఁడే ॥ ౨౧౫ ॥ క ॥ నిపాకరణముగఁ దన్ను బ ।
హిష్కారము నొందఁ జేయునిల్వాలనైరిన్ । పుష్కరభూతకరణహృ । త్పుష్కరుఁడి
తఁడనఁగ నన్నుఁ దూఱందగునే ॥ ౨౧౬ ॥ క ॥ మమకారదూరునకుమి । త్రములుగళత్ర
ములు నన్నదమ్ములు ననుబం । ధములు పరిష్వంగముధ । ర్మమె నైకొనమణుఁగ్గు సగము
నైలయుసగమే ॥ ౨౧౭ ॥ తే ॥ గాఢవిజ్ఞానమయ మనోగూఢమైన । నిర్మమునిన్నె

ధారను॥ ౨౦౮॥ సతిసన్న=నిందింపరాని॥ ౨౦౯॥ చేలద్యోతిత=వస్త్రములచేత ప్రకాశింపఁ
జేయఁబడిన. కలమాన్న = వరిఅన్నమునందు. తత్తాదృక్=దానికిఁదగిన॥ ౨౧౦ ॥ శష్కులులు
=చక్కిలములు—కృశించినవారు. ముండధారులు = ఏకదండిసన్న్యాసులు. తోయము=పిండము.
పరిష్వంగములు=అలింగనములు॥ ౨౧౧॥ సారస్వతపట్టభద్రులు = విద్యలందు రాజులు. ఉదార
=గొప్పవాఁడైన. కళా = విద్య ॥ ౨౧౨ ॥ కేలారము=మండ. అర్థులు= యాచకులు. అలరన్
=సంతోషింపఁగా. ప్రాభవంబునన్=ప్రభుత్వముచేత. నిర్ఛిద్ర=పరాకులేని॥ ౨౧౩ ॥ జరఠత
పస్వి=ముసలిముని. చిత్తాభోగంబునన్ = మనోవృత్తియందు॥ ౨౧౪ ॥ ఓవరి=ఉప్పరిగ. చ
దువుపుత్తడి=సరస్వతి. (పుత్తడి=కీలుబొమ్మ) బెడఁకి=తప్పి॥ ౨౧౫ ॥ బహిష్కారము = వెలి.
హృత్పుష్కరుఁడు = మనసికమలముకలవాఁడు॥ ౨౧౬ ॥ పరిష్వంగము=చేరిక. మైకొనన్=
ఒప్పుకొన॥ ౨౧౭॥ నిర్మమునిన్=మమకారములేనివానియొక్క. కరాళ = భయంకరమైన॥ ౨౧౮॥

ర్యమతేనుండు నేరఁడుగాన । దానధారాకరాళకాంతారదంతి । కుంభముక్తాహార
ణములఁ గూడునెట్లు ॥ ౨౧౮ ॥ క ॥ అకుటిలగుణవాసనతో । నకలిగిమరువంపు
లేఁగొనయుఁబోలినశ్రీ । శుకునెన్నరేమిసారెజ । నకునెంతురు పరముఖోపనతవి
జ్ఞానుక్ ॥ ౨౧౯ ॥ చ ॥ మునిజనభాగధేయమగు మోక్షముపక్షములేకపలికెనీ ।
వనఘవిచారసారగోనియాడెదు బూడిదబొట్టువోసియా । చెనఁటిగృహస్థధర్మమ
దిచిమ్మెటసింగమెగాజురత్నమే । కనకశలాటుకాధమము కల్పఫలంబెచలంబులేటి
కిక్ ॥ ౨౨౦ ॥ ఉ ॥ సంపదచేతఁగానికొనసాగవుసువ్వెగృహస్థధర్మముల్ । సం
పదపూర్వజన్మవికసత్సుకృతంబునఁగానిచేరదా । సంపదచేరియుక్ స్మరవశంవదుఁ
జేయుమహాత్ము నేనియుక్ । జంపతునన్నఁగన్నసిమి చంపుడుముంపుడుబోధగాధ
లక్ ॥ ౨౨౧ ॥ శా ॥ కందర్పాస్త్రములంచునంచిత తటితాకాండంబు లంచుక్ సు
ధా । మందస్యందములంచుకాంచనలతామత్తల్లులంచుక్ సుధీ । బృందంబుల్ ధ్వని
నిందలందెగడునీబింబోష్ఠులందెల్లనా । నందాభాసమె కాకభాసిత చిదానందంబు
వెంపొందునే ॥ ౨౨౨ ॥ చ ॥ కురులసిరుల్ మెఱుంగుఁజనుగుబ్బలనిబ్బరముల్ మొ
గంబువి । స్ఫురణములింద్రనీలమణి భూధరశృంగతురంగలాంఛనా । దరవశదృష్టిఁ
జూచెదవు తాపసవంశవతంసతజ్జరా । భరమునవచ్చు తెల్పుఁబడుపాటువళీవలనం
బునుండఁగక్ ॥ ౨౨౩ ॥ క ॥ కులమొల్లగోత్రమొల్లక్ । గలకంతులనొల్లనొల్లఁగలు
ములుబాధా । నలహుతదుర్భవబాధా । నలమతినైకందునొకధనముచేసనుచుక్ ॥
౨౨౪ ॥ క ॥ ఒకటికిఁ బదియుఁబదింటికి । నొకనూఱునుగాఁ గదనదుయుక్తులకుఁజ
లిం। పకనాడువుపడువుదృఢని। ష్ఠకునలరియుఁబలుకుఁగపటసంయమికినుకక్ ॥ ౨౨౫ ॥
సీ ॥ పందకుఁబోటులోభగ్రస్తునకునీఁగిబోయకుఁగరుణనపుంసకునకు । నంగనాసుఖ
మునెఱింగించుతెఱఁగయ్యె నాబుద్ధినీయందునాటకునికి । నెటువైనఁగమ్మనీవిదివో
లునిదివోలదనితెల్పఁదెలియనేయసదుఁబోడువ । నిమ్నాభిముఖమైననీటినెవ్వఁ
డోవ్రత్రిప్పియెప్పగుచోటఁదిరుగఁజేయు । నలమిగుడిమ్రింగువానికిఁదలుపులప్ప । డ
ములుగాకుండనేయగస్త్యమునిపనువు । మీఱియూరకిగుర్వనమిన్నముట్టు । నింత
వేఁటికినామాటయెంతపాటి ॥ ౨౨౬ ॥ ఉ ॥ వ్యాసనుతాదులందఱఁచివానికిమంగ
లకత్తిమ్రింగదా । సాసలనట్టుచాఁచెదదెయందనిపంటికిబొందితోనకై । లాసము

---

ఉపనత=పొందఁబడిన॥ ౨౧౯ ॥ భాగధేయము=భాగ్యము. చెనఁటి = వ్యర్థమయిన॥ ౨౨౦ ॥
ఉసిమి=పులిమి—కప్పి. ముంపుడు=ముంచునట్టి ॥ ౨౨౧ ॥ తటితాకాండంబులు = మెఱుపులస
మూహములు. స్యందములు=ధారలు. మత్తల్లులు = శ్రేష్ఠములు. తెగడు=నిందించు॥ ౨౨౨॥
నిబ్బరములు=బిగువులు. వళీవలనంబు=కడుపుమీఁదిముడుఁతలచుట్టుకోలు ॥ ౨౨౩ ॥ ౨౨౪॥
౨౨౫ ॥ పంద=పిఱికి. పోటు = యుద్ధము. ఈఁగి=దానము. అసదుఁబోడువ = అల్పదుష్టుఁ
డు. నిమ్నాభిముఖము = పల్లమునకుఁదిరిగినది. పనువు = ఆజ్ఞ. ఇఱుర్వునక్ = చిగిరించుట

చేరఁ జూచెదు చలంబది యేమి ఫలంబటంచు నా । భూసురుఁ డీసువెంచి మునిపుత్త్రకుఁ
బాసి తొలంగి వెండియున్ ॥ ౨౨౭ ॥ తే ॥ కామధేనుముఖంబునఁ గార్యసిద్ధిఁ । బడ
యనూహించి మాయలు వన్నిచనియె । వినుమునిశ్రేష్ఠ తపము గావించు వానిఁ । గనిన
దలయెర్చుఁ గాదె యాఖండలునకు ॥ ౨౨౮ ॥ సీ ॥ ఉద్యదుత్థానసముద్యోగమాత్రావ
శిష్టచేతస్స్మారదష్టదర్భ । క్షతికృదుగ్రధ్వాంక్షతతినివారణవిధాత్వరమాణవామాగ్ర
దంశపిహిత । నాదృతాధశ్శయనారంభ విస్రంభగళకంబళాభోగఁ గాతరాక్షి ।
నేకపార్శ్వస్థితిస్వీకారనిర్భగ్నచరమోరుకరశల్యసాంద్రబాష్ప । దుగ్ధసేవాసమయ
బోధముగ్ధవత్స । పీడితాపీనపర్యంతపృథులదామ । వేష్టితగ్రీవనటచూచె విప్రుఁ డా
క్కి । యర్జునినిజోటజప్రఘాణాంతరమున ॥ ౨౨౯ ॥ క ॥ చూచి యిది యెల్ల మున్నె
టి । వాచంయము వెల్మిగిడ్డి వడువొందెడునీ । నైచికికి నెట్లొకో యీ । నీచతవాటిల్లె
నిన్న నేట నెయనుచున్ ॥ ౨౩౦ ॥ చ ॥ మతిఁ గృపఁ గ్రమ్మ బాడబకుమారశిరోమణి
యుద్ధరించె భూ । పతితఁ దపస్వి రోహిణి సపాయపరంపరఁ బాచి సాఁకి యా । ర్జితబలఁ
జేయఁ గాఁ దలఁచి శిష్టహితన్ గలికాలజాతదు । స్థతఁ బడు ధర్మదేవత శతచ్ఛదలోచనుఁ
డెత్తుకైవడిన్ ॥ ౨౩౧ ॥ క ॥ పడబడఁ బాఱుచు గడగడ । వడఁకుచు మొదవింత నిలిచె వన
జాక్షుఁడుమున్ । వెడలింపఁ గ జలనిధి వెలు । వడియించుక దెలియ వుడమి పడఁతియుఁ
బోలెన్ ॥ ౨౩౨ ॥ చ ॥ పదములకొంకువోఁ బసికిఁ బ్రక్కల స్రుక్కెడలించి దంశవం ।
శదమనవృత్తి నింపొసఁగి సాస్నన ఖంబుల దువ్వి నెత్తురుల్ । చిటికెఁగండ్లఘోరజ
ముచిక్క ముఖస్థతృణంబు దొప్పి చియు । మ్మొదవు మృదుక్రియన్ నడపి ముంగిట బండిటి
రాటఁ గట్టుచున్ ॥ ౨౩౩ ॥ క ॥ చేతోజహాయచ్ఛాయా । పాతాసహాస్త్రైనమంచి పచ్చిక
యువిని । ర్ధౌ కలధౌతదండవి । ఘాతులితజలంబులందపసి ప్రియమొసఁగన్ ॥ ౨౩౪ ॥
సీ ॥ పడఁబడ నెత్తిఁ బొల్పడి యునిక నాసనాభ్యాసనైపుణశక్తిఁ బట్టువడదె । నులపాం
కురములేర్చి యులుపవట్టెడుపూనికఁ గుశపల్లనాహృతి కుంటువడియె । సడలంగమె
డరజ్జు గడువడి విడుతమినతసూత్రవృత్తియవులఁ జనియెఁ । బొలయుయాచ్ఛేతిసుటకుఁ
బొలయుపల్లులఁ బోవనదలించు హుంకృతిఁ జెదరెమంత్ర । మానసలన్నియు మొదలంటఁ

---

యంమ—మొలకెత్తినప్పడే ॥ ౨౨౬ ॥ ౨౨౭ ॥ తలయేర్చున్=తలనొచ్చును ॥ ౨౨౮ ॥ ఉత్థాన=లేచుటకు. దష్ట=కఱచిన. క్షతికృత్=గాయముచేయుచున్న. ధ్వాంక్ష=కాకులయొక్క. విధా=పనియందు. దంశపిహిత=అడవియీఁగలచేతకప్పఁబడినది. విస్రంభ=మైత్రిగల. గళకంబళ=గంగడోలుయొక్క. కాతర=వెఱచిన. చరమోరు=వెనుకటితొడయొక్క. అర్జునిన్=ఆవును ॥ ౨౨౯ ॥ వెల్మిగిడ్డి=పెయ్యామేఁపు. వడువు=విధము. నైచికికిన్=ఆవునకు ॥ ౨౩౦ ॥ రోహిణిన్=ఆవును. దుస్థతన్=పేదఱికమునందు—హీనదశయందు. శతచ్ఛదలోచనుఁడు = విష్ణుఁడు ॥ ౨౩౧ ॥ మొదవు=ఆవు ॥ ౨౩౨ ॥ కొంకు=దడ. స్రుక్కు=ముడుఁత. సాస్న = గంగడోలు. గండ్లన్=గాయములందు. చిక్క=చిక్కి. రాటన్=కంబమునందు ॥ ౨౩౩ ॥ ౨౩౪ ॥ ఉలపాంకురములు = గడ్డిమొలకలు. ఉలుప = కానుక. కుంటుపడియెన్ = నిలిచిపోయెను. పొల =

గోసియున్న । గోఁచికట్టునకటువంటిగోడవగడవ । రాక మెడఁజుట్టుకొనియెనూర
కయకార్య। కరణశీలుర కెప్పాటఁగల దెసుఖము ॥ ౨౩౫ ॥ చ ॥ విబుధతపోధనేంద్ర
విను వేయువిధంబులనాతఁడేదనే । చిబలవిభేదినై చికివిశృంఖలమైఖలమైత్రిఁబోలె వే।
గబలవిహీనతాఁ త్రియుఁడుగంగడుఁగ్రొవ్వనివ్వటిల్లి బి । దబలిసిబందికాఁడగువిధం
బునఁద్రిమ్మరుచున్మహాటవిన్ ॥ ౨౩౬ ॥ ఉ ॥ గుండువలెన్ బలీయమగుగోడియతో
తఁజరింపనారఁగాఁ । బండినబల్సువంటి పసిభాసిలు మైసిరిచూడిరా కెంతయున్ ।
బండుఫనర్పసల్పగతిపాలజనింపసమాంసమీనకున్ । వెండియునిల్చెఁజూలుదధిపిచి
మణీఘృణిభాచ్చు చాఁదువన్ ॥ ౨౩౭ ॥ ఆ ॥ వత్సయుతయుగర్భవతియునై మూ
హేయి । పతివ్రతంబునణఁపవార్చియుండెఁ । గంజగర్భతర్ణకయుజగద్గర్భయు ।
నై నయసురుఁజెలువుటావుఁబోలె ॥ ౨౩౮ ॥ క ॥ లోచనవికృతిముకురమున । గో
చరమగుపగిదిఁగపటగోచరితమదన్ । మోచినవాచంయమిసుతుఁ । డేచిననె
వ్వగలబొగిలియిట్లూహింపన్ ॥ ౨౩౯ ॥ సీ ॥ వత్సనాభిగంధవహామయ్యెనీయావు
పైగాలినీవారపాకములకుఁ । గఠినకుద్దాల వక్త్రములయ్యె నీజన్నెమును దెకరాల
కరాందమూలములకుఁ । జటులదవానలచ్ఛటయయ్యెనీగిడ్డికటుజిహ్వబర్హిస్కాయ
ములకు । నారణోచ్చారణోద్ధతులయ్యె నీతొట్టుకంఠహుంకృతులేణగర్భిణులకు ।
నాకుమొగమోడియాఁగాదనరుతపస్వి । లేలయియామైలపూఁయుకదూలదీని । వత్స
యుతముగనీవనీవాటముపకు। లాడిగావింతునంతఁదొలంగుదూఱు ॥ ౨౪౦ ॥ ఉ॥
దండమెదీనివాలధిసుధానిభవాఃకరకంబెదీనియీ । తుండపొదుంగుదీనిముకుఁగోత్రిళు
లుభూమిబిలాంతరంబులే । గండపటంబెదీని మెడకంబళమంచుఁ ద్యజించెరోసియ ।
కొండొకబ్రహ్మచారిమదిగూకులువత్తులునైయసద్గతిన్ ॥ ౨౪౧ ॥ తే ॥ క్రేపువా
పోవఁబట్టిలంకియకుఁదార్చి। తోలవియఁగొట్టిమెడనొకరాతుండుగట్టి ।గిడ్డివెడలించెఁ
దలతాఁడుకేలఁదొట్టి। మారి వెడలించువడువునమాణవకుఁడు ॥ ౨౪౨ ॥ క ॥ ఆధే
నువుతత్కృతబహు । బాధలసక్రోధయగుచుఁబరతత్వసము। ద్బోధకబోధకలితుఁ

---

మాంసము. రాలయా=చుట్టుకొను. గోఁచికట్టునకున్=బ్రహ్మచారికి. గొడవ=దుఃఖము॥ ౨౩౫॥ విదన్=రోషింపఁగా. ఏచి=బలిసి. విశృంఖలమై=అడ్డములేనిదయి ॥ ౨౩౬ ॥ సమాంసమీనకున్=ఏఁటేఁటనీనెడియావునకు॥ ౨౩౭॥ మూహేయి=ఆవు. వార్చి=ప్రతిష్ఠించి. తర్ణక=లేఁతదూడగలది॥ ౨౩౮॥ ముకురమునన్=అద్దమునందు. నెవ్వగలన్=అధికవిచారములచేత॥ ౨౩౯॥ వత్సనాభి=వసనాభియనెడివిషము. నీవారపాకములకున్=నివ్వరిపంటలకు. జన్నె=ఆవు. కెక్కాలు=గిట్టలు. గిడ్డి=ఆవు. బర్హిస్సు=దర్భ. ఆరణ=గర్భస్రావముగలిగించు వేదమంత్రములయొక్క. తొట్టు=ఆవు. దూల=తీఁట. లాడి=బలి॥ ౨౪౦॥ వాలధి=తోఁక. గండపటంబె=తెరచీరయా. కొండొక=చిన్న. కూకులువత్తులునై=మిక్కిలికలవరమునొంది॥ ౨౪౧॥ క్రేపు=దూడ. పోవఁబట్టి=అణపఁగా. లంకియ=పెన. తార్చి=కూర్చి. తొట్టి=పట్టి. మాణవకుఁడు=బ్రహ్మచారి॥ ౨౪౨॥ ౨౪౩ ॥ పొదరు=పొద. వల్మీబిలము=పుట్ట

డగు । వాధూలముఁ నిందుఁ డుండువనమునఁబడి మెఁ ॥ ౨౪౩ ॥ క ॥ పులియున్న
పొదరు మొసలికి । నెలవగు బలుమడువు దాఁచు నిచ్చిన వల్మీ । బిలమున సమ్ము నివసనమౌ ।
వ్వలనం జొరఁజనదు వాసవప్రభృతులకున్ ॥ ౨౪౪ ॥ శా ॥ అమాయాగవిమష్ట
నష్టడవిలోనత్యుద్ధతిన్ రేసిమ । ధ్యేమార్గంబు సనభ్రగర్భితను రావిప్రింబోలివల్మీకరే ।
ఖామగ్నాకృతినున్నయున్న తత్తపఃకౌశల్యశల్యున్ గత । వ్యామోహున్ జిరజీవి దేవ
తులితున్ వాధూలవాచంయమున్ ॥ ౨౪౫ ॥ ఉ ॥ మిట్టిపడి బిట్టు మిట్టిపడి మానిసము
త్థితుఁడయ్యె మేనిపై । పెట్టిన పుట్ట నెట్టు వనిసి బీఁటలు వాఱ శ్రవశ్శకుంతముల్ । చట్టుప
లెత్తి నుండ ఱెక్కి సాఁగఁదలం పజటాచ్ఛటాచ్ఛవిన్ । ముక్కెలుగట్టి నిద్రలు మరుద్భుగధీశ
కులంబు మేల్కొనన్ ॥ ౨౪౬ ॥ మ ॥ కనవుం దీపలు దావపావకశిఖాఘసంబుల్ ప్రకా
శింపవె । కనకమైతోఁచిన కొండ చందమున దీక్ష్ణ శ్మశ్రు ప్రచండచ్ఛటా । విసరకోగ్రతర
సోగ్రమూర్తియగుచున్ వృద్ధవ్రతి శ్రేష్ఠుఁడా । త్మసమీపస్థితుహస్తముక్తసురభిన్ ద
ద్వర్ణిన్ వీక్షించుచున్ ॥ ౨౪౭ ॥ ఉ ॥ ఓరి దురాత్మ యోరివిసయోజ్ఝితయోగిమదాం
ధ యెందు నే । వారికిఁ జేరరాదు మనువారికి నావనమీవు చొచ్చి జం । భారికృతోపఘాత
శతహార్యము గాని మదీయ ఘోరదు । ర్వారసమాధిగౌరవము వమ్ముగఁజేసితి వాసుర
క్రియన్ ॥ ౨౪౮ ॥ తే ॥ వృద్ధుఁ బ్రణిధానసిద్ధ్మగ్ను బుద్ధిబలవి । హీనుసన్నిట్లు చేసితి
గానన్నీవు । నిట్టిపాపంబునీరూపునీవిధంబు । సదటునఁ డివారయి భేకంబవగు మనవు
డు ॥ ౨౪౯ ॥ శా ॥ ఆపృథ్వీసురసూతితత్పదసరోజానమ్ముఁడై యుల్లనన్ । గోపా
టోపమడంపుఁడీరలిగినన్ గొండల్ వడున్ వార్ధుల్ । సూపేనుకన్ ధరవమ్ము మ్యామినో
రగుమహాప్రపంబునా నెంతని । స్థాపత్యాసనలెస్సగాఁ జెనిసినన్ శాపాగ్ని చేఁగాఁ
పవే ॥ ౨౫౦ ॥ క ॥ తెలుఁగని లయశిఖివనినిను । నెలుఁగుచు వాధూలముని కు లేశనిజ
ముగా । నెలిఁగి మెఱిఁగి తనయాదల । కొలవింగొని గోఁకవిస్ఫురణ నుతియుఁగలఁడే ॥
౨౫౧ ॥ ఉ ॥ ఉద్ధతిదక్కెయొక్కయెడనూరకయుండఁగనీ కి కంధరా । బద్ధమహాహి
నీకపిలఁ బాపఁ దలంచితి నొండు లేమదీ । సోద్ధగణాతిసాంద్రకరుణోదధి విచిసమృద్ధి
గ్రైనని । బుద్ధికిఁ జేర్పగాఁదగు నెఘోరదవానలకీలఖేలమున్ ॥ ౨౫౨ ॥ వ ॥ అనిము
నితనయుండు ధేన్వాగమనాది తదుచ్చాటనాంతంబుగాఁగల తనవృత్తాంతంబు విన్న

---

కలుగు ॥ ౨౪౪ ॥ గవి=అరు. మష్టన్=త్రొక్కను. రేసి=విజృంభించి॥ ౨౪౫ ॥ మిట్టిపడి=
ఎగిరిపడి. నెట్టు=కప్ప. అవిసి=పగిలి. బీఁటలువాఱన్=బద్దలుకాఁగా. శ్రవశ్శకుంతములు=
చెవియందలిపక్షులు. చట్టుపలు=రెక్కలు. ముక్కెలుగట్టి=గుమిగూడి. మరుద్భుక్=పాముల
మొక్క ॥ ౨౪౬ ॥ తద్వర్ణిన్ = ఆబ్రహ్మచారిని ॥ ౨౪౭ ॥ హార్యము=హరింపదగినది. వ
మ్ముగన్=వ్యర్థముగా ॥ ౨౪౮ ॥ ప్రణిధాననిమగ్నున్= ధ్యానయోగమునందు మునిఁగినవానిని॥
౨౪౯ ॥ ఊరు=మీరు॥ ౨౫౦॥ లయశిఖి=ప్రళయాగ్ని. తెలుఁగు=యత్నించు॥ ౨౫౧॥ కంధరా
బద్ధమహాహిన్=మెడనుగట్టఁబడిన పెద్దపామును ॥ ౨౫౨ ॥ ౨౫౩ ॥ ప్రస్ఫుటత్ = చలించుచు

వించుటయును నూహించియు త్తైలంగుచిత్తంబున యథార్థంబుగాఁగనుంగొని ॥ ౨౫౩ ॥
మ॥ ఘ్రుకుటీభీషణభాలభాగుఁడు తను ప్రోద్భూతఘర్మాంబు బిం।దుకుఁడుగ్ర స్ఫుటదో
ష్ఠపల్లవుఁడు చేతోభీతికృల్లోలతా । రకఘూర్ణన్నయనుండుగాకశమసార స్మేరుఁడ
య్యెండప । స్వీకులగ్రామణి చిచ్చుచందుఁ బొడవై చెన్నొందు చందంబునన్ ॥ ౨౫౪ ॥
క ॥ సుప్రణయుఁడగుచు మునిలో । కప్రవరుండాదరించెఁ గనికరమునన । వ్విప్రకు
మారుఁ దృగంచల । విప్రుషములుగా వెయవనివిబుధాగ్రహముల్ ॥ ౨౫౫ ॥ ఉ ॥
ఆవసుధామరప్రభవు నమ్ముని యిట్లనువత్స విన్మనా । భావపథంబునన్ నినునపాపు
నిఁగాఁగన్నుఁగొంటి నాగ్రహ । వ్యాపృతచిత్తవృత్తినిటులాడితి మీఁదరయంగ లేకనా ।
యీవచనంబు దప్పదనయుం బెదమూర్ఖత నన్ను మోచుటన్ ॥ ౨౫౬ ॥ చ ॥ వగవకుమ
న్నదైవగతి వచ్చినకీడు దలంచి నెమ్మదిన్ । భోగులకు మన్నకర్మములపోకకుఁ భోగమె
హేతువన్నవి । శ్వగురుగిరీంద్ర వత్సలు దివానిశముల్ దలపోయుమన్నమే । లగుహ
రిభక్తియుక్తులకు నాపద రాదు గదన్న యెన్నఁడున్ ॥ ౨౫౭ ॥ సీ ॥ జలధరంబన నెద్ది
పొలపంబు వ్రేల్చించు నిల్లాలి మెఱుఁగుల మొల్లములకు । మున్నీరనఁగ నెద్ది మొలచుట కావా
లమాణిక్యరాసులు వాసియాత్మజులకు । నీడ ప్రమాఁకన నెద్ది నిలువనీడై తోఁచునాఁకటనుం
డు ద్విజావళులకుఁ । దాఁపన నెద్ది యాధారమౌ దివిబ్రాఁకుపితృవర్యులకుఁ గుంటిపిచ్చ
కలకు । వట్టిగృహమేధిధర్మంబునందు నీవు । గుత్స సేయుటనీరీతి గొడవయొదవె । నొప్ప
గతినొప్పఁగనఁగల్గు దుద్ధతులకుఁ । గసరిపైవచ్చుజాళ్లపై గాలియైన ॥ ౨౫౮ ॥ క ॥ ఏనింత
వాఁడనేనయి । వూనుదునఁట యెద్ది గాక పోయెడు ననిసుం । తైనఫలమందఁదీరదు । మా
నవులకకాదు వినుమ మర్త్యులకైనన్ ॥ ౨౫౯ ॥ సీ ॥ మునులనుష్టుభమునఁ దనుఁగొల్వఁ
దగువాని ఁబ్రహ్లాదుఁ బ్రోవఁ జాల్పడినవాని । ద్వాత్రింశదురుభుజాస్తంభాఢ్యుఁడగు
వాని నశ్వత్థమూర్తిగా నుండువాని । చక్రంబుచేతను త్రిజనముఁ బ్రోచెడువాని విబుధా
ధ్యాసినశ్వత్థమూర్తిగా గుండువాని । చక్రంబుచే తేజ ప్రాజనముఁ బ్రోచెడువానివిధా
యుధంబుల వెలయువాని । నలఘుదివ్యాకల్పములఁ బూడఁగలవాని భీమరథ్యాపగాసీ
మవాని । వివిధకథలవానివివిధరూపంబుల । వానినిలిచి కొలుచువానివాని । శ్రీనృసిం
హు సేవ సేవింపు మేకంబ । వైతదంఘ్రిమూలమధివసించి ॥ ౨౬౦ ॥ తే ॥ దర్దురాం
గనయందు సంతానసిద్ధి । నీకునగుఁ గొంత కాలంబు నిర్గమింప । దానఁ నీదు పితరాణం.

స్వ. భీతికృత్ = భయము నుగలుగఁజేయుచున్న. లోలతారక = చలించుచున్న కనుగ్రుడ్లతో.
ఘూర్ణన్నయనుండు = తిరుగుడుపడుచున్న కన్నులు కలవాఁడు. స్మేరుఁడు = చిఱునవ్వుగలవాఁ
డు. పొడవు = ఆకృతి ॥ ౨౫౪ ॥ సప్రణయుఁడు = ప్రీతితోఁ గూడుకొన్నవాఁడు. విప్రుషములు =
తుంపురులు. అవనివిబుధ = బ్రాహ్మణులయొక్క ॥ ౨౫౫ ॥ వ్యాపృత = మిక్కిలియావరింపఁ
బడిన. మోచుటన్ = పొందుటచేత ॥ ౨౫౬ ॥ భోగులకుము = తలంపకుము ॥ ౨౫౭ ॥ పొలపంబు =
వ్యాపనము. మొల్లములకున్ = ధనములకు. ఆవాలము = పాదు. ఆణిరాసులు = ముత్యాలు. ద్వి
జావళులకున్ = పక్షిసమూహములకు; బ్రాహ్మణపఙ్క్తులకు. తాఁప = మెట్టు. కుత్స = నింద —
రోఁత. గొడవ = సంక్షోభము ॥ ౨౫౮ ॥ సుంత = కొంచెము ॥ ౨౫౯ ॥ ౨౬౦ ॥ దర్దురాంగన = ఆఁడు

బుతలఁగి శాప । మోక్షసంప్రాప్తియునుగల్గునాక్షణంబ ॥ ౨౬౧ ॥ వ ॥ అనియివ్వి ధంబునవాధూలుండు శాపావధినాఁడివియవ్వటువు నాశ్వాసించి విశ్వావధ్యూతజనకర్మ బుగనంబురుహప్రియమండలంబు భేదించికొనుచుఁజనియపవర్గసామ్రాజ్యసింహాసనా సీనుండయ్యెనిచ్చటవియచ్చరధేనువు సేవింవనానిఫనిసఫలంబుచేసి ఫలోదయంబునలం కరించె. ప్రయుతసుతుండును విఫలప్రయత్నుండై యయత్నసంప్రాప్తంబగు నిజవ్య సనంబున నసురసురయ్యును సాయంసమయ కుముదంబు చందంబున గొంతకొంత తచ్ఛాంతివచనంబులవడఁజెడినవాఁడై జగత్త్రితయపవిత్రీకరణంబగు పాండురంగక్షే త్రంబునకుంజని ॥ ౨౬౨ ॥ క ॥ భీమరథీదోట్టితీర్థ । స్తోమంబులనెల్లఁదన్వుదోఁగిం చిముని । గ్రామణికుహనాభీరశి । ఖామణిమణిసౌధరాజగర్భాగతుఁడై ॥ ౨౬౩ ॥ సీ ॥ సురతరుప్రసవరింఛోళిమాళివినీల జలదంబులోని క్రొందళుకులెసఁగ । మొగ మువెన్నెల మేటిమొగరేటిమగమీలగతిపక్ష్మలాక్షియుగ్మకము మెఱవఁ । గటియనె మ్మేనుచీకటిమాఁకుఁబాఁకుబంగరుతీఁగక్రియఁదూలఁగద్రుమశాటి । యుడుపథంబు నజాఱుసురరత్నతతిభాతి హారముల పెనవుడమీఁదాఁక । నచ్చరలువీవనలువీవ నంగరాగ । వాసనలుభూషణార్చులసేసలెసఁగఁ । బిఱఁదిదెసనున్నరమమీఁదనా రగిధవళి । చలదళచ్ఛాయనుండువిట్టలునుతించు ॥ ౨౬౪ ॥ ఉ ॥ ఫాలముచుక్కవంకనెల పైవెలుఁగొందెడులోహితాంగునిన్ । బోలఁగఁగంబుగర్భమునఁ బొల్పగునీలములీ లఁగంధరా । కాళిమయుల్లసిల్లవిధుఖండముకెంజడకెంపుఁదమ్మిలో । బాలమరాళ మట్లలరభాసిలుకాలిఁలాటపట్టికన్ ॥ ౨౬౫ ॥ మ ॥ నలినాస న్నలినాసనాననవు రాణస్థానముల్ డాయని । మ్ములబల్సాయలబోరుతల్పులధరంబుల్ గెంపువాచూరు లున్ । గలవిద్వద్వదనాంతరాళ నవరంగక్షోణిరాణించును । జ్జ్వలవజ్రవ్రజశంఖ సంఘనిభభాషాయోషజిహ్వాస్థలిన్ ॥ ౨౬౬ ॥ సీ ॥ లలితకుంతలశైవలముఖశైశం శవబింబమధరాధరప్రవాళాంకురంబు । చపలస్వభావలోచనమహామీనంబుకమనీ యకంధరాకంబుకంబు । గర్వితస్తనకనత్పర్వతాభోగంబువిశదత్రివళిభంగవిలసనం

---

కప్పు. నిర్గమింపక = కడవఁగా. పితౄణంబు = పితృఋణము ॥ ౨౬౧ ॥ అంబురుహప్రియ మండలంబున్ = సూర్యమండలమును. అపవర్గ = మోక్షమునైడి. వియచ్చరధేనువు = దేవతల యావు. అసురసురు = బడలినవాఁడు. కుముదంబు = తెల్లగలువ ॥ ౨౬౨ ॥ తొట్టి = మొదలు కొని. తోఁగించి = ముంచి ॥ ౨౬౩ ॥ ప్రసవరింఛోళి = పువ్వులసమూహము—పువ్వులచెండు. మొ గరేటి = మొఖరియనునదియందలి. కటియ = నల్లన. కద్రుమశాటి = పసుపువన్నెవస్త్రము = పీతాం బరము. ఉడుపథము = ఆకాశము. అర్చుల = వెలుఁగులు. చలదళచ్ఛాయన్ = రావిమ్రానినీడ యందు ॥ ౨౬౪ ॥ నెలపైన = చంద్రునిమీఁద. లోహితాంగునిన్ = అంగారకుని. కంధరాకాళిమ = నొడసలుపు ॥ ౨౬౫ ॥ నలిన్ = తగునట్లు. ఆసన్ = ఆశతో. నవరంగక్షోణిన్ = క్షేత్రభూచవి కయందు. భాషాయోష = సరస్వతి ॥ ౨౬౬ ॥ శశబింబము = చంద్రబింబము. మధ్యప్రాంత

బు । మధ్యవృంతావర్తమహితంబు కటితటీద్వీపంబు పృథులోరుదివిజకరటి । కరము
పదకూర్మ పృథుకంబు గ్రమ్మ నఖర । మణికలాపంబు నగుచు నేమగువరూపు । భూరి
సౌభాగ్యసంపదఁ బోలుఁదంద్రి । నాసుధాంభోధి పుత్రి బాహాంతరమున ॥ ౨౬౭ ॥
మ ॥ సితకీరస్ఫటికాక్షమాలికలు గెంజేదోయి సంధించి భా । రతివామాంకతలంబు
నన్ సతతముం దంజిల్లఁ గల్లోలసం । గతహంసోత్తమఫేనపఙ్క్తి యగు గంగా
వాహినిం దాల్చుద్రై । వతశైలంబునఁ దేజరిల్లు నలవిశ్వస్రష్టనాభిం దగన్ ॥ ౨౬౮ ॥ తే ॥
రత్నసందర్భగర్భ యీరత్నగర్భ । చరణపీఠంబుగా నున్న సకలభువన । మయునిని
నుఁగంటి ద్దేవనాభయములుడిగె । ననితపస్ప్రీతిఁ గంసాక్షి యాతఁ బొగడి ॥ ౨౬౯ ॥ క ॥
అబ్జజనివటుపుత్తరది । కృటమునఁ గనుఁగొని యొం దరళతరతరుమూర్తిన్ । బటున
ఖరశైత్యముననా । రటముడిపి సురారి నేలురసికు నృసింహున్ ॥ ౨౭౦ ॥ క ॥ శాశ్వ
తకరుణాంబుధిన । వ్విశ్వవిభుం గనుటఁ గోలె విప్రుని మది మా । నీశ్వరశాపవికారమ ।
నీశ్వర దుశ్చేష్టితాభినయ మొనరింపన్ ॥ ౨౭౧ ॥ శా ॥ నీరంధ్రాంగణకర్కటీబిలము
లన్ నిర్దింపమ్మృత్స్నమయా । హారంబుల్ గబళింపఁ బెల్లు నవనిట్టట్టుం బ్లుతంబుల్ గొ
నన్ । దూరాయాస్యదహీంద్రభీతి పుతి గొందుల్ దూఱఁ గోరున్ మదిన్ । సారాపేత
మనోబలం బగు భవిష్యద్భేకము త్సేకమై ॥ ౨౭౨ ॥ క ॥ ఈవడువున శాపవ్యస । నా
వేశము గదిరియును మహాధైర్యమునన్ । నావిప్రుఁడు సుప్రతిభా । దేవేజ్యుఁడు ప్రస్తు
తించు దితిసుతశత్రున్ ॥ ౨౭౩ ॥ ఉ ॥ ఆసభను కుఱ్ఱఁగంబమున నాఁడయ నుద్భవమం
దియాసురా । గ్రేసరహృద్విదారణముఁ జించిదుదంచితహాసకృత్యముల్ । గాసమక
క్రియుం బెనుపఁ గాఁ గత మేమి పునర్భవస్పృహన్ । నీసటలెవ్వరేఁ దెలియ నేర్తురె మర్త్య
మృగాధినాయకా ॥ ౨౭౪ ॥ ఉ ॥ మిమ్మటమైన వాఁడిపవిమిశ్రములై వెలుఁగొందు నీన
ఖా । గ్రమ్ములకున్ మృదుప్రకృతి గల్గుట క్రొత్తరమౌను చాద్రిపా । ర్శ్వమ్ములయందు
నందుఁగల సారగతుల్ నఖరాభిపాతసాధ్యమ్ములు గామి గావలయు నట్లగుటల్ దితి
పుత్రశాత్రవా ॥ ౨౭౫ ॥ ఉ ॥ కోపవికారమంచు నొకకొందఱు గొందఱు భక్తలోకర
క్షాపరతంత్రతాజనితసాంద్రకృపాగుణమంచుఁ గొందఱు । ద్దీపితవీరసింధువిహృతి

---

=బొ...నెడి. ఆవర్త=సుడిచేత. పృథుకంబు=పిల్ల॥ ౨౬౭ ॥ విశ్వస్రష్ట=బ్రహ్మ॥ ౨౬౮ ॥ ౨౬౯ ॥
నఖరశైత్యమునన్ = గోటిచల్లఁదనముచేత. ఆరటము = సంకటము. సురారిన్ = ప్రహ్లాదుని.
౨౭౦॥ కోలెన్ = మొదలుకొని॥ ౨౭౧ ॥ ప్రాంగణ=ముందరిచోటునందలి. మృత్స్నమయ=
మట్టివికారమయిన. కబళింపన్ = మ్రింగను. ప్లుతంబులు=దాఁట్లు. ఆయాస్యత్ = వచ్చుచు
న్న. సారాపేత=సారములేని॥ ౨౭౨ ॥ వడువున=విధమున. సుప్రతిభాదేవేజ్యుఁడు= మంచి
బుద్ధిచేత బృహస్పతియైనవాఁడు॥ ౨౭౩ ॥ హృద్విదారణము = గుండెలు పగల్చుట. పునర్భవస్పృ
హన్ = సంహారాసక్తిచేత; కోల్తియందలి యాసక్తిచేత. సట=జూసము; జూలు॥ ౨౭౪ ॥ మి
మ్మటము=మిక్కుటము. పవి=వజ్రాయుధము॥ ౨౭౫ ॥ ఉద్దీ...వికారము—ఉద్దీపిత=మిక్కిలి వెలుఁ
గుచున్న. వీరసింధు=వీరరసము యను సముద్రము నందలి. విహృతి= విహారము చేత. స్ఫుట=స్పష్టమయిన. తే

నధ్యాత్మపూర్ణబుద్ధి । జాగరముసేయుశాలూరచక్రవర్తి ॥ ౨౮౩ ॥ ఆ ॥ రత్నరంగవల్లిరచనదనరఁదనమేను । పువ్వుగుత్తికరణిపొలుపునిలుప । నంబుచరముప్రాతరారంభవేళల । నృహరియగ్రవీధినిలుచునఘ ॥ ౨౮౪ ॥ క ॥ హరిదాసమనుచుఁదనునె । ల్లరుపేరిడిపిలువఁగలిగిస్లవపతిగడపెన్ । జిరకాలముపూర్వజనన । చరితజ్ఞంబగుచుమోక్షసౌఖ్యాపేక్షన్ ॥ ౨౮౫ ॥ ఆ ॥ ఇటులుకొన్నియేండ్లులేగంగనాకనాథు । పౌండరీకనాథుపర్వమునకుఁ । గన్యకుబ్జవిభునికన్యాశిరోమణి । ప్రాణసఖులుగొల్వనరుగుదెంచె ॥ ౨౮౬ ॥ తే ॥ ఆత్మవాహనములనుండియవతరించి । నారసింహాఖ్యతీర్థంబునకునుఁగట । భైమిచెంగటవిడిసిరిపద్మముఖులు । విరహిహృద్ధాములగుమారుశరములనఁగ ॥ ౨౮౭ ॥ ఆ ॥ మార్గఖేదశిథిలమతులంగసలుచొచ్చి । భీమరథిఁగలంచుటేమిక్రొత్త । వారిగోరువెచ్చవక్షోజములకాంతి । లవముమజ్జగములఁదవిలికలఁప ॥ ౨౮౮ ॥ సీ ॥ గంధవాహమునకగారంబులివియంచువీజనంబులఁజూచివెగటుగదిరి । మరుబాణములసహోదరవర్గమిదియంచునలరుమొగ్గలఁజూచియలఁతనొంది । కమలారినామంబుగైకొన్నవివియంచుఁబుల్లదీఁగలఁజూచిఫుల్లసిల్లి । శుకయుగంబులుదామునొకచాయవివియంచునవశుకంబులఁజూచినవముఁగదిరి । కన్యకుబ్జేశకన్యపైఁగలుగుచెలువు । భావములఁబెంపు నొందెపులు మోవఁజేయ । బలిమినిజధైర్యములుచికరఁబట్టియున్న । మునులొనర్పుదురొకరీతిముఖ్యవిధులు ॥ ౨౮౯ ॥ తే ॥ వనజనాభునియభిషేకమునకెగాని । కనకగర్భాదులకుఁబాఁదుకొనఁగరాని । తీర్థకుండాంబునికరంబుతెలివపింపు । గబ్బిచనుజక్కవలచేతఁగప్పఁబడియె ॥ ౨౯౦ ॥ తే ॥ జాబునలరులతేనియగారయిచ్చి । గాడ్పుసంధించునయకానియూర్పువెలచు । నెందునయ్యాఁకవిరితోఁటనిందుముఖుల । నగవునునుమంచుసానవోలెనయముదలఁగ ॥ ౨౯౧ ॥ ఆ ॥ అవసరంబుగాచియల్లంతదవ్వుల । నుండిసురలుమునులు దండములిడ । నొప్పుముకురనందునూరువుగలవేల్పుఁ । గొమ్మలంటిరాటబొమ్మవోలె ॥ ౨౯౨ ॥ మత్తకోకిల ॥ జాలిదక్కిమఠాంతరాళవిశాలవేదులయందుఁగో । నాలగొందిఁదపంబుసల్పుజనంబుతొల్సుములుమాలుఁద । ద్బాలికాకులనిస్తులస్తనపాళికామృగ

---

కప్పులరాజు ॥ ౨౮౩ ॥ రంగవల్లి = ముగ్గు. అంబుచరము = కప్ప. ప్రాతరారంభ = తెల్లవాఱి ॥ ౨౮౪ ॥ చరితజ్ఞము = చరిత్రము నెఱిఁగినది ॥ ౨౮౫ ॥ ఏగంగన్ = కడవఁగా ॥ ౨౮౬ ॥ అవతరించి = దిగి. కునుఁగటన్ = దగ్గఱ. చెంగటన్ = దగ్గఱ. విడిసిరి = నివసించిరి. విరహిహృద్ధాములు = విరహముకలవారియొననునవాటినవి ॥ ౨౮౭ ॥ ఖేద = శ్రమచే. లవము = లేశము ॥ ౨౮౮ ॥ అగారంబులు = ఇండ్లు. వీజనంబులన్ = విసనకఱ్ఱలను. ఫుల్లదీఁగలన్ = సోమలతలను. పుల్లసిల్లి = వెలవెలఁబోయి. నవశుకంబులన్ = లేఁతమాచిపత్రులను. నవము = మృదుత్వము. చెలువు = అందము ॥ ౨౮౯ ॥ పాఁదుకొనన్ = స్థిరముగానిలువ. తెలివపింపు = స్త్రీలగుంపు. గబ్బి = గంభీరమయిన ॥ ౨౯౦ ॥ నయ = మనోజ్ఞము. ఆఁకవిరితోఁటన్ = కట్టుకావలిగలపూఁదోఁటయందు. సాన = నూఁఱు ॥ ౨౯౧ ॥ ౨౯౨ ॥ జాలి = శంక. వేదులయందున్ = అరుఁగులయందు. కోనాలగొందిన్ = మిక్కిలి

నాభివా । తూలికాహతిపక్వశాల్మలితూలికాశకలాకృతిన్ ॥ ౮౩ ॥ శా ॥ డోలా రోహణసాహసోద్యమనుఁ జాటుప్రోక్తినర్మోక్తివి । ద్యాలాలిత్యముఁ బుష్పసాయక సపర్యాచర్యయున్ మున్నుగా । హాలాపానవిహారమున్నడపి రుద్యత్ప్రీతి పద్మేక్షణల్ । పోలుంబోలములింత యెన్నక మహాబోధిద్రుమచ్ఛాయలన్ ॥ ౮౪ ॥ ఆ ॥ జవ్వనంబుమదముసౌందర్యమదమును । ధనమదంబుమనసుఁ బెనఁగుదుర్లఁ । బాదల నంతశీధుమదముఁదోడ్తోఁబ్రోది । యగుచునిగిడెనమ్మృగాక్షులందు ॥ ౮౫ ॥ సీ ॥ దామోదరుఁడుయశోదాస్తన్యమానెడు ననిమొనఁ పిరిగు త్తినలిభ్రమింపఁ । బ్రొగ్గులుచొచ్చెఁగద్రూదేవికిపుడని ప్రియమందు వేణుగర్భిణిగుణించి । పావనిగ్గదనాశ్చ ఫణికేతుతోడలని యడలునేనుఁగుచేతనరఁటులూడుఁగ । బడబాగ్నిజడధివెల్వడియె డునని చూపుఁగానఁబూచినకింశుకము చెలులకు । శేషవృతమేరుశిఖరమనిషఁబొఁగడు నంచకౌఁగిటనున్న హేమాంబుజంబు । పూర్వముగువిసిరిమదివెడపొడము జేర । మధుమదక్షీబయగునాకరివిధునిభాస్య ॥ ౮౬ ॥ సీ ॥ సుధయొలుకనెతివేణిసోమార్థమునుబోలి చెమరించెదుర్గతేఁజెమరునాసలు । కురుకరభర్తదృగ్గోళంబు శీధుసంసేవనంబుబోలె జేవురించె । విష్ణునన్యాసత్తువీక్షించుటనుబోలె ముక్తకేశికిబొమముడీజనించెఁ । ద్వరితనిశ్వాసవేదనవోలెఁగంపించె విజయునివదనారవిందదళము । పరమపావనమైన తత్పాండరీక । పుణ్యతీర్థావకాశమపూర్వసిద్ధిఁ । బెనఁచునృపకన్యకాసఖీజనులవివిధ । విలసనంబులజనియించునలుకననఘ ॥ ౮౭ ॥ క ॥ పొడగనిరిపడఁతులయ్యెడఁ । బొడలపొడలయొడలితపసిపుట్టువుగఁప్పన్ । జడభరతనిభముఁ నరహరి । యడుగుఁబుడమిసరియపెడలియఁటచనుదేరన్ ॥ ౮౮ ॥ చ ॥ కనకముశైలరోహణనగంబొ సుధాంబునిధానగర్భమో । యనిమిషకార్ముకంబు దయమయ్యో డునొప్పగునాక్కొదీనివు । ట్టినకడయంచువిస్మయముడింపక చంపకపుష్పనాసికల్ । చొనిపిరివాలుఁజూపువలచుట్టునుదర్దురపట్టభద్రునిన్ ॥ ౮౯ ॥ తే ॥ కందుకముగాదు

---

యలుకైనకేఁకటివాలయందు. శాల్మలి=తైర్యములు. తూలున్=చలించును. నిస్తుల=ఈడులేని. వాతూలికాహతిన్=గాలిపోఁకుడుచేత. శాల్మలితూలిక=బూరుగుదూది ॥ ౮౩ ॥ చాటు=స్తోత్రరూపమయిన. నర్మోక్తి=ప్రియవచనము. లాలిత్యము = తిన్నఁదనము. సపర్యాచర్య=పూజచేయుట. హాలా=మద్యము. పోలుంబోలములు= యుక్తాయుక్తతలు. బోధిద్రుమ = రావిమ్రానియొక్క ॥ ౮౪ ॥ జవ్వనంబు = యౌవనము. ప్రోది=పోషణము—వృద్ధి ॥ ౮౫ ॥ అలి=తుమ్మెద. పావని=భీముని. ఫణికేతు = దుర్యోధనుని. అడలున్=దుఃఖించును. జడధి = సముద్రమునుండి. కానన్=అడవియందు. వృత=ఆవరింపఁబడిన. క్షీబ=మదించినది ॥ ౮౬ ॥ చెమరించు=చెమటపట్టు. కుర్కురభర్త = కుక్కలరాజు=భైరవుఁడు. జేవురించెన్= ఎఱ్ఱనాయెను ॥ ౮౭ ॥ సరియన్=సందుగ ॥ ౮౮ ॥ రోహణనగంబొ = రత్నపర్వతమో. అంబునిధాన=సముద్రముయొక్క. అనిమిషకార్ముకంబు=ఇంద్రధనుస్సు. దర్దురపట్టభద్రునిన్=కప్పల

కేళీశుకంబు గాదు । పలుకు-వీణియ గాదు దర్పణము గాదు । వర్షపిశునంబుఁ బట్టబ
ల్వరుసఁ జనిరి । చంచలాక్షులు చపలప్రచారలెందు ॥ ౩౦౦ ॥ తే ॥ యువజనంబులఁ
దనయుఱఁ దవ్వులు పఱచు । కీలు గలిగిన యొకనీలనీలవేణి । తురుము విఱిదండయురి వారి
చరముఁ జిక్కు- । వఱపనేరక మదిఁ జిక్కువడి యోఁదాన ॥ ౩౦౧ ॥ తే ॥ చొచ్చి చనఁ
బట్టుటకు నొక్క-మచ్చెకంటి । మ్రోలఁ బఱచిన బేలదర్దురము దాఁటెఁ । దొంటి పుట్టు
నఁదనయంటు సంటువారి । మీఁది మమకారనదిఁ ద్రెవ్వ నీఁదుకరణి ॥ ౩౦౨ ॥ క ॥ ఆవ
ర్షాభూవిభునకు । హావళి దఱచయ్యె బిసరుహాక్షులచేతన్ । రావణునకు వైకుంఠ
వు । రావాసస్త్రీలచేతి యలజడివోలెన్ ॥ ౩౦౩ ॥ ఆ ॥ పూర్వజన్మకుంభభూశిష్య
ముఖ్యుండు । భేకరూపకూపబింబితుండు । ప్రయుతసుతుఁడు దవ్వులు పడఁడయ్యె భూ
పాల । తనయ సఖులచేత ధాత్రృతనయ ॥ ౩౦౪ ॥ క ॥ నరనాథపుత్రి యత్తఱి । నురుకుచ
కచజఘనభారయుతయయ్యు నదిన్ । ధరియించెఁ గార్యభరమున్ । గిరిగహనద్వీ
పసహితక్షితిధృతిఁ బోలెన్ ॥ ౩౦౫ ॥ ఉ ॥ పన్నిదమొద్ది యేనిడుఁడు పట్టెదఁ జూడుఁ
డు వీనినంచు నా । కన్నియ చిన్నినవ్వులయగాఁ జెలికత్తియలం దనూద్యమ । చ్ఛన్న
మనస్కులం దెగడి చంచలకాంచికలాపవాగురీ । సన్నహనంబునన్ సలిలజంతులలా
మముఁ బట్టె నుబ్బుచున్ ॥ ౩౦౬ ॥ తే ॥ సర్వతీర్థప్రదేశప్రశస్తమతికిఁ । గాంచిఁ ద
పులుట దనకగ్గ మంచు నొక్క- । తవులువడియుం డెవరుణదంతావళంబు । పడఁతి
యురిఁ జేసె మెడచుట్టు పసిఁడిరశన ॥ ౩౦౭ ॥ సీ ॥ పులుఁగు నాడించుచొప్పున మించు
నాఁడించు మించు నసకిన నాడించినట్టు । లారామచిత్రశాలూరంబు మదహాసకౌముదిప
రిషిక్తగండఫలక । యగుచు నించుక వడియాడించి కప్పకు వెఱచిన యొకవృద్ధవిప్రుమీఁ

---

రాజును ॥ ౨౯౯ ॥ వర్షపిశునంబున్ = కప్పను ॥ ౩౦౦ ॥ కీలు = నేర్పు. తురుము = కొప్పు ॥
౩౦౧ ॥ బేల = మూఢము. దర్దురము = కప్ప ॥ ౩౦౨ ॥ వర్షాభూ = కప్ప. హావళి = ఉపద్రవము.
అలజడి = శ్రమము ॥ ౩౦౩ ॥ కుంభభూ = అగస్త్యుని. తవులుపడఁడు = చిక్కఁడు. తవులుపడఁడయ్యె
ను = చిక్కకపోయెను ॥ ౩౦౪ ॥ కచ = తలవెండ్రుకలయు. జఘన = మొలకట్టుయొక్కయు.
ధృతిన్ = ధరించుటను ॥ ౩౦౫ ॥ పన్నిదము = పందెము. తనూద్యమచ్ఛన్నమనస్కులన్ =
కొంచెపుఁ బ్రయత్నముచేత కప్పఁబడిన మనసులుగలవారిని — విశేషప్రయత్నము లేనివారిని. తెగ
డి = నిందించి. వాగురీ = ఉరి. సన్నహనంబునన్ = ఆయిత్తపాటుచేత. ఉబ్బుచున్ = సంతో
షించుచు ॥ ౩౦౬ ॥ కాంచిన్ = మొలనూలునందు; కంచియందు. తగులుట = చిక్కుకొనుట;
ఆసక్తుఁడగుట. వరుణదంతావళంబు = కప్ప. రశన = మొలనూలు ॥ ౩౦౭ ॥ మించు = మెఱు
పు; విధము. సకిన = బొమ్మ. శాలూరంబు = కప్ప. కౌముది = వెన్నెలచేత. పరిషిక్త = అంత

ద । నై చిత్తచ్ఛాపంబువలనసఖీజనంబును దానుదచ్ఛైకమునకు భార్యయై యయ్యెనిట్లుత నకుననురూపతనురూప । శీలములఁదలిర్చునాలిపిండు । గలుగుటయునునయుతుఁడ లఘుసంసారాబ్ధి । నీఁదుత్రొంటియీఁతయినుమడింప ॥ ౩౦౮ ॥ తే ॥ అధిపతన యకుమునుబహిఃప్రాణములగు । చానలెవ్వారువారెల్లసతికిదాయ । లైరిమండూ కసార్వభౌమార్ధతనువు । లైనదినములసాపత్న్యమెంతకీడు ॥ ౩౦౯ ॥ ఉ ॥ నన్నని మోముమీసములనూఁగును జెన్నటిగాకమున్నయా । సన్నముగాగృహస్థులకునగ్రణినైమనుమంచుమున్నవే । గన్నులవేల్పుదెల్పనదిగాదని వాదముసేయుధైర్యసం । పన్నుఁడుదేర్పగాఁదొణఁగెపాదనతింగుపితప్రియాతతిన్ ॥ ౩౧౦ ॥ తే ॥ విషమశరుఁడేయుమాపులవేట్లనెన్న । వాఁడువాధూల మునిగొపవర్గతతుల । రాతికొండుకైనయిల్వాలారాతిచట్టు । మనసుగరఁగించిమమతలఁబెనఁగెఁగాన ॥ ౩౧౧ ॥ తే ॥ స్వాతిమేఘుంబుచినుకులువసధిశుక్తి । వితతినయ్యెడనైమౌక్తికతవహించు । కరణినయుతునిప్రేమతతాంతలందు । నిలిచెఁబర్యాయపాత్రతానియమసరణి ॥ ౩౧౨ ॥ క ॥ మునిపతికిరాజసుతకును । దనయుఁడుజన్మించెనంతదచ్ఛాపపుటి । ద్గనువిరిసె జ్ఞానచంద్రుఁడు । గనుపట్టెన్ విష్ణుపదముగానఁగవచ్చెన్ ॥ ౩౧౩ ॥ వ ॥ సలపితుం డగుట మందపాలసమశీలుండగుప్రయుతనందనుచరిత్రంబచ్ఛతరమైకపాత్రంబయ్యెనిట్లు ॥ ౩౧౪ ॥ క ॥ గృహమేధిధర్మవర్మా । సహమతియగుకునమతియుయుతుఛందమునసుదు । స్పృహదుఃఖగ్రాహాసన । గుహఁబడుననివింటిమునుమునుముందునిచేతన్ ॥ ౩౧౫ ॥ ఆ ॥ విష్ణుభక్తులైవివేకులై తృష్ణావి । దూరులైస్వకుక్షిపూరణంబు । సమయసంభృతార్థసంతృప్తిగాఁగోరి । నడచువారు భవను గడచువారు ॥ ౩౧౬ ॥ సీ ॥ అనిపార్వతీనాథుఁడమరసంయమిఁజూచిపరమభాగవతప్రసక్తిగలుగు । నీవిష్ణుప్రార్థింపనిఖిలోన్నతములగుదైవతక్షేత్రతీర్థములమేళ । నంబెఱింగించితినానాకథా నిధానంబగుదానినెన్నఁడునుదీని । వైష్ణవధర్మప్రవర్తనంబెడలిన యసదులకెఱుకసే

---

టినుతఁజిసిన. ఇంచుకవడి=కొంచెముసేపు. అలిపిండు = పెండ్లాలసమూహము ॥ ౩౦౮ ॥ చానలు = స్త్రీలు. దాయలు = పగవారు. అర్ధతనువులు = అర్ధదేహములు—భార్యలు. సాపత్న్యము = సవతితనము ॥ ౩౦౯ ॥ వేగన్నులవేల్పు = ఇంద్రుఁడు. పాదనతిన్ = కాళ్లకుమ్రొక్కుటచేత ॥ ౩౧౦ ॥ రాతికొండుకు=చలింపనివాఁడు. చట్టు = శిష్యుఁడు ॥ ౩౧౧ ॥ ౩౧౨ ॥ ఇర్లు=చీకటి. విష్ణుపదము = ఆకాశము; విష్ణుదేవునిపాదము ॥ ౩౧౩ ॥ సలపితుఁడు = మాటతోఁగూడినఁవాఁడు ॥ ౩౧౪ ॥ వర్మ=కవచము. అసహమతి = సహింపనిబుద్ధిగలవాఁడు ॥ ౩౧౫ ॥ పూరణంబు = నింపించుట. భవము=జన్మము ॥ ౩౧౬ ॥ ప్రపత్తి = భక్తిపూర్వకశరణాగతి. ఎడలిన= పాసిన. అసదు

యకుచుఁ జీవు । గుప్తముగఁ జేయుమనుడు భర్గునకు మ్రొక్కి । మునిముని ధ్యేయనీకతం బునదురాప । రూపత క్షేత్రరాజస్వరూపమెఱుఁగఁ । గంటిగరిగంటిగాని సౌఖ్యము లుగంటి ॥ ౩౧౭ ॥ చ ॥ భయమునదచ్చి దుఃఖములఁ బాచి సుఖంబులఁ బ్రోదిచేసి తద్ద యఁదిలకించి నీయమగుఁ దమ్ములనిమ్ములఁ గొల్చి నిత్యసం । శ్రయమొనరించు నాకికన సాధ్యము లేదిది యట్లయానుని । ర్భయభవసాగరోత్తరణనాదికులాదిమ వైష్ణవాశ్రి తుల్ ॥ ౩౧౮ ॥ క ॥ అనిపానఃపున్యంబుగ । వనజాసనసూతి మ్రొక్కి వలగొని హ రుపే । డ్కానిపౌండరీకమునకుఁ । జని తైర్థమిందీర్థమాడి చక్రిభజించెన్ ॥ ౩౧౯ ॥

క ॥ భజియించి తత్ప్రసాద । వ్యజనానిలశమిత తాపుఁడై యిప్పుడు న । బ్జజసూతి దక్షిణద్వా । రజగతి నున్నాఁడు సుస్థిర ప్రమదమునన్ ॥ ౩౨౦ ॥

క ॥ అని కథకుఁడు శౌనకముఖ । మునులకు హరిదివ్య చరితములు దురిత తమో । దినకరకిరణాయితములు । వినిపించెఁ గళావతీశ వేదాద్రీశా ॥ ౩౨౧ ॥

శా ॥ దిగ్దంతావళకర్ణచాలన సముద్వేల్లన్మరుత్పల్లవ । స్రగ్దీప్తి ప్రకటప్ర తాపశిఖిసంఛన్నాఖిలాశాంతస । మ్యగ్దానాధరితామరద్రుమ రమాప్రాణేశ భక్త ప్రియా । ప్రాగ్దిక్కేసరిపీఠికాధిపసభాపద్మాకరాహస్కరా ॥ ౩౨౨ ॥

క ॥ విద్వత్కుముద నిశాకర । విద్వేషి వరూథనాథ వేశంత మదాం ।

---

లకున్ = అల్లులకు. దురాప = పొందరాని. గరిగంటిగాని = తలఁగని ॥ ౩౧౭ ॥ ప్రోదిచేసి = పోషించి. తిలకించి = చూచి ॥ ౩౧౮ ॥ పానఃపున్యంబుగన్ = మాటిమాటికి. వనజాసనసూతి = నారదుడు. వలగొని = ప్రదక్షిణము చేసి. తీర్థమాడి = స్నానము చేసి ॥ ౩౧౯ ॥ వ్యజన = విసనకఱ్ఱవలని. శమిత = అణఁపఁబడిన. జగతిన్ = భూమియందు ॥ ౩౨౦ ॥ కిరణాయితములు = కిరణములయినవి ॥ ౩౨౧ ॥ దిగ్దంతావళ...శాంత — దిగ్దంతావళ = దిగ్గజములయొక్క. కర్ణ = చెవులను. చాలన = చలింపఁజేయుటచేత. సముద్వేల్లత్ = మిక్కిలి వీచుచున్న. మరుత్పల్లవ = గాలిచిగుళ్లయొక్క. స్రక్ = సరముయొక్క. దీప్తి = ప్రకాశమును. ప్రకట = ప్రసిద్ధపఱిచెడి. ప్రతాపశిఖి = ప్రతాపాగ్నిచేత. సంఛన్న = లెస్సగాఁ గప్పఁబడిన. అఖిలాశాంత = ఎల్లదిక్కులకొనలు గలవాఁడా. సమ్య...ద్రుమ = సమ్యక్ = లెస్సయయిన. దాన = ఈవిచేత. అధరిత = క్రిందుపఱుపఁబడిన. అమరద్రుమ = దేవవృక్షము గలవాఁడా. రమాప్రాణేశభక్తప్రియా = విష్ణుభక్తులకు ఇష్టుఁడా. ప్రాగ్ది..స్కరా — ప్రాగ్దిక్ = తూర్పుదిక్కునందలి. కేసరిపీఠికాధిప = సింహాసనాధిపతులయొక్క. సభా = కొలువుకూటములనెడి. పద్మాకర = తామరకొలఁకులకు. అహస్కరా = సూర్యుఁడా ॥ ౩౨౨ ॥ విద్వత్కుముదనిశాకర = విద్వాంసులనెడి కలువలకు చంద్రుఁడా. విద్వేషి...రద — విద్వేషి = శత్రువులయొక్క. వరూథనాథ = సేనానాయకులనెడి. వేశంత = నీటిపడియలకు. మదాంధ = మదముచేత

ధద్విరద కీర్తి సంవృత । సద్వీప దిలీపభూప సదృ శాటోపా ...... ॥ ౩౨౩ ॥

మాలిని ॥ సరసగుణరతీశా షట్సహస్రాస్వయేశా । నిరవధికగుణాఢ్యీ నిత్యస
త్యోపలబ్ధీ । హరిహయసమభోగా యాచమానానురాగా । కరగతనిగమాళీ కా
వ్యకృత్పద్మహేళీ ॥ ౩౨౪ ॥

గద్యము॥ ఇతి శ్రీమత్పరమపదనాథ నిరవధిక కృపాపరిపాక పరి
చిత సరస కవితా సనాథ రామకృష్ణ కవినాథ ప్రణీ
తంబయిన పాండురంగమాహాత్మ్యంబను
పరమ భాగవత చరిత్రంబు నందు
సర్వంబును పంచమాశ్వాసము.

శ్రీ పాండురంగ విట్ఠలస్వామినే నమః.



కన్నుగాననని. ద్విరద=ఏనుఁగైనవాఁడా. కీర్తిసంవృతసద్వీప = కీర్తిచేఆవరింపఁబడిన ద్వీపముల తోఁగూడినవాఁడా. దిలీపభూపసదృశాటోపా = దిలీపమహారాజునొక్క ఆటోపమును బోలిన ఆటోపముగలవాఁడా ॥ ౩౨౩ ॥ సరసగుణరతీశా = సరసమైనగుణముచేత మన్మథుఁడా. షట్సహస్రాస్వయేశా = ఆఱువేలకులమునకు ప్రభుఁడా. నిరవధిగుణాఢ్యీ = మేరలేనిమంచిగుణములకు సముద్రుఁడా. నిత్యసత్యోపలబ్ధీ = శాశ్వతమును నిజమునైన బుద్ధికౌశల్యముగలవాఁడా. హరిహయసమభోగా = ఇంద్రునిభోగముమంటి భోగముగలవాఁడా. యాచమానానురాగా = యాచింపఁబడుచున్న అనురాగముగలవాఁడా. కరగతనిగమాళీ = హస్తగతమైన వేదపఙ్క్తులుగలవాఁడా. కావ్యకృత్పద్మహేళీ = కవీశ్వరులనెడి తామరలకు సూర్యుఁడా॥ ౩౨౪॥

